# STUDIES IN
# SRIMADBHAGAVATAM
## IN TELUGU

BY

VAVILALA VENKATA SIVAVADHANI, B.A.,

*(Being the amplification of three Lectures delivered during the Easter of 1916 before The South Indian Theosophical Convention at Adyar, Madras.)*

28·10·29

FIRST EDITION—(ONE THOUSAND.)

MADRAS:

V. RAMASWAMY SASTRULU & SONS

192, ESPLANADE.

1918.

హరిః ఓమ్.

శ్రీగురుభ్యో నమః.

# శ్రీమద్భాగవతసారము.

---

వావిలాల వేంకటశివావధానులు, బి. యే., గారిచే

రచింపబడినది.

1916 ఏప్రియలు ఈస్టరు సెలవులలో మద్రాసు అడయారులో

దివ్యజ్ఞానసమాజమువారి యెదుట నిచ్చిన

ఉపన్యాసత్రయముయొక్క వివరము

(మొదటి కూర్పు 1,000 ప్రతులు).

చెన్నపురి:

ఆదిసరస్వతీనిలయ ముద్రాలయమున ముద్రితము.

1918.

| | | | | | |
|---|---|---|---|---|---|
| బ్రహ్మసూత్రసారము | .... | రూ. 1 | 4 | 0 |
| శ్రీమద్భాగవతసారము | .... | 1 | 8 | 0 |

వీని ప్రతులు ఈ క్రిందివారివద్ద విక్రయమునకు దొరకును.

(i) చెన్నపట్టణము, అడయారునందున్న థియసాఫికలు పబ్లిషింగు హౌసు.

(ii) వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, మద్రాసు.

(iii) వేమూరి. రాంజీరావు అండు కంపెనీ, మచిలీపట్నము.

హరిః ఓమ్.

శ్రీ గురుభ్యో నమః.

సమర్పణమ్.

బ్రహ్మశ్రీ అన్నవరపు వేంకటరాఘవశాస్త్రి

గురువర్యకరకమలేషు,

శ్లో. ప్రజ్ఞానిధే, ప్రకృతిసౌమ్య, మహాన్తిమూర్తే,
భో భారతీతనయరత్న, గురో, నమస్తే.
త్యక్త్వాధునా పససి యద్యపిమాంసుదూరే
త్వం మే తథాపి మనసో నహి దూరగోఽసి.

శ్లో. వినా భవంతం తవ పుత్రకోఽహం
కస్మై మదీయాం కృతి ముత్సృజామి ?
స్వహస్త సంవర్ధిత పాదపస్య
ఫలం యథా గ్రంథ మిమం గృహాణ.

ప్రణతసేవకస్య

వావిలాల వేంకటశివావధానినః.

హరిః ఓమ్.

శ్రీగురుభ్యోనమః

# శ్రీమద్భాగవతసారము.

## విషయసూచిక.

### భూమిక. ౧-౨౩



### ప్రథమస్కంధసారము. ౨౪-౪౪

పుట.

## పంచమస్కంధసారము. ౧౦౩-౧౦౮



## షష్ఠస్కంధసారము. ౧౦౯-౧౨౨



## సప్తమస్కంధసారము. ౧౨౩-౧౪౯

పుట.

ద్వాదశస్కంధసారము. ౨౪౧-౨౬౧



హరిభక్తిభూమికలు. ౨౬౨-౩౧౯

## విష్ణుభక్తితత్త్వవివేకము. ౩౨౦-౩౫౧

హరిః ఓమ్.

శ్రీ గురుభ్యో నమః.

# శ్రీమద్భాగవతసారము.

## భూమిక.

---

శ్లో. జగన్మంగళరూపాయ సృష్టిస్థిత్యంతకారిణే
నమో వేదాంతవేద్యాయ కృష్ణాయ పరమాత్మనే.

శ్లో. త్యక్త్వా సుదుస్త్యజసురేప్సితరాజ్యలక్ష్మీం
ధర్మిష్ఠ ఆర్యవచసా యదగాదరణ్యమ్
భృత్యార్తిహం ప్రణతపాల భవాబ్ధిపోతం
వందే మహాపురుష తే చరణారవిందమ్.

క. శ్రుతికల్పతరుచ్యుత మా
త్రతశుకవక్త్రోద్గతామృతద్రవయుత ము
న్నతరసభాగవతఫలము
మతి నానుఁడు ముక్తిదనుక మహి బుధులారా!.

# శ్రీమద్భాగవతసారము.

## భూమిక.

### ౧. మొదటిమాట.

సోదరులారా!

బ్రహ్మశ్రీ తూముచర్ల రామచంద్రరావుగారు చిట్టిమూరు రామయ్యగారు లోనగు మనసోదరులు, మనదివ్యజ్ఞానసమాజమువారు ౧౯౧౬ వ సం. ఏప్రిల్ ఈస్టరు సెలవులలో పెద్దాపురములో సభ చేయుదురు గాన నపుడు శ్రీవిష్ణుభాగవతముపై మూఁడు చిన్నయుపన్యాసములను చేయుఁగూర్చి నన్నని నాకు సెలవిచ్చిరి. నే నిదివఱలో సంస్కృతభాగవతమును ౧౬ ఏండ్లనుండి యప్పు డప్పుడు చదువుచుంటిని. దానిసారము సంగ్రహించి దానియందుఁ బ్రతిపాద్యములగు నముఖ్యవిషయములను, శ్రీకృష్ణులగు భగవంతులను, జ్ఞప్తికిఁ దెచ్చికొనుటకు నవకాశ మిచ్చినందులకు మీ కందఱ కనేకవందనము లాచరించెద. ఈ సందర్భమున శ్రీనారదులకు బ్రహ్మ, వసుదేవునకు నారదులును, సెలవిచ్చిన వక్ష్యమాణశ్లోకములు స్మరణమునకు వచ్చెను:—"సమ్యక్కారుణికస్యేదం వత్స! తే విచికిత్సితం, యదహం చోదితో ధర్మే భగవద్వీర్యదర్శనే." (భా-౨-౫-౮) = వత్సా! భగవద్వీర్యప్రకాశనం బగు

శ్రీమహాభారతము సర్వపురాణములం దెట్లు సర్వోత్తమ
మని ప్రతిపాదింపఁబడియెనో యట్లే శ్రీభాగవతమును భక్తి
జ్ఞాన వైరాగ్యలోకోపకారములను సంపాదించునది గాన
సర్వోత్కృష్ట మని పద్మమాత్స్యపురాణములలోఁ గీర్తిం
పఁబడి యున్నది. శ్రీమహాభారత రామాయణములవలె నిది
గూడ వేదసమ్మితము. "ఇతిహాసపురాణం పంచమం" అను
ఛాందోగ్యశ్రుతియు భారతమువలెఁ బురాణముగూడఁ
బంచమవేద మని చెప్పుచున్నది. వేదమువలె నితిహాస
పురాణములుగూడ నీశ్వరునివలననే యావిర్భవించినట్లు
"అస్య మహతో భూతస్య నిశ్వసిత మేతత్ యదృగ్వేదో
యజుర్వేద స్సామవేదో ఽథర్వాంగిరస ఇతిహాసః
పురాణంవిద్యా ఉపనిషదః శ్లోకాః సూత్రా ణ్యనువ్యా
ఖ్యానాని వ్యాఖ్యానా న్యస్యై వైతాని సర్వాణి
నిశ్వసితాని" అను బృహదారణ్యకశ్రుతి పలుకుచు
న్నది. ఇచట "ఇతిహాసాది" శబ్దము లెనిమిదియు
వేదములందుఁ గలుగుచున్నవిధార్థవాదములను చెప్పుచున్న
వనియు, ఋగ్వేదాదిశబ్దములు విధివిధానమును జెప్పుచు
న్న వనియు, శ్రీశంకరభగవత్పాదులు శ్రుతికి భాష్యము
చేసిరి. కాని భాష్యవార్తికకారు లగు శ్రీసురేశ్వరాచా
ర్యులు ప్రసిద్ధేతిహాసపురాణాదులే యాశబ్దముల కర్థము
లనియు నట్లుచెప్పనిచో లోకప్రసిద్ధార్థము నతిక్రమించుట

న్యాయము కాదనియు, నుడివిరి. వేదము లపౌరుషేయము లనియు, నితిహాసపురాణములు పురుషకృతము లనియు, లోకశాస్త్రవ్యవహారము. [illegible] నాశ్రయించి ప్రవర్తించియుండనోపు. పూర్వమీమాంసావిరోధాధికరణమందు శ్రుతికంటె స్మృతిపురాణములు దుర్బలము లని జైమినులు ప్రతిపాదించిరి. విధ్యర్థవాదములు రెండు వేదగతము లయినను, విధి ననుసరించి యర్థవాదములు సన్వయింప వలసిన ట్లర్థవాదాధికరణమందు నిర్ణయించినరీతి శ్రుతి ననుసరించి అర్థవాదాదివివరణములుగ నితిహాసపురాణములు గూడ సన్వయింప వలసియున్నవి. కాన నితిహాసపురాణములు వేదసమ్మతము లనుటకు సంశయము లేదు.

మఱియు, వేదము కర్మకాండమనియు, జ్ఞానకాండమనియు, రెండుభాగములుగలది. కర్మకాండమును మన్వాదిస్మృతులు బహువిధముగ వివరించునట్లు జ్ఞానకాండమును బురాణములు వివరించుచున్నవి. ఇతిహాసములీరెంటిని విశదపఱచుచున్నవి. స్మృతులు ధర్మార్థకామాచరణమును విధించుచు, దానివిశేషములను దెలియఁ జేయుచున్నవి. వేదము చదువుటకు నధికారము లేని స్త్రీశూద్రద్విజబంధువులకు నాఖ్యాయికా (కథా) రూపమునను, ముఖ్యముగ మోక్షోపాయములను, ధర్మార్థకామసాధనము లుపసర్జన

ముగను,యితిహాసపురాణములు బోధించును. వేదములలో నారణ్యకములును,ఉపనిషత్తులును,ఎల్లు శ్రేష్ఠములో, యట్లే పురాణములలో శ్రీమద్భాగవతము శ్రేష్ఠము. కావుననే యితరపురాణములకంటె దీనిపై నెక్కున టీకలు గలవు. ౧. శ్రీధరస్వామి కృతభావార్థదీపిక. ౨. చంద్రిక. 3. ముని భావప్రకాశిక. ౪. విజయధ్వజము. ౫. ఫలారి. ౬. ముక్తాఫలము. ౭. శుకరహస్యము. ౮. సారార్థముక్తావళి. ౯. కామధేనువు. ౧౦. తోషిణి. ౧౧. తోషిణీసారము. ౧౨. వీరరాఘవీయము. ౧౩. అన్వితార్థప్రకాశిక. ౧౪. పుణ్యారణ్యకృతటీక. * భాగవతసందర్భమను విమర్శగ్రంథము శ్రీకృష్ణచైతన్యశిష్య శ్రీజీవననాథనకృతము. హరిలీల బోపదేవకృతము. సనాభిగ వ్యాసహితముగ నీగ్రంథమున కనుబంధమున దానినచ్చువేయించితిని. ఈటీకలలో బదియు, రాసక్రీడకు ౧౬. టీకలును, మధురలోనున్న దేవకీనందన ప్రెస్సువారచ్చొత్తించిరి. శాంకరరామానుజమధ్వవల్లభ నింబార్కాదులగు వైదికమతస్థులును, శ్రీకృష్ణచైతన్యానుయాయులగునవైదిక మతస్థులునుగూడ భాగవతమునకు వ్యాఖ్య లొనరించి, లోకోపకారము చేసిరి. హిందూదేశ

---

* ౧౧ వ స్కంధముమీద శ్రీధరవ్యాఖ్యపై విశ్వనాథాదులు టీక లొనరించిరి. అవి కాశిలో నచ్చుపడినవి. భాగవతతాత్పర్యనిర్ణయమను ప్రకరణము శ్రీమధ్వాచార్యకృతము.

భాషలలోఁ గూడ దానివ్యాప్తి మెండు. ఇంగ్లీషునఁ గూడ నట్టుగారు తర్జుమా చేసిరి. భాషావ్యుత్పత్తియొక్కయు, టీకయొక్కయు, సహాయమున్నను, భక్తిలేనిది భాగవతమును భవమునకు రాదని పెద్దలిట్లనుదురు:—"భక్త్యా భాగవతం జ్ఞేయం నవ్యుత్పత్త్యా న టీకయా". దీనిలో నన్వయకాఠిన్యము, నర్థగాంభీర్యము, బహుస్థలములలో నున్నను, వేదాంతశాస్త్రజ్ఞానముతోఁ గూడిన భక్తిచే నీగ్రంథ మన్వయించి దానిరస మనుభవించి యితరుల ననుభవింపఁ జేయనగు. దీనిపరమతాత్పర్య మద్వైతమయినను దీనిలో నవిశేషబ్రహ్మవివరము మెండుగ నున్నది. ఏలయన దీనిఁ జదువ నధికారులు స్త్రీశూద్రద్విజబంధువులు లోనగు సర్వమానవులు.

### 3. శ్రీభాగవతలక్షణము.

పురాణములు, ఉపపురాణములనియు, మహాపురాణములనియు, రెండు తెఱంగులు. సర్గప్రతిసర్గవంశవంశానుచరితాశ్రయములనియైదు గలది యుపపురాణము. ఈ యైదువిషయములును, స్థానము, పోషణము, ఊతి(వాసన), నిరోధము, ముక్తియు, గూడి పదిలక్షణములు గలది మహాపురాణము. సర్గప్రతిసర్గస్థానపోషణమూతిమన్వంతరేశానుకథననిరోధముక్త్యాశ్రయములు గలది గాన శ్రీమద్భాగవతము మహాపురాణము. దశమమగు నాశ్రయమనగ బ్రహ్మతత్త్వము. దానిని, పరమాత్మ, భగవంతుఁడు, ననియు వచియింతురు. దానిని బ్రతిపాదించుటకు సర్గాదినవ

పదార్థములు వివరింపఁ బడినవి. సర్గాదులందుఁ బ్రత్యక్షముగ నాశ్రయము నిరూపింపఁబడినది. అర్థవాదములగునాఖ్యాయికలయందుఁ దాత్పర్యముచే నాశ్రయము సూచింప బడి యున్నది. కావున బ్రహ్మస్వరూపప్రతిపాదనమే యీ మహాపురాణము యొక్క ముఖ్యప్రయోజనము. సర్గాదిలక్షణ మెట్లనః— భగవంతునిచే సాక్షాత్తుగ నవ్యక్తమునందు గుణపరిణామముచేఁ గల్గు మహదహంకార పంచతన్మాత్ర గగనాది మహాభూతసృష్టి సర్గమనఁబడు. ఈశ్వరునిచే సృజింపఁబడిన బ్రహ్మాండశరీరాభిమానియగుహిరణ్యగర్భునిచేఁ జేయఁబడినచరాచరభూతసృష్టి ప్రతిసర్గమునాఁబడు. సృజింపఁబడినలోకములయొక్కయు, లోకులయొక్కయు, మర్యాదలను భగవంతుఁడు మత్స్యకూర్మాద్యవతారములచేఁ బాలించుట స్థానము, లేక స్థితియనఁబడు. దీనిని వైకుంఠ విజయమని కూడ నందురు. నిజభక్తులయెడ భగవంతుఁ డొనరించు ననుగ్రహము పోషణ మనఁబడు. భగవదనుగ్రహము వడసినస్వాయంభువాది మనువులయొక్క సద్ధర్మవివరము మన్వంతర మనఁబడు. కర్మవాసనలూతు లనంబడు. భగవంతుని లీలావతారచరిత్రములును, హరిభక్తు లగునంబరీషాదులచర్యలును, ఈశాను చరితములనఁ బడు. పరమాత్ముని యోగనిద్ర ననుసరించి జీవులు నిజశక్తు లగునుపాధులతోఁ గూడ

నేకీభవించుటయే లయ మనియు, నిరోధ మనియుఁ జెప్పఁ
బడు. ప్రకృతిసంబంధప్రయుక్తమగు రూపమును విడిచి
జీవుఁడు స్వస్వరూపమునం దుండుట ముక్తి యనఁబడు.
జగములకెల్ల సృష్టిస్థితిలయము లెవనివలనఁ గలుగునో
యదియే బ్రహ్మమనియు, పరమాత్మ యనియు, భగవంతుఁడ
నియు, ఆశ్రయ మనియుఁ, జెప్పఁబడు. ఈ దశవిషయ
ములు స్మృతిగ్రంథములయందు సంగ్రహించిన గ్రంథము
లయందు వ్యస్తముగ నిరూపింపఁబడినట్లు శ్రీబోపదేవశ్రీధర
లభిప్రాయపడిరి. ఒక్కొక్క గ్రంథమునం దొక్కొక్క
విషయము ప్రధానముగఁ బ్రతిపాదించినను దశవిషయ
ములు గూడఁ బ్రసంగవశముగ నిరూపింపఁబడిన వని
శ్రీభాగవతసందర్భకారులు తలంచిరి.

— ౪. శ్రీభాగవతసంప్రదాయప్రవృత్తి. —

శ్రీభాగవతము గర్భోదకశాయి యగు శ్రీమన్నారా
యణునినాభికమలమునందు జన్మించిన బ్రహ్మకు నారాయణుని
చే సంగ్రహముగ నుపదేశింపఁబడినది. పిదప నా బ్రహ్మ
దానిని గొంచెము విస్తరముగఁ దనమానసపుత్రుఁ డగు
నారదున కుపదేశించెను. భాగవతమును నిర్మించి తృప్తిఁ
జెందక విచారగ్రస్తుఁ డగు కృష్ణద్వైపాయనుఁ డను వేదవ్యా
సునకు దానిని నారదు లుపదేశించిరి. ఆ యర్థము నా వ్యా
సులు విస్తరించి తనకొడుకగు శ్రీశుకమహర్షికి బోధించిరి.

ఆశుకులు ప్రాయోపవిష్టుండగు పరీక్షిన్మహారాజు సభలో దానిని వెల్లడి చేసిరి. మొదట వ్యాసులయొద్ద దానినిఁ జదివి తిరిగి శుకునివలన విని సూతుఁడు నైమిశారణ్యములో సత్త్రయాగముఁ జేయుచున్న శౌనకాదిఋషులకు దానిని బోధించెను. ఇట్టిభాగవతము పరంపర గాను మన కందఱకు శ్రవణాదిగోచరమయ్యెను. పరమభాగవతులగు బమ్మెరపోతనామాత్యులు, గంగనార్యులు, సింగనార్యులు, వెలిగందల నారయ్యయు, భక్తిభరితంబుగఁ బద్యగద్యాత్మకంబుగను, సన్మిత్రులును, సంస్కృతాంధ్రములలో సమస్తపాండిత్యముగల బ్రహ్మశ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రులవారు వచనరూపముగను, సంస్కృతభాగవతమును దెనిఁగించి యాంధ్రప్రపంచమునకుఁ గడు మేలొనరించిరి. ౧, ౨, ౩, ౪, ౭, ౮,౯, ౧౦. స్కంధములుపోతనామాత్యులు, ౫, వ స్కంధము గంగనార్యులు, ౬వ స్కంధము సింగనార్యులు,౧౧,౧౨ స్కంధములుపోతన సచ్ఛిష్యులగు వెలిగందల నారయ్యయుఁ దెనుఁగు గావించిరి.

## ౫. భాగవతవిషయసంగ్రహము.

శ్రీమద్భాగవతములో ముఖ్యముగ నుపపాదింపఁ బడిన విషయము లేమన:— అనాదినిధనుఁడు భగవంతుఁడు భక్తవత్సలుఁడు సర్వేంద్రియప్రేరకుఁడు సర్వజీవ

నియామకుఁడు నగు హరియందుఁ గల్పింపఁబడు. నిర్గు
ణము విశ్వోత్పత్తిలయాధారము నగు నపరోక్షజ్ఞానపర్యం
తమైన జ్ఞానంబును జ్ఞానసాధనంబు నిందు నిరూపింపఁ
బడియె. భక్తియోగంబును నదాశ్రయంబైన వైరాగ్యం
బు నిందుఁ బ్రతిపాదింపఁబడియె. మఱియుఁ బరీక్షిజ్జన్మాదిక
థనంబును నారదావ్యాఖ్యానంబును విప్రశాపమునం జేసి
పరీక్షిత్తు ప్రాయోపవేశం బొనర్చుటయు శుకపరీక్షిత్సంవా
దంబును యోగధారణామూలముగ యోగి యర్చిరాది
గతిం బొందువిధంబును బ్రహ్మనారదసంవాదంబును భగ
వదవతారానుకీర్తనంబును మహదాదిసర్గంబును విరాడ్రూ
పకారోత్పత్తిక్రమంబును విదురోద్ధవసంవాదంబును విదు
రమైత్రేయసంవాదంబును బురాణసంహితా ప్రశ్నంబును
బ్రళయమున మహాపురుషునియూర్ధ్వస్థానంబును బ్ర
కృతిసృష్టియు మహదాదిసృష్టియు వైరాజపురుషాశ్రయ
బ్రహ్మాండసంభవంబును స్థూలసూక్ష్మకాలగతి భేదంబును
పద్మోద్భవంబును వరాహమూర్తి భూమినుద్ధరించి హిర
ణ్యాక్షుం బరిమార్చుటయు నూర్ధ్వతిర్యగర్వాక్సర్గంబును
మనుసర్గంబును సహజదంపతులగు శతరూపాస్వాయంభువ
మనువులజన్మంబును గపిలావతారంబును గపిలదేవహూతి
సంవాదంబును నవప్రజాపతిసముత్పత్తియు ధర్మపత్నీసం
తానవర్ణనంబును గర్దమప్రజాపతిసంతతిప్రతిపాదనంబును

దక్షయజ్ఞవినాశనంబును ధ్రువోపాఖ్యానంబును బృథుచరితంబును నారదప్రాచీనబర్హిస్సంవాదంబును బ్రియవ్రతచరిత్రంబును నాభిచరిత్రంబును భరతోపాఖ్యానంబును ద్వీపవర్షాదిభూమండల వర్ణనంబును జ్యోతిశ్చక్రస్వరూపనిరూపణంబును పాతాళనరకాదిలక్షణ ప్రతిపాదనంబును ప్రచేతసులకు దక్షజన్మంబును దక్షపుత్రీసంతానకథనంబును వృత్రచరిత్రంబును హిరణ్యకశిపువధంబును బ్రహ్లాదచరితంబును మన్వంతరానుచరితంబును గజేంద్రమోక్షణంబును మన్వంతరావతారంబును హయగ్రీవమూర్తికథనంబును కూర్మమత్స్యనరసింహవామనావతారప్రతిపాదనంబును నమృతార్థంబుక్షీరసాగరమథనంబును దేవాసురయుద్ధంబును రాజవంశకీర్తనంబును నిక్ష్వాకుజన్మంబును సుద్యుమ్నచరిత్రంబును నళోపాఖ్యానంబును దానోపాఖ్యానంబును సూర్యవంశరాజచరిత్రంబును శశాదచరిత్రంబును సౌకన్యాఖ్యానంబును శర్యాతిచరిత్రంబును గకుత్స్థచరిత్రంబును ఖట్వాంగచరిత్రంబును మాంధాతృచరితంబును సౌభర్యాఖ్యానంబును సగరచరితంబును సర్వపాపహరంబైన శ్రీరామచరితంబును నిమిదేహత్యాగంబును జనకకులసంభవంబును బరశురామచరిత్రంబును సోమవంశజుండైన యైళునిచరిత్రంబును యయాతిచరిత్రంబును నహుషచరిత్రంబును దుష్యంతపుత్రుండైన భర

తునిచరితంబును, శంతనుచరిత్రంబును భీష్మచరిత్రంబును
యదువంశకీర్తనంబును శ్రీకృష్ణావతారంబును శ్రీకృ
ష్ణుండు నందగోకులంబునం బెరుగుటయుఁ బూతనాప్రాణ
హరణంబును, శకటోచ్చాటనంబును తృణావర్తనిష్పేషణం
బును బకవత్సాఘాసురసంహారంబును బ్రహ్మకుమాయఁ
జూపుటయు సఖిహితంబుగా ధేనుకుంజంపుటయు బ్రలం
బవధంబును గోగోపాలకులందావాగ్నింగాచుటయుఁ గాళి
యమర్దనంబును, నందమోక్షణంబును గోపికావ్రతచ
ర్యకుఁ గృష్ణుఁడు తుష్టినొందుటయు దీక్షితవిప్రపత్నులకుఁ
బ్రసాదంబొనర్చుటయు దీక్షితులయనుతాపంబును గోవ
ర్ధనోద్ధరణంబును శక్రకామధేనువులు కృష్ణుంబూజించి
యభిషేకించుటయు రేలు కృష్ణుండు గోపికలతోడం
గ్రీడించుటయు శంఖచూడవధంబు నరిష్టసంహారంబును
కేశిమర్దనంబు నక్రూరాగమనంబును రామకృష్ణులమధు
రాగమనంబును వ్రజాంగనావిలాపంబును మధురాలోక
నంబును కువలయాపీడవధంబును ముష్టికచాణూరాది
మర్దనంబును కంసవధంబును మృతగురుపుత్రానయనం
బును రామకృష్ణులు మధురలో యాదవులకుఁ బ్రియము
లొనర్చుటయుఁ బలుమాఱులు జరాసంధుం బరిభవించు
టయు యవనేంద్రఘాతనంబును ద్వారకాప్రవేశంబును
స్వర్గమునుండి పారిజాతమును సుధర్మనుం దెచ్చుటయు

రుక్మిణీహరణంబును హరసమరంబును బాణాసురభుజచ్ఛేదనంబును నరకసంహారంబును షోడశసహస్రకన్యకాహరణంబును శిశుపాల వధంబును పౌండ్రకసాల్వదంతవక్త్రశంబరద్వివిదపీఠమురపంచజనాదిసంహారంబును ధన్యహిమకథనంబును వారణాసీదాహనంబును పాండవులు నిమిత్తముగాఁగ భారతరణమున భూభారము హరించుటయు విప్రశాపవ్యాజమున యదుకులముపసంహరించుటయు నారదవసుదేవ సంవాదంబును వాసుదేవుఁ డుద్ధవున కాత్మజ్ఞానభక్తియోగధర్మములుపదేశించుటయు నాత్మయోగ మహిమంబున శ్రీకృష్ణుండు మర్త్యవేషవిడంబనంబు పాలించుటయు యుగలక్షణప్రవృత్తియుఁ గలియుగమున నరుల యుపద్రవంబును జతుర్విధప్రళయంబును ద్రివిధసృష్టియుఁ బరీక్షిన్నృపాలుని దేహత్యాగంబును వేదవిభాగంబును మార్కండేయ చరిత్రంబును మహాపురుషవిన్యాసంబును సూర్యవ్యూహకథనంబు నిందు నిరూపింపఁబడియె.

### ౨. శ్రీకృష్ణతత్త్వము భాగవతములోని ముఖ్యవిషయము.

శ్రీమద్భాగవతమందుఁ బ్రధానముగఁ బ్రతిపాదింపఁ బడినవిషయము శ్రీకృష్ణతత్త్వము. తత్ప్రేమరూపమగు భక్తియే పరమప్రయోజనము, సర్వార్థసాధకము. అది

యే సాధ్యభక్తి యగు పరమానందము. సాధనభక్తి, జ్ఞానము, వైరాగ్యము, లోకోపకారకర్మము, దానికి సాధనములు. వానిలో ౮ భేదములు సర్వజ్ఞు లగు కపిలమహర్షి తల్లి యగు దేవహూతికిని, ౯ భేదములు ప్రహ్లాదుఁడు తండ్రి యగు హిరణ్యకశిపునకును, నుపదేశించిరి. వాని భేదములు, విశేషములు, ముందు వివరింపఁబడును. శ్రీకృష్ణతత్త్వము భాగవతములో నుపక్రమ పరామర్శోపసంహారములం దుపపాదింపఁ బడినది. ఆదియందుసూతశౌనక, నారద వ్యాస, శుక పరీక్షిత్సంవాదములలోఁ బ్రతిపాదింపఁబడినది. వానిలో శ్రీకృష్ణభక్తిప్రవృత్తులు గూడ సూచింపఁబడినవి. మధ్యస్కంధములలోఁ గుంతీభీష్మ స్తవములలోను, యుధిష్ఠిరార్జున శుకపరీక్షిద్బ్రహ్మనారదోద్ధవ విదురమైత్రేయ కపిలదేవహూతి భరతరహూగణ యమయమదూతయుధిష్ఠిరనారదాదిసంవాదములలోను, ధ్రువపృథుప్రాచీనబర్హిః ప్రాచేతసాజామిళప్రహ్లాదగజేంద్రమోక్షణ సముద్రమథనాంబరీషాద్యుపాఖ్యానములందును, ౧౦, ౧౧-వ స్కంధము లందంతటను, శ్రీకృష్ణునిదివ్యచర్యలు, మాహాత్మ్యము, తత్త్వము, తత్త్వావేదకము లగుసాధనములు, సోపస్కరముగను, విపులముగను, వర్ణింపఁబడినవి. ౧౨-వ స్కంధమందువారితత్త్వప్రభావాదులు నిగమింపఁబడెను. గ్రంథమంతయు భక్తిరసముతో నిండియున్నది.

మఱియు, "పరోపకృతికైవల్యే తులయిత్వా జగద్గురుః (జనార్దనః), సుత్వా చోపకృతిం గుర్వీ మవతారాన్ దశాగ్రహీత్" అని పెద్దలు చెప్పినట్లు, పురుషుఁడగుపరమేశ్వరుఁడు లోకోపకారముకొఱకు ననంతావతారముల నెత్తినను, వానిలోఁ గొన్నియవతారములు, వారిచర్యలు, ప్రయోజనములు, మాత్రము, శ్రీభాగవతప్రథమతృతీయ స్కంధములలో సంగ్రహముగఁ జెప్పి వానివివరణ మితర స్కంధములలో వ్యాసులు చేసిరి. వీనిరహస్యమిట్లు పూర్వాచార్యులు నుడివిరి. సృష్టిప్రథమమునం దావిర్భవించినపురుషునియందావేశములుగలవి మత్స్యకూర్మాదులుకొన్నియు, తచ్ఛక్త్యావేశములు గలవి కుమారనారదాదులందుఁ గొన్నియు, వివరింపఁబడెను. వానిలోఁ గుమారనారదాదులందు జ్ఞానభక్త్యంశావేశము, పృథ్వాదులలోఁ గ్రియాశక్త్యంశావేశము, గలవు. ఆవేశావతారములలో మహాశక్త్యావేశములు గలకుమారనారదాదులవతారములనియు, తచ్ఛక్తిగల మరీచిమన్వాదులు, విభూతులనియు వాడుదురు. మత్స్యాద్యవతారములందువారికి సర్వజ్ఞత్వసర్వశక్తిత్వాదిధర్మము లున్నను, వారియవతారముల కవసరమగుజ్ఞానక్రియాశక్తులుమాత్ర ముపయోగింపఁ బడినవి. సనత్కుమారనారదాదులగునాధికారికులందు వారిబోధనాదివ్యాపారములకుఁగావలసినజ్ఞానభక్త్యంశకళావేశముమాత్రము,

ప్రకటనము చేయఁబడినది. మఱియు, నృసింహాపరశు
రామ కల్కిపురుషావతారములలో నైశ్వర్యము, నారద
వ్యాసవరాహబుద్ధావతారములలో ధర్మము, రామధన్వం
తరియజ్ఞపృథువులలో యశస్సు, బలమోహినీవామను
లలో సిరి, దత్తాత్రేయమత్స్యకుమారకపిలులలో జ్ఞాన
ము, నరనారాయణకూర్మఋషభులలో వైరాగ్యము,
ప్రకటనము చేయఁబడినవి. సత్యము, శౌచము, దయ,
క్షాంతి, త్యాగము, సంతోషము, ఋజుత్వము, మనో
నిగ్రహము, బహిరింద్రియనిగ్రహము, తపస్సు, సమత్వము,
పరాపరాధసహనము, లాభములయెడ నుపేక్ష, శాస్త్ర
విచారము, జ్ఞానము, విరక్తి, ఐశ్వర్యము, శౌర్యము, తేజ
స్సు, దక్షత్వము (స్మృతి), చేయఁదగినపనిని జ్ఞాపకముఁ
జేసికొనుట, స్వాతంత్ర్యము, క్రియానైపుణ్యము, కాంతి,
ధైర్యము, మృదుత్వము, ప్రతిభాతిశయము, వినయము,
శీలము, మనోదార్ఢ్యము, కర్మేంద్రియపటుత్వము, జ్ఞానేం
ద్రియపాటవము, భోగాస్పదత్వము, గాంభీర్యము, స్థిరత్వము,
శ్రద్ధ (ఆస్తిక్యము), కీర్తి, పూజనీయత్వ, మనహంకార
త్వము, గర్వాభావము మున్నగు ౩౯ గుణములుం గాక
బ్రహ్మణ్యతా శరణ్యతాదిసకలకల్యాణగుణసమూహం
బులు శ్రీకృష్ణదేవునియందు నెడఁబాయక నిత్యముగ

సుండెనని ధరణి ధర్మదేవతతో నుడివెను. ఇతరావతారములలో గనంబడిన సమస్తగుణములు సమగ్రముగ శ్రీకృష్ణులు ప్రదర్శించిరి గాన వారిరూపము సాక్షాత్తుగ శ్రీమన్నారాయణులే యావిర్భవించిరని నద్వ్యమాణశ్లోకము చెప్పుచున్నది:—'ఏతే చాంశకళాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయం.'(భా.౧,3,౨౮)కాననే శ్రీకృష్ణ భగవంతులుపూర్ణావతారమని శ్రీధరానందగిరిస్వాముల తలంపు. ద్వితీయదశమస్కంధాదులలో శ్రీకృష్ణులంశావతార మని యున్నను మొదటిస్కంధములోని మూడవ (అవతారగుహ్య) యధ్యాయములో 'కృష్ణస్తుభగవాన్స్వయం' అనియు, 'స్వయమేవ హరిః కిల' (భా. ౯,౨౪,౫౪) "గృహీతమూర్త్తిత్రయ ఈశ్వరేశ్వరః." (భా.౧౧,౨౯,౭) అనియు, నుండుటచే శ్రుతిలింగాద్యుపక్రమాదిన్యాయములు వారిమతమునకు సహకారులు. కాని శ్రీమధ్వాచార్యులవారు వసుదేవనందనుఁ డగు శ్రీకృష్ణుఁ డితరావతారములవలె నంశావతారమనియు, నన్నియంశావతారములకు మూలమగు నింకొకరు పూర్ణావతార మనియు, వారిపేరు గూడ కృష్ణుఁ డనియుఁ దలంచిరి. మఱియు వారిమతములో నంశాంశులకు భేదము లేదు. కాని భారత హరివంశాదులలో వసుదేవనందనుఁ డగు శ్రీకృష్ణుఁడు

విష్ణ్వంశ మని పలుచోట్ల నుండుటచే శ్రీశంకరభగవ త్పాదులు వాని నంశావతార మనియే భగవద్గీతోపోద్ఘాతభాష్యములో వ్రాసిరి. కాని ఆ తత్త్వము విచారించినచో బ్రహ్మ నిరంశము. దానియం దంశకల్పన మావిద్యక మని 'ఆత్మని చైవం విచిత్రాశ్చ హి' (౨-౧-౨౮) అను బ్రహ్మసూత్రము నొక్కి చెప్పుచున్నది. అది పురుషసూక్త భగవద్గీతాది శ్రుతిస్మృతుల ననుసరించుచున్నది.

ఈవిషయమై భాగవతు లీతీరున నభిప్రాయపడిరి. పరమవ్యోమాధినాథునకు వాసుదేవుఁ డనిపేరు. అతఁడే శ్రీకృష్ణుఁడు, షోడశకలరూపమును ధరించిన మహావిష్ణువు. ప్రకృతి ఈక్షణకర్త యయినచో నతఁడే సంకర్షణాంశుఁ డగు. అతఁడు కారణార్ణవశాయి యయి, మహత్తత్త్వస్రష్ట యగు పురుషుఁడు మొదటివాఁడు. అతనియంశములే మత్స్యాద్యవతారములు. గర్భోదకశాయియయి, పద్మనాభుఁ డగు ప్రద్యుమ్నుఁడు రెండవవాఁడు. క్షీరోదకశాయి యయి, హరి యనునని రుద్ధుఁడు మూఁడవవాఁడు. ఈముగ్గురు వాసుదేవాంశములు. సంకర్షణుఁడు ప్రకృతికి నంతర్యామి; ప్రద్యుమ్నుఁడు సమష్టివిరాట్టు; అనిరుద్ధుఁడు వ్యష్టివిరాట్పురుషుఁడు ; ఈముగ్గురంతర్యామియంశములు. భగ

వంతుఁ డగు శ్రీకృష్ణుఁడు, అంశమునుగాక, అంశియుఁగాక పురుషుఁ డనుపరమవ్యోమాధినాథుఁ డగువాసుదేవుఁడు. మఱియు, భగవదవతారములు 'అనుప్రవేశా (ఆవేశా) వతారము'లనియు, 'స్వాంశావేశావతారము' లనియు, రెండు తెఱంగులు. మనవలె వారు కర్మబద్ధులుకారు. భగవదంశ నరాదిదేహమందుఁ బ్రవేశించుట యవతార మని చెప్పఁబడెను. పరమేశ్వరావిర్భావములగు శ్రీకృష్ణాదుల జన్మములు, కర్మములు, కేవలమైచ్ఛికములు, కర్మాధీనములు, దివ్య (అప్రాకృతిక) ములు, ధర్మగ్లానినిమిత్తకములు, లోకానుగ్రాహకములు, అని భగవద్గీతాచతుర్థాధ్యాయ ౬-౯ శ్లోకములలోను, భాగవతమందుఁ బలుచోట్లను, స్పష్టముగాఁ జెప్పఁబడినది. ముందు వానివివరములు చేయఁబడును. సంకల్పసూర్యోదయాదుల వలనను, గురువులవలనను, అవతార రహస్యము నరయ నగు. తీవ్రభక్తి జ్ఞాన వైరాగ్యములు గల మహాత్మునందు భగవత్కళ ప్రవేశించి, వానిజ్ఞానశక్త్యాదులను బ్రకటించి, లోకోపకారముఁ జేసినచో వాని నావేశావతార మందురు. పృథుపరశురామకల్కిస్తులు లోనగువారట్టివారు. నృసింహ రామకృష్ణాదులు సాక్షాద్భగవదవతారములు. ఈవిషయములో నాధునికాచార్యులు భిన్నాభిప్రాయు లైరి.

బ్రహ్మజ్ఞాను లగు తల్లాప్రగడ సుబ్బారావుపంతులుగారు శ్రీకృష్ణు నావేశావతార మని తలంచిరి. ఆని బెసంటమ్మగారు ౧౮౯౯ డిసెంబరులో సాక్షాత్తుగ భగవదవతార మని యనిరి. ౫ లేక ౬, ఏండ్లనుండి ఆని బెసంటు లెడ్బీటరుగార్లు దశమస్కంధపూర్వభాగములో వర్ణింపఁబడిన వ్రజవాసి యగు శ్రీకృష్ణులు క్రైస్తువలె జగద్గురువులును బోధిసత్త్వులును, అగు మైత్రేయమహాత్ముల యావేశావతార మని తలంచిరి. భాగవతమతము, క్రైస్తవమతము, శ్రీరామానుజాచార్య సిద్ధాంతము, కేవలజ్ఞానముకంటె భక్తి మోక్షమునకు సన్నిహితోపకారక మని చెప్పుచున్నవి. భాగవతోపాఖ్యానములలో భగవత్సేవ, భాగవతసేవ, లోకసేవయే, భక్తియనియు, నట్టిభక్తిజ్ఞానముకంటెను మోక్షముకంటెను నూఱురెట్లెక్కువ యనియు, నొక్కి చెప్పఁబడినవి. "నీపాదకమలసేవయు, నీపాదార్చకులతోటి నెయ్యము నసితాంతాసారభూతదయయును, దాపసమందార నాకు దయసేయఁగదే" యనునర్థము పెక్కుచోట్ల గానఁబడుచున్నది. భాగవత తృతీయస్కంధగత విదురమైత్రేయసంవాదము, విష్ణుపురాణగతపరాశరమైత్రేయసంవాదము, తెలియఁజేయునంశ మేమన:— శ్రీకృష్ణు లుద్ధవాదులకును, శ్రీపరాశరులు మైత్రేయులకును, నుపదేశించినట్టి సనాతనధర్మము నే శ్రీకృష్ణు

నిర్యాణానంతరము భగవంతు లగు మైత్రేయులీకలియుగ
మం దీలోకములో స్థాపింపఁజేయుటకు శ్రీకృష్ణులచే నియ
మింపఁబడిన యాధికారికపురుషు లగు జగద్గురువులనియు,
వారు విదురున కట్లుపదేశించిరనియు, నగపడు. వారే క్రైస్తు
రామానుజాచార్యులు లోనగు నవతారము లెత్తిరనియు,
త్వరలో నింకొక యవతారమెత్తి యిప్పటి యిక్కట్లను
మాన్పి లోకరక్షణము చేయుదురనియు, వారిశిష్యప్రశిష్యు
లనుచుండుట మనకుఁ దెల్లము గద. వారు త్వరలో దయ
చేయుటకుఁ ద్రికరణశుద్ధిగా నహర్నిశముఁ బ్రార్థింపవల
యు. శ్రీకృష్ణులమహిమ దుర్విజ్ఞేయము, మఱియు నుపదే
శైకసాధ్యము. అయినను వారి కొన్నిచర్యలు దశమాది
స్కంధసారములలో సూచింపఁబడు.

ఈగ్రంథరచనలోను, దీనివ్రాయుటలోను, అచ్చొ
త్తించుటలోను, దప్పులను సవరించుటలోను, నాకు సాయ
మొనరించిన వారికెల్లరకు నతితతు లొనరించి దీని బ్రచు
రించితి. దీనిలో నుదహరించిన గద్యపద్యములు ప్రాచార్య
కృతములు.

బ్రహ్మశ్రీ, శతఘంటము వేంకటరంగశాస్త్రులవారు
రచియించిన 'ఆంధ్రవచనభాగవతము' లోని గద్యాల నక్క

షక్కుడ నిందు సంగ్రమించుటకు దానిని బ్రచురించిన బ్రహ్మశ్రీ, వావిళ్ల. రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారంగీకరించినందులకు వారికివందనములు.

సత్యంబ్రవీమి పరలోక హితం బ్రవీమి
సారం బ్రవీమి భగవద్ధృదయం బ్రవీమి
సంసార ముల్బణ మసారమవాప్యజంతో
స్సారోఽయమీశ్వరపదాంబురుహస్య సేవా..

---

హరిః ఓమ్.

శ్రీ గురుభ్యో నమః.

# శ్రీమద్భాగవతసారము.

## ప్రథమస్కంధసారము.

---

శ్లో. నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.

శ్లో. షడ్భిరంగై రుపేతాయ వివిధై రవ్యయై రపి,
శాశ్వతాయ నమస్కుర్మః వేదాయ చ భవాయ చ.

మ. లలితస్కంధము కృష్ణమూలము శుకా
లాపాభిరామంబు మం
జులతాశోభితముఁ సువర్ణసుమన
స్సుజ్ఞేయముఁ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమల
వ్యాసాలవాలంబునై
వెలయుఁ భాగవతాఖ్యకల్పతరువుర్విఁ
సద్ద్విజశ్రేయమై.

# ప్రథమస్కంధసారము.

## ౧౭. భగవదవతారసంగ్రహములు.

సోదరులారా !

ప్రథమస్కంధాదిలోఁ బురాణవేత్త యగుసూతుఁడు శౌనకాదిఋషులకు హరిభక్తిని, నాత్మతత్త్వమును, నిష్కామకర్మవైరాగ్యములను, సంగ్రహముగఁ జెప్పి, విష్ణువు యొక్క యవతారములను, వారిచర్యలను, నవతారరహస్యజ్ఞానహేతుస్వరూపాదులను, వక్కాణించె. ద్వితీయస్కంధములో శ్రీశుకాచార్యులు పరీక్షిద్రాజునకు వీనితో నింకొకనాలుగును జేర్చి, యవతారములను సప్రయోజనముతో, బ్రహ్మ నారదున కుపదేశించినరీతిని, జెప్పె. ౫-౮-౧౦-౧౧-౧౨-స్కంధములలో నింకఁ గొన్ని చెప్పఁబడినవి. వానిని గ్లుప్తముగ నిందుఁ బొందుపఱచెద. శ్రీమన్నారాయణుఁడగు వాసుదేవుఁడే తొలుదొలుతఁ దాను నిర్గుణుఁడయ్యు విభుండై, గుణమయము, కార్యకారణాత్మకంబు, నగునాత్మమాయతోడం గూడి, యీజగమెల్ల సృజించె. అయ్యాత్మమాయవలన విలసిల్లు నాకాశాదిగుణముల లోనం దాను జొచ్చి గుణవంతుని పోలెఁ దోఁచఁ జేయుచుండు. వస్తు

గతింజూచినఁ జిచ్ఛక్తి విజృంభణమునంజేసి యాతం డట్టి వాఁడుగాఁడు. అగ్నియొక్కఁడయ్యుఁ బెక్కుదారువులం గూడి నానావిధములం దోఁచురీతి విశ్వాత్ముఁ డగుపరమ పురుషుఁడు నానాభూతముల నంతర్యామియై నానారూప ములఁగొన్నయట్లు దోఁపఁజేయుచుండు. హరిభూతసూక్ష్మేం ద్రియమనములం దననిర్మించినభూతములలోనంజొచ్చి తత్తద్గుణముల నిచ్ఛమై భోగింపఁజేయు. లోకపావనుఁడైన యాలోకేశ్వరుఁడు లీలావతారలోలుఁడై దేవతిర్యఙ్న రాదిరూపములం గొని సత్త్వగుణములలోకములం బా లించుచున్నవాఁడు.

## ౧. పురుషావతారము.

మహాదహంకారపంచతన్మాత్రములంబొదవి యేకాద శేంద్రియములు పంచమహాభూతములను షోడశకళల నొప్పారు పురుషావతారంబుఁ దొలుత భగవంతుఁడు లోకముల సృజించువాఁడై గ్రహించె. అయ్యదియే భగవంతుని విరాడ్రూపంబని చెప్పఁబడు. అదియే పరమే శ్వరుని ప్రథమావతారంబు. అప్పరమపురుషుఁ డేకార్ణ వంబైన జలమున విశ్రమించుచు సమాధిరూపమగు నిద్రం దనరించునెడ నతని నాభిహ్రదంబునందలి కమల

మునం దొల్లిపాద్మకల్పమునం బ్రపంచసృష్టికారుల కధి
పతియగు చతుర్ముఖుండు వొడమె. బ్రహ్మజన్మకారణం
బైన యప్పురుషావతారముఁ దాల్చినభగవంతుని విరా
ణ్మూర్తి యవయవసన్నివేశంబులచే దేవమనుష్యాదిలోకవి
స్తారంబెల్లఁ గల్పింపఁబడియె.అయ్యది యేరజోగుణాదులం
దవులని సత్త్వమయంబైన భగవంతుని నిరతిశయనిజ
రూపంబు.అనేకపాదములు తొడలు ముఖములు శిరస్సులు
నేత్రములు శ్రోత్రములు నాసికములు కిరీటకుండలాంబ
రములును గలిగి యద్భుతంబుగా వెలయు నయ్యుత్తమ
రూపమును యోగులుత్తమం బగు జ్ఞానలోచనమునం
గాంతురు. ఇయ్యదియే యాదినారాయణరూపం బని
చెప్పఁబడు. ఇది యితరావతారముల రీతి నావిర్భావ
తిరోభావములం గాంచక యవికారంబై కార్యాంతమున
సర్వావతారములకు నివేశస్థానంబై యారంభమున
నన్నింటికి బీజము చొప్పున నుద్గమస్థానంబై నాశరహి
తంబై యొప్పుచుండు. తదీయాంశాంశములనే దేవతిర్య
ఙ్నరాదిసర్గంబు చెల్లుచుండు. అట్టి పురుషావతారంబుఁ
బూనియే భగవంతుఁడు దొలుతఁ గౌమారమను సర్గ
విశేషమునకుఁ దొడరి బ్రాహ్మణుండై దుశ్చరంబైన యఖం
డితబ్రహ్మచర్యంబు నడపె. కాన,

శ్లో. భూతైర్యదాపంచభిరాత్మసృష్టైః
పురం విరాజంవిరచయ్యతస్మిన్,
స్వాంశేనవిష్టః పురుషాభిధాన
మవాపనారాయణ ఆదిదేవః.

## ౨. మత్స్యరూపము.

క. మీనయి తా నతలగతం
బైననిగమచయముఁ దెచ్చి యజునకు నొసఁగం
గా నేర్చినసుమనస్సమ్మా
నితవిగ్రహుభజింతు మత్స్యాత్మహరిన్.

## 3. కూర్మము.

క. అమృతమథనమున మంధన
గము లీలోద్ధరణకేలిఁ గైకొని సురసం
ఘమునకుఁ బ్రియ మొనరించిన
యమేయుఁ గూర్మాత్ము నంబుజాక్షుం గొలుతున్.

## ర. ధన్వంతరి.

వ. సముద్రమథనమున నమృతకలశము దెచ్చియు రోగ నివారణముకొఱకు నాయుర్వేదశాస్త్రముఁ బ్రకటించిన హరిరూపము.

## ౫. మోహినీరూపము.

వ. అమృతంబు గొని దేవాసురులకుఁ బంచిపెట్టుటలో వారిని దనవేషముచే మోహముఁజెందించిన శ్రీహరి.

## ౬. వరాహము.

క. వారాహరూపమునఁ బెం
పారినతనదంష్ట్ర నొకట నవనిసగిరికాం
తారంబుగ నెత్తినయా
శౌరిం గ్రోడాత్ముఁ దలఁతు సమ్యగ్భక్తిన్.

## ౭. నృసింహమూర్తి.

ఆ. నారసింహవపురుదారభావమునొంది
ఘనుహిరణ్యకశిపుఖరనఖమున
వ్రచ్చిదీప్తమూర్తివఱలు నృసింహాత్ము
నాత్మభవునిభక్తి నాశ్రయింతు.

## ౮. వామనుఁడు.

క. వామనరూపంబునను
ద్దామబలుఁ బలినడంచి త్రైలోక్యాతి
క్రామితఁ బేర్చిన యద్భుత
ధాముంగ్రాంతాత్ముఁ దలఁతు దామోదరునిన్.

ఇప్పటి వైవస్వతమన్వంతరమం దీరూపము హరియొ త్తెను.

౯. పరశురాముఁడు.

ఆ. పరశురాముఁ డనఁగ భవ్యుండుజమదగ్ని
కుద్భవించి యిరువదొక్క మాఱు
మనుజపతులనెల్లఁ దునిమిన క్రోధాత్ము
నధికభ క్తి శార్ఙ్గినాశ్రయింతు.

౧౦. శ్రీరాముఁడు.

క. క్షత్త్రాత్ముఁ గొలుతు దశరథ
పుత్త్రుః శ్రీరాముఁ డనఁగఁ బొలిచిన దేవున్
శత్త్రుభయదు రావణు నొక
మాత్రం దునుమాడినట్టిమధుసూదనునిన్.

౧౧. బలరాముఁడు.

క. హలముసలధరునిఁ గసుణా
నిలయహృదయురాముఁ రౌహిణేయుసితాంగుః
జలదనిభాంబరుని శుచిం
దలఁతునుగోవిందుశౌర్యధనుభోగాత్మున్.

౧౨. శ్రీకృష్ణుఁడు.

మ. యదువంశంబున వాసుదేవుఁడనఁ గ్రీ
డార్థంబు జన్మించి దు

ర్మదయై త్యావలిఁ గూల్చి పార్థునకు సా
రథ్యంబు త్రైలోక్యస
మ్మదమారంగ నొనర్చి దేవముని స
మ్మానోద్ధతిఁ భూభరం
బుడొలంగించినచక్రి నంబురుహనా
భుఁ గొల్తుఁ గృష్ణాత్మునిన్.

## ౧౩. శ్రీబుద్ధదేవుఁడు.

వ. కలియుగాదియందు మధ్యగయప్రదేశంబున జిన సుతుండై తేజరిల్లి వైదికేతరమతస్థులకు ధర్మము బోధఁ జేసిన హరి.

## ౧౪. కల్కి.

క. కలికాలచలితధర్మము
నిలుపంగలయట్టి విష్ణునింగల్కాఖ్యత్మున్
దలఁతుఁ దురగవాహను మ్లే
చ్ఛులనెల్లం గీటడంచుశుభచారిత్రున్.

## ౧౫. నరనారాయణులు.

క. గణుతింపఁగ నరనారా
యణులన ధర్మునకు నుదయమందిరి దాతౌ

యణిమయైనమూర్తినలనం
బ్రణుతగుణోత్తరులు పరమపావనమూర్తుల్.

శ్లో. ధర్మస్య దక్షదుహితర్యజనిష్ట మూర్త్యాం
నారాయణో నర ఇతి స్వతపః ప్రశాంతః
నైష్కర్మ్యలక్షణ మువాచ చచార కర్మ
యోద్యాపిచాస్త ఋషివర్యనిషేవితాంఘ్రిః.

శ్లో. యో వై భారతవర్షేఽస్మిన్ క్షేమాయస్వస్తయేనృణాం,
ధర్మజ్ఞానశమోపేత ఆకల్పాదాస్థిత స్తపః.

వీరు బదరీవనమునఁ గామక్రోధములను జయించి తీవ్ర వైరాగ్యపరులై మనభారతవర్షాభివృద్ధికొఱకు నీకల్పాది నుండి యిప్పటికి నారదాదిఋషులతోఁగూడి తపంబుఁ జేయుచు మనకు మేలరయుచున్నారు. కాన,

శ్లో. నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం
దేవీం సరస్వతీంవ్యాసం తతో జయ ముదీరయేత్.

౧౬. యజ్ఞుఁడు.

వ. ఋచియనుమునికి నాకూతియందుదయించి తన కొడుకులగు యామాదిసురలు గొలువస్వాయంభువమన్వంతరముఁ బాలించినహరి.

౧౭. కపిలుఁడు.

చ. ధృతమతి దేవహూతికిని
దివ్యవిభుండగు కర్దమప్రజా
పతికిఁ బ్రమోదమొప్ప నవ
భామలతోఁ గపిలాఖ్యుఁ బుట్టియే
గతిహరిపొందునట్టిశుభ
గం బగుసౌఖ్యముఁ దల్లికిచ్చి దు
ష్కృతములువాపి చూపె ముని
సేవితమై తనరారు మోక్షముఁ.

౧౮. దత్తాత్రేయుఁడు.

అత్రిపత్ని యగుననసూయకు హరివలనఁబుట్టి ప్రహ్లాదాలర్కాదులకు యోగజ్ఞానము లుపదేశించిన హరి యంశము. అనసూయకు శివుఁడు దూర్వాసుఁడుగను, బ్రహ్మ చంద్రుఁడుగను నుదయించి, బ్రహ్మశివవిష్ణువులకుఁ దత్త్వములో భేదము లేదని వా రత్రి కిట్లు సెలవిచ్చిరి:—

క. విను మేము ముగుర మయ్యును
ననుపమమతిఁ దలఁప నేకమై యుండుము.

### ౧౯. హంస.

హంసరూపమున బ్రహ్మజ్ఞానభరితమగుభాగవతమును నారదునకుపదేశించిన హరి.

### ౨౦. నారదుఁడు.

మునులకు హరితత్త్వభక్తిబోధకం బగుపాంచరాత్రతంత్రంబును బోధించిన విష్ణ్వవతారము.

### ౨౧. వాసుదేవసంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధులు.

వ. పరుఁ డగువాసుదేవుఁడే నాలుగు వ్యూహరూపముల నవతరించి సృష్టిస్థితిలయము లొనరించుచున్నట్లు పాంచరాత్రములో నున్నది. "నమస్తే వాసుదేవాయ నమస్సంకర్షణాయచ, ప్రద్యుమ్నాయానిరుద్ధాయ తుభ్యం భగవతేనమః." వీని విశేషములుగల పాంచరాత్రమతసంగ్రహము ౧౨-వ స్కంధసారములోఁ జూడ నగు.

### ౨౨. సనకసనందసనత్కుమారసనత్సుజాతులు.

ఈ నలుగురు బ్రహ్మమానసపుత్రులుగ నవతరించి పూర్వకల్పప్రళయమునందుత్పన్నసంప్రదాయంబైన బ్రహ్మవిద్య నీకల్పమందుఁదగిన శిష్యుల కుపదేశించునాధికారికులు.

శ్లో. ప్రాక్కల్పసంప్లవవినష్టమిహాత్మతత్త్వం
సమ్యగ్జగాదమునయోయదచక్షతాత్మన్.

## ౨౩. హయగ్రీవుఁడు.

యజ్ఞమునందు హరి యీరూపమున నవతరించి బ్రహ్మకు వేదము నుపదేశించెను.

శ్లో. హంసస్వరూప్యవదదచ్యుతఆత్మయోగం
దత్తఃకుమారఋషభో భగవాన్ పితానః,
విష్ణుశ్శివాయజగతాంకలయానతీర్ణ
స్తేనాహృతామధుభివా శ్రుతయోహయాస్యే.

## ౨౪. హరి యనునాదిమూలావతారము.

మ. కరినాథుండుజలగ్రహగ్రహణ దుః
ఖాక్రాంతుఁడై వేయిన
త్సరముల్ గుయ్యిడుచుండ వేల్పులకు వి
శ్వవ్యాప్తిలేకుండుటన్
హరినీవేశరణంబ నాకనినఁ గు
య్యాలించి వేవేగవా
శ్చరముం ద్రుంచి కరీంద్రుఁగాచెమహితో
త్సాహంబునన్ సోదరా.

### ౨౫. ఋషభుఁడు.

హరి ఋషభ నామమున నాభికి మేరుదేవియం దవ
తరించి కొంతకాలము రాజ్యముచేసి యధ్యాత్మవిద్యగఱపి
తుదకు సుతుల కారాజ్యము నొప్పగించి పరమహంసమా
ర్గంబు నితరుల కుపదేశించి యవధూతచర్య నాచరించెను.

### ౨౬. ధ్రువుఁడు.

సవతితల్లిచే నవమానింపఁబడి నడవి కేగి తపంబొన
రించి యందఱమీఁదనుండు ధ్రువపదమ్ము సాధించిన హరి
రూపము.

### ౨౭. పృథువు.

హరి పృథువుగ నవతరించి భూమిఁజక్కఁగఁ బా
లించి ప్రజలకు ధర్మార్థకామముల నుపన్యసించిరి.

### ౨౮. వ్యాసులు.

చ. ప్రతియుగమందు సంకుచిత
భావులు నల్పత రాయువుల్ సుదు
ర్గతికులు నైనమర్త్యుల క
గమ్యములున్ స్వకృతంబులున్ సుశా
శ్వతములు నైన వేదతరు
శాఖలు దా విభజించినట్టిన

న్నుతుఁడు పరాశరప్రియుత
నూజుఁడు నాహరి పుట్టెనర్మిలిన్.

చ. ప్రాంశుపయోదనీలతను
భాసితునుజ్జ్వదండధారుఁ బిం
గాంశు జటాచ్ఛటాభరణు
నాగమపుంజపదార్థతత్వ ని
స్సంశయకారుఁ గృష్ణమృగ
చర్మకృతాంబర కృత్యుభారతీ
వంశవివర్ధనుణ్ త్రిదశ
వందితు సాత్యవతేయుఁగొల్చెదన్.

౨౯. వైకుంఠుఁడు.

వైకుంఠలోకమున కధిపతియగు హరి.

చతుర్దశమనువులు (౧౪) ప్రతిమన్వంతరమందు మన్వవతారంబులనొంది స్వకీయతేజఃప్రభావంబున నప్రతిహతంబై లోకసంరక్షణంబుఁ జేయుచుండు హరిరూపములగు.

చతుర్దశమన్వంతరములలోని హరి యవతారములు ౧౪—వీరి పేర్లు:—యజ్ఞుఁడు, విభువు, సత్యసేనుఁడు, హరి, లేక హరిమేధస్సు, వైకుంఠుఁడు, అజితుఁడు, వామనుఁడు,

సార్వభౌముఁడు, ఋషభుఁడు, విష్వక్సేనుఁడు, ధర్మసేతువు, స్వధాముఁడు, యోగీశ్వరుఁడు, బృహద్భానుఁడు. వీరు వరుసఁగ 14 మన్వంతరములలో జగత్పాలనంబుఁగావింతురు. వీరిలో యజ్ఞహరి వైకుంఠ వామనులు పూర్వముదాహరింపఁబడిన వారైనను, ఋషభుఁ డాయుష్మంతున కంబుధారయందుఁ బుట్టినహర్యవతారముగాన నాభికొడుకగు ఋషభదేవునికంటె భిన్నుఁడు. కాన నివియన్నియు ౫౩ అవతారములు.

మఱియు సృష్టివిషయతపస్సును, బ్రహ్మమును, ప్రజాపతులును, లోకముల సృజించునెడను, ధర్మమును, విష్ణుండును, మనువులును, ఇంద్రాది దేవగణంబులును, ధాత్రీపతులును, లోకమునుఁ బాలించునెడను, నధర్మమును, శ్రీరుద్రుండును, నురగంబులును, రాక్షసులు మున్నగువారును, లోకనాశము గావించునెడను, నానాశక్తివిలసితుండైన భగవంతుని మాయావిభూతులేగాని యొండుగాదు.

## ౮. అవతారరహస్యజ్ఞానము.

ప్రథమస్కంధ తృతీయాధ్యాయములోని ౨౫-౩౫ శ్లోకములలో భగవదవతారరహస్యజ్ఞాన మిట్లు వర్ణింపఁబడె.

ఊటయుడుగని సరస్సునం గాలువలమాడ్కి సత్త్వనిధియగుహరియవతారంబుల సంఖ్యాకంబులై ప్రవర్తిల్లు.

ఋషులు మునులు సురలు మనుపుత్త్రులు ప్రజాపతులు మున్నుగా నెల్లవారు హరివిభూతివిశేషంబకాని యొండు కాదు. ఇయ్యవతారంబులలోఁ గొన్ని హరియంశములు గను కొన్ని యంశాంశములుగ నున్నవి. దైత్యవ్యాకులంబైన లోకమునకుఁ బ్రతియుగమున సుఖముఁ గూర్పఁగ యథోపయోగముగ జ్ఞానక్రియాశక్తులకు సమావేశము గలిగించుచుండు. వసుదేవునకు దేవకీదేవియందవతరించిన శ్రీకృష్ణుఁడన్ననో యట్లుగాక సర్వపరిపూర్ణుఁడై యావిష్కృతసకలశక్తివిలసితుండై సాక్షాన్నారాయణుండ యగు. ఈయవతారరహస్యంబుఁ దెలిసిన నరునకు ముక్తిగల్గునని భగవద్గీతాభాగవతములు నొక్కి చెప్పుచున్నవి. రూపహీనుఁడై చిదేకరసుఁడైన యాత్మునకీస్థూలసూక్ష్మరూపములు భగవంతుని మాయాగుణములగుమహదాదులచే నాత్మస్థానమునఁ గల్పితంబు లయ్యె. ఈరెండు రూపములు నాత్మునియం దవిద్యాకల్పితంబుల కాని వాస్తవములుగావని సమ్యగాత్మజ్ఞానమునఁ బ్రతిషేధముఁ గావింపఁబడు నప్పుడు జీవుఁడు జ్ఞానైకస్వరూపమగుబ్రహ్మంబ యగు. సంసారచక్రమునం గ్రీడించు సర్వజ్ఞుఁడగు నీశ్వరుని మాయాదేవి యావరణవిక్షేపములొనర్పకయు పరమంబు గాంచి విద్యారూపమునం బరిణ

మించి సదసద్రూపం బగుజీవోపాధిని నీఱుచేసి యుపర మంబుఁగాంచునేని యప్పుడతండు బ్రహ్మస్వరూపసంప న్నుఁడని తత్త్వవిదులెఱుంగుదురు. పెక్కేల? అప్పు డతఁడాత్మీయమగు పరమానందరూపమునఁ బూజితుం డగు. జీవునకు జన్మాదులు మాయాకార్యంబులైనవిధం బుననే, యంతర్యామి యగునీశ్వరునకును గర్తృత్వంబు లేకున్నను, గర్మంబులును, జన్మాదులు లేకున్నవతా రంబులును, వేదరహస్యంబులై చెల్లుచుండునని పెద్దలు వర్ణింతురు. ఈశ్వరుండీవిశ్వమునకు సర్గస్థితులొనర్చుచుఁ దాను వానిం దవులక యింద్రియాదులను నియమించుచు వానివిషయములం గ్రహించుచు,నందు జీవునివలె సక్తుం డు గాఁడు. స్వాతంత్ర్య పారతంత్ర్యములే యీశ్వరు నకు జీవునకును విశేషమై యుండెడు. దీనివివరము ప్రథ మాదిస్కంధ ప్రబోధచంద్రోదయ సంకల్పసూర్యోదయా దులందుఁ జూడ నగు. అవతారములను నుపన్యాసము లలో ఆనిబెసెంటమ్మగారిజ్ఞానమును మనోహరముగ వివ రించిరి. ప్రపంచరక్షణమునకొఱకింత శ్రమనుచేయుట కీశ్వరునకుఁ, బ్రపంచమునందును, దానినివాసులయందును, గల నిర్హేతుకజాయమానకటాక్షముగాక వేఱొండుగా దని వృద్ధులిట్లు సెలవిచ్చిరి.

పరోపకృతికైవల్యే తులయిత్వా జనార్దనః,
మత్వా చోపకృతిం గుర్వీమవతారాన్ దశాగ్రహీత్.

అట్లే దేహదేహీయులపై నహంకారమమకారము లుమాని లోకోపకారరూప మగుభగవత్సేవ యనుభక్తిం జేసినచో శ్రీహరి యనుగ్రహించు నని బ్రహ్మ నారదున కిట్లు చెప్పెను.

చ. ఇతరము మాని తన్ను మది
నెంతయు నమ్మి భజించువారి నా
శ్రితజనసేవితాంఘ్రి సర
సీరుహుఁడైన సరోజనాభుఁ డం
చితదయతోడ నిష్కపట
చిత్తమునం గరుణించునట్టివా
రతులదురంతమై తనరు
నవ్విభుమాయఁ దరింతు రెప్పుడున్.

మఱియు బ్రహ్మశివనారదసనకాదులును ప్రహ్లాద స్వాయంభువమనుశతరూపాప్రాచీనబర్హిశ్శుకయమాంగధ్రు వాదులును, నామాయాస్వరూప మెఱుంగుదురు. మఱియు నైలముచికుందజనకగాధిరఘుసగరాంబరీషగయయయాతి మాంధాతాలర్కశతధన్వరంతిదేవ దేవవ్రతబలిదిలీపధూర్త

రయసౌభరిభూరిషేణోదంకశిబిదేవల పిప్పలాదోద్ధవపరాశ
రవిభీషణహనుమదర్జునార్ష్టిషేణవిదురశ్రుతదేవ లోనగు
మహాత్ములుగూడ విష్ణుమాయ నెఱిఁగి యతిక్రమింప
నేర్తురు. పెక్కు లేల? భాగవతులంగొలిచి తదీయశీలము
నేర్చినమాత్రముననే స్త్రీశూద్రహూణశబరపుల్కసాదుల
కీమాయాస్వరూపంబు దెలిసి దాఁటఁ గలగన. గురూపసత్తి
శాస్త్రాభ్యాసములతో భగవంతుని నిరంతరభజించు పుణ్యా
త్ములఁ జెప్పనలయునె?

### ౯. ప్రథమస్కంధసారము.

వైరాగ్యము ప్రథమస్కంధమందు సూతశౌనకా
దులు, నారదవ్యాసులు, శుకపరీక్షితులు, గురుశిష్యులుగ
నుండి, శ్రీమద్భాగవతము నీలోకములోఁ బ్రవర్తింపఁజేసి
నట్లగపడుచున్నది. వీనికి వైరాగ్యతారతమ్యముచే వరు
సఁగ మందమధ్యమోత్తమత్వము నిర్ణయింపఁబడినది.
సూతశౌనకాదులు మందవైరాగ్యు లనియు, నారదవ్యా
సులు మధ్యమవైరాగ్యు లనియు, శుకపరీక్షితులు, ఉత్త
మవైరాగ్యు లనియు, హరిలీలలో బోపదేవుఁ డనేకహే
తువులతో నిర్ణయించిరి. అనుబంధము (౧) ను జూఁడుడు.
పరీక్షిన్మహారాజుత్తమవైరాగ్యసంపన్నుఁ డని నిరూపిం
చుటకై విప్రశాపకుస్సైన సమృద్ధమగురాజ్యభోగమును

ద్యజించినారనియు, వ్యాసనారదాదిఋషులు వారి వైరాగ్యమునకచ్చెరువందివారిసమీపమునకువచ్చిరనియు, భాగవతములోఁ జెప్పఁ బడినది. రాజ్యము నిష్ప్రతిపక్షమనుటకై భీష్మనిర్యాణమును, అశ్వత్థామపరాజయమును వర్ణింపఁబడినవి. మఱియు భగవదవతారసమాప్తియుఁ గౌరవపాండవనిర్యాణమును, వైరాగ్యదార్ఢ్యముకొఱకు మొదటిస్కంధములోఁ జెప్పఁబడినవి. కావున నీవైరాగ్యత్రయములో నొకవిధ మగువైరాగ్యము గలవాఁడే భాగవతశ్రవణమందు నధికారియని ప్రథమములో నధికారినిరూపణము చేయఁబడినది. పరీక్షిన్మహారాజు ఋషులను జ్ఞానోపదేశముకొఱకుఁ బ్రార్థించుటచే గురూపసత్తియావశ్యక మనియుఁ, దీవ్రవిరక్తి గలశిష్యునివెదుకుచు గురువతనిని డాయును గాన శుకమహర్షి పరీక్షిత్సమీపమునకుఁ దానె వచ్చె ననియు, మొదటిస్కంధమువలన నరయ నగు. మఱియు మనుష్యశరీర మెత్తినందులకు ప్రయోజనము లోకోపకారము చేయుటయే యని ఋషులీతీరున పరీక్షిత్తున కుపదేశించిరి.

శివాయ లోకస్య భవాయ భూతయే
య ఉత్తమశ్లోకపరాయణా నరాః,
జీవంతి నాత్మార్థ మసౌ పరాశ్రయం
ముమోచ నిర్వేద్య కుతః కళేబరం.

చ. ఉత్తమకీర్తులైనమను
జోత్తము లాత్మహితంబు లెన్నఁడుం
జిత్తములందుఁ గోరరు హ
సించియు లోకుల కెల్ల నర్థసం
పత్తియుభూతియుఁ సుఖము
భద్రముఁ గోరుదు రన్యరక్షణా
త్యుత్తమమైన మేనువిభుఁ
డూరక యేల విరక్తిఁ బాసెనో (భా౧-౮౦).

మఱియు నీస్కంధములోఁ బలుచోట్ల శ్రీకృష్ణ స్వరూప రూపగుణమహిమలు, వారిభక్తులగు భీష్మకుంతీ విదురపాండవుల భక్తివైరాగ్యప్రకారములు, శ్రీకృష్ణనారద వ్యాసశుకసూతాదు లొనరించిన లోకోపకారములు, సోపస్కరముగ వర్ణింపఁబడినవి గాన నిందు భాగవతశ్రవణాధికారికిఁ గావలసిన వైరాగ్యము లెస్సఁగ వివరింపఁబడియద్వైతమిట్లు సూచింపఁబడినది:—

శ్లో. ఆదిమధ్యావసానేషు వైరాగ్యాఖ్యానసంయుతమ్,
హరిలీలాకథావ్రాతామృతానందితసత్సురమ్.

శ్లో. సర్వవేదాంతసారం యద్బ్రహ్మాత్మైకత్వలక్షణమ్,
వస్త్వద్వితీయం తన్నిష్ఠం కైవల్యైకప్రయోజనమ్.
(భా. ౧౨-౧౩-౧౧-౧౨.)



హరిః ఓం.

శ్రీగురుభ్యోనమః.

# ద్వితీయస్కంధసారము.



శ్లో. శ్రీగురూన్ పరమానందస్వరూపా నభివాదయే,
తాపత్రయాపహా యేషాం కృపా బ్రహ్మామృతప్రపా.

తే. చేతులారంగ శివునిఁబూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబులోను గాఁదలఁపఁడేనిఁ
గలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు.

## ౧౦. ద్వితీయస్కంధసంగ్రహము.

సోదరులారా !

ప్రథమస్కంధాంతమందు రాజు ప్రాయోపవిష్టుఁడైనపు డతనికిఁ గలవిరక్తినింజూచి యచ్చెరువొంది వ్యాస పరాశరమైత్రేయాదిఋషులు తత్సమీపమునకు రాఁగా రాజు వారిని సన్మానించి భగవత్కథలను గీర్తింప మని వేడుకొనఁగ శుకమహర్షి యాదృచ్ఛికముగ నచటి కే

తెంచె ననియు, వారిని రాజు గౌరవించి మృతికాలమునం దరుఁ డొనరింపఁదగిన కృత్యముల నడిగినట్లును జెప్పఁబడె ను. దానిపై శుకులు రాజునకు ద్వితీయస్కంధమున మృతి నొందు నరుఁడు సర్వసంగపరిత్యాగముచేసి భగవద్రూప గుణనామశ్రవణకీర్తనస్మరణాదులను జేయవలయుననియు, నందుకు మొదట ధారణాయోగ మనుష్ఠింపవలయు నని యుఁ గూడ సెలవిచ్చిరి. అది రెండుతెఱంగులు. మొద టిది స్థూలధారణమనంబడు. చతుర్దశ (౧౪) భవనాత్మక బ్రహ్మాండమందుఁ గల సకలపదార్థములు పరమేశ్వరునిశిరః ప్రభృతిపాదాంతావయవము లని భావించుటయే స్థూల ధారణము. రెండవది సూక్ష్మధారణము. భగవంతునిదివ్యా యుధదివ్యభూషణసమన్వితం బగుదివ్యవిగ్రహమును మన స్సులో ధ్యానించుటయే సూక్ష్మధారణము. ఈరెంటిచే వశీకృతాంతఃకరణము గలవాఁడే విష్ణుశ్రవణకీర్తనస్మర ణాదులనుఁ జేయ నగు ననిచెప్పి ద్వాపరాంతమందుఁ దన తండ్రి యగువ్యాసులచేఁ గావింపఁబడిన శ్రీభాగవతమును శుకులుచెప్పఁదొడఁగె.

తర్వాత శ్రీపరమపురుషుని లీలావతారములు, వారి యమానుషచర్యలు, లోకోపకారకర్మములు, వానిప్రయో జనములు, ప్రథమస్కంధములో సూతుఁడు శౌనకాదులకుఁ

జెప్పినదానికంటె విస్తరముగను, సోపస్కరముగను, భక్తి భావితంబుగను, బ్రహ్మ నారదుల కుపదేశించి గని శుకులు రాజునకుఁ జెప్పిరి. ఆయవతారసంగ్రహ మిదివరలోఁ జేయ బడినది. విష్ణుమహిమ దుర్విజ్ఞేయ మయినను వారిదయ వలననే బ్రహ్మమొదలుసర్వజీవులకు వారియందు భక్తిగలిగి దేహదేహాయులపై నహంకారమమకారములఁద్యజించిన చో నామహిమ నరయవీలగునని బ్రహ్మ నారదునకు సెల విచ్చె. భగవదవతారరహస్యజ్ఞానము వలన మాయాతర ణోపాయము, బ్రహ్మతత్త్వము, నారాయణునకు లోకుల పైఁ గలుగు నిర్హేతుకజాయమానకటాక్షము, తద్భక్తిజ్ఞా నావశ్యకతయు, లోనగువిశేషములందు నరయనగు. భగవ ద్భక్తియందు దేవాసురమానవవానరాదిసర్వజీవులధికారు లని శుకులు చెప్పఁగ సంతసించి సృష్టిస్థితిలయబంధమోక్ష నియమనప్రవేశవిశేషములనుగూర్చి రాజడుగ శుకు లీ తరున బ్రహ్మనారదసంవాదము ననువదించెను.—

## ౧౧. బ్రహ్మనారద సంవాదసారము.

దీనిలో మొదట శ్రీమన్నారాయణుఁడు బ్రహ్మకుఁ జేసిన యుపదేశ మీరీతిని వివరింపఁ బడినది. ౨౨ తత్త్వ ములను సృజించి బ్రహ్మాండము నేర్పఱచి దానిగర్భోదక మందుఁ దా మావేశించి తమనాభియం దొక కమలము

సృజింపఁగ నాకమలము గర్భోదకోపరిభాగమందుఁ దేలు చుండఁగ దానియందు బ్రహ్మదేవుఁ డుదయించి కమలము నకు మూలస్థాన మరయుటకు దానినాళము ద్వారా లోపలఁ బ్రవేశించి బహుకాలము యత్నించినను మూలము నరయఁజాలక నిర్విణ్ణుఁడై తిరిగి కమలగర్భమునుఁ బ్రవేశించి చింతించుచుండఁగఁ దపస్సుచేయు మను "తప" శ్శబ్ద మొకటి బ్రహ్మకు వినఁబడెను. తదనంతరము బహువర్షంబులు తప మొనరింప నారాయణుఁడు ప్రసన్నుఁడై తనదివ్యలోకమును ముక్తబృందసేవితమును నగుదివ్యస్థానమంటపమును దానిలోని తనసన్నివేశవిశేషమును గనఁబఱిచెను. అందులకు బ్రహ్మ యచ్చెరువొంది భగవంతుని స్తుతింప "నీయెడఁ బ్రసన్నుండనై యావైకుంఠలోకమును జూపితిని. నీవీ బ్రహ్మాండమందుఁ జరాచరములను సృజింపు" మని యానతిచ్చి శ్రీభాగవతార్థసారమును బ్రహ్మ కుపదేశించెను. పిదప లోకములను లోకపాలురను జరాచరభూతములను బ్రహ్మసృజించి బ్రహ్మమానసపుత్త్రుఁ డగునారదునకు భాగవతమును సవిస్తరముగ నుపదేశించెను. కడపటియధ్యాయమందు భాగవతములో వివరింపఁబడిన తొమ్మిదిలక్షణములు గల లక్ష్య మగు నాశ్రయము, జగత్సృష్టియు సూక్ష్మముగ వర్ణింపఁబడెను. సృష్టికిఁ బూర్వమే నారాయణుఁడు వైకుంఠమును బ్రహ్మకుఁ జూపినందున నది

నిత్య (Super Cosmic) మని తోఁచుచున్నది. మఱియుఁ
జిత్తైకాగ్ర్యరూపమగు తపస్సే సమాధి యనియు, భగవం
తుని స్థూలసూక్ష్మరూపముల ధ్యానముచేఁ జిత్తైకాగ్రత
గలుగుననియు, దానిచే భగవత్తత్త్వదర్శన మగుననియు,
నీస్కంధమువలనఁ దెలియ నగు. ఇది "అపిసంరాధనే
ప్రత్యక్షానుమానాభ్యాం" అను బ్రహ్మసూత్రముయొక్క
యర్థము ననుసరించుచున్నది. కాననే వేదాంతకల్పతరు
కారు లిట్లు సెలవిచ్చిరి:—

"అపిసంరాధనేసూత్రా
చ్ఛాస్త్రార్థధ్యానజా ప్రమా,
శాస్త్రదృష్టి ర్మతా తాం తు
వేత్తి వాచస్పతిః పరః" ఇతి.

దీనివిశేషములు మత్కృతబ్రహ్మసూత్రసారములో వివ
రింపఁబడినవి.



హరిః ఓం.

శ్రీగురుభ్యోనమః.

# తృతీయస్కంధసారము.



శ్లో. యోనిత్యం యముపాసతే ఽఖిలజనాః
యేనేదమావాస్యతే
యస్మైకర్మకరోతిసాత్వికకులం
యస్మాదిదం జాయతే
యస్మైశ్వర్యమవేక్ష్యనైజవిభవం
యస్మిన్మహీవిశ్వంస్థితం
సందూరే పునరంతికే ఽపివిదితం
ధ్యాయామి నారాయణం (పరమేశ్వరం).



౧౩. మూఁడవస్కంధసంగ్రహము.

మూఁడవస్కంధములో సర్గమను సృష్టివర్ణింపఁ
బడెను. మొదట శ్రీకృష్ణ నిర్యాణకాలమునకుఁ బూర్వము

ఉద్ధవుఁడు వారిచేఁ దత్త్వోపదేశముఁ బొంది బదరీవన
మునకుఁబోవుచు, మార్గమధ్యమున మధురనొద్ద విదురునిం
గలసి, యతనికి శ్రీకృష్ణపాండవకౌరవనిర్యాణాదులఁ జెప్పి,
నాతత్త్వమును దనకు బోధింపుమని విదురుఁడు ప్రార్థిం
పఁ, దనకు శ్రీకృష్ణులు తత్త్వముపదేశించినపుడు భగవ
న్మైత్రేయమహర్షి వచ్చినట్లును, విదురునకు దాని నుపదే
శింపుమని భగవదాజ్ఞ యయినదనియుఁ, జెప్పి యుద్ధవుఁడు
బదరికేగెను. దీనిలో విదురోద్ధవులకును, మొదటిస్కంధము
లో సూతభీష్మకుంతీయుధిష్ఠిరార్జునోత్తరాదులకును, నింద్ర
ప్రస్థద్వారకాపురస్త్రీలకును, భూదేవికిని, పరీక్షిద్రాజునకును,
శ్రీకృష్ణునియెడలఁ గలభక్త్యతిశయవిశేషములు, బహు
విధములు వర్ణింపఁబడినవి. ప్రేమరూపమగుభక్తితో నిండి
యున్నవి. ఉద్ధవవిదురసంవాదము కరుణాభక్తిరసములతోఁ
బూరితమయియున్నది. పిదప హరిద్వారమున నేకాంతము
నఁ దపంబొనరించుచున్న మైత్రేయు నొద్దకేగి, వారివలన
భగవదుక్తమగు తత్త్వవిశేషములను విదురుండు లెస్సయా
రసె. ఈకథవలన మనకుఁ దెలియఁదగినయంశమేమన:—
సద్గుర్వాగతమగు తత్త్వము సద్గుర్వాజ్ఞ లేనిది యితరులకు
నుపదేశింపఁగూడదనియు, సద్గుర్వన్వేషణము కర్తవ్యమని
యు నరయుట. మఱియుఁ బరమేశ్వరునివలనఁ గలిగిన మహా
భూతాదిసృష్టిని, హిరణ్యగర్భునిచేఁ జేయఁబడిన చరా

చరసృష్టినిఁ, గాలపరిణామ విశేషములను జెప్పుటయే
గాక, భగవత్పరాశరఋషివలన వినిన విష్ణుతత్త్వమును
గూడ విదురున కుపదేశించి, యజ్ఞవరాహమూర్తి యవ
తరించి హిరణ్యాక్షుని వధించినవృత్తాంతమును, కపిలదేవ
హూతిసంవాదమును గూడ, మైత్రేయులు చెప్పిరి.

### ౧౩. భూతభౌతిక సృష్టిభేదములు.

మఱియు, పృథివ్యాది చతుర్దశలోకములను సృజించి
ప్రజలను సృజించుటకై సనకసనందాదులను బుట్టిం
పఁగ వారు బ్రహ్మభావనాపరులయి సృష్టికుపయోగింపని
వారయినందున, మరీచి దక్షప్రభృతులను, స్వాయంభువ
మనువులనుసృజించి, వారిని బ్రజాసృష్టిఁ జేయుఁడని బ్రహ్మ
శాసించెను. అప్పుడు భూమి మహాజలాక్రాంతమయి పయి
కిఁ దేలకపోయినందున యజ్ఞవరాహ రూపమెత్తి విష్ణువు
దాని నుద్ధరించెను. దానియందు మరీచ్యాదులు చరాచర
ప్రపంచమును సృజించిరి. బ్రహ్మకృతసర్గము దశవిధములు,
వానిలోఁ బ్రాకృతసర్గములాఱు, వైకృతసర్గములుమూఁడు,
ప్రాకృతవైకృతోభయాత్మకసర్గమొక్కటి. సర్గమునకుఁ
గాలద్రవ్యగుణములంజేసి ప్రళయము త్రివిధంబు. శ్రీహరి
నుండి, ప్రకృతిలోఁగలిగిన గుణములకు వైషమ్య మా
పాదించు మహత్తత్త్వంబు సృజించుట ప్రథమసర్గంబు

ద్రవ్యజ్ఞానక్రియాత్మకం బైన యహంకారసృష్టి ద్వితీయ స్వర్గంబు, భూతసూక్ష్మసృష్టితోడ మహాభూతములం బుట్టించుశక్తి సహాకృతం బైన భూతసృష్టి తృతీయసర్గంబు. జ్ఞానేంద్రియకర్మేంద్రియసృష్టి చతుర్థసర్గంబు. వైకారిక నామధేయంబగు దేవసృష్టి పంచమసర్గంబు. మనస్సును దన్మయంబని చెప్పంబడు జీవుల కావరణవిక్షేపములం గావించు పంచపర్వావిద్యాసృష్టి షష్ఠసర్గంబు. ఈయాఱును బ్రాకృతసర్గములనంబడు. ఇంక వైకృతములం జెప్పెద:—

ఈ సృష్టిప్రకారం బెల్ల సంసారతాపనివారకం బైనలీల నలరు హరి రజోగుణము గ్రహించినం గలుగుచుండెడు. వైకృతసర్గములలో ముఖ్యమగు స్థావరసృష్టి సప్తమ సర్గంబు. మీఁదికి వ్యాపించుట యవ్యక్తచైతన్యంబు నొందుట యంతస్స్పర్శమాత్రం బెఱుంగుట యవ్యవస్థితపరిణామంబు మున్నగునానాభేదము లొందుటయు నను నివి సాధారణలక్షణంబులుగా నొప్పుస్థావరములు వనస్పత్యోషధీలతాత్వక్సారవీరుద్ద్రుమంబులన నాఱువిధములం దనరుటం జేసి స్థావరసర్గము దనలో షడ్విధంబుల నెసఁగెడు. ఉత్తరకాలవిచారంబుఁ గానక యాహారాది జ్ఞానమాత్రంబు గలిగి ఘ్రాణేంద్రియమున నర్థములం గనుచు దీర్ఘానుసంధానశూన్యంబులైన యిరువదియెని మిది తెఱంగుల నొప్పుతిర్యగ్జంతువుల యష్టావింశతివిధం

బైనసృష్టి యష్టమసర్గంబు. గోవు, అజము, మహిషము, కృష్ణసారము, సూకరము, గవయము, రురువు, గొఱియ, యుష్ట్రి మనుద్విశఫంబులు తొమ్మిదియు, గర్దభ, మశ్వ, మశ్వతరము, గౌరము, శరభము, చమరి యను నేక శఫంబు లాఱును, కుక్క, నక్క, తోడేలు, పులి, పిల్లి, కుందేలు, ఏదు, సింహము, కోఁతి, తాఁబేలు, ఉఁడుమను పంచనఖంబులు పండ్రెండును, మకరాదులగుజలచర జంతుసముదాయం బొక్కటియుఁ, జేర్చి లెక్కింపఁగఁ దిర్యగ్జంతువు లిరువదియెనిమిదివిధంబుల నొప్పెను. ఖచరంబులగుకంకగృధ్రబకశ్యేనహంససారసాదులగుపక్షిజాతులును దిర్యగ్జంతుగణంబు లోన గణింపవలయు. తిర్యక్స్రోమాన్యస్సృష్టి యష్టమసర్గంబు. రజోగుణప్రధానులై కర్మపరులై దుఃఖము సుఖముగాఁ దలఁచు నరుల యర్వాక్స్రోతం బగుసృష్టి నవమసర్గంబు. ఇది యేకప్రకారంబు. ఈమూఁడు వైకృతసర్గములనంబడు. దేవసర్గము వైకారికనామధేయం బనియుఁ బ్రాకృతములలోఁ బంచమం బనియు మున్ను చెప్పితిం గదా. సనత్కుమారాదులు దేవభావమునను మనుష్యభావమునను దనరి పూజనీయులవుటం జేసి వారిసృష్టి కేవలప్రాకృతంబు కేవల వైకృతంబునుం గాక యుభయాత్మకంబై దశమసర్గమనం బరఁగు. వైకృత మగు దేవసృష్టి దేవసర్గంబు, పితృసర్గంబు,

సురసర్గంబు, గంధర్వాప్సరస్సర్గంబు, యక్షరాక్షససిద్ధస
ర్గంబు, చారణవిద్యాధరసర్గంబు, కిన్నరకింపురుషాదిసర్గం
బు, భూతప్రేత పిశాచసర్గంబు ననునెనిమిది విధముల
నొప్పెడు."

## ౧౪. సృష్టిక్రమము.

ఈసందర్భములో సృష్టిక్రమము, దేవతలవిగ్రహవత్త్వ
ము, దేవతలకును శూద్రులకును వేదోక్తకర్మోపాసనాజ్ఞా
నములు కలవా? లేవా? యను సంశయము, వేదనిత్యత్వము,
ఆధికారికుల కర్మములు, ఋషులచర్యలు,నిందు మాక్రూత
బ్రహ్మసూత్రసారములోనుండి సంగ్రహింపఁబడినవి. మను
వులు, దేవతలు, ఋషులు, ప్రతికల్పమునందు సమాన
నామరూపములతోఁ బుట్టి పూర్వకల్పమునందవలె, మను,
చంద్ర, వ్యాసాది, నామరూపధారులై జగద్వ్యాపా
రముఁ జేయుచుందురు. వీరందఱు జీవన్ముక్తులయిన
యాధికారికపురుషులు, వీరిచేఁ జేయఁబడు సృష్టిక్ర
మము సూక్ష్మముగ విచారింపఁబడును. వేదములను
నమ్మిహిందూమతస్థు లందఱుఁ బ్రపంచముయొక్క సృష్టి
ప్రళయములకు, మొదలుగాని, తుదిగాని లేక, నియత
మగు కాలము గలవియై యనాదులుగ నున్నవని నమ్ము

దురు. హిరణ్యగర్భుఁడగు బ్రహ్మయాజ్ఞవలనఁ బ్రపంచ సృష్టికలుగును. దానికాలము మహాకల్పమనఁబడును. బ్రహ్మమానప్రకారమది నూఱేండ్లు. పిదప నంత (నూఱేండ్లు) కాలము ప్రపంచము నాశము నొందియుండును. దానిని మహాప్రళయమందురు. బ్రహ్మమున కొకదినము, అవాంతరకల్పమనియు, నొక రాత్రి, యవాంతరప్రళయమనియుఁ, జెప్పఁబడును. ఒకదినము 14 మనువులకాలము. ఒక మనువుకాలమునకు సప్తఋషులు, దేవతాదులు నుందురు. ఒక మనువుకాలము మన్వంతర మనఁబడును. దానికాలము 71 మహాయుగములు. ఒక మహాయుగము కృత, త్రేతా, ద్వాపర, కలియుగముల కాలము. వేయి మహాయుగములు బ్రహ్మమున కొకదినము. వీని వివరములు భాగవతములో విశేషముగ నున్నవి. మహాయుగకాలము 12000 దివ్యసంవత్సరములు. 4000 కృతయుగము, 3000 త్రేతా, 2000 ద్వాపరము, 1000 కలియుగము. కృతయుగమునకుఁ బూర్వసంధి 400 ఏండ్లు, పరసంధి 400 ఏండ్లు. త్రేతాయుగమునకుఁబూర్వాపరసంధులు 300---300. ద్వాపరయుగసంధులు—200—200. కలియుగసంధులు—100—100. మొత్తము 10000 + 2000=12000. మనుష్యమాన మొకయేటికి దేవమాన మొకదినము. మహాసృష్టి

ప్రళయములలో నే నియమము లుండునో, యానియమము లేయవాంతరసృష్టిలయములలోను, మన్వంతరములందును, నుండును. ప్రళయములోఁ బ్రపంచము సర్వనాశమై, శూన్యముగాక దాని బీజములగు వాసనలు లేక సంస్కారములు నిల్చియుండి, మిగిలిన సృష్టిలోఁ దిరిగి వృద్ధినొందును. పూర్వసృష్టికంటెఁ బరసృష్టి యొక్కన విశేషములు కలదిగనుండును. హిరణ్యగర్భాదులగు నీశ్వరులు పరమేశ్వరానుగ్రహముచేఁ బూర్వసృష్టి వ్యవహారమును నిద్రనుండి లేచినవానివలె జ్ఞప్తికిఁ దెచ్చుకొని, క్రొత్తకల్పములో నిస్సృష్టినిఁ జేయుదురు. పూర్వకల్పములో లోకసంరక్షణముకొఱకు జీవులు విశేషముగఁ గర్మోపాసనములు చేసినచో నీశ్వరానుగ్రహమున నీకల్పములో సృష్టిస్థితిలయకర్తలుగ జన్మింతురు. కృష్ణ యజుర్వేద తృతీయాష్టక ప్రథమపాఠక చతుర్థపంచమ షష్ఠానువాకములలో "అగ్నిర్వా అకామయత" ఇత్యాది నక్షత్రేష్టి ప్రకరణములో నీ విషయము స్ఫుటముగ వివరింపఁబడియున్నది. ఈ కల్పములో నగ్ని మొదలు విష్ణువువఱకు నుండు 37 నామరూపములుగల దేవతలు పూర్వకల్పమునందున్న యాయాపేరు లాయాయాకారములుగల దేవతల యధికారములను గోరి, వారివలెఁ దామును బరోప

కారమును జేయువలయునను దృఢసంకల్పములతో, నా
యగ్న్యాదిదేవతలను గూర్చి యుత్కృష్టకర్మోపాసనము
లను జేయఁగా నీకల్పములో నాయాదేవతలనామములు
ను, రూపములును, బదవులునుఁ, గలిగెనని స్పష్టముగ శ్రుతి
చెప్పుచున్నది. వీరి నామములు ముందు వివరింపఁబడును.
బృహదారణ్యక ప్రథమాధ్యాయ చతుర్థబ్రాహ్మణప్రథ
మానువాకముకూడ నీవిషయమును జెప్పుచున్నది.
వీరంతయాధికారికదేవతలయి, జగద్వ్యాపారమునందుఁ
బరమేశ్వరునకు సహాయము చేయుచున్నారు. అట్లే పూ
ర్వకల్పములలోఁ జేసిన కర్మజ్ఞానాదులచే, ఋషులు వేద
కాండములను గనిపెట్టి శిష్యులకు బోధచేసి, ధర్మాధర్మ
ములను బ్రవర్తింపఁ జేయుచున్నారు. వీరిని, కాండఋషు
లనుదురు. పూర్వకల్పపుఁగర్మమును, విద్యను, ననుభవ
మును, నుత్తరకల్పమునందలి ప్రజలకుఁ గలపుటకుఁగొం
దఱు మహాపురుషులను బరమేశ్వరుఁడు నియమించునని
యు, వీరిపేళ్లు శిష్టులనియు, మత్స్యపురాణములోనున్నది.
వారే మనువులుగను, మహర్షులుగను, దేవతలుగను, బితృ
దేవతలుగను, ననేకపర్యాయములుపుట్టి, తమకర్మవిద్యా
నుభవములను, బ్రపంచముచేయుచు, లోకరక్షణముఁ జే
యుచున్నారు. ఈ మన్వంతరములోఁ బ్రజాపాలనాధికారి
వైవస్వతమనువు. జ్ఞానోపదేష్ట సనత్కుమారుఁడు. ఈకలి

యుగమందు జ్ఞానోపదేష్ట మైత్రేయమహర్షి. వీరిని బోధి సత్త్వుఁడని బౌద్ధులనుదురు. క్రైస్తవుఁడని క్రైస్తవులందురు. ఈయాధికారికుల విశేషములు ముందు వివరింపఁబడును. ఇప్పటికాలపు మనవంటివారికి దేవతలగపడకపోయినను, వ్యాసులు మొదలగు మహర్షులు వారితోఁ బ్రత్యక్షమున వ్యవహరించినట్లు, స్మృతులయందున్నది. ధర్మోత్కర్ష వశమున నిప్పటికిని నట్టి మహనీయుల దర్శనానుగ్రహములకుఁ బాత్రులగువారు విశేషముగ నున్నారు. స్వాధ్యాయము వలన నిష్టదేవతాప్రాప్తి కలుగుననియు, బ్రహ్మోపాసనా యోగానుష్ఠానములచే నణిమాద్యైశ్వర్యములు ప్రాప్తములగుననియు, యోగశాస్త్రములు, శ్రుతులు, బోధింపఁగా వానిని నిరాకరించుట సాహసమాత్రము. మంత్రబ్రాహ్మణాత్మకమగు వేదరాసము నెఱుఁగు ఋష్యాదుల సామర్థ్యము మనశక్తి నంటెడిదికాదు కదా. కావున వారి మాహాత్మ్యమును బోధించు నితిహాసపురాణములు వేద మూలములు.

## ౧౫. దేవతలు.

దేవతలకు వేదోక్తకర్మోపాసనాజ్ఞానములు కలవా యను సంగతి విచారింపఁబడును. బ్రహ్మజ్ఞానమందును దదుపాసనంబునందును మనుష్యులకు మాత్రమే కాక దేవత

లకుఁగూడ నధికారము (యోగ్యత) కలదు. దేవతలు తైజసశరీరధారులు; కర్మదేవతలు, ఆజానజాన దేవతలు,నని రెండు తెఱంగులు. కర్మదేవతలు భూలోకమున మానవులయియుండి యజ్ఞదానాది సత్కర్మముల ఫలాభిలాషతో నాచరించుటచే స్వర్గలోకమునకుఁబోయి యచ్చటనున్న యితరదేవతలతో సమానమయిన దేహములనుబొంది వానికంటెఁగొంచెము తక్కువభోగము ననుభవించువారు. ఆజానజాన (స్వాభావిక) దేవత లీకల్పమున జన్మప్రభృతి దేవతలుగఁ బుట్టినవారు; పూర్వకల్ప(సృష్టి)మందు మానవులుగనుండి, యాకల్పమునసుండు దేవతలనుగూర్చి సత్కర్మోపాసనలనుజేసి, వారి యనుగ్రహముచే నీకల్పమందు వారిసమాననామరూపములతో దేవతలుగఁబుట్టి, లోకపాలనముఁ జేయువారు. వీరిలో నాధికారికులు చంద్రసూర్యేంద్రాదులు. ఈదేవతలకింద్రియాదులు, శాస్త్రజ్ఞానము,కర్మఫలేచ్ఛ, లేసందున, జ్ఞానోపాసనాకర్మముల ననుష్ఠింప యోగ్యత లేదనికొందఱనుదురు. వేదమంత్రము మాత్రమే దేవతయైనందున, హవిర్భోగము, నైశ్వర్యముఁ, ప్రసన్నత్వము, ఫలదాతృత్వముఁ గూడ దేవతలకు లేదనుచున్నారు. ఈవాదము ధర్మమీమాంసా శాస్త్రప్రవర్తకులగు జైమిని ఋషుల కిష్టము లేకపోయినను, వారి

యనుయాయులలోఁ గొందఱ కిష్టము. కాని యిది ప్రమాణవిరుద్ధము. ఇంద్రాదిదేవతలు విగ్రహవంతులనియు, నశ్వమేధాది యాగములు చేసినట్లును, బ్రహ్మవిద్య నుపదేశముపొంది యితరుల కుపదేశించినట్లు, ననేకశ్రుతిస్మృతీతిహాసపురాణములందుఁ గనబడుచున్నది. శిల్పశాస్త్రకారులును శ్రుత్యాదులలో నున్నప్రకార మింద్రాదిదేవతల విగ్రహములు చెక్కుచున్నారు. వేదములలోని విధివచనములలో దేవతలకు విగ్రహాదులు చెప్పఁబడకున్నను, విధివాక్యములకు బలకరములగు మంత్రార్థవాదవాదములలో నవి చెప్పఁబడినందున, నవి గ్రాహ్యములు. కావున వారికి శరీరాదులును, నుత్తమఫలాభిలాషయుఁ గలవు. కాన నుత్తమ కర్మములందును దహరాదిసగుణబ్రహ్మోపాసనమందును, శ్రవణాదిసాధ్యమగు నిర్గుణ బ్రహ్మజ్ఞానమందును, దేవతలకు నిర్భయ్యంతరముగ యోగ్యత కలదు. మఱియు, వారిలోఁగూడ మనుష్యులలోవలెఁ జాతుర్వర్ణ్యవిభాగము గలదు. కనుకనే బృహస్పతి ప్రభృతులు బ్రాహ్మణులనియు, ఇంద్రవరుణాదులు క్షత్రియులనియు, మరుత్తులు వైశ్యులనియు, గంధర్వాదులు శూద్రులనియు, శ్రుతులం దచ్చటచ్చటఁ జెప్పఁబడియున్నది. జ్యోతిశ్శాస్త్రముగూడ దీని ననుకరించుచున్నది. బ్రాహ్మణత్వాదిజాతి, యాయాజీవులయొక్క యదృష్ట (పూర్వకృత పుణ్యపాప)

విశేషముకాని, మనుష్యత్వాదిజాతివంటిది కాదు. ఒక జీవుఁడు బ్రాహ్మణ దంపతులకుఁ బుట్టినచో బ్రాహ్మణుఁడని వ్యవహరింపఁబడుచున్నాఁడు. అటులే క్షత్త్రియ వైశ్య శూద్రులు, కొన్ని హేతువులచేఁ దమజాతిని మార్చుకొనినట్లు ప్రమాణములు గలవు. విశ్వామిత్రుఁడు, దేవాపి, రాజకులమం దుదయించి రాజ్యము వదలి రాజర్షులయి, తపోమహిమచే బ్రహ్మర్షులయినట్లు భారతము చెప్పుచున్నది. కనుక బ్రాహ్మణత్వ మనునది కేవలము జన్మమువలనఁ గలిగినదిగాక, సత్కర్మములవలనఁగూడఁ గలుగవచ్చు ననుటకు నిదర్శనములు గలవు. అటులే దేవతలుకూడ బ్రాహ్మణాది దంపతులకు జన్మింపకున్న, నదృష్టరూప బ్రాహ్మణత్వాది జాతి కలిగి యుండవచ్చును. ఇందులకుఁ బ్రమాణములు భగవద్గీతలు, భారత భాగవతములు, దేవతాధికరణముపై శ్రీభాష్యవ్యాఖ్యయు(శ్రుతప్రకాశాచార్యకృతము), దానిలోనుదాహృతములగు శ్రుతి న్యాయాదులు.—

### ౧౭. శూద్రులు.

శూద్రులు మనుష్యజాతివారైనను, వేదోక్తోపనయనాది సంస్కారములు వారికి లేవు, గాననాజ్ఞానమందు వారి కధికారములేదని సూత్రకారులు, భాష్యకారులు, నిర్ణయించిరి. కానియిది సామాన్యనియమము.—విదుర

సూతాదులగు సిద్ధుల కిది వర్తింపదని శంకరాభిప్రాయము.—మఱియు సంవర్గవిద్య శూద్రున కుపదేశింపఁబడినట్లు ఛాందోగ్యోపనిషత్తులో నున్నదిగాని, దానియందు మాత్రమధికార ముండవచ్చు నేమోయని శంకరులు వ్రాసి,సూత్రకారులుమాత్రము శూద్రశబ్దమునకు రూఢిఁ పరిత్యజించి యోగము నంగీకరించి రనియు, వ్రాసిరి. ఛాందోగ్యములో సత్యకామజాబాలునియొక్క జాతిసత్యము పలుకుటవలన బ్రాహ్మణజాతి యని నిర్ణయింపఁబడినది. అది జాతి విభాగము గుణకర్మములవలనఁ గలుగునను గీతాభాగవతవాక్యములను బలపఱచుచున్నది. వానిని ముందుఁ జూపెదను. కాని యేకారణముచేతనో గుణకర్మములకంటె జాతిమాత్రమే ప్రకృతవర్ణ విభాగమున కాధారము. పంచాక్షరీ నారాయణాష్టాక్షరీ మంత్రములు వేదోక్తములయినను నవి యాచండాలాంతము నుపదేశింపఁబడుచున్నవి. భగవద్గీతా భాగవత సూతసంహితాదులలో శ్రుతుల విచారము మెండుగనున్నది. అవి స్త్రీశూద్రద్విజబంధువులకుఁ గూడ నుపాదేయములు.

### ౧౭. వేదనిత్యత్వము.

వేదకాలములోనున్న నరులు పంచజనులని (Fifth Race) ఋగ్వేదములోనున్నది. వేదము సృష్టిమొదలు

ప్రళయమువఱకునుండు నాకాశమువలె సాపేక్షిక నిత్యముకాని, యీశ్వరునివలె సర్వదా నిత్యము కాదు. వేదశబ్దము నిత్యముకాని, వైయాకరణులు చెప్పుస్ఫోటము నిత్యముగాదనికూడ శంకరులు శ్రుతియుక్తి ప్రపంచములతో స్థాపించిరి. ఇది రామానుజమధ్వాదులకుఁగూడ సమ్మతమే. ప్రతిసృష్టిలోను వేదము శిష్యులచేఁ దిరిగివ్యాపింపఁజేయఁబడుననియుఁ, బ్రతిద్వాపరాంతమున వ్యాసులచే విభజనము చేయఁబడుననియుఁ బురాణాదిప్రసిద్ధము. "యుగాంతేఽంతర్హితాన్ వేదాన్, సేతిహాసాన్ మహర్షయః, లేభిరేతపసాపూర్వం, అనుజ్ఞాతాః స్వయంభువా" అను భారతశ్లోకము నరయనగు. వేదార్థము సనాతనమనియు, వానిని బోధించుశబ్దము సాపేక్షికనిత్యమనియుఁ దేలును. ఇప్పుడు ప్రచారములోనున్న వేదములు 5000 సంవత్సరములక్రిందటి వ్యాసులచే విభజనముచేయఁబడినవి. అంతకుఁ బూర్వ మెట్లున్నవో తెలియదు. పూర్వయుగములలోనున్న గ్రంథములిప్పుడు లేవు. మఱియు శబ్దము నిత్యమనిన, ఆకృతిలేకజాతి (archtypes)ని బోధించునది నిత్యముగాని వ్యక్తినిబోధించునది కాదని శంకరమతము. వేదవిభాగములు ద్వాదశస్కంధములోను మత్కృతవిద్యారణ్యచరిత్రములోను జూడనగు.

### ౮౭. అధికారికులు, వారివ్యాపారములు.

సగుణనిర్గుణ బ్రహ్మసాక్షాత్కారులగు బ్రహ్మవేత్తలు, ప్రారబ్ధశరీరములు విడిచినవెంటనే ముక్తిని బొందుదురు. కాని కొందఱు దేవతలు, ఋషులు, బ్రహ్మసాక్షాత్కారము గలిగిన పిదప, వారిశరీరములు పోయినతర్వాత, మఱికొన్ని శరీరములను బొంది, ప్రపంచమందు వ్యవహరించుచున్నట్లు శ్రుతిస్మృతీతిహాసపురాణములలోఁ జెప్పఁబడియున్నది. అదియెట్లన:— బ్రహ్మాంశమందు, అపాంతరతముఁడనుపురాణర్షి వేదప్రవర్తకుఁడుగనుండి, విష్ణునాజ్ఞవలన ద్వాపరకలియుగసంధియందుఁ గృష్ణద్వైపాయనుఁడుగఁబుట్టి వేదములను దిరిగి ప్రవర్తింపఁజేసెను. వసిష్ఠమహర్షి బ్రహ్మమానసపుత్రుఁడయ్యును, నిమిచక్రవర్తిశాపమువలనఁ బూర్వదేహమును గోలుపోయి, బ్రహ్మాజ్ఞచే మిత్రావరుణులవలన నూర్వశియందుఁ దిరిగిపుట్టె. భృగ్వాదిఋషులు బ్రహ్మమానసపుత్రులయ్యును, వరుణదేవయజ్ఞమందుఁ దిరిగిపుట్టిరి. సనత్కుమారులుకూడ బ్రహ్మమానసపుత్రులయ్యును, సాంబమూర్తికి వరమిచ్చి వారికిఁ గుమారస్వామిగఁ బుట్టిరి. ఇట్లే దక్షనారదాదులుగూడఁ గొన్నికొన్ని కారణములచేఁ బూర్వదేహములనువదలి దేహాంతరములనుబొందినట్లుచెప్పఁబడుచున్నది. వీరిలోఁ గొందఱు పూర్వదేహముపోయిన తర్వాత

నింకొకశరీరమునుధరించుచున్నారు. మఱికొందఱు పూర్వ దేహముండఁగనే, యోగ ప్రభావముచే ననేకవిధశరీరములను ధరించుచున్నారు. వీరందఱకు సకల వేదార్థములు బాగుగఁ దెలియును. ఈయీశ్వరులు ప్రపంచరక్షణార్థమై పరమేశ్వరునిచే నియమింపఁబడిన వేదప్రవర్తనాద్యధికారములు కలవారై యున్నందున, నాయధికారము సమాప్తిఁ బొందువఱకు నాశరీరములతోఁ గాని యితరశరీరములతోఁ గాని, తమయధికారములను నడుపుచుందురు. శరీరేంద్రియములకు హేతువగు ప్రకృతిని స్వాధీనపఱచుకొనుటచే నొక దేహమునుండి మఱియొక దేహమునకు, నొకగదినుండి మఱియొకగదికిఁ బోయినట్లు, స్వేచ్ఛతోఁ బోవుదురు. అనేకశరీరములను క్రమముగ నైనను, లేక నేకకాలమున నైనను సృజించి, వాని యందుఁ దమజీవచైతన్యమును బ్రవేశపెట్టుదురు. వీరు, సులభవలె, జాతిస్మరులు గారు. ఏలయన వీరికి మొదట నుపక్రమింపఁబడిన కర్మఫలము విదేహకైవల్యమువఱకు నుండును. ఈయధికారముల ననుభవించునపుడు, వీరు జీవన్ముక్తులయినను, నా యధికారానంతరము విదేహముక్తిఁ గందురు. వీరి కిట్టిమహోపదవి, యాకల్పమునఁ గలుగుటకుఁ బూర్వకల్పమందు వీరు చేసిన యుత్కృష్ట పుణ్యకర్మాది విశేషములు పూర్వముఁ జెప్పియుం

టిమిగద. వీరికిని సామాన్యజీవన్ముక్తులకును సహా స్రాంశమువారయున్నది. వీరు కేవల లోకోపకారార్థము సృష్టిస్థితి సంహారకార్యములందుఁ బరమేశ్వరునకు సహాయము చేయుచున్నారు. ఇట్టివారిలో 37 గురు దేవతలను నక్షత్రేష్టిలోఁ దైత్తిరీయశ్రుతివర్ణించినది. వారెవరనః—

అగ్ని, ప్రజాపతి, సోముఁడు, రుద్రుఁడు, ఋక్షు, బృహస్పతి, దేవాసురులు, పితరులు, అర్యముఁడు, భగుఁడు, సవిత, త్వష్ట, వాయువు, ఇంద్రాగ్ని, పౌర్ణమాసి, మిత్రుఁడు, ఇంద్రుఁడు, ప్రజాపతి, ఆపః (వరుణుఁడు), బ్రహ్మ (పుణ్యకీర్తిని గోరువాఁడు), విష్ణువు, వసువు, ఇంద్రుఁడు, అజుఁడు, అహిర్బుధ్న్యుఁడు, పూషుఁడు, ఆశ్వినులిద్దఱు, యముఁడు, అమావాస్య, చంద్రుఁడు, అహోరాత్రులు, ఉషానక్షత్రము, సూర్యుఁడు, అదితి, విష్ణువు. వీరిలోఁ గొందఱు జీవుల కర్మానుసారముగ సుఖదుఃఖముల నిత్తురు, కొందఱనేకవిధముల సృష్టిస్థితిలయకర్మములను జేయుదురు. రాజోద్యోగస్థుల వలె నీశ్వర నియుక్తములగు వ్యాపారముల నతిజాగ్రత్తతోఁ జేయుదురు. ఇట్లు బద్ధజీవులకు జ్ఞానోపదేశము నిమిత్తము సిద్ధేశులగు ఋషులు గుప్తవేషములతో సంచరింతురని శ్రీభాగవతమందలి చిత్రకేతూపాఖ్యానములో (6-స్కం. 15 అ.) నున్నది. వారెవరనః—

"సనత్కుమారులు, నారదుఁడు. ఋభు, ఆంగిర
సుఁడు, దేవలుఁడు, అసితుఁడు, అపాంతరతముఁడు, వ్యా
సులు, మార్కండేయుఁడు, గౌతముఁడు, వసిష్ఠుఁడు, భగ
వంతులగు పరశురాములు, కపిలుఁడు, బాదరాయణి
(శుఁడు),రోమశుఁడు, చ్యవనుఁడు, దత్తుఁడు,పతంజలి,పరా
శరుఁడు, మైత్రేయుఁడు, భరద్వాజుఁడు, వారుణి, దేవశిరా
బోధ్యుఁడు, పంచశిఖుఁడు, హిరణ్యనాభుఁడు, కౌసల్యుఁ
డు, శ్రుతదేవుఁడు, ఋతధ్వజుఁడు. ఈమహాత్ముల వ్యాపా
రము లోకులకు సుఖమును గలుగఁజేయుటయే. ఇట్టి జ్ఞా
నోపదేష్టలగు దేవతలు, ఋషులును, గలరని, బృహదార
ణ్యకములోనుగాఁగల వేదములందును, విష్ణుపురాణసూ
తసంహితాద్యార్ష గ్రంథములందును,నున్నది. పితృయాన
దేవయానములలో నుండు నాధికారికులగు ౮౮ వేల పితృ
దేవతలు,౮౮ వేల మునులు, భూలోకములోఁ గర్మజ్ఞానాభి
వృద్ధికొఱకుఁ బుట్టుచున్నారని విష్ణుపురాణములోను,యా
జ్ఞవల్క్యస్మృతిలోను, నున్నది. నిర్గుణబ్రహ్మజ్ఞాన సగుణ
బ్రహ్మోపాసకులు ముక్తిఁ బొందిన పిదప, లోకోపకారా
ర్థము సర్వలోకములందు సంచరించుచుఁ దమయనుభవ
మును జనులకు వెల్లడిఁజేయుచు వారిని భవసాగరము
నుండి తరింపఁజేయుదురని తైత్తిరీయభృగువల్లిలోఁగూడ
నున్నది. భగవంతులగు మహావిష్ణువుగూడ శ్రీరామ

కృష్ణాద్యవతారముల నెత్తి ధర్మసంస్థాపనము చేయుదు రని శ్రుతిస్మృతిప్రసిద్ధము. శ్రీమహావిష్ణువు సనాతనర్షి యగు నారాయణావతారమెత్తి హిమవత్పర్వతదక్షిణ పార్శ్వమందున్న బదరికాశ్రమమందు లోకహితార్థమై యీ కల్పాంతమునఱకుఁ దపస్సుచేయుచున్నట్లు భారత భాగవత ప్రసిద్ధము. ఆయాశ్రమమునకుఁ జేరువను త్తర మున శంబళగ్రామమనియు, కలాపగ్రామమనియు, రెండు ఋషివాటికలు గలవు. వానిలోనున్న ఋషులుకూడ లోక రక్షణార్థము తపస్సుచేయుచున్నారు. వారిలోనిద్దఱు సూర్యసోమవంశస్థులగు మరు దేవాపియను మహనీయులు రాజర్షులయి కలాప గ్రామములో నుండిరి. వారి తపోమహిమచే నిప్పుడు బ్రహ్మర్షులయి యున్నారు. వారి వలన రాఁబోవు కృతయుగసృష్టిధర్మములు ప్రవర్తింపఁ బడును. దానికిఁ గావలయు యత్న మిప్పటినుండి చేయు చున్నారు. ఈవిషయములో భాగవత విష్ణు కల్కిపురాణ ములు ప్రమాణములు. శ్రీకృష్ణపరాశరులనాఁటిచ్ఛి ష్యులయినట్టియు, భగవద్వ్యాససమానులునగు మైత్రే యర్షి సనాతనధర్మమునరసి కలియుగంబున జగద్గురు పదంబు నధిష్ఠించియున్నట్లు విష్ణుపురాణ భాగవతములు చెప్పుచున్నవి. వారియాశ్రమముహిమవత్పర్వతమున కుత్త రమని వారి శిష్యులు సెలవిచ్చిరి. మరుదేవాపిఋషులు

దివ్యజ్ఞానసమాజము నీలోకమున స్థాపించి బ్రహ్మజ్ఞానమును వెల్లడిచేయుచు ధర్మసంస్థాపనముం జేయుచున్నారు. ఋషులలోఁ గొందఱు బ్రహ్మలోకాదైశ్వర్యములనపేక్షించినచో నాయైశ్వర్యములనొంది యాలోకములందు సత్సంగమాదులచే వానియందు విరక్తియుక్తులయి జ్ఞానమునొంది కైవల్యమునుబొందుదురు.

౧౯. ఆఋషులు, వారిచర్యలు.

ఋషులలోఁ గొందఱు బ్రహ్మయొక్క మానసపుత్రులై యున్నారు. శ్లో. 'మరీచి రత్రిర్భగవాన్ అంగిరాః పులహః క్రతుః, పులస్త్యశ్చ వసిష్ఠశ్చ సప్తైతే బ్రహ్మణస్సుతాః' అని హరివంశములోని సప్తమాధ్యాయగతాష్టమశ్లోకమును, శ్లో. 'మరీచి రత్ర్యంగిరసౌ పులస్త్యం పులహం క్రతుం, ప్రచేతసం వసిష్ఠంచ భృగుం నారదమేవచ. పతీన్ ప్రజానాం అసృజత్ మహర్షీన్ నాదితో దశ,' అనుమనుస్మృతి ప్రథమాధ్యాయగతశ్లోకమును, నీయర్థమును జెప్పుచున్నవి. సనకసనందనాదులుకూడ బ్రహ్మవలనఁ బుట్టినారని పురాణములందుఁ జెప్పఁబడియుండుటయేగాక బృహదారణ్య ప్రథమాధ్యాయ చతుర్థబ్రాహ్మణమునందు 'సైషా బ్రహ్మణోతిసృష్టిః' అనునాఱవ

వాక్యమునందు సనకాదుల సృష్టి బ్రహ్మవలననయినదని రంగరామానుజభాష్యములో వ్రాయఁబడియున్నది. శంకర భాష్యమును విమర్శించినను నీయర్థము గంభీరముగాఁ గన పర్చినట్లు తోఁచుచున్నది. ఈబుషులలో మొదటి మరీచ్యాదిబుషులు ప్రాయశః ప్రవృత్తి ధర్మమును, అనఁగా వర్ణాశ్రమాది సామాన్యధర్మమును, ప్రవర్తింపఁ జేసిరని యు, రెండవ 'సనకసనందనాది బుషులు నివృత్తి ధర్మ మును, అనఁగా నాత్మజ్ఞానగోచరమైన విశేషధర్మమును, ప్రవర్తింపఁజేసిరనియు, గీతాభాష్యారంభ గ్రంథమునందు శంకరులు వ్రాసిరి. మఱికొందఱు బుషులు పూర్వోక్తమరీచ్యాది బుషులయొక్క సంతతి వారైయున్నారు. వారు పరాశర వేదవ్యాసదత్తాత్రేయ ప్రభృతులు. వీరలందఱు కూడఁ దమ తపఃప్రభావముచే హిరణ్యగర్భునిచేఁ బ్రకటితములుకాకయున్న వేదములయొక్క మంత్రబ్రాహ్మణ భాగముల నధ్యయనము లేకయే గ్రహించి లోకములోఁ బ్రకటించిరి. ఇదియే బుషిత్వము. "యుగాంతేంతర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః, తేపనా లేభిరేపూర్వం అనుజ్ఞాతాస్స్వయంభువా" అను స్మృతి వచనమిందుకుఁ బ్రమాణము. వేదములందుఁ బ్రతిపాదింపఁబడిన నామధేయములు గల మను, వసిష్ఠ, యాజ్ఞవల్క్య, పారాశర్య, జనక, అజాతశత్రుప్రభృతులు, ఆధికారికపురుషులు. వీరు

ప్రవాహనిత్యులుగాఁ బ్రతికల్పమునందు జన్మించి పరమే శ్వరాజ్ఞానుసారముగా ధర్మజ్ఞానములను లోకములందుఁ బ్రవర్తింపఁజేయుచున్నారు. వీనిలోఁ గొందఱు వసిష్ఠ సనకాదులు శాపాదులచేఁ బూర్వదేహములను విడిచి, ఊర్వశ్యాదులందు సమాన నామరూపములతో జన్మించి పూర్వమువలె ధర్మజ్ఞానములను బ్రవర్తింపఁ జేయుచున్నారని, 3.3.32 యావదధికారసూత్రభాష్యమునందు వ్రాయఁబడియున్నది. రెండవతరగతి ఋషులలో శక్తిపరాశరాదులు, బ్రాహ్మణపురుషులకు బ్రాహ్మణస్త్రీలయం దవతరించినను, వ్యాసాదులు జాత్యంతరస్త్రీలయం దవతరించినను, ఉత్పత్తి ప్రభృతి బ్రాహ్మణత్వము కలవారుగానే స్మృతీతిహాసపురాణములందు వ్యవహరింపఁబడుచున్నారు. మరు దేవాపి విశ్వామిత్రాది ఋషులు, ఉత్పత్తి మొదలుకొని క్షత్రియజాతిలో నుండినను, తపోవిశేషముచేత నంతర్గతమైన బ్రాహ్మణత్వమును బహిర్గతముగాఁ జేసి బ్రహ్మర్షులై యున్నారు. కావున బ్రాహ్మణత్వమనునది యదృష్టవిశేషసంయోగమే కాని కేవలజాతిగాదు. ఈయర్థము దేవతాధికరణములోని "తదుపర్యపి బాదరాయణస్సంభవాత్," అను సూత్రముయొక్క రామానుజభాష్యవ్యాఖ్యాన శ్రుతప్రకాశికలో నయుక్తికముగా వ్రాయఁబడియున్నది. వీరందఱు నాధికారికపురుషులని యావదధికార సూత్రభాష్యములోఁ

జెప్పియున్నారు. అధికారికులనఁగా లోకమునందు సామా
న్యవిశేషరూపధర్మజ్ఞానప్రవర్తనార్థమై పరమేశ్వరునిచే
నియమింపఁబడినవారు. వీరలాయాకాలములందు లోకు
లకు ధర్మజ్ఞానముల నుపదేశించుచు నిజరూపముతోఁ
గాని రూపాంతరములతోఁగాని పరమేశ్వరునివలె సంచరిం
చుచున్నారు. పరమేశ్వరుఁడు శ్వేతద్వీపమునందు నిజరూప
ముతో నారదాదులకుఁ దత్త్వోపదేశమును జేసెనని శాంతి
పర్వనారాయణీయములోను, మత్స్యవరాహరామకృష్ణాది
రూపములతో వైవస్వతాదులకు నుపదేశించెనని భారత
భాగవతమత్స్యపురాణాదులయందును, జెప్పఁబడియున్నది.
అట్లులే నారదాదులుఁగూడ లోకులకు ధర్మజ్ఞానములను
నిజరూపముతోను రూపాంతరములతోను, నుపదేశించుచు
సంచరించుచుందురు. ఈయర్థము శ్రీభాగవత షష్ఠస్కం
ధ 15- అధ్యాయములో, శ్లో "కాయువాం జ్ఞానసంపన్నౌ
మహిష్ఠౌచ మహీయసాం, అవధూతేన వేషేణ గూఢా
వివసమాగతౌ. చరంతిహ్యవనౌకామం బ్రాహ్మణా భగవత్ప్రి
యాః, మాదృశాం గ్రామ్యబుద్ధీనాం బోధాయోన్మత్త
లింగినః. కుమారో నారదఋభురంగిరా దేవలోసితః"
(6-15-15) ఇత్యాది శ్లోకములును, దశమస్కంధ 8-వ
యధ్యాయమునందు, శ్లో. "మహద్విచలనం నృణాం
మాదృశాం దీనచేతసాం, నిశ్శ్రేయసాయ భగవన్ నాన్య

ధాకల్పతే క్వచిత్." అని గర్గమహర్షి నిగూర్చి నందునిచేఁ జెప్పఁబడిన శ్లోకమును, బ్రతిపాదించుచున్నవి. నారదసనత్కుమారాది దేవర్షులును యాజ్ఞవల్క్య భృగుశ్వేతకేతుప్రభృతి బ్రహ్మర్షులును, జనకాజాతశత్రు ప్రవాహణాది రాజర్షులును, నధికారస్థానములయందుండి, ధర్మజ్ఞాన ప్రవచనపరులై యున్నారు. బృహదారణ్య ఛాన్దోగ్యాదివేదాంతములు, భృగుయాజ్ఞవల్క్యాదులు బ్రహ్మజ్ఞాన ప్రవర్తకులైనట్లును,పరాశరస్మృతి ప్రథమాధ్యాయ 15-వ శ్లోకము, దాని వ్యాఖ్యయు, వసిష్ఠగర్గనారదాదులు ధర్మశాస్త్రప్రవర్తకులైనట్లును జెప్పుచున్నవి. ధర్మజ్ఞాన ప్రవర్తనాధికారమందు నియుక్తులైన పూర్వోక్తమహర్షులు ప్రతికల్పమునందు నావిర్భవించి సమాన నామరూప వ్యాపారములు గలవారై యుండుటవలననే యనాదిసిద్ధములైన పదములయందు వీరినామధేయములు కూర్పఁబడి, వారిచే జరిగింపఁబడిన వ్యాపారములు ప్రతిపాదింపఁ బడియున్నవి. దేవతాధికరణములోని 'శబ్ద ఇతిచేన్నాతః ప్రభావాత్ ప్రత్యక్షానుమానాభ్యాం' అను సూత్రభాష్యమునందు, ఇంద్రాదిదేవతావాచక శబ్దములు జాతివాచకములుగాని, వ్యక్తివాచకములుగావు; వ్యక్తివాచకములైనచోఁ దత్తద్వ్యక్తి వినాశానంతరము, తత్తద్వాచకములగు నింద్రాదిశబ్దములర్థశూన్యములై యప్ర

మాణములగునని, నిరూపింపఁ బడియున్నది. ఇది యుక్త
మే; లోకమునందు దేవదత్తుఁడను వానికిఁ గుమారుఁడు
కలిగినపుడు వానికి యజ్ఞదత్తుఁడని నామమునుంచుదురు.
యజ్ఞదత్తుఁడుండునఱకు నామమర్థయుక్తమైయున్నను వాని
మరణాంతర మానామమర్థశూన్యమగును గదా ! ఈన్యా
యముచేతనే వేదములయందుఁ గల ఋషివాచకశబ్దములు
గూడ జాతివాచకములే యని నిశ్చయింపవచ్చును. ఛాన్దో
గ్యములోని 'సద్విద్య' 'భూమవిద్య', కఠవల్లిలోని నాచికేత
విద్య', తైత్తిరీయములోని 'భార్గవీవిద్య', బృహదారణ్యము
లోని 'అక్షరవిద్యా' ప్రభృతివిద్యలు, నిర్గుణవిద్యలనఁబ
డును. వీనినిఁ బ్రకటింపఁజేసిన యుద్దాలక శ్వేతకేతులు
సనత్కుమారనారదులు మృత్యునచికేతులు, భృగువరు
ణులు, జనకయాజ్ఞవల్క్యాదులు నిర్గుణవిద్యానిష్ఠులనియు,
అక్షివిద్య, దహరవిద్య, శాండిల్యవిద్య, పంచాగ్నివిద్య,
మొదలగు సగుణవిద్యలను బ్రవర్తింపఁజేసిన సత్యకామోప
కోసలాదులు సగుణవిద్యానిష్ఠులనియు, నిర్ణయింపఁ దగి
యున్నది. దహరవిద్యారంభమందుఁ బ్రజాపతి యావి
ద్యను బ్రవర్తింపఁజేసి నట్లుగపడకపోయినను, దహరవిద్యా
శేషమైన ప్రజాపతివిద్యయందుఁ బ్రజాపతి ప్రవర్తకుఁడని
తెలియఁబడుచున్నందున దహరవిద్య ప్రజాపతిచేతనే ప్రవ
ర్తింపఁజేయఁబడినదని నిశ్చయింపఁ దగియున్నది. వీరిలో

శ్వేతకేతువు నిర్గుణసద్విద్యయందును, సగుణపంచాగ్ని విద్యయందును, బ్రవర్తకుఁడైనట్లు కనఁబడుచున్నను, సగుణవిద్య, నిర్గుణవిద్యాప్రాప్తికి సాధనమైనందున ముందుఁగా సగుణననుష్ఠించి తర్వాతనిర్గుణవిద్యానిష్ఠుఁడైనట్లు చెప్పిన విరోధము లేదు. శ్లో. 'నిర్విశేషం పరం బ్రహ్మ సాక్షాత్కర్తు మనీశ్వరాః, యేమందాః తేనుకంప్యం తేసవిశేషనిరూపణైః. వశీకృతేమనస్యేషాంసగుణబ్రహ్మసేవనాత్, తదేవావిర్భవేత్ సాక్షాదపేతోపాధికల్పనం' అని కల్పతరువులో సగుణవిద్య నిర్గుణవిద్యాప్రాప్తికి సాధనమని వ్రాయఁబడియున్నది. సత్యజ్ఞానానందములు, అస్థూలత్వాదృశ్యత్వాదులును స్వరూపనిరూపకధర్మములు. వీనినుపసంహరించుకొని చేయఁబడు నుపాసనము నిర్గుణవిద్యయనఁబడును. వీనిని, సత్యకామత్వ, సత్యసంకల్పత్వాదినిరూపిత సరూపవిశేషణములను, నుపసంహరించుకొనిచేయఁబడు నుపాసనము సగుణవిద్య యనఁబడును. నిర్గుణబ్రహ్మనిష్ఠులైన శ్రీశుక, వైశంపాయన, యాజ్ఞవల్క్య ప్రభృతులు తత్వజ్ఞానమును, పరీక్షిత్, జనమేజయ, జనకాదులకు నిర్హేతుకముగ నుపదేశించినందున, వీరికిపరహితాచరణమే యవశ్యమని యభిప్రాయము కల్గియున్నట్లు కనఁబడుచున్నది. కావున నేగీ. 12అ.3-4 'యేత్వక్షరమనిర్దేశ్య' మను శ్లోకములందు, అక్షర బ్రహ్మోపాసకులకు "సర్వభూతహితేరతాః" అను విశేషణ మియ్యఁబడి

యున్నది. హితమనఁగాఁ దత్కాలమందుఁ గటువుగానుండి యుత్తరకాలమందు సుఖకరమైనది. నిర్గుణనిష్ఠులు సర్వభూతహితపరులై యుండుట స్వభావము. "అమానిత్వాదిగుణములు, ఆరురుక్షువులకుఁ బ్రయత్నసంపాద్యములై నందున సాధనములనియు, సాధకులకున ప్రయత్నసిద్ధములయినందున స్వభావములనియు, మధుసూధనస్వామివారు గీతోపోద్ఘాతములోఁ జెప్పియున్నారు. కావున సాధనమైన సగుణవిద్య ననుష్ఠించువారును సాధ్యమయిన నిర్గుణవిద్య ననుష్ఠించువారును బరహితాచరణముగలవారై యుండుట యావశ్యకము. గీ. (18-68-69.శ్లో. "య ఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి, భక్తింమయిపరాం కృత్వా మామేవైష్యత్యసంశయః. నచతస్మాన్మనుష్యేషు కశ్చిన్మేప్రియకృత్తమః, భవితానచమేతస్మాదన్యః ప్రియతరోభువి." అను వచనములయందు భగవత్తత్త్వజ్ఞానము నుపదేశించుటయే భగవదనుగ్రహసంపాదక కృత్యములలో నుత్తమోత్తమమనియు,నట్లుపదేశించువారలే యత్యంతభగదనుగ్రహపాత్రు లగుదురనియు, నతివిశదముగాఁ జెప్పఁబడియున్నది. కావున సజ్జనులైన వారు యథాశక్తి పరహితాచరణపరులై యుందురుగాక (ఇది బల్లారిలో 1914-సం॥ ఆగష్టు నెలలో జరిగిన దివ్యజ్ఞానసభయందు నేనిచ్చిన యుపన్యాససంగ్రహము).

౧౮. శ్రీవరాహావతారము - జయవిజయులరాక్షసజన్మకర్మములు.

సృష్ట్యనంతర మీకల్పాదియందు హరికల్పాది యందు హరి శ్వేతవరాహావతారమెత్తి హిరణ్యాక్షుని సంహరించి భూమిని నీటనుండి యెత్తెను. వరాహదేహము యజ్ఞస్వరూపముగ వర్ణింపఁబడెను. యజ్ఞవరాహమూర్తి చరమోపదేశ మీతీరున వరాహపురాణములో నున్న ది:—'స్థితేమనసి సుస్వస్థే శరీరేసతి యోనరః, ధాతుసామ్యేస్థితే స్మర్తా విశ్వరూపంచమామజం. తతస్తంమ్రియమాణం తు కాష్ఠపాషాణసన్నిభం, అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిం'. శ్రీరామకృష్ణచరమోపదేశములతోఁ దీని ననుష్ఠింపవలయు. అనంతరము హిరణ్యాక్ష హిరణ్యకశిపులగు రాక్షససోదరుల పూర్వజన్మము వర్ణింపఁబడినది. వారు భగవల్లోకపాలకులగు జయవిజయులు. సనకాదు లగు బ్రహ్మపుత్రులను వైకుంఠాంతఃపురమునకుఁ బోనీయకుండిన హేతువున వారిశాపముచే జయవిజయులసురయోనులందు మూఁడుజన్మముల హిరణ్యాక్షహిరణ్యకశిపు, రావణకుంభకర్ణ, శిశుపాల దంతవక్త్రులన, వరుసఁగఁ బుట్టి హరిచే హతులయిహరియను గ్రహమున,ముక్తినొందిరి. ఈకథవలనఁ దెలియఁదగిన దేమన:— భగవత్సేవకులుసయితము బ్రహ్మవేత్తలనవమానించినచో దుర్గతినొందుదురు గాన బ్రహ్మవిదపచారము

సర్వవిధములఁ బరిత్యాజ్యము. భగవద్భక్తులను నిష్కారణము శపించుటచే సనకాదులు ప్రహ్లాదుఁడుగ నసురయోనియందుఁ బుట్టి తండ్రిచేఁ జేయఁబడిన యష్టకష్టములం బడెను. కానభాగవతాపచారము సర్వవిధములఁ ద్యాజ్యమనియుఁ దెలియఁదగు. జయవిజయులు ద్వేషరూప మైనభక్తి మూఁడుజన్మములందుఁ గలిగి తదనంతరము హరిసాయుజ్య ముక్తిని బొందిరి. ఏల యన ; జయవిజయులు, సకామ భక్తులు సనకసనందనాదులు నిష్కామభక్తులు. హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు జన్మమందు వరాహనృసింహరూప మొందిన భగవంతునిచే మడిసినను, ముక్తిఁ బొందక రావణ కుంభకర్ణులుగఁ బుట్టి యీజన్మమందు శ్రీరామరూపుఁడగు భగవంతునిచేఁజంపఁబడినను ముక్తిఁబొందక తిరిగి శిశుపాల దంతవక్త్రులుగఁబుట్టి శ్రీకృష్ణులగుభగవంతులచేఁజంపఁబడి, సాయుజ్యముక్తిఁ బొందినట్లు చెప్పఁబడినది. భగవంతునిచే మృతినొందినవానికి ముక్తి యవశ్యము గలుగవలసియుండఁగఁ బ్రథమద్వితీయజన్మములలో వారికి ముక్తి లేకుండుటకును మూఁడవజన్మాంతమందు ముక్తి గలుగుటకును సంశయింపనగు. ప్రథమజన్మమందు భగవంతునిచే మృతి నొందినను వరాహనృసింహరూపములందు హిరణ్యాక్షహిరణ్యకశిపులకుభగవత్ప్రతిపత్తి లేకుండెను! కాన వారికి ముక్తి లేకున్నను భగవత్కృతమృతి యగుపుణ్యప్ర

భావముచే వారు రావణకుంభకర్ణులుగ జన్మమొంది త్రై
లోక్యాధిపసంపదనుబొందినను శ్రీరామచంద్రులచే మృతి
నొందినపుడుఁ గూడ శ్రీరాములు భగవంతుఁడను జ్ఞానము
వారికి లేకుండెను. తర్వాత నాపుణ్యప్రభావముచే సకల
రాజవంశోత్కృష్టమగుచేది (సూరత్=Surat) రాజవంశ
మందప్రతిహతైశ్వర్యసంతులయి వారు శిశుపాలదంత
వక్త్రులుగఁ బుట్టిరి. శ్రీకృష్ణరూపముతో నున్న భగవం
తుఁడు పీతాంబరధారిత్వాదిసకలభగవల్లక్షణప్రాకట్యము
గలిగియున్నందున నామూర్తియందుఁ బూర్వవాసనా
సిద్ధమగుదీర్ఘవైరముచే స్నానాసనభోజనాదిసమయము
లందుఁ గూడ శ్రీకృష్ణభావనావిశేషముచే, శ్రీకృష్ణప్ర
యుక్తములగుచక్రగదలచే స్మృతి నొందినపుడు, ద్వే
షాదిదోషములు నశించి కేవలశ్రీకృష్ణరూపమందు భగవ
త్ప్రతిపత్తి గలిగి ప్రేమభక్తిపరవశు లయి యుండిరి గాన
వారిరువురకు చక్రగదాహతిచే సాయుజ్యముక్తి సిద్ధించె
నని పరాశరులయభిప్రాయము (విష్ణుపురాణ-4-అం-౧౫-
అ). దానిని భాగవత మనుసరించుచున్నది. "జన్మత్ర
యానుగుణితవైరసంరబ్ధయా ధియా, ధ్యాయం స్తన్మయ
తాం నీతో భావోహి భవకారణం' (భా10-74-47.శ్లో.)

"మధుదైత్యాంతకుమీఁదిమత్సరమునన్
మత్తిల్లి జన్మత్రయా

వధి నేప్రొద్దుఁ దదీయరూపగుణది
వ్యధ్యానపారీణధీ
నిధి యౌటన్ శిశుపాలభూవిభుఁడు దా
నిర్ధూతసర్వాఘుఁడై
విధిరుద్రాదుల కందరానిపదవిన్
వే పొందె సర్వేశ్వరా॥.

ఆంధ్రభా. 10. 799.

ఇందుచే సమ్యగ్భక్తివలన భగవత్తత్త్వజ్ఞాన మోక్షములవశ్యము గలుగునని తేలును. - శ్రీకృష్ణచైతన్యులును వారియనుయాయులును గూడ నట్లే తలంచిరి. ఈవిషయములోనివిశేషములు దశమస్కంధసారములో వివరింపఁబడును. మఱియు నరనారాయణులే కృష్ణార్జునులుగ నవతరించి భూభారమును దొలఁగించిరని వర్ణింపఁబడినది:—

"తావిమౌ వై భగవతో హరే రంశావిహాగతౌ,
భారవ్యయాయచ భువః కృష్ణౌయదుకురూద్వహౌ॥.
(4-1-59)

మఱియు నరనారాయణావతారమందుఁ దమవైరాగ్యమును భంగపఱుపవచ్చిన రంభాద్యప్సరసల కాతిథ్యాది

గౌరవములు చేయుటచే గామక్రోధజయమును గనుపఱచి
నట్లు,నిర్హేతుకముగ జయవిజయుల నాగ్రహించి శపించిన
సనకాదుల కాతిథ్యాది సత్కారములొసంగి తేనియలొ
లుకు మాటలతోఁ బ్రశంసించుటచేఁ గోపజయ మిక్కడ
భగవంతు లగపఱచిరి. మఱియు లక్ష్మీశాపమువలనను, సన
కాదులలో నంతర్యామిగ నుండిన భగవంతుని శాపము
వలనను, జయవిజయులకు రాక్షసజన్మము వచ్చినట్లుగూడ
భగవంతులు సనకాదులతో సెలవిచ్చిరి. సనకాదులు తమ
నడతకు సిగ్గుపడిరి. భగవన్మాయ యట్టిమహాత్ములకుఁ గూడ
దురత్యయము.

## ౨౧. కపిలగీత.

ప్రథమమనువగుస్వాయంభువమనువుచేఁ జేయఁబడిన
సృష్టియందు నామనుపుత్త్రికయగు దేవహూతినిఁ గర్దమ
ప్రజాపతి పరిణయమాడి యామెవలనఁ దొమ్మిదికొమరిత
లను నొకకొడుకును గనెను. ఆకొమరుఁడు భగవదవతార
మగుకపిలమహర్షి. వారు తండ్రికిఁ దత్త్వోపదేశముఁ జేసి
తల్లికి సాంఖ్యయోగభక్తివైరాగ్యముల నుపదేశించిముక్తిని
బొందించిరి. వీనిలో భక్తియోగముమాత్రము సంగ్రహిం
పఁబడును.ఇతరవిషయములుగూడనమూల్యములు.వానిఁ

మూలమునఁ దెలియవలయు. తల్లిదండ్రులుగూడఁ గొడు
కులు జ్ఞానాధికు లైనపుడు వారివలన బోధనరయనగునని
యీ యుపాఖ్యానమువలనఁ దెలియనగు. భక్తిప్రకార
మేమన :—

"స్వభావగుణభేదమునం జేసి పురుషులయభిప్రాయ
భేదంబున భక్తియోగంబు బహుప్రకారముల నొప్పు.
ఎట్లంటేని, హింసనొండె దంభమునొండె మత్సరము
నొండె సంకల్పించి క్రోధియై భేదదర్శనమునఁ జేయఁబడు
త్రివిధభక్తియుఁ దామసమునంబడు. విషయములఁ గోరి
యొండె యశముఁగోరియొండె నైశ్వర్యముఁ గోరియొండె
భేదబుద్ధితోఁ బ్రతిమాదుల నర్చించుట రాజసభక్తియునఁ
బరఁగి యిచ్ఛాభేదమునఁ ద్రివిధంబగు. పాపక్షయార్థం
బొండెఁ బరమేశ్వరప్రీత్యర్థమొండె శాస్త్రానుసరణార్థమొండె
భేదమతిఁ జేయుంబడు త్రివిధభక్తియు సాత్త్వికమునంబ
రఁగు. ఈతొమ్మిదింటిలో నుత్తరోత్తరంబు త్తమంబు.
మఱియు శ్రవణకీర్తనాది భేదమున నవవిధంబైన భక్తి
యోగము పూర్వోక్త నవభేదములం గుణించిన నెనుబది
యొక్కండు భేదములయ్యెడు. ఇవి యెల్ల సగుణభక్తి
ప్రకారంబులు. సముద్రమునం గంగోదకంబునకుం బోలె
నాగుణములు విన్నంతన సర్వగుణాశ్రయుండైన నాపై
యవిచ్ఛిన్నముగ మనస్సునకుఁ బ్రసక్తిగలుగ ఫలాపేక్ష

యు భేదదర్శనంబునుం గానక ప్రవర్తించుట నిర్గుణభక్తి
యోగమునకు లక్షణంబు. అట్టి నిర్గుణభక్తియోగంబుఁ
గొన్నవారు సాలోక్యముఁగాని సమానైశ్వర్యముఁ
గాని సామీప్యముఁగాని సారూప్యముఁగాని సాయుజ్యముఁ
గాని యిత్తునన్నను మత్సేవాసక్తులై యభిలషింపరు.
త్రిగుణముల నతిక్రమించి బ్రహ్మభావంబుఁ బడయ
నుపాయంబైనయాత్యంతికభక్తియోగం బియ్యది. ఫలాభి
సంధిమాని యనుష్ఠించిన నిత్యనైమిత్తికకర్మాత్మకస్వధ
ర్మము, శ్రద్ధాసమన్వితంబై నిష్కామంబై యహిం
స్రంబైనపూజావిధానము, మదీయప్రతిమాదర్శనస్ప
ర్శనపూజాస్తుతివందనాదికంబు, భూతములయెడ మద్భా
వనంబు, ధైర్యము, వైరాగ్యము, మహాత్ములయెడ
బహుమానంబు, దీనులయెడఁ గారుణ్యం, బాత్మతుల్యుల
యెడ మిత్రత్వంబు, శమము, నియమ, మాధ్యా
త్మికానుశ్రవణము, నామసంకీర్తన, మకుటిలత్వ,
మార్య సంగ, మనహంకారము, మున్నగు భాగవతగుణ
ముల సేవించినవాని పరిశుద్ధచిత్తము శ్రవణమాత్రమునఁ
దత్క్షణంబ నన్నుఁ బొందు. వాతప్రేరితంబై గంధము దన
నెలవగుపుష్పాదులనుండి ఘ్రాణేంద్రియముం జేరుచంద
మున యోగరతంబై నిర్వికారంబైనచిత్త మాత్మం జేరు.
భూతాత్ముఁడగు నేను సర్వభూతములలో నుండుదు

ఇయ్యర్థం బెఱుంగక మర్త్యుఁడు ప్రతిమార్చనంబుఁ గావించు. సర్వభూతములలో నంతర్యామియైన నన్నీశ్వరుం ద్యజించి ప్రతిమలనర్చించిన నాపూజభస్మహోమతుల్యం బయ్యెడు. పరకాయముల వసించు నాయెడ భేదబుద్ధిం జేసి ద్వేషించు భూతవైరియైన మానికి మనశ్శాంతి యెన్నడుం గలుగదు. భూతనిందకుఁడు నానావిధద్రవ్య సంభారములసంపాదించి క్రియాయోగమునం బ్రతిమల నెంత పూజించినం దాన నేను సంతుష్టిఁ జెందను. సర్వ భూతవర్తియైన యే నతనిలో నుండుదు నని యెందాఁక నెఱుంగకుండు నందాఁక నరుఁడు స్వధర్మపరుఁడై ప్రతి మాదుల నర్చింపఁ దగు. తనకుం బరునకు నించుకేనియు భేద మెంచుభిన్నదర్శనున కేను మృత్యుస్వరూపుఁడనై యత్యంతభయముఁ గావింతు. కావున సర్వభూతాల యుండై భూతాత్ముఁడై నన్ను దానమానములను మిత్త్రత్వమునను సమదర్శనమునను బూజించుట కర్తవ్యంబు. అచేతనంబులకంటెఁ జేతనానంతంబులు వానిలోఁ బ్రాణ వృత్తియుతంబులు వానిలో జ్ఞానవంతంబులు వానిలో నింద్రియవృత్తిమంతంబులు వానిలో స్పర్శవేదులకంటె రసవేదులు వానికంటె గంధవేదులు వానికంటె శబ్దవే దులు వానికంటె రూపభేదవేదులు వానికంటె నుభయ తోదంతములైన యశ్వాదులు. పాదహీనంబుల కంటె

బహుపాదంబులు వానిలోఁ జతుష్పదంబు లగుజంతువులుం గ్రమక్రమంబున నుత్తమంబులు. వానికంటెఁ బదద్వయోపేతులగుమనుష్యు లుత్తములు. మనుష్యులలోఁ జతుర్వర్ణములు ప్రశస్తంబులు. చాతుర్వర్ణ్యంబునందును బ్రాహ్మణులు శ్రేష్ఠులు. బ్రాహ్మణులలో వేదవాదులును వారిలో సర్వజ్ఞానవంతులును వారిలో సంశయచ్ఛేదకులగు మీమాంసకులును వారిలో స్వధర్మానుష్ఠానపరులును వారిలో నిష్కాము లగుముక్తసంగులు నుత్తరోత్తరముగ నుత్తములు. సర్వకర్మములను దత్ఫలములను దేహమును నా కర్పించినయతండు నా కవ్యవహితుండు గావున నందఱిలో నుత్తముఁడు. అట్టికర్తృత్వాభిమానరహితుఁడైన సమదర్శనునకంటెఁ నొండొక్కయుత్తముని నే నెఱుంగను. ఈశ్వరుఁడు జీవకలచే నందఱిలో నున్నవాఁడని సర్వభూతములను బహుమానించుచు మ్రొక్కవలయు. మనుపుత్రీ! భక్తియోగము నష్టాంగయోగముం జెప్పితి. నారెంటిలో నొక్కటి నట్టిపురుషుండు పురుషోత్తముం బ్రాపించు". ఈయధ్యాత్మోపదేశానంతరము దేవహూతి ముక్తిఁ జెందెను.

"దయా స్తిసర్వభూతేషు సర్వంకృష్ణ మయంజగత్,
యోజానాతిమహాజ్ఞానీ సభక్తోవైష్ణవోత్తమః."

---

హరిః ఓం.

శ్రీ గురుభ్యో నమః.

# చతుర్థస్కంధసారము.



శ్లో. అజ్ఞాన నాశనేదక్షం
దీక్షితంభక్తరక్షణే,
వటమూలాశ్రయంత్ర్యక్షం
దక్షిణామూర్తి మాశ్రయే.

శ్లో. శ్రీహరింపరమానంద
ముపదేష్టారమీశ్వరం,
వ్యాపకంసర్వలోకానాం
కారణం తం నమామ్యహమ్.

## ౨౨. నాల్గవస్కంధసంగ్రహము.

సోదరులారా!

నాల్గవస్కంధములో విసర్గము వర్ణింపఁబడెను. మొదట స్వాయంభువమనుసృష్టివర్ణనములో నత్రిమహర్షికి ననసూయకు బ్రహ్మవిష్ణుమహేశ్వర్ల యంశముల సోమదత్త దూర్వాసుల యుత్పత్తి, పిదప దక్షుఁడుమొదలగు ప్రజాపతులచేఁ జేయఁబడిన విసర్గమనుకార్యసృష్టియు నాలుగు చరిత్రములలో వివరింపఁబడినవి.

## ౨౩. దక్షాధ్వరనాశము.

మొదటిది సతీదేవి చరితము. ఆమె తండ్రియగు దక్షప్రజాపతి దేహాభిమానుఁడై కేవలకర్మజడుఁడై తత్త్వవిముఖుఁ డైనందునను, భాగవతనిందాపరుఁడైనందునను, నాతనికిఁ బుత్రికావియోగము, యజ్ఞభంగము, స్వరూపవైరూప్యముం గలిగె. కానఁ బరమభాగవతోత్తముఁడగు శివునినిందసర్వదాసర్వథాపరిహర్తవ్యమని వైష్ణవాదులు గట్టిగ నరయనగు.

“హసంతి యస్యాచరితంహిదుర్భగాః
స్వాత్మన్రతస్యావిదుషస్సమీహితం॥” (3-14-28)

అను కశ్యపవాక్యమును మఱవవలదు. భగవత్ప్రసాదము చేతను, భాగవతానుగ్రహముచేతను, దక్షుఁడు తిరిగియజ్ఞమును స్వరూపమును బడసెఁగాన నాయుభయానుగ్రహములను నెన్నిపాట్లనైనఁబడి సంపాదింపవలయు. మఱియు సతీదేవి నందీశ్వరాదుల చారిత్రములవలన వేద్యాంశములు తెల్పఁగలవు. భగవద్భక్తిలేని యజ్ఞకర్మము నిష్ప్రయోజనమనియుఁ, బాపకరమనియు, భాగవతము పలుచోట్లఁ జాటించుచున్నది. మఱియు భాగవతమునందు శివకేశవుల మాహాత్మ్యము, దక్షయజ్ఞనాశ త్రిపురసంహార సముద్రమథనాదికథలలో, సోపస్కారముగ వర్ణింపఁబడినది. వీనిలో దుర్మార్గనిగ్రహము, త్రిలోకరక్షణము, మహాదేవుఁడుచేసిరనియు, నందులకు వారిపత్నియు లోకమాతయగు పార్వతి, వారి పరమమిత్రులగు శ్రీహరియు, దేవతాదులు, కడుసహకారులనియు, సరయనగు. భాగవతమందనేకస్థలములలో శివుఁడు హరిభక్తాగ్రేసరుఁ డని యున్నను, నావచనములు "నహినిందా" న్యాయానుసారమన్వయింపనగు. "బ్రహ్మాదయోయత్కృతసేతుపాలాః యత్కారణం విశ్వమిదంహిమాయా, ఆజ్ఞాకరీ యస్యపిశాచచర్యా అహో విభూమ్నశ్చరితం విడంబనం"= "ఎవ్వానికరుణ బ్రహ్మాదులాత్మవైభవములఁ దనరుదు రెవ్వఁ డీవిశ్వమునకు హేతువెవ్వనియాజ్ఞకు మాయలోఁబడు; ఎవ్వఁడు తీవ్రవైరాగ్యమును సూచించుటకుఁ బిశాచ

చర్య ననుకరించు నట్టివాఁడు శివుఁడని కశ్యపుఁడు దితితోఁ జెప్పె (3-14-29). దక్షునితో హరియిట్లుపలికె:—

"అహం బ్రహ్మాచశర్వశ్చ జగతః కారణం పరం,
ఆత్మేశ్వర ఉపద్రష్టా స్వయందృగవిశేషణః.
ఆత్మమాయాం సమావిశ్య సోఽహం గుణమయీం ద్విజ,
సృజన్ రక్షన్ హరన్ విశ్వం దధ్రే సంజ్ఞాం క్రియోచితాం.
త్రయాణామేకభావానాం యోనపశ్యతి వై భిదాం
సర్వభూతాత్మనాం బ్రహ్మన్ సశాంతిమధిగచ్ఛతి."
(4-7-50-54)

= బ్రహ్మవిష్ణు మహేశ్వరు లొకరేయనియు, సృష్టిస్థితి లయవ్యాపారములకొఱకుఁ బేర్లువేఱుగఁ బెట్టికొనిరని యుఁ దేలును. ఇట్లే దశమాదిస్కంధములలో నున్నది. సముద్రమథనోపాఖ్యానములో:—

"న తే గిరిత్రాఖిలలోకపాల
విరించవైకుంఠసురేంద్రగమ్యం,
జ్యోతిః పరం యత్ర రజస్తమశ్చ
సత్వం న యద్బ్రహ్మ నిరస్తభేదం."

"గిరీశా సత్వరజస్తమోగుణరహితంబై నిరస్తభేదంబై బ్రహ్మాత్మకంబై వెలుంగు నీపరమజ్యోతిస్సు సకలలోకపాలు

రకును సురేంద్రునకును బ్రహ్మదేవునకును విష్ణుదేవునకును గమ్యంబుగాదు" అని ప్రజాపతులు శివునిస్తుతించినట్లున్నది. విష్ణ్వాధిక్యము భాగవతమునందు విశేషముగఁ జెప్పఁబడినను బూర్వోక్తన్యాయానుసారముగ శివకేశవులకుఁ దత్త్వములో భేదమించుకయయిన లేదని యరయనగు. దశమస్కంధహరివంశములలోఁగూడ నట్లేయున్నది.

౨౮. ధ్రువోపాఖ్యానము.

రెండవది ధ్రువోపాఖ్యానము. ధ్రువుఁడు బాలుఁడయ్యును, దుర్లభఫలమును గోరినవాఁడయ్యును, శ్రీనారదోపదేశముచే శ్రీవాసుదేవద్వాదశాక్షరీమంత్రమును బడసి భగవంతుని నారాధించి వారియనుగ్రహముచే సార్వభౌమత్వమును బిదప నత్యుత్తమమగు విష్ణుపదమును బొందెను. ధ్రువనారదవిష్ణుస్వాయంభువమన్వాది సంవాదములలో వేదాంశములు మెండుగనున్నవి. ధ్రువుని సుకృతవిశేషముచే నతనితల్లి యగు సునీతిగూడ ధ్రువస్థానమును బొందెను. కాన బాల్యదశయందైనను భగవద్భజనాదికమావశ్యకమనియు, నది భాగవతునకు మహాఫలదాయకమే కాక భాగవతదేహసంబంధులకుఁ గూడ మహాఫలప్రద మనియు నరయనగు. ధ్రువుఁడర్థార్థి యాపభక్తుఁడు.

ధ్రువప్రశ్నాదిదృష్టాంతముల వలన బాల్యమందుఁ గూడ నధ్యాత్మవిద్య నేర్చుకొన నగు నని తేలును.

### ౨౫. పృథూపాఖ్యానము.

మూఁడవది పృథూపాఖ్యానము. పృథుచక్రవర్తి వేనుని బాహుమథనమువలన హర్యనుగ్రహమునఁ బుట్టెను. వేనుఁడు వేద వైదిక విద్వేషి. కాన నతనిని బ్రాహ్మణులు శాపమునభస్మముఁ జేసిరి. పృథుచక్రవర్తి ప్రజలను పుత్త్రులవలెరక్షించి వారికి ధర్మార్థకామములు భగవదర్పణపురస్సరముగఁ జేయనగు నని యుపన్యసించి, వారికి గ్రామపట్టణాదులను నిర్మించి, భూమిలోని సస్యములను వృద్ధిపఱచి, చక్కఁగఁ బ్రజాపాలనముఁ జేసిరి. తదనంతరము భగవదనుగ్రహముచేత సనకసనందనాదులతనిదర్శించి నపుడు సనత్కుమారుఁ డతని కిట్లు తత్త్వముపదేశించెను.—

“ఆత్మేతరంబు లగు దేహాదులమీఁద వైరాగ్యంబు, నిర్గుణబ్రహ్మంబు పై నత్యంతరతియు,నను టే నరులకుఁ బారమార్థికక్షేమంబునకు హేతువని శాస్త్రములందు సమ్యగ్విమర్శమున నిశ్చితంబయ్యె. అట్టివిరక్తి సహాకృత బ్రహ్మాభి

రతిశ్రద్ధాయోగంబునను భగవద్ధర్మాచరణంబునను దత్త్వార్థ
విచారంబునను యోగేశ్వరోపాసనంబునను నిరంతర
హరికథాశ్రవణంబునను రాజసతామసగోష్ఠీపరిత్యాగం
బున నర్థకామాపరిగ్రహంబునను హరిగుణకీర్తనం బెడఁ
బాయనివివిక్తసేవనంబున నాత్మసంతోషంబునను
హింసావర్జనంబునను శమాదిసంపాదనంబున నాత్మ
హితానుసంధానంబునను, హరిచరితస్మరణసుఖానుభవం
బునను నిష్కామయమనియమానుష్ఠానంబునను మార్గాం
తరానిందనంబునను యోగక్షేమార్థక్రియారాహిత్యంబు
నను శీతోష్ణాదిద్వంద్వసహనంబునను భాగవతులకుఁ
గర్ణపూరంబైన హరిగుణశ్రవణంబున నెసఁకమెసఁగిన
భక్తియోగంబుననుం గలుగు. బ్రహ్మరతినిష్ఠయొదవె
నేని పురుషుఁ డాచార్యోపదేశంబునఁ దీవ్రవైరాగ్య
విజ్ఞానములంజేసి నిర్వీర్యంబైన యహంకారమును
బంచాత్మకంబై జీవులకావరణంబుఁ గావించు. దాని
నాత్మోత్థితంబైన యగ్నియరణిం బోలె దహించెడు.
దాననుపాధివర్గంబగుడుఁ దద్గుణములైన కర్తృత్వ
భోక్తృత్వాదులం బరిహరించి ద్రష్టృదృశ్యభేదప్ర
తీతికారణంబు నశించినకతన స్వప్నావస్థయందు సేవ్య
సేవకభేదప్రతీతులగు రాజభృత్యాదులం బ్రత్యేకంబు
గోచరింపఁజేయు ప్రతిపత్తియా స్వప్నము నశించినం దోఁచన

నశించు విధంబున భేదదర్శనంబు నిత్యాలంబగుటయుఁ
బురుషుండు బాహ్యములగు ఘటాదుల నాభ్యంతరము
లగు సుఖదుఃఖాదులనుం గనుంగొనఁడు. ఉపాధియగునం
తఃకరణ మొక్కఁడుండిన ద్రష్టయగు నాత్మని దృశ్యమగు
నింద్రియార్థవిషయంబు నేతదుభయ సంబంధహేతువైన
యహంకారమును భిన్నభిన్నముగఁ బురుషుండు సూచుఁ
గాని యయ్యుపాధి లేకుండినంగాదు. జలము దర్పణము
మున్నగు ప్రతిబింబనిమిత్తములుండినంగదా బింబప్రతి
బింబభేదముఁ జూచుట లోకమున ననుభవగోచరం బగు
చుండు.—ధర్మార్థకామములు మూఁడును గాలభయ
సంయుక్తంబులై యనిత్యములవుటం జేసి మోక్ష
మొక్కండే పరమపురుషార్థంబు. పరులైన బ్రహ్మాదుల
కును గుణక్షోభానంతరముగలిగి యమరులనంబడు
నస్మదాదులకును గాలవిక్రమంబునం బ్రధ్వంసంబునుదయ
ములయుటం జేసి యాత్యంతికక్షేమరూపం బైన నిత్య
త్వంబు లేదు. కావున నోనరేంద్రా దేహేంద్రియప్రాణ
బుద్ధ్యహంకారముల నావృతంబులై స్థావరజంగమం
బులలో నంతర్యామియై సాక్షియై ప్రత్యక్ప్రతీతయై
పరిచ్ఛిన్నుండై వెలయు పరమాత్ముండు నేనయని తాదా
త్మ్యానుసంధానమున నెఱుంగుము. ఉత్కృష్టనికృష్ట

రూపముననుఁ గార్యకారణాత్మకత్వంబుననుఁ దనరు నీవిశ్వ మెవ్వనియందు రజ్జువునందు ప్రతీతరీతి మాయాయోగ మునం దోఁచి వివేకమున నిరాకృతిం గాంచునట్టి నిత్య ముక్త శుద్ధబుద్ధ సత్య స్వరూపమునఁ గర్మమలిన ప్రకృతిం బరిభవించు పరమాత్మ నాశ్రయించెద. అట్టి యద్వైతాపరోక్షజ్ఞాన మశక్యమగునేని భక్తి నలవరింపుము."

ఈ యుపదేశానంతరము పృథుచక్రవర్తి తన భార్యా పుత్త్రాదులను, రాజ్య భృత్యాదికము సర్వమును, సన కాదులకు 'మీ నన్నువు మీ కిచ్చుట యెక్కుడగాదని', రాజునకు భృత్యుండు రాజకీయములగు తాంబూలాది పదార్థంబులచే నుపచారంబులు చేసినవిధమున, సమర్పించెను. పిదప రాజునకు దానిని వారు తిరిగి యియ్య రాజ్యము చేసి కొంతకాలమునఁ దీవ్రవైరాగ్యభక్తిజ్ఞానములు గలిగి పుత్త్రునకు రాజ్యమిచ్చి, వనమునకు వెళ్లి తపస్సుచే దేహముఁ ద్యజించెను. భగవదర్పణపూర్వకధర్మాచరవలనఁ ణము, ప్రజారంజనము, ధర్మజ్ఞానబోధయు, నతనిచర్య దెలియనగు. సర్వకర్మములు భగవదర్చనరూపముగఁ జేయుటచేఁ బృథుచక్రవర్తియర్చనభక్తినిష్ఠుఁడని ప్రసిద్ధి నొందెను.

### ౨౬. ప్రాచీనబర్హికథ.

నాల్గవది ప్రాచీనబర్హికథ. ప్రాచీనబర్హియను రాజు తన పదుగురు కుమారులను సృష్టినిమిత్తము తపస్సునకుం బంపి, గర్మనిష్ఠుండై జ్యోతిష్టోమాది కర్మములనాచరించుచుండంగ నారదమహర్షి కర్మనిష్ఠనుండి యతనిని దొలంగించి జ్ఞాననిష్ఠను బోధించుటకై కర్మములను దూషించి యాత్మస్వరూపమును జన్మకర్మ పరంపరారూపమగు నవిద్యావిలాసమును సంసారానర్థకమును డెలియంజేయుం బురంజనోపాఖ్యానమతిచిత్రముగ నన్యోపదేశముగా వర్ణించి పిదప దాని యంతరార్థమును విప్పి చెప్పిరి. ఆత్మ, సిద్ధుండైనను బుద్ధీంద్రియాద్యభిమానముచే నాస్వరూపమును మఱచి, నానావిధదుఃఖముల ననుభవించుచు నెడతెగని సంసారమున మునుంగు ననియు, నాయభిమానం బుడిగినచో ముక్తుండనియును నారదు లుపదేశించిరి. దీనిచే శ్రౌతస్మార్తకర్మనిష్ఠ సంసారహేతువనియు, జ్ఞాననిష్ఠ మోక్షహేతువనియు స్పష్టము. పురంజనోపాఖ్యానమతివిపులముగను సోపస్కారముగను యుక్తిభూయిష్ఠంబుగను సంసారవిరక్తిదార్ఢ్యముకొఱకుం జెప్పంబడినది. కాన దానిని మఱవవలదు. రాజునకుం గర్మవిషయమయి కొన్నిసంశయము లుండ వాని కీతీరున సమాధానము చెప్పిరి:—

“నరేశ్వరా! పురుషుండు మనఃప్రధానమైన లింగశరీరము

తోడంగలిసికర్మములఁ జేయుఁగావునఁ గర్మారంభకమగునా
లింగశరీరమున నేయాత్మ తత్కర్మఫలములంగుడుచు. స్వప్న
మందుజాగర దేహము జీవించియున్ననుదానివిడిచి తత్కా
లకల్పితంబైన జాగరావస్థాన శరీరసదృశ దేహాంతరముం బ్రవే
శించి జాగరదేహాభిమానమువిడిచి మనస్సున సంస్కా
రాహితంబైన కర్మఫలముం గుడుచువిధమునం గర్మోప
స్థాపితంబైన దేహాంతరంబెత్తి తత్కర్మఫలములఁ బురు
షుండుగుడుచు. కర్మారంభకమగు మనఃప్రధానలింగశరీర
మొల్లపు డొక్కటియే కావునఁ గర్తృభోక్తృశరీరభేదమని
తలంపం బనిలేదు. స్థూలశరీరభేదంబ కించిత్కరంబు. వీరు
నావారలు నే నిట్టివాఁడ నని యహంమమాభిమాన
ముతో నేదేహమునఁ బురుషుఁడు కర్మమాచరించు నట్టి
యహంకార గృహీతమగు కర్మంబే, దేహాంతరోత్పత్తికార
ణంబు గావునఁ గర్తృత్వ భోక్తృత్వధర్మములు రెండున
భిమానసన్నిధాపితములవుటం జేసి యభిమానకారణం
బైనమనస్సుప్రధానముగా నమరులింగదేహమున కన్నింటి
లో నేకరూపమున సమన్వయము గలిగినకతనం గర్తృ
త్వంబునందును భోక్తృత్వంబునందును దేహభేదము
చూపట్టదు. తత్తత్ప్రారబ్ధకర్మక్షయావసానములై యల్ప
కాలభోగ్యములగు తత్తత్స్థూలదేహములం గర్మసాకల్య
ఫలమనుభవించుట యశక్యంబు గావునఁ బ్రధానలింగశరీ

రైక్యంబే కర్తృత్వభోక్తృత్వముల యెడనైక్యాపాదకం
బని యెఱుంగుము. ఇంద్రియవ్యాపార జ్ఞానకర్మరూపము
లగు చిత్తవృత్తుల నొకప్పుడు చిత్తమున కనుమతియొదవు
విధమునఁ జిత్తవృత్తులను బూర్వజన్మకర్మమనుమితంబ
య్యెడు. ఈ దేహమున నొకప్పు డేదియుఁజూచియు వినియు
నెఱుంగని విషయముల స్వప్నమనోరథాదులం బురుషుఁ
డేరూపమున నేప్రకారమునం దనమదిఁ గనుంగొను
నయ్యర్థంబరసి యతండు తాను దేహాంతరమునఁ బూర్వ
మెప్పుడే నొకప్పుడు తద్రూపము తత్ప్రకారములగునర్థము
ననుభవించి యుండెదననియుఁ దదారంభకంబగు కర్మం
బును దాన నుండెడుననియుఁ గర్మంబనుమేయంబగును.
అననుభూతవిషయమును మనస్సు గ్రహింపనేరదు.
కావున నట్టియర్థంబుల యెడఁ బూర్వకర్మానుమానంబపరి
హార్యంబయ్యెడు. ఉచ్చనీచజన్మంబులఁ బొందువానికి
భావిరూపముల మనస్సే తెలుపుచుండెడు. మనోధర్మము
లగు నౌదార్యకార్పణ్యాదిగుణములం బూర్వవృత్తియను
మింపఁబడియెడు. స్వప్నావసరంబులందు మనస్సునం
గేవలాసంభావితంబు లగు పర్వతాగ్రమునందు సము
ద్రదర్శనము పగలు నక్షత్రప్రకాశ మాత్మశిరశ్ఛేదము
మున్నగు కొన్ని యత్యంతాదృష్టశ్రుతములు దోఁచుంగాని
దేశకాలక్రియాశ్రయంబులగునవి యెల్ల నిద్రాదిదోష

మునం బ్రతీతిగోచరంబులగు నని యనుమించుటొ
ప్పెడు. ఇంద్రియగోచరంబులన్నియుఁ గ్రమానుబోధమున
మనస్సున వచ్చుచుఁ బోవుచుండుఁ గావున దరిద్రుఁ డొక
ప్పుడు తన్ను మహారాజుగాఁ దలంచుటయు,సంపన్నుఁడొక
ప్పుడు దన్ను దరిద్రుఁగాఁ దలంచుటయుఁ, బొసఁగఁ జనుఁ
గావున మనోధర్మ ప్రవృత్తింజేసి యసంభవంబు దేనికిం
గలుగదు. జనులందఱు సమనస్కులు గావున మనో
ధర్మములందఱకు నవినాభూతములై యుండు. సత్త్వైక
నిష్ఠంబై భగవద్ధ్యానపరంబైన మనస్సునందుఁ జంద్ర
మండలమున రాహూపరాగంబెట్టులట్లు లీజగంబెల్ల నేక
కాలసంయోగము నొందిన తెఱంగునఁ జూపట్టుఁగాని
శుద్ధమనస్సున సర్వవిషయస్ఫురణంబను నయ్యర్థము
యోగిప్రత్యక్షంబు. మనోబుద్ధీంద్రియార్థగుణవ్యూహ
పరిణామంబైన లింగశరీర మనాదియై యెందాఁకనుండు
నందాఁక నహంమమాభిమానకార్యంబైన స్థూలదేహ
సంబంధము పురుషు నెడఁబాయదు. సుషుప్తిమూర్ఛాసం
తాపమృత్యుప్రజ్వారసమయంబుల నింద్రియవిఘాతము
లం జేసి యహంకారముండినం బ్రకాశింపదు. మఱియు
గర్భావస్థయందును బాల్యమందునింద్రియపుష్కలత్వంబు
లేనికతన నమావాస్యనాఁడు చంద్రరూపం బెట్టుల
ట్లులు యౌవనదశందోఁచు నహంకార మభివ్యక్తిఁబొర

యదు. అర్థము లేకుండినను విషయములఁ జింతించువానికి స్వప్నమున ననర్థ దర్శనంబుమాడ్కి సంసారానువృత్తియు డుగదు. ఇవ్విధమున లింగదేహము పంచతన్మాత్రాత్మకంబును, త్రిగుణాత్మకంబు షోడశవికారాత్మకంబును, చైతన్యాపాదకుండైన యప్పురుషుఁడు జీవుఁడనంబడు. పురుషుఁడు లింగదేహమున నొక్క స్థూలదేహముం ద్యజించి దేహాంతరంబుఁ గొని దీని మూలముననే హర్షశోకభయసుఖదుఃఖము లనుభవించు. జలగయుత్తర తృణమును సాకల్యముగఁ బట్టుకొనునంతకుఁ బూర్వ తృణముం ద్యజింపనివిధమునం బురుషుఁడు మ్రియమాణుఁడయ్యుఁ బూర్వదేహారంభకకర్మసమాపనమున నన్య దేహప్రాప్తిగలుగు నంతకుఁ బూర్వదేహాభిమానంబు విడువఁడు. పూర్వకర్మములుండిన కారణంబుననే పురుషుఁ డింద్రియములఁ బూర్వోపభుక్తములం జింతించుచుఁ గర్మము లొనర్చుటం జేసి మనస్సే భూతములకు సంసారకారణంబనియు నవిద్య యుండునంతకు దేహాదులకుఁ గర్మబంధము గలుగుననియు నెఱుంగుము. ఇవ్విధమునఁ బూర్వ పూర్వకర్మం బుత్తరోత్తర దేహములకుఁ బ్రారంభకరమగుటం జేసి యనుమానప్రమాణగోచరంబైన కృతకర్మ మదృశ్యమనియు, నెట్లు కాలాంతరమున ఫలమిచ్చుననియు, సంశయింపఁ బనిలేదు. కర్మప్రవాహమున సర్వంబుపపన్నమయ్యెడు. కావున నవిద్యాదినాశనంబుఁ

గోరి ఋజాజగంబెల్ల సృష్టిస్థితిలయకారణవాసుదేవా
త్మకం బని తలపోసి సర్వవిధముల నాహరినిభజింపుమని
యట్లు జీవేశ్వరతత్త్వంబు నిరూపించి ప్రాచీనబర్హిని
వీడుకొని నారదుండు సిద్ధలోకంబునకుఁ జనియెను. అటఁ
బ్రాచీనబర్హియుఁ బ్రజాసర్గాభిరక్షణంబులం బుత్రులనియ
మించి తపోమతియై కపిలాశ్రమంబున కరిగి ముక్తసంగుఁ
డై యేకాగ్రచిత్తమునం గోవిందచరణాంబుజంబు భజి
యించి తత్సమత్వంబునడసె." ఈబోధనుమన దివ్యజ్ఞాన
సామాజికులగు బ్లావెట్స్కి, బెసంటు, లెడ్బీటరు
గార్లు, బహుయుక్తులతోను, దృష్టాంతములతోను, బహు
గ్రంథములలో సెలవిచ్చిరి. బ్రహ్మశ్రీ నంజుండప్ప గారు
య్యగార్లగుమనసోదరులు తెలుఁగున నావిషయము
వారిగ్రంథములలో స్పష్టపఱచిరి. కాన దాని నిచటవివ
రింపలేదు.

## ౨౭. ప్రాచేతసులకథ.

ప్రాచీనబర్హిపుత్రులగు ప్రాచేతసులు తపంబునకుఁ జను
చుండ మధ్య భగవంతుఁడగు రుద్రదేవుఁడు ప్రత్యక్ష
మయి రుద్రగీతయనునారాయణస్తోత్రమును వారికుపదే
శించెను. ఆమంత్రజపముచే విష్ణుసాక్షాత్కారముగలిగి
సృష్టికర్మమందుఁ బ్రవర్తించిరి. ఇందుచే మహాపురుషాను
గృహీతమగు మంత్రము భగవత్సాక్షాత్కారమును గలు

గఁ జేయుననియు, పూర్వజన్మసుకృతవిశేషముచే నీ జన్మమందు మహాపురుషసమావేశముగలుగుననియుఁ దెలియనగు. వారు గృహస్థాశ్రమమందుండి రాజ్యముఁజేసి నారదునిచే నిట్లద్వైతజ్ఞానోపదేశమునుబొందిరి :—

"హరి సర్వకారణకారణంబుగావున నశేష దేహులకాత్మఁడు, కాలప్రధానపురుషస్వరూపుఁడు, స్వతేజో నిరస్తసమస్తగుణప్రవాహుఁ, డపాస్తసకలసంకల్ప వికల్పుఁ, డద్వయుఁడు, భేదాధ్యాసాపవాదానంతరగమ్యాత్మస్వరూపుఁ,డనాదిమధ్యాంతుఁడు, నిత్యానందమాత్రుఁడు, చిద్ఘనుఁడు,నగు నాపరమాత్మ నాత్మైకత్వ భావమున భజియింపుఁడు. సర్వభూతదయ, యదృచ్ఛాలాభసంతుష్టి, సర్వేంద్రియోపశాంతి, యనునివియలవరించికొన్నఁ గేశవుండు పరితోషంబునొందు. విషయములెల్లవర్జింపఁబరిశుద్ధంబై వెలయు సాధుచిత్తమునిరంతరభావనోపహతుండై భక్తులకువశుండైన యతనియందు తద్ఘటాకాశంబు రీతినెడఁబాసి యెఱుఁగఁడు. అవ్విధంబున హరినిధ్యానించి తద్గతిం గాంచిరి.

అంత విదురుఁడు బహువిధంబులగు మోక్షమార్గంబు లాఖ్యాయికారూపమున నుపదేశించిన భగవంతులును, జగద్గురువులును, నగు మైత్రేయులకు సాష్టాంగప్రణామమర్పించి సెలవు తీసికొని జ్ఞాతులగు పాండవులను జూచుటకు హస్తినాపురమున కేగెను.

---

హరిః ఓమ్.

శ్రీ గురుభ్యో నమః.

# పంచమస్కంధసారము.



చరణౌ శరణీకుర్మః శ్రీమన్నారాయణప్రభోః,
అపి శ్రీవిశ్వనాథస్య పరమానందదాయినః.

సోదరులారా:—

## ౧౮. పంచమస్కంధసంగ్రహము.

అయిదవస్కంధములో, సృజింపఁబడిన లోకముల మర్యాదాపాలనమనుష్ఠానము వివరింపఁబడినది. ఏకర్మముచే నెవరేలోకములో నెంతవఱకుండవలయునో యాయేర్పాటుష్ఠానమనఁబడు. మొదట భూలోకములో జంబూద్వీపములోనుగాఁగల యేడుద్వీపములుగలవనియు, వానిని స్వాయంభువమనువుకొడుకగు ప్రియవ్రతుని వంశపు రాజులు పాలించిరనియు, వర్ణించి, దేవలోకమును దేవతలు

పాలించువిధము, పాతాళలోకమును రాక్షసులేలు తెఱఁగును, బిదప శుకులు రాజునకుఁజెప్పిరి.

౨౯. ప్రియవ్రత చరిత్ర.

జంబూద్వీపములోఁ దొమ్మిదిఖండము లేర్పడియున్నవి. దానినిం బ్రియవ్రతునిఁ గొడుకగు నాభిపరిపాలించెను. ప్రియవ్రతుఁడు మొదట నధ్యాత్మజ్ఞాననిష్ఠుఁడై, తర్వాత గృహస్థుఁడై, పిదప సర్వసంగపరిత్యాగముఁ జేసి, పరిపాకజ్ఞానముచే ముక్తుఁడైనట్లు వర్ణింపఁబడినది. ఇందు వలన నధ్యాత్మనిష్ఠుఁ డైనను గృహస్థాశ్రమము నవలంబించి యజ్ఞులగు లోకులను ఋజుమార్గంబునఁ బ్రవర్తింపఁ జేయుట కర్తవ్యమని యరయనగు. దీనికి ధ్రువపృథు ప్రాచేతసాదులు గూడ దృష్టాంతములు.

౩౦. ఋషభ దేవాచారము.

ప్రియవ్రతవంశమునం దుదయించిన ఋషభదేవుఁడు భగవదవతారము. బహుకాలము జంబూద్వీపాధిపత్యముఁ జేసి బ్రహ్మావర్తమందు సకలజనుల కధ్యాత్మవిద్య నుపన్యసించి పిదపఁ దా నవధూతవేషమునొంది బాలోన్మత్తపిశాచములవలె సంచరించుచుఁ బరిపూర్ణబ్రహ్మనిష్ఠుఁ డిట్లుండవలయునని యవధూతాశ్రమధర్మమును బ్రదర్శించిరి. ఈయాచారముం జూచి కొందఱు మందజ్ఞులు

జైనాదిమతములను గల్పించెను. సాధ్యావస్థలో నుండఁ
దగినధర్మమును సాధనావస్థలోఁ గనఁబఱచుచున్నారు.

### ౩౧. జడభరతకథ.

భూమి నేడు దీవులుగఁ బ్రియవ్రతుఁ డేర్పఱచి, దానిని
దన యేడుగురు కొడుకుల కిచ్చెను. నాభి యను కొడుకు
జంబూద్వీపమును పాలించినపిదప నతని కొడుకగు ఋషభ
స్వామి దాని నేలి నూఱుగురుకొడుకులఁ గనెను. జ్యేష్ఠ
పుత్త్రుఁడగు భరతునకు భూమిలోని తొమ్మిదవ భాగమగు
భరతవర్షము నిచ్చెను. అంతకు ముందుదాని నజనాభవర్ష
మందురు. ఆభరతుఁడు పరమభాగవతుఁడు. భగవత్ప్రీత్యర్థ
ముగ ననేకయజ్ఞములఁ జేసి శుద్ధచిత్తుఁడై కొడుకులకుఁ
దనరాజ్యము విభజించి సాలగ్రామక్షేత్రమందుఁ దపమొ
నరించి యచట హరిణశిశుసంగముచే హరిణజన్మ
మొంది భగవత్ప్రీభావముచే జాతిస్మరుండై యుండి మృగ
శరీరావసానమందు బ్రాహ్మణజాతియందుఁ బుట్టి యాజన్మ
మందు లోకసంగమునకు భయపడి జడునివలె సంచరించు
టచే జడభరతుఁడను పేరు నొందెను. అట్టిసమయములో
సౌవీరరాజగు రహూగణుఁడు కపిలాశ్రమమునకుఁ బోవు
చో నతనిని వెట్టిబోయిగఁ బట్టుకొని శిబికావాహకునిగ
(సవారిబోయలు) నేర్పఱచుకొని, యటుతరువాయి నతని

వలనఁ దత్త్వోపదేశమును భవారణ్యోపదేశమును బొంది కృతార్థుఁడై చనెను. సంసారి, వర్తకుఁడనియు, సంసారము వలన దుఃఖముగలుగుననియు, విశ్రాంతిఁబొందినచోసుఖము గలుగుననియు, హరిభక్తివలన జ్ఞానమునొంది సంసారాటవిని దాఁటవలసినదనియు, మనుష్యజన్మమందు భాగవత సమాగమము గలుగుఁ గాన నితరజన్మములకంటె నది శ్రేష్ఠమనియు, జడభరతుఁడు బోధించెను. ఈచరిత్రము జ్ఞాని యన్యసంగముచేయఁగూడదనియు,జ్ఞానాతిశయమును వెలుపలికిఁ దెలుపక సంచరింపవలయు ననియుఁ, దెలుపును. భవాటవివర్ణనము, తత్త్వోపదేశము, సొంపుగనున్నవి.

### ౩౨. భారతివర్షము.

మఱియు, భారతవర్షమువలె,మేరు మొదలగువర్షము (దేశము)లుగలవు. వానిలోనుండు హరియవతారముల యొక్కయు, వారి భక్తులయొక్కయు, మర్యాదాపాలనంబును, కృత్యములును, వర్ణింపఁబడినవి. ఆయావర్షంబున కొకహరియవతారముగలదు. వారిభక్తులు వానిమంత్రముల జపించుచుఁ గొలుతురు.వారాదేశవాసుల క్షేమము కొఱకుఁ దపంబుఁ జేయుదురు. మన జన్మభూమి యగు భారతవర్షంబునకు నారాయణుఁడు దేవత, నారదుఁడు భక్తుఁడు. వారు మనసంరక్షణమునకును, వృద్ధికిని, దపంబు కల్పాదినుండి చేయుచున్నారు.

## ౩౩. ఇతరవర్షములు.

| వర్షనామము.— | దేవతానామము.— | భక్తనామము.— |
| --- | --- | --- |
| ౧ ఇళావృతము | సంకర్షణుఁడు | భవుఁడు |
| ౨ భద్రాశ్వము | హయగ్రీవుఁడు | భద్రాశ్రవుఁడు |
| ౩ హరివర్షము | నరసింహుఁడు | ప్రహ్లాదుఁడు |
| ౪ కేతుమాలము | కామదేవుఁడు | లక్ష్మి |
| ౫ రమ్యకము | మత్స్యావతారము | రమ్యకమనువు |
| ౬ హిరణ్మయవర్షము | కూర్మము | ఆర్యముఁడు |
| ౭ ఉత్తరకురువర్షము | యజ్ఞవరాహరూపము | భూతధాత్రి |
| ౮ కింపురుషవర్షము | శ్రీరామచంద్రుఁడు | హనుమంతుఁడు. |

కింపురుషవర్షములో శ్రీరాములవారు భార్యతోను, తమ్మునితోను, భక్తాగ్రేసరుఁడగు హనుమంతునితోను, నుండి, యాప్రజలను రక్షించును. దానినే యుత్తరకోసలమని వాడుదురు. కలియుగములో శ్రీరామకృష్ణులభక్తిపూజలు భారతఖండములో మెండుగనున్నవి.

## ౩౮. సూర్యాదిగోళములవర్ణనము.

అనంతరము సూర్య చంద్ర నక్షత్రమండలముల వివరము, తత్పాలనాక్రమము వివరింపఁబడి పిదప స్వర్గ పాతాళనరకలోకములవిశేషములు గూడ నొక్కి వక్కాణింపఁబడినవి. మొదట నర్చిరాదిమార్గక్రమంబున బ్రహ్మలోకంబు సాధించి యతనితోఁడఁ గల్పాంతమున ముక్తి నొందవింపఁజాలినవివృత్తిమార్గంబు బోధించి, యటఁ బ్రకృతిలయంబుఁ గానక భోగార్థంబు మాటిమాటికి దేహారంభముతో స్వర్గాదిభోగములఁ గల్పింప నోపుప్రవృత్తిపథంబున ధర్మలక్షణంబులయిన నానానరకములను శుకులురాజునకుబోధించెను. వానివివరము మత్కృత బ్రహ్మసూత్రసారమునఁ జూడనగు. పిదప స్వాయంభువ మన్వంతర చరిత్రమును ప్రియవ్రతోత్తానపాదులవంశంబులను ద్వీపవర్ష గిరిసరిత్సముద్రాదిలక్షితం బైనక్షితిమండలంబునఁ గలుగులక్షణంబును సన్నివేశంబును జ్యోతిర్గణలోకస్వరూపంబు నధోలోకముల ప్రకారంబును సర్వేశ్వరుం డెట్లు సృజించి పాలించె నాభంగియు వివరింపఁబడెను.

---

హరిః ఓమ్.

శ్రీ గురుభ్యో నమః.

# షష్ఠస్కంధసారము.



చ. ఏవిభువందనార్చనము
    లేవిభుచింతయు నామకీర్తనం
భేవిభులీల లద్భుతము
    లెప్పుడుః సంశ్రవణంబు సేయు దో
షావళిఁ బాసి లోకము శు
    భాయతవృత్తిఁ జెలంగునండ్రు నే
నావిభు నాశ్రయించెదన
    ఘౌఘనివర్తను భద్రకీర్తనున్.

శ్లో. గురూన్ భాగవతాన్ విష్ణో
    రవతారాన్ భజామ్యహం,
కృష్ణం వందే కృపాసింధుం
    గోపీనాం ప్రాణవల్లభం.

సోదరులారా!

### ౩౫. షష్ఠస్కంధసంగ్రహము.

ఈ యాఱవస్కంధములోఁ బోషణము వివరింపఁబడె. అనఁగా భగవంతుఁడు మర్త్యస్వర్గపాతాళలోకములలో నున్న తనభక్తులను రక్షించు ప్రకారము వర్ణింపఁబడెను.

### ౩౬. అజామిళోపాఖ్యానము.

నానాయాతనలకు మూలంబైన నరకంబులం బడక తప్పించుకొనుటకు బ్రహ్మచర్య తపశ్శమదమ త్యాగసత్యకృచ్ఛ్ర చాంద్రాయణాదిప్రాయశ్చిత్తములు మన్వాదిధర్మశాస్త్రములలోఁ జెప్పఁబడినవి. హరింజేయువారవిద్యావంతులగుటంజేసి యవి పాపహరములయినను, నాత్యంతికముగఁ బాపక్షయమును జేయనేరవు. సేతుయాత్రాదికము వలన నంతకుముందుఁ జేసినపాపము పోయినను, బిదపఁ దిరిగిఁ బాపముఁ జేయునిచ్ఛగలుగును. మఱియుఁ, బాపముఁ జేయును. కానఁ బాపకర్మముఁ జేయవలయునను నిచ్ఛయను వాసన, మన్వాదులచేఁ జెప్పఁబడిన ప్రాయశ్చిత్తముచేఁ జావదు. కానఁ బాపమునకుఁ బునఃప్రవృత్తిగలుగకుండ మూలధ్వంసంబుఁ గావింపఁగ జ్ఞానమొక్కండె పరమప్రాయశ్చిత్తంబు. తత్ప్రాప్తికొఱకు వాసుదేవపరాయణులయిన కొందఱు జ్ఞానాఖ్యమగు కేవల (అనన్య)

భక్తిచే సూర్యుఁడు హిమంబు నెట్లట్లుపాపముల మూల ముట్ట నిర్దహింతురు. తనప్రాణములను శ్రీకృష్ణున కర్పించిన భక్తుఁడు భాగవతసేవ నఖిలపాపములను బాపపాపనలను హరించినట్లు, నరుఁడు తపస్సుమున్నగువానిచే హరింపఁజాలఁడు. పుణ్యనదు లితరపావనత్వంబుఁగలిగింపఁజాలియు సురాభాండంబునకు శుద్ధిఁగావింపనికైవడి ఋషిప్రోక్తనానాప్రాయశ్చిత్తములు నియమమున నాచరించినను విష్ణుపరాఙ్ముఖునకు శుద్ధి గావింపనేరవు. కాన భక్తివలనఁ జిత్తశుద్ధియు,ననుభవజ్ఞానమును,నలవడు. భగవద్భక్తిగాని, భాగవతభక్తిగాని, వృద్ధికాఁగా. దానికి విరోధములగు రజస్తమోగుణప్రయుక్తములగు మనోవాక్కాయకృత్యములు మూలములతో నశించి, చిత్తముయొక్క స్వభావమగు సత్వము వృద్ధినొందఁగఁ జిత్తము శుద్ధియగును. అప్పుడు గురూపదేశముచే సంకురించిన బ్రహ్మాత్మైక్యజ్ఞానము సాధనాభ్యాసముచే ననుభవజ్ఞానముగఁ బరిణమించు. కాన వాసనలతోఁగూడిన పాపము విష్ణుభక్తిపోఁగొట్టు నను నంశమును నజామిళోపాఖ్యానమను ప్రాచీనకథ ప్రదర్శించుచున్నది. మఱియు మన్వాదికృత ప్రాయశ్చిత్తములు వ్యవస్థితములు,వర్ణాశ్రమభేదప్రయుక్తములు. భగవద్భక్తియందు సర్వప్రాణులు నధికారులు. మన్వాదికృతప్రాయశ్చిత్తములవలన నాత్మ

జ్ఞానము కలుగదు. వాసుదేవభక్తివలన విరక్తిజ్ఞానములు పుట్టును. ఈభక్తి నరుఁడు చరమకాలమందుఁ జేసినచో నది క్రమముగ ముక్తిదాయకమనియుఁగూడ నీకథవలనను, గీతాష్టమాధ్యాయమువలనను, నరయనగు. అట్టిభక్తికి ముఖ్యకారణము భగవత్కృపాలేశము, లేక భాగవతుల దయ, యని నారదు లీతీరున సూత్రము రచియించిరి:—"ముఖ్యతస్తు మహత్కృపయైవ భగవత్కృపాలేశాద్వా". నారదాదులకు మహాత్ముల యనుగ్రహమువలన హరిభక్తి వృద్ధియయినది, గోపికలకు భగవద్దయచేతనే యయినది. కావననే శ్రీశంకరాచార్యులు, "దుర్లభం త్రయమేవైతద్దైవానుగ్రహహేతుకం, మనుష్యత్వంముముక్షుత్వం మహాపురుష సంశ్రయః" అని మహాత్ములయనుగ్రహము గలుగుట దుర్లభమని సెలవిచ్చిరి.

అజామిళోపాఖ్యానమువలన నింకొక విషయము గ్రహింపనగు. విష్ణునామములందు హరిశక్తులన్నియు నున్నవి. వానిని విననప్పుడనే హరిరూపగుణాదులు జ్ఞప్తికివచ్చి, యట్టిగుణాదులను సంపాదించుటకు భక్తుఁడు యత్నించును. ఆయత్నముచే దానికివిరుద్ధములగు దుష్టసంకల్పాదులు నశించును, వీనివివరములు Mr. A. Besant's 'The Path of Discipleship and In the Outer Court'

లోనగు నింగ్లీషు గ్రంథములలోను బ్రహ్మశ్రీ వంజుంషప్ప రామయ్యగార్ల తెలుఁగుగ్రంథములలోను నరయునగు. చావఁబోవు నప్పుడు హరినామ కీర్తనాదికము పాప క్షయకరమని విష్ణుదూతలచేతను, యమునిచేతను, యమ దూతలకీ కథలోఁ జెప్పఁబడినది. యాదృచ్ఛికమగు నామ కీర్తనమునకే యింత ఫలమున్నపుడు శ్రద్ధాభక్తులతోఁ గూడిన నామకీర్తనాదికమమితఫలదాయకమని యూ చింపనగునని కూడ నీకథవలనఁ దెలియనగు. హరినామ కీర్తన ప్రధానముఁజెప్పిన శ్రుతిస్మృతీతిహాసపురాణ వచనము లనంతములు గలవు. అవి కేవలస్తుతివాక్యములని తలంపవీలులేదు. ఆవాక్యముల సన్నిధినిఁ గర్మాదివిధాయక వాక్యములు గనఁబడవు. నామకీర్తన మవశ్యకర్తవ్యమని విధినిఁ గల్పించికొని యీవాక్యములావిధికినర్థవాదము లని నిశ్చయింపవలయునని శ్రీధరస్వామిమొదలగు భాగ వతవ్యాఖ్యాతలు సెలవిచ్చిరి. శ్రీకృష్ణచైతన్యుల యభిప్రా య మేమనః—'నామ్నామకారి బహుధా నిజసర్వశక్తి స్తత్రార్పితానియమితః స్మరణేన కాలః, ఏతాదృశీతవ కృపాభగవన్ మమాపి దుర్దైవ మీదృశ మిహాజనినాను రాగః'. కలియుగమందు హరిసంకీర్తన మావశ్యక మని భారతభాగవతముల వలనను, మహారాష్ట్రభక్తుల చరిత్ర ములవలనను, శ్రీశంకరాచార్యకృత విష్ణుసహస్రనామ

భాష్యమువలనను, శ్రీకృష్ణచైతన్యాదుల యాచారమువలనను, స్పష్టము. "సకృన్మనః కృష్ణపదారవిందయోర్నివేశితం తద్గుణరాగి యైరిహ, న తే యమం పాశభృతశ్చ తద్భటాన్ స్వప్నేపి పశ్యంతిహిచీర్ణనిష్కృతాః." (భా. 6-1-19). దీని యనేకార్థము లారసియాచరించి ధన్యులగుదురుగాక.

### ౩౭. భాగవతుల లోకపాలనరీతి.

శ్రీమైత్రేయ, విదుర, ఉద్ధవ, నారదాంగిరస, వ్యాస, శుక, సూత, నారాయణ, సనత్కుమార, విష్ణుదూత, యమ, హార్యాదినవజాయంతేయులచరిత్రలవలన ముఖ్యముగ మనమరయఁ దగిన విషయమేమన:—భగవంతుం డెట్లని భక్తులకుఁ గూడ నగపడకుండ లోకోపకార మెట్లుచేయుచున్నాఁడో, యట్లే వాని భక్తాగ్రేసరులగు భాగవతులు గూడ సామాన్యజనులకగపడక యవ్యక్తచిహ్నములతో లోకమున సంచరించుచు, యోగ్యులగు శిష్యులకు భక్తిజ్ఞాన కర్మ వైరాగ్యము లుపదేశించి వారిమూలమునలోకోపకారముఁ జేయుదురు. అందులకే వారు జీవించుట. కావున వారి త్రోవ ననుసరించుటమనకుఁ గర్తవ్యము, జన్మసాఫల్యము. ఈవిషయము తృతీయస్కంధసారములోఁ జూడనగు. జీవన్ముక్తులగు నాధికారికులు భాగవ

తో _త్తములు. స్థూలసూక్ష్మరూపంబైన యీవిశ్వ మెల్ల భగవద్రూపంబనియు నయ్యది యెల్లందమకు వ్యతిరిక్తంబు గాదనియుం జూచుచు నప్రతిహతాభిమతగతిం జేసి సుర సిద్ధ సాధ్య గంధర్వ యక్ష నర కిన్నర నాగ ముని చారణ భూత విద్యాధర ద్విజ గో లోకంబుల లోకరక్షణార్థముం ద్రిమ్మరుదురు.

"అవ్యాహతేష్ట గతయస్సుర సిద్ధసాధ్య
గంధర్వ యక్షనరకిన్నర నాగలోకాన్,
ముక్తాశ్చరంతి మునిచారణ భూతనాథ
విద్యాధర ద్విజగవాంభువనాని కామమ్."

(భా. 11-2-23)

"జనస్యకృష్ణాద్విముఖస్య దైవా
దధర్మశీలస్య సుదుఃఖితస్య,
అనుగ్రహాయేహచరంతినూనం
భూతాని భవ్యాని (మంగళకర = పరోపకార
శీలాని) జనార్దనస్య." (3-5-3)

"విష్ణోర్భృత్యా స్వభృత్యార్థ కృతశ్చరంతి." (3-4-25)

నారదం ప్రతిధ్రువవాక్యం.

"నూనంభవాన్ భగవతో యోంగజః పరమేష్ఠినః,
వితుదన్నట తేవీణాంహితాయజగతోஉర్కవత్" (4-8-41)

యమవాక్యం.

"ప్రాయేణదూతా ఇహవై మనోహరా
శ్చరంతి తద్రూపగుణస్వభావాః,
భూతానివిష్ణోస్సురపూజితాని దుర్దర్శలింగాని
రక్షంతి తద్భక్తిమతః పరేభ్యో
మత్తో మర్త్యానథ సర్వతశ్చ." (6-3-17-18)

చిత్రకేతువాక్యం.

"ఏతే (మైత్రేయాదయః) పరేచసిద్ధేశా
శ్చరంతి జ్ఞానహేతవః." (6-15-19)

విదేహవాక్యం.

"విష్ణోర్భక్తాహిలోకానాం పావనాయ చరంతిహి"
(11-2-28)

వీరందఱు యోగమహిమచే నంతర్ధాన బహి ర్ధానములను బొందఁగలరు. భాగవతాది పురాణము లలో భగవంతులు, భాగవతులు, నాధికారికులు, నరు లకుఁ గనపడిబోధించి తిరిగి యంతర్భావముఁ బొందినట్లు న్నది. అట్టి సిద్ధులెట్లు గలుగునో దానివివరములు యోగ శాస్త్రమందును, దివ్యజ్ఞానసమాజకుల గ్రంథములం దును వ్యక్తీకరింపఁబడినవి. కానియాధికారికులగు దేవ తలయొక్కయు, భాగవతులగు నారదాదులయొక్క నడ

తలలో నొకభేదము గలదని వసుదేవుఁడు నారదునకుఁ జెప్పెను:—'దేవచరితము భూతములకు సుఖమును దుఃఖమునుం గావించు. అచ్యుతాత్ములగు మీయట్టిసాధువుల చరిత్రయన్ననో కేవలసుఖార్థమే'='భూతానాం దేవచరితం దుఃఖాయచసుఖాయుచ, సుఖాయైవహి సాధూనాం త్వాదృశామచ్యుతాత్మనాం'(11-2-5). ఇట్టిసాధువులును, అధికారికులును, నగుమహాత్ములు, వైవస్వతమనువు, ఇంద్రుఁడు, మైత్రేయుఁడు, మరువు, దేవాపి, క్రైస్టు, మహమ్మదు, లోనగువారు. వారిప్పటికిని లోకోపకారముఁ జేయుచున్నట్లువారిశిష్యులగు బ్లావెట్స్కీ సుబ్బారావు ఆల్కాటు అనిబెసెంటు లెడ్బీటరులోనుగాఁగల మహనీయులవలన మనమువినియుంటిమి గద. మనలోఁ గొందఱకు వారిలోఁ గొందఱు దర్శనము గూడ నిచ్చిరిగద. మన యిష్టదేవతనుగూర్చి ప్రార్థించినను, భగవంతుల శిష్యులగు భాగవతులలో నొకరుగాని కొందఱుగాని మనయక్కఱలను దీర్తురు. ఇప్పుడు జరుగుచున్న ఐరోపా ఘోరయుద్ధములోను, జలాగ్నిలయముల లోను, నట్టిమహనీయులు వచ్చి మృతినొందువారి కుపశమనముఁ జేయుదురని లెడ్బీటరుగారు (The Invisible Helpers, In the Inner Life and The Hidden Side of Things) లోనుగాఁగల గ్రంథములలో వ్రాసిరి. దానిని భారతభాగవతాది గ్రంథములుఁగూడ బలపఱచుచున్నవి. దేవాపిమున్నగుమహాత్ములీపనిని ఐరోపాయుద్ధములోఁ జేయు

చున్నారు. ఈకారణములో బ్రిటిషు ఫ్రెంచివారిపట్టున ధర్మా భివృద్ధికొఱకు లోకోపకారము చేయుచున్న దైవీసంపత్తు గలమహాత్ములు సహాయము చేయుచున్నారు. అధర్మాభి వృద్ధికొఱకుఁ బాటుపడు నాసురసంపత్తిగలరాక్షసులు జర్మ నువారికి సాయపడుచున్నారు. 'ధర్మోజయతి,' యనున్యా యానుసారముగఁ దుదకు మన బ్రిటిషు ఫ్రెంచి లోనగువా రే జయలక్ష్మినిఁ బొందుదురని మహాత్ములశిష్యులు సెలవిచ్చిరి. దానిని బాహ్యసూచనలుగూడ బలపఱుచుచున్నవి. ఈ యన్ని హేతువులచే భగవంతుఁడగు పతంజలిఋషి యోగ శాస్త్రమందు "ఈశ్వరప్రణిధానాద్వా వీతరాగవిషయం వాచిత్తం," (1-1-23,237) అనుసూత్రములలో నీశ్వరుని గాని కృష్ణద్వైపాయనాదులగుమహాత్ములనుగాని ధ్యానిం చినఁ జిత్తమందు రజస్తమములు పోయి చిత్తము శుద్ధ సత్త్వమయమయి యేకాగ్రత నొందునని సెలవిచ్చిరి. కాన మహాత్ములగు మైత్రేయమరుదేవాపి మున్నగు ఋషు లను, వారిశిష్యులను, మనోవాక్కాయములచే సేవించి వారియాజ్ఞానువర్తులయినచో సకల పురుషార్థములు సమ కూడు,జన్మసాఫల్యమగు,లోకమునకు మహోపకారమగు.

౩౮. దక్షోపాఖ్యానము.

చాక్షుషమన్వంతరమందు దక్షప్రజాపతి పదుగురు ప్రచేతసులకు మారిషయందు జన్మించి సృష్టిచేయుటకై తపంబుఁజేసి భగవదనుగ్రహంబున హర్యాశ్వులను పదివేలమంది కొడుకులఁగనెను. వారు నారదునివలనఁ దత్త్వోపదేశముఁ బొంది నివృత్తిమార్గపరులయిరి. తిరిగి శబలాశ్వులగు పదివేలమంది దక్షునకుఁ గలిగిరి. వారుగూడ నారదోపదేశము నొంది నివృత్తిపరులైరి. అంతనలిగి దక్షుఁడు నారదునకు శాపమిచ్చెను. తదనంతరము దక్షుఁ డఱువదిమంది కూఁతులను గని వారివలనఁ జరాచరప్రపంచమును బుట్టించెను. ఇది మైథునసృష్టి. ఇంతకుఁబూర్వము మానససృష్టి—సంకల్పముననే సృష్టిజరిగెను. ఈకథవలనఁ బ్రవృత్తిపరులకు నివృత్తిమార్గ ముపదేశింపఁగూడదని యరయనగు. దక్షాదుల స్తోత్రములలో నద్వైతతత్త్వఘుంపుగ వర్ణింపఁబడెను.

౩౯. ఇంద్రోపాఖ్యానము.

దేవలోకాధిపతియగు నింద్రుఁడైశ్వర్యగర్వముచేఁ దన పురోహితుఁడగు బృహస్పతియెడ ననాదరముఁ జేసి నందున నతఁడింద్రునిఁ ద్యజించెను. అందుచే నసురు లింద్రునిరాజ్యము గొల్లఁగొనిరి. అపుడు దేవతలసురుఁడగు విశ్వరూపునిం బురోహితుఁగ నియమించుకొని, యతని

వలన హయగ్రీవ బ్రహ్మవిద్యయగు నారాయణకవచమును
గ్రహించి, దానిచే నసురులను జయించి తమరాజ్యమును
దిరిగి సంపాదించిరి. తదనంతరము విశ్వరూపుఁడు యజ్ఞ
ములను జేయించునపుడు ప్రత్యక్షముగ దేవతలకుఁ బరో
క్షముగ దైత్యులకు హవిర్భాగములనిచ్చెను. అందుచే
నింద్రుఁడు కోపించి విశ్వరూపునిఁ జంపెను. దానివలన
బ్రహ్మహత్యాదోషమింద్రునకుఁ గలిగెను. దీనిని భూజల
వృక్షస్త్రీలయందుఁ బ్రవేశపెట్టి వారికింద్రుఁడు వరముల
నొసంగెను. విశ్వరూపునితండ్రియగు త్వష్టయాభిచారిక
ముఁజేసి యింద్రసంహారార్థమై వృత్రాసురునిఁబుట్టించెను.
వాని జయించుటకు శ్రీహరియాజ్ఞచే నారాయణ
కవచనిష్ఠుఁడగు దధీచిని బ్రార్థించి వానియస్థులచే వజ్రా
యుధమును నిర్మించుకొని వృత్రుని నింద్రుఁడు పరిమా
ర్చెను. వృత్రుఁడు భగవత్తత్త్వమును బోధించుచు మడి
సెను. కాన హరియనుగ్రహముచే నింద్రుఁడు వృత్రుని
సంహరించి దేవలోకరాజ్యమును దిరిగి సంపాదించెను.
వృత్రుఁడు భగవత్సేవను భాగవతకైంకర్యమును గోరెను.
ఈ కథవలన నైశ్వర్యవంతులయినను గురుధిక్కారముఁ
జేయఁగూడదనియు, సాధుహింసఁ జేయఁ గూడదనియు,
నాపత్కాలమందుఁ గూడ భగవద్భాగవతానుస్మరణము,
కైంకర్యమును జేయవలయుననియు నరయనగు.

## ౪౦. చిత్రకేతూపాఖ్యానము.

వృత్రాసురుఁ డసురయోనియందుఁ బుట్టినను, భగవద్జ్ఞానము గలుగుట కతనిపూర్వజన్మమగు చిత్రకేతుచరిత్రముఁ జెప్పఁబడినది. చిత్రకేతు వనుమహారాజు, కొడుకు చావునకు దుఃఖించుతఱి నారదాంగిరసులచే జ్ఞానోపదేశమునొంది వారి యనుగ్రహమున సంకర్షణ విద్యనుబొంది తదుపాసనమున విద్యాధరాధిపత్యము నొంది విమానసంచారముఁ జేయఁగ శ్రీదక్షిణామూర్తిపార్వతుల నగ్నరూపములను జూచి పకపకనవ్వి పార్వతీశాపమున వృత్రాసురుఁడుగఁ బుట్టెను. కాని చిత్రకేతుఁడు చిత్తవికారము నొందలేదు. కాన, భగవద్ధర్మనిష్ఠులయినను, భాగవతోత్తములగు మహాత్ముల నాక్షేపింపఁగూడదని తెలియనగు. భగవన్మైత్రేయాదులగు సిద్ధేశ్వరులు గూఢరూపములతో లోకోపకారముఁ జేయుటకుఁ బ్రపంచమంతటను దిరిగిక ర్మభక్తిజ్ఞానవైరాగ్యము లుపదేశింతురని గాయుపాఖ్యానములో (భా. 6-14 అ) స్పష్టముగనున్నట్లిదివఱలోఁ జెప్పియుంటిని గద. మఱియుఁ జిత్రకేతువు సంపత్తులో నాపత్తులో నేకరూపముగఁ జిత్తవికారము లేనివాఁడుగనున్న ధీరుఁడని మహాదేవుఁడు స్తుతించెను. "వికారహేతౌసతి విక్రియంతే యేషాంనచేతాంసితఏవధీరాః" యను కాళిదాసవాక్యము స్మరణమునకుఁ దెచ్చికొని ప్రవర్తింపవలయు.

౪౧. సవితృవంశమరుద్గణపుంసవనవృత్తాంతములు.

పిదప సవితృప్రభృతుల వంశమును, సప్తమరుద్గణ జన్మప్రకారంబు, విష్ణుప్రీతికరంబగు పుంసవనవ్రతవిధానమును, వివరింపఁబడెను.

శ్లో. చేతోదర్పణమార్జనం భవమహా
దావాగ్నినిర్వాపణం
శ్రేయఃకైరవచంద్రికావితరణం
విద్యావధూజీవనం
ఆనందాంబుధివర్ధనం ప్రతిపదం
పూర్ణామృతాస్వాదనం
సర్వాత్మస్నపనం పరం విజయతే
శ్రీకృష్ణసంకీర్తనమ్.

---

హరిః ఓమ్.

శ్రీగురుభ్యోనమః.

# సప్తమస్కంధసారము.



శ్లో. క్వాహం బుద్ధ్యాది సంరుద్ధః
క్వచ భూమా మహాంస్తవ,
దీనబంధో దయాసింధో
భక్తిం మే నృహరే దిశ.

శ్లో. చరణం స్మరణం ప్రేమ్ణా
తవదేవసుదుర్లభం,
యథాకథంచిన్నృహరే
మమభూయాదహర్నిశమ్.

శ్లో. ప్రహ్లాద నారద పరాశరపుండరీక
వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యా౯,
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీ౯
పుణ్యానిమా౯ పరమభాగవతా౯ స్మరామి.



సోదరులారా !

౪౨. సప్తమస్కంధసంగ్రహము.

సప్తమస్కంధాదిలో, "ఊతుల" వర్ణనముగలదు. ఊతులనఁగఁ బూర్వజన్మకర్మము ననుసరించి, నేనుకర్తను, నేను భోక్తను, నను సంస్కారములగు వాసనలు. వర్ణాశ్రమధర్మముల వివరముగూడ నీస్కంధాంతమందుఁ జేయఁబడె. ఈస్కంధములోని 15 అధ్యాయములలోఁ గర్మభక్తిజ్ఞాన వైరాగ్య ముక్తిస్వరూపములు సహేతుకముగను, మనోహరముగను, సంక్షేపముగను, వర్ణింపఁబడెను గాన నది పఠనీయము, మఱియు నాచరణీయము. వాసనలు రెండువిధములు:—అశుభములు, శుభములు. వీని వివరములు యోగవాసిష్ఠములోను, జీవన్ముక్తివివేకములోను, జూడనగు. క్రమముగ నవి మహాత్ముల నిగ్రహానుగ్రహములచేఁ గలిగి పురుషప్రయత్నముచే వృద్ధుల నొందుఁ గాన సత్సంగ మవశ్యకర్తవ్యము. జయవిజయులు భగవద్ద్వారపాలకులయ్యును, బ్రహ్మమానసపుత్త్రులగు సనకాదులశాపముచే నసురవాసనలనుబొందిరి. అసురబాలకుఁడైన ప్రహ్లాదునకు నారదానుగ్రహమున శుభవాసన లబ్బెను. పూర్వజన్మపుణ్యాపుణ్యకర్మము లీజన్మమందలి

శుభాశుభ వాసనలకుఁ గారణములు. కాననే చిత్రకేతువు "దేవైర్న్యాయయతోఽప్యక్తం పూర్వదిష్టం హితస్యతత్" అని భవాసితోఁననెను (6-17-7). ఏడవస్కంధములోని మొదటిపది యధ్యాయములలో శుభాశుభ వాసనల కారణ స్వరూపఫలములు వర్ణింపఁబడినవి. కడపటి యయిదధ్యాయములలోఁ బుణ్యాపుణ్య కర్మకారణ స్వరూప ఫలములు వివరింపఁబడినవి.

## ౪౩. ప్రహ్లాదచరిత్రము.

మొదటిది ప్రహ్లాదచరిత్రము. అదిను ప్రసిద్ధముగద. ప్రహ్లాదకథ భగవద్భక్తివర్ధనములలో నత్యుత్తమము. ప్రేమభక్తియే యతని స్వరూపము. సనకసనందనాదులు ప్రహ్లాదులుగ జన్మించిరని చెప్పియుంటిమి గద. వారిశుభవాసన కుద్భోధము గలుగుటకును, "ఆచార్యవాన్ పురుషో వేద" యను న్యాయపరిపాలనముకొఱకును, నారదోపదేశము ప్రహ్లాదునకు గర్భమున నుండఁగనే చేయఁబడెను. అతని గుణవిశేషము లనేకవిధముల వర్ణింపఁబడినవి. తండ్రి యెన్ని బాధలుపెట్టినను, సహించి విష్ణుసర్వవ్యాపకత్వాదిగుణముల నీతీరున వర్ణించెను:—

మ. కలఁ డంభోధిఁగలండుఁ గాలిఁగలఁ డా
కాశంబునం గుంభినిం

గలఁ డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్
ఖద్యోతచంద్రాత్ములన్
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలిం
గవ్యక్తులంబంతటం
గలఁ డీశుండు గలండు తండ్రి వెదకం
గానేల నీ నాయెడన్.

క. ఇందుఁగలఁ డందు లేఁడని
సందేహమువలదుచక్రి సర్వోపగతుం
డెందెందువెదకిచూచిన
నందందేకలఁడు దానవాగ్రణివింటే.

పిదప స్తంభంబున నిట్లుహరినింజూపెను.

మ. అంభోజాసనుఁ డాదిగాఁగఁదృణప
ర్యంతంబువిశ్వాత్ముఁడై
సంభావంబుననుండుప్రోడవిపుల
స్తంభంబు నందుండఁడే
స్తంభాంతర్గతుఁడయ్యునుండుటకునే
సందేహమున్ లేదు ని
ర్దంభత్వంబుననేఁడు గానఁబడుఁ బ్ర
త్యక్షస్వరూపంబునన్.

వ. అంత.

మ. హరిసర్వాకృతులం గలండనుచుఁ బ్ర
హ్లాదుండుభాషింప స
త్వరుఁడై యెందును లేఁడు లేఁడని సుతుం
దైత్యుండు తర్జింప శ్రీ
నరసింహాకృతి నుండెనచ్యుతుఁడు నా
నాజంగమస్థావరో
త్కరగర్భంబుల నన్నిదేశముల ను
ద్దండప్రభావంబునన్.

అంతకుఁ బూర్వము హిరణ్యకశిపుఁ డుగ్రతపంబాచరించి బ్రహ్మవలన సకలైశ్వర్యఫలముల నొంది వాని ననుభవించె. ఆయైశ్వర్యమదముచేఁ దానే యీశ్వరుఁడని భ్రమఁజెందెను. కాని యితరలౌకికాలౌకికవిషయము లన్నియుఁ దెలిసినవాఁడె. హిరణ్యాక్షుఁడు పోయినందులకు దితిశోకించిన నామెకుఁ జక్కఁగవిరక్తి నుపదేశించి యూరడించెను. ప్రహ్లాదచరిత్ర, విష్ణుపురాణములోను భాగవతములోను యోగవాసిష్ఠములోను మనోహరముగ వర్ణింపఁబడెను. గుణోపసంహారన్యాయము ననుసరించి యీ మూఁడువర్ణనలు మనకు గ్రాహ్యములు. "యస్య ప్రసాదాదహమేవవిష్ణుః మయ్యేవ సర్వంపరికల్పితంచ, ఇత్థంవిజానామిసదాత్మరూపం తస్యాంఘ్రిపద్మం ప్రణతో౽స్మి నిత్యం" (వాక్యవృత్తి.) "విముంచతి యదా కామాన్ మానవో మనసిస్థితాన్, తర్హ్యేవపుండరీకాక్ష

భగవత్త్వాయకల్పతే," (భా 7-10-10), "నా౽విష్ణుః విష్ణుమర్చయేత్" (యోగవాసిష్ఠే) .లోనగు వర్ణనలు ప్రహ్లాదుఁడద్వైతి యనిచెప్పినను, నతఁడు భగవత్కైంకర్యదాసత్వములందును లోకోపకారకత్వములయందును బద్ధకంకణుఁడై.—

"ప్రాయేణ దేవమునయస్స్వవిముక్తికామా
మౌనంచరంతి విజనేనపరార్థనిష్ఠాః,
నైతాన్విహాయ కృపణాన్విముముక్ష ఏకో
నాన్యత్త్వదన్యశరణం భ్రమతో౽నుపశ్యే." (7-9-44)

"దేవా,మునులు తమముక్తిని గోరువారై విజనములందుమౌనముఁబూనిదిరుగుచుందురుగానియితరులకు మేలుగలుగవలయునని యత్నింపరు. దీనులగులోకులను విడిచినాముక్తినిమాత్రమే నేనుకోరను. సంసారమునఁదిరుగుడుపడునాదీనజనులకు నీవుదక్కనింకొక్కని శరణంబని తలంపను"ఇట్లుశ్రీనరసింహ దేవునిస్తుతించినట్లు భాగవతములోనున్నదికాన నతఁడు స్మరణదాస్యభక్తులకు దృష్టాంతము. అతఁడు కావించిననృసింహస్తోత్రము భాగవతములో స్తవరాజము. అదిమనసామాజికులు నొక్కిచెప్పు భగవత్కైంకర్యమును లోకసేవను విశేషముగను ననువదించుచున్నది. దానిలో నభిజనధనవిద్యాదులకంటె భగవద్భక్తి యావశ్యకమనియు భగవదర్పణపురస్సరముగఁ గర్మ

ములఁ జేయనగుననియు, భగవదర్పణముతోఁ జేయు పూజాదికము భక్తునియందలి ప్రేమచే భగవంతుఁ డంగీకరించి యాపూజాదిఫలము జీవుల కెంతఁ గావలయునో యంతఁ బంచిపెట్టునుగాని తాననుభవింపఁడనియు, భగవద్దాస్యము, భాగవతసాంగత్యము, భక్తునకు ముఖ్యముగ నుపాదేయములనియు, బహువిశేషములున్నవి. వరములు కోరుమని నృసింహదేవుఁడుగఁ దనకు వరములక్కఱ లేదనియు, లోకముకంటె విజాతీయమగు స్వామిభృత్యత్వమిమ్మనియుఁ,గామలోభాదులు లేకుండఁ జేయుమనియుఁ, దనకపకృతినొనర్చిన తండ్రిని క్షమించి యతనికి మంచిగతి నిమ్మనియు,నడిగెను. మఱియు, ముక్తి తనకక్కఱ లేదనియు స్వార్థత్యాగపూర్వకపరోపకారముకొఱకుఁ దను బాటుపడి దీనులగు తనప్రజలు ముక్తులయ్యెడువఱకు యత్నించి నరహరి యనుగ్రహమున ననన్యచింతతో వారికి ముక్తి సంపాదించెదనని నిశ్చితాభిప్రాయము దెలవిచ్చిన మహాభావులగు ప్రహ్లాదునిగుణములు సాకల్యముగ వర్ణింప నలవియే? కొన్నిహరిభక్తిభూమికలలో వర్ణించితిని. హరియందును, సర్వభూతములందును నేకభావముగల మహాత్ముఁడు. వానిచరిత్రమువలన నరయనగు కొన్ని విశేషములు హరిభక్తి భూమికలలో వివరించితి. భగవన్నింవయు,భాగవతాపచారము, సర్వానర్థకరములని హిరణ్యకశిపు నడత

వలనఁ దెలియనగు. హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జన్మకారణ మిదివఱలో వివరింపఁబడె. వారివైరభక్తిస్వరూపఫలములు దశమస్కంధసారములోఁ జూడనగు.

౭౪. హార్యనుగ్రహంబున రుద్రునికీర్తి యతిశయించుట.

శ్రీహార్యనుగ్రహమున రుద్రునకుఁ ద్రిపురసంహారము లబ్ధమయినట్లును, రుద్రునికీర్తి యతిశయించినట్లును, వర్ణింపఁబడినది.

౭౫. వర్ణాశ్రమధర్మవివరము.

నారదులు ధర్మరాజునకు సాధారణాసాధారణరూపములగు వర్ణాశ్రమధర్మము లుపదేశించి గుణములచేత ముఖ్యముగ వర్ణనిర్ణయముఁ జేయనగునని యీతీరున సెలవిచ్చిరి:—(భా 7-11-34). "యస్య యల్లక్షణంప్రోక్తం పుంసో వర్ణాభిసూచకం, యదన్యత్రాపిదృశ్యేత తత్తేనైవ వినిర్దిశేత్. శమాదిభిరేవ బ్రాహ్మణాది వ్యవహారోముఖ్యః నజాతిమాత్రా దిత్యాహ—యస్యేతి. శ్రీధరటీక:—ఏవర్ణంబునకేలక్షణంబుసెప్పఁబడియె నయ్యదియితరులలోఁ గన్పట్టునేని దాన నతనిఁ దద్వర్ణయోగ్యంగా నిర్దేశింపఁదగు." మఱియు, "తన కులధర్మముఁ విడిచి దానవవైరిపదారవిందముల్, పనివడి సేవఁజేసి పరిపాకము వొందకయెవ్వఁడేని చచ్చిన మఱుమేననైన నది సిద్ధివహించుఁ దదీయ

సేవఁ బాసినఁ, గుల ధర్మగౌరవము సిద్ధివహించునే యెన్నిమేనులకు?"

౪౭. ఆత్మానాత్మతత్త్వము.

నారదులీతీరున ధర్మరాజున కాత్మానాత్మతత్త్వము పదేశించిరి:— "సంకల్పవర్జనంబునఁ గామమును, గామత్యాగమునఁ గ్రోధమును, దృశ్యపదార్థములం దనర్థవిమర్శమున లోభమును, తత్త్వవిచారమున భయమును, నాత్మానాత్మవివేకమున శోకమోహములను, సాధుసేవనంబున దంభమును, మౌనమున యోగాంతరాయములయిన లోకవార్తాదులను, దేహాద్యభిమానత్యాగమున హింసను, కృపచే భూతములవలనిదుఃఖమును, సమాధిచే దైవిక సుఖదుఃఖములను, ప్రాణాయామాదిబలమున దేహజన్యదుఃఖమును, సాత్త్వికాహారాదిసేవనంబున నిద్రను, సత్త్వమున రజస్తమస్సులను, నుపశమమున సత్త్వమును, గురుభక్తిచే సర్వమును, జయింపవలయు. జ్ఞానదీపము నిచ్చిన సాక్షాద్భగవత్స్వరూపుఁడైన గురువు సామాన్యమానవుండను నసద్బుద్ధి చేసిన వాని చదువు కుంజరశౌచంబురీతి నిష్ఫలంబు. లోకము మనుష్యమాత్రుఁగాఁ దలఁచు నీకృష్ణుఁడే సాక్షాద్భగవంతుఁడు" అని నారదులు బోధించె. ఈబోధయొక్కయు, భగవంతులుద్ధవున కుపదేశించిన వర్ణాశ్రమబోధయొక్కయుఁ దాత్పర్యమే మన:—వర్ణా

శ్రమధర్మములను నిష్కామముతోను, నీశ్వరార్పణబు
తోను, నాచరించినచోఁ గర్మబంధముక్రమముగఁ బా
భగవద్భక్తిచేకురు. కావననే శ్రీశంకరభగవత్పాదులు కర
యోగ రహస్య మీశ్వరశరణాగతి యని చరమశ్లోకప్రతి
లో వ్రాసిరి. కావుననే శ్రీకృష్ణులు బోపదేవులు వర్ణాశ్ర
ధర్మ విచారఫలము క్రమక్రమముగఁ గర్మత్యాగమనియు
సర్వకర్మత్యాగపూర్వకమైన భూతదయయు, భగవచ్ఛ
ణాగతియు, మానవముఖ్యధర్మములనియు, నుడివిరి. కా
నట్టి మహాఫలదాయకములు గాని ప్రకృతవర్ణాశ్రమ
ధర్మాభాసలు సంకరములు, పరిహాసాస్పదంబులు. అవి
మాఱినఁగాని మనకు మేలు గలుగదని మహాత్ములయాశయ
ము. ''శరీరమును రథముఁగా, నింద్రియములను రథ్యములుఁ
గా, నింద్రియప్రేరకంబైన మనస్సును బగ్గములఁగా, శబ్దాది
విషయముల గంతవ్యదేశములఁగా, బుద్ధిని సారథిఁగాఁ,
జిత్తము నీశ్వరకృతమహాబంధనముఁగా, దశవిధప్రాణముల
నక్షముఁగా, ధర్మాధర్మాభిమానములఁ జక్రములఁగా,
జీవునిరథికుఁగా, బ్రణవమును ధనుస్సుగా, శుద్ధజీవుని శర
ముఁగాఁ, బరబ్రహ్మమును లక్ష్యముఁగా, బెద్దలు నిరూపిం
తురు. రాగము, ద్వేషము, లోభము, శోకము, మోహము,
భయము, మదము, మాన, మవమాన, మసూయ
మాయ, హింస, మత్సరము, రజస్సు, ప్రమాద, మాకలి,

నిద్ర మున్నగురజస్తమఃప్రకృతికంబులును, సత్వస్వభావములునగు నవి యొల్లశత్రువులు. ఇంద్రియాదిపరికరనికరం బెల్ల నాత్మవశమున నిలుప నరశరీరరూపంబైన రథము నెందాఁక నరుఁడు వహించు నందాఁక మహాత్సేవానిశాతంబైన జ్ఞానఖడ్గముంబూని యచ్యుతబలమున నరాతుల నిరసించి యాత్మానందమున సంతోషించు. అప్పుడుపశాంతుఁడై రథాదికమగు నీపరికరమునెల్ల నుపేక్షింపఁజను. తప్పిన నసదింద్రియములను రథ్యములు, నసద్బుద్ధియను సారథియు నాప్రనుత్తు నుత్పథమునకీడ్చి విషయశత్రువులయొద్దఁ జేర్చు. ఆశత్రువు లధికమృత్యుభయంబై తమోంధంబైన సంసారకూపమున రథ్యసారథులతో నాతనిఁద్రోచు. ప్రవృత్తము నివృత్తమునన, వైదిక కర్మంబు ద్వివిధంబు. ప్రవృత్తమునం బునరావృత్తియు, నివృత్తమున మోక్షంబు నుంగలుగు. శ్యేనాదిహింసకర్మంబు ద్రవ్యమయము. కామ్యమత్యాసక్తియుక్తంబైన యగ్నిహోత్రాదికంబు. దర్శపూర్ణమాసములు, చాతుర్మాస్యము, పశుయాగము, సోమయాగము, వైశ్వదేవము, బలిహరణ మనునవి యిష్టమనఁబరఁగు, ప్రవృత్తకర్మమునాఁబడు. దేవాలయారామకూపతటాకాదినిర్మాణము పూర్తలక్షణంబైన ప్రవృత్తంబు. దేహాంతరారంభకమగు పురోడాశాది ద్రవ్యపరిణామము, ధూమరాత్రికృష్ణపక్షదక్షిణాయ నాభిమాని దేవతలు,

సోమలోకము, దర్శ, మోషధి, వీరుత్తులు, అన్నము, రేతస్సు ననుక్రమమునం బ్రవృత్తికర్మమార్గము పునర్భవకారణం బగు. వీనిలో ననుక్రమంబునఁ జొచ్చి తత్తత్సామ్యముఁ బొంది మగిడి నిషేకాదిశ్మశానాంతములైన సంస్కారముల సంస్కృతుండైన ద్విజుఁడు ప్రవృత్తికర్మమున నీలోకమునం బుట్టు. జ్ఞానదీపములగు నింద్రియములలో స్వకర్మముల నయ్యింద్రియములను సంకల్పమూలమగు మనస్సునందును, వికారాన్వితంబైన యమ్మనస్సును విద్యాలక్షణంబైన వాక్కునందును, దాని వర్ణసమామ్నాయంబునందును, దాని సర్వాత్మకంబైన యోంకారంబునందును, నయ్యోంకారమును బిందువునందును, దాని నాదమందును, దానిం బ్రాణమందు, నాసూత్రాత్ముని బ్రహ్మమందును, సమన్వయించి, యగ్ని, సూర్యుఁ డహఃపూర్వాహ్ణ శుక్లపక్ష పూర్ణిమో త్తరాయణాభిమానిదేవతలు నను మార్గముఁ నంజొచ్చి బ్రహ్మలోక మధిగమించి స్థూలోపాధి యగు విశ్వునకు సూక్ష్మలయంబుఁ గావించి సూక్ష్మోపాధి యగు తైజసుండై, సూక్ష్మముం గారణమున లయించి, కారణోపాధియగు ప్రాజ్ఞుఁడై కారణస్వరూపమును సాక్షిస్వరూపంబున సమన్వయించి, తురీయుఁడై సర్వలయమున నాత్మేఁడు ముక్తుఁ డగు. అట్లు బ్రహ్మలోకం బధిగమించినవారికి నాలుగుగతులు గలుగు. ఆలోకమును సాధించిన సగుణ

బ్రహ్మోపాసకులు బ్రహ్మలోకంబు నడసి యాబ్రహ్మతో ముక్తి నొందుట యొకటి. అట్టి సగుణ బ్రహ్మోపాసకులలోను, నిర్గుణ బ్రహ్మజ్ఞానులలోను, గొందఱు నంతకుముందు వారుచేసిన ప్రకృష్టకర్మోపాసనలవలన వే ఱొకకల్పమునఁ బుణ్యతారతమ్యమున నాధికారికపదంబు లభించుట మఱియొకటి. అశ్వమేధయాజులు, సత్యబ్రహ్మోపాసకులు, బ్రహ్మలోక మధిగమించి హిరణ్యగర్భవిలయానంతర మిా మానవసృష్టి(కల్పము)లో జన్మింపరు. ఇది మూఁడవది. భగవద్భక్తులై బ్రహ్మలోకంబు గతించినవారి కిచ్చ వచ్చినప్పుడు దానిని భేదించి విష్ణుపదం బారోహించుట నాల్గవది. నిర్గుణజ్ఞానికి దేహావియోగకాలమందే ముక్తి. సాలగ్రామమందు విష్ణుబుద్ధిని, బాణమునందు శివబుద్ధిని వలెఁ, జేయు ప్రతీకోపాసకులు విద్యుల్లోకము నర్చిరాదిమార్గమున నేగుదురు. ఇయ్యది దేవయానంబు, నివృత్తకర్మంబు. ప్రవృత్తకర్మపరుఁడాను పూర్వోక్తమగిడిమగిడి పుట్టువిధమున నివృత్తినిష్ఠుఁడైన యాత్మయాజి యుపశాంతాత్ముఁడాత్మస్థుఁడు గావునఁ బునరావృత్తి నొందఁడు. వేదబోధితంబులైన యీ పితృయాన దేవయానముల రెంటిని శాస్త్రదర్శనంబున నెఱింగిన యతఁడు దేహస్థుఁడయ్యు మోహమ్ముం బొరయఁడు. దేహములకాదిని గారణరూపమున నంతమున నవధిరూపమునను వెలుపల భోగ్యరూప

మునను లోపల భోక్తృరూపమునను బర మపరమునఁ
దనరి జ్ఞానజ్ఞేయంబులు, వచన వాచ్యంబులు, తమః ప్రకా
శంబులును, దానయై జ్ఞాని తనకంటె లాఁతివస్తువుంగానక
యప్పుడు పరమాత్మయై వెలయుఁగావున మోహమెట్లు
లెనయు? ప్రతిబింబము వాస్తవముగాదని తర్కవిరోధ
మున నిశ్చితంబైయున్నను, వాస్తవంబని తోఁచురీతి
నింద్రియార్థవిషయంబెల్ల దుర్ఘటంబు గావున నాభాస
రూపమున నర్థమని వికల్పితంబగు. అయ్యది పారమార్థి
కంబుగాదు. పృథివ్యాదిపంచభూతముల యైక్యబుద్ధ్యా
లంబనరూపమై యద్వయమగు దేహాదికము సంఘాతా
రంభకపరిణామములలో నొక్కటిగాని, సంఘాతముగాని,
తద్వికారముగాని, తత్పరిణామముగాని, తదత్యంతభిన్నము
గాని, తదన్వితముగానికాదు. కావున మృషాభూతము.
మహాభూతములవయవిద్రవ్యములు గావున సూక్ష్మావ
యవములు లేకుండిన నుండవు. అవయవి లేకుండినచో
నవయవములు నుండఁజాలవు. పరమాత్మస్వరూపమునకు
వాస్తవభేదము లేకుండినను, బూర్వరూపారోపసాదృశ్య
మునంజేసి భ్రాంతిగలుగు. ఆభ్రాంతి యవిద్యయుండు
నంతకునుండు. అయ్యవిద్య దొలఁగినఁ దానుందోఁడన
తొలంగు. స్వప్నమున నొండొకస్వప్నము జాగరంబును
గాంచురీతి, సర్వము మిథ్యయై యున్నను, శాస్త్రమువిధి
నిషేధములబోధించు. ఆత్మతత్త్వానుభవమున భావా

ద్వైత క్రియాద్వైత ద్రవ్యాద్వైతములనఁ ద్రివిధా ద్వైతము నాలోచించి, మునివస్తువునెడ భేదబుద్ధి తత్తదధికారభేదమునఁ గర్మభేదబుద్ధి, సత్కర్మసాధితఫల మాత్మైక భోగ్యమనుబుద్ధి, యనుమూఁడు స్వప్నములను జాగ్రదాద్యవస్థాత్రయమును నిరసించు. పటమునకుఁ దంతువులకు నైక్యమెట్లట్లు భేదము మిథ్యగావున నుత్పత్తికిఁ బిమ్మటఁ గార్యకారణంబులు రెండునొక్కటియే యని యాలోచించుట భావాద్వైతము, మనోవాక్కాయ కృతమునైన సర్వకర్మములను సాక్షాత్పరబ్రహ్మమునందు సమర్పించుట క్రియాద్వైతము. తనకును జాయా సుతాదులకు నితర ప్రాణులకు దేహము పంచభూతాత్మకత్వమున నొక్కటేయనియు భోక్తపరమాత్మస్వరూపమున నొక్కఁడేయనియు నభేదమాలోచించి యందఱి యర్థ కామముల నొక్కటిగాఁ జూచుట ద్రవ్యాద్వైతము. ఎవ్వని కెయ్యది, దేశకాలవస్తు దైవ్వనివలన నిషిద్ధముగాకుండు, నవ్విధంబు దప్పకుండ నరుం డనాపత్సమయంబునఁ గర్మములాచరింపవలయు. ఇవి యాదిగాఁ గలుగు వేదచోదిత కర్మముల వర్తించు నరుఁడు గృహాశ్రమంబుననుండియుఁ గృష్ణునిమీఁదిభక్తియోగమునఁ దద్గతింగాంచు.'' మఱియు,

లౌకికాలౌకికకర్మములనన్నియు భగవదర్పణ పురస్సరంబుగ భగవత్ప్రీతికొఱకుఁ జేసి భగవదనుగ్రహముఁ బడసి సంసారబంధమోచనంబు నొందనగుననిచెప్పి

పూర్వకల్పమందలి తనగంధర్వజన్మముఁ జెప్పి, శ్రీకృష్ణభక్తి యాత్యంతిక పురుషార్థదాయకమని చెప్పి, యిట్లు నారదులు నిగమించిరి:—

ఉ. "ఏపరమేశుచే జగము లీ
సచరాచరకోటిఁ గూడి సము
ద్దీపితమయ్యె నే విభుని
దివ్యకళాంశజులబ్జగర్భగౌ
రీపతిముఖ్య దేవముని
బృందము లెవ్వఁ డనంతుఁ
డచ్యుతుండా పురుషోత్తముండు
కరుణాంబుధి కృష్ణుఁడుపో నరేశ్వరా!"

అఖిలాధారుఁడ జాదిదుర్లభుఁ
డు బ్రహ్మంబైన విష్ణుండు నీ
మఖమందర్చితుఁడై నివాసగతుఁడై
మర్త్యాకృతిన్ సేవ్యుఁడై
సఖియై చారకుఁడై మనోదయితుఁడై
సంబంధియై మంత్రియై
సుఖదుండయ్యె భవన్మహామహిమఁ
దాఁ జోద్యంబు ధాత్రీశ్వరా"

౪౭. కర్మబ్రహ్మవిచారము.

మఱియు, కర్మబ్రహ్మవిచార మిదివఱలో నేను జేసిన శ్రీవిద్యారణ్య చరిత్రములో నిట్లు సంగ్రహించితిని:—

"మనచర్యకు సంస్కృతమునఁ జేసు కర్మ - అదిలౌకికము, అలౌకికము, నని రెండువిధములు. లౌకికమన, మనము చేయుభోజనమజ్జనాదులు. అలౌకికము, శ్రౌతము, స్మార్తము, అని రెండు తెఱఁగులు. శ్రౌతము వేదోక్తము, స్మార్తము స్మృతిపురాణేతిహాసాద్యుక్తము. ఈయుభయకర్మములు నిత్య, నైమిత్తిక, కామ్యము, లని త్రివిధములు. ప్రతిదినము బ్రాహ్మణాదివర్ణులు, బ్రహ్మచర్యాద్యాశ్రములు, తప్పక చేయ వలసిన దని శ్రుతిస్మృత్యాదులలోఁ జెప్పఁబడిన కర్మములు నిత్యములు; ఆధాన సంధ్యావందనాదులు నిత్యములు. అమావాస్యాగ్రహణాదినిమిత్తమును బురస్కరించుకొని చెప్పఁబడు శ్రాద్ధకర్మాదికము, పాపపరిహారక మగు ప్రాయశ్చిత్తకర్మము, నైమిత్తికములు. ఫలముకోరి చేయునది కామ్యకర్మ. వృష్టికొఱకుఁ జేయుకారీరవారుణజపాదులు కామ్యములు. మఱియు నలౌకికకర్మము ప్రవృత్తినివృత్తి రూపములుగ నున్నది. సంసారసంబంధముగలది ప్రవృత్తి, దానిని మరీచ్యాదు లంగీకరించిరి. నివృత్తి సంసారసంబంధము లేనిది, దానిని సనకాదులు స్వీకరించిరి. మఱియు సర్వకర్మము, మానసికము, వాచికము, కాయికము, నని యుఁ గూడ నగు. కర్మ, ధర్మ, శబ్దములు ప్రాయికముగాన లౌకికకర్మార్థమందు శ్రౌతస్మార్తగ్రంథములలో వాడంబడు ను. ఈకర్మకు ఫలముకలదు. ఆఫలమైహిక మనియు, నా

ముష్మికమనియు,ద్వివిధము.అష్టకాదిసాధ్యమగు పుష్ట్యాది ఫలమైహికము.ఆముష్మిక మభ్యుదయము, నిశ్శ్రేయసము, అని రెండు తెఱఁగులు.అభ్యుదయమనఁగాఁ బారత్రికస్వర్గాది భోగము. నిశ్శ్రేయస మన మోక్షము. కర్మమభ్యుదయము నకు సాక్షాత్సాధనము. కర్మవలనఁ జిత్తశుద్ధి యుదయించి తదనంతరము తత్త్వజ్ఞానముపుట్టిదానిపరిపాకముచే మోక్షము కలుగును,గాన నిశ్శ్రేయసమునకుఁ బరంపరాకారణము కర్మము. ధర్మమువలన సుఖము,జ్ఞానమును బుట్టు, జ్ఞానము వలన మోక్షముఁ బొందును, అని స్మృతికూడఁ జెప్పుచున్నది.సర్వాశ్రములచేఁ ననుష్ఠింపఁబడు నిత్యకర్మవలన బ్రత్యవాయ (పాప) పరిహారము, పుణ్యలోకప్రాప్తి, బ్రహ్మజ్ఞానేచ్ఛ, కలుగు నని, శ్రుతిస్మృతిమీమాంసాద్వయసిద్ధాంతము. నిత్యకామ్యకర్మములఁ జేసినచో ఫలదాయకములు గాన నవి తద్విషయములో సమములయ్యును నిత్యములు చేయనిచోఁ బాపమువచ్చును గాన కామ్యములకంటె భిన్నములు.దర్శమొదలగునవి వచ్చునపుడు చేయక తప్పని కర్మలు గాన నిత్యములవంటివే. నైమిత్తికములును కూడఁ దప్పనిసరివే. నిత్యనైమిత్తికకర్మానుష్ఠానమువలనఁ జిత్తశుద్ధి కలిగి జ్ఞానోత్పత్తికలుగును గాని, రాగప్రయుక్తములయిన కామ్యకర్మలను జేసినచో జ్ఞానేచ్ఛకలుగదు. నిత్యకర్మము సంకల్పభేదముచే సంస్కారము,వివిదిషాజనకము, నని రెండు

విధములు గలది. శ్రుతిస్మృతులలో విహిత మనిచెప్పం
బడుకర్మ సంస్కారము. నిషేకాదిశ్మశానాంతసంస్కార
ములు, దృష్టాంతములు. తాను చేయుకర్మము(లౌకికమయిన
నలౌకికమయినను సరె) తనకు వైధ (చేయక తప్పదు) మ
నియు,దానిఫలమీశ్వరునకర్పణము చేయఁబడుఁగాక,యది
తనకక్కఱలేదు,అని యెవఁడు కర్మముఁ జేయునో యది వా
నికిఁ దత్త్వజ్ఞానేచ్ఛను బుట్టించును. కాన మోక్షేచ్ఛగలవాఁ
డీశ్వరార్పణబుద్ధిచేఁ గర్మముఁ జేయ నగు. ప్రపంచము
లో మానవజాతిచేయు కర్మ సాధారణము, అసాధారణము,
నని ద్వివిధము. సత్యము, దయ, క్షమ, యనసూయ, శుచి
త్వము, అనాయాసను, మంగళము, అకార్పణ్యము,
శమము, దానము, అహింస, గురుశుశ్రూష, తీర్థసేవ,
అలోభత్వము, దేవపూజ, మొదలగునవి మానవసా
ధారణధర్మములు. ఆయాయి వర్ణములకు, ఆ యా యి
ఆశ్రమములకు, శ్రుతి స్మృతులలోఁ జెప్పఁబడినపూర్వోక్త
ధర్మములు,అసాధారణములు. ఇవి యన్నియు నీశ్వరార్పణ
బుద్ధితో ముముక్షువుచేఁ జేయఁబడినచో మోక్షసాధనము
లగు చిత్తశుద్ధిజ్ఞానములను బుట్టించు. మోక్ష మనుని శ్రే
యసమన, నాత్మస్వరూపము తానని యెఱుఁగుట.
స్థూలదృష్టిచేఁ జూడ,లోకములో నాత్మ, యనాత్మ,యను
రెండువస్తువులు తెలియుచున్నవి. బుద్ధిమొదలు దేహము

వఱకు నుండు ప్రపంచ మనాత్మ యనఁబడు. తదితరము, దానికి నాధారము, ఆత్మ:—ఆయాత్మ యాథార్థ్యమును గురూపదేశ శాస్త్రజన్యజ్ఞానముచే నుత్తమాధికారు లెఱుఁ యుదురు. ఆత్మయే జిజ్ఞాసునిజస్వరూప మని యెఱుఁయుట మోక్ష మని యద్వైతుల నిశ్చయము. అదిజన్య ముకాదు. ఆత్మనిత్యము. అన్యంతశూన్యము, దానినిజస్థితిని దెలియుటయే మోక్షప్రాప్తి. దాని మఱుంగు దెలియకుండుటచే ననాత్మయగు జగము దానికంటె వేఱనియు, నదితాను, తనది యనియు, భ్రమగలుగు. ఆత్మకంటె జగము వేఱు కాదనియు, జగమునకు నాత్మయాధార మనియు, లెస్సఁగ ననుభవమునకుఁ దెచ్చికొనవలయు. ఆత్మకు, ననాత్మకు సంబంధమును దెలుపుటకు మృద్ఘట రజ్జుసర్ప దృష్టాంతములు శ్రుతులలో నున్నవి. కుండఁజేయుటకు ముందు, చేసిన తర్వాత, కుండ పగిలిపోయిన తర్వాత,—మూఁడుకాలములలోను—దానికి హేతువగు మన్ను మన కగపడుచున్నది. మట్టి వికారమేకుండ. మట్టి స్వరూపము తెలిసినచో దాని యాకారవిశేషమే కుండయనియు, మట్టికంటె వేఱు కాదనియు, లెస్సగఁ దెలియ నగు. అటులే యీజగత్తు యొక్క సృష్టికిఁబూర్వము, స్థితికాలమందును, ప్రళయమందును, జగత్తు నాత్మకంటె వేఱుకాదు. ఆత్మయొక్క యాకారవిశేషమే యని యెఱుఁగదగును. దీనిని 'పరిణా

మవాదము' అని శాస్త్రజ్ఞు లందురు. అనఁగాఁ గారణము తన రూపుమాఱి కార్యరూప మగుట. పాలు పెరుఁగయిన ట్లు, మన్ను కుండయయినట్లు—ఇట్టిసంబంధ మీశ్వరునకు జగత్తునకునున్న దనినచోఁ బ్రతి వలుసులోను నీశ్వరచైతన్య మున్నదని బోధించినచో, నుపాసకునకు 'ఆత్మవత్సర్వ భూతాని'యను న్యాయము ననుసరించి సర్వప్రపంచవిషయ ములందు సౌహార్దము, సర్వము తన స్వరూప మను జ్ఞానము, నహింసాభూతదయాసత్యగుణాదులు నలవడును. అందుకొఱకు నీవాదము ననుసరించి సృష్టిదృష్టాం తము శ్రుతులలోఁ జెప్పఁబడెను. ఇది వ్యవహార భూమిలో నుత్తమదశను బోధించుచున్నది. దీని సాధన ములు భగవద్గీతా ద్వాదశాధ్యాయాదులలోఁ జూడనగు. ఈ దృష్టాంతమువలన నింకొక సంగతిఁ దెలియనగు. కార్య ము కారణముకంటె భిన్నరూపము గలదిగా స్థూలదృష్టుల కగపడినను నిజస్వరూపము విచారించినచోఁ గార్యము కారణమును విడిచి యగపడదు గాన కారణజ్ఞానము కలుగఁ గార్యము కారణరూపమే యని తెలిసి గ్రహించుటయే నిజమయిన తెలివి. అటులే సత్పదార్థ మగు నాత్మను దెలి యఁగఁ గార్య మగుప్రపంచ మాత్మను విడిచియుండదు. కాన ప్రపంచముయొక్క నిజస్వరూప మాత్మయే యని తెలిసి గ్రహించుటయే నిజమయిన తెలివి. ప్రపంచము

వికారము, నామమాత్రముగలది, సత్యముగాదు, అని చెప్పుటకు ఘటము వికారము, నామమాత్రము వ్యవహారమునకుఁ గాను ధరించినది, సత్యము కాదు, అని "మృత్తికేత్యేవ సత్యం వాచారంభణం వికారో నామధేయం" అని ఛాందోగ్యములో సోపస్కరముగ నున్నది. పరమార్థము విచారించినచో, ననాత్మ యగు ప్రపంచమునకు నాత్మను విడిచి వేఱుస్థితి లేదు. ఈయర్థమును స్ఫుటముగ బోధపడుటకు మహోపనిషత్తులోనగువానిలో రజ్జుసర్పదృష్టాంతముస్వీకరింపఁబడె. పురుషుఁడు త్రాటినిజూచి పామని భ్రమపడినపుడు నిజముగాఁ బామును జూచినపుడు కలుగు భయకంపాదులు గలుగుచున్నవిగద—అటులే మనకు మనదేహము మన మనియు, దేహసంబంధు లగుబంధువులు, స్నేహితులు, చరాచరాత్మకప్రపంచము, మనవియనియు, దృఢవిశ్వాస మున్నంతవఱకు వానియందు మోహముపోదు. అది సర్వానుభవసిద్ధమే. దేహాదులు సర్పస్థానీయములు. అనఁగా నాత్మచైతన్యమును మన మెఱుంగక దానిని దేహము దేహసంబంధమగు సర్వప్రపంచము నని భ్రమయుటవలన వానివశమయితిమి. సర్పముకాదు, రజ్జువని తెలిసినయాప్తుఁడు చెప్పినతోడనే, భయకంపాదులుడిగి యది నిజముకాదనుజ్ఞానము మన కంకురించును. అటులే గురూపదేశశాస్త్రజ్ఞానములచేఁ బ్రపంచము

మనము కాదు, మనది కాదు, అదియు, మనము, నాత్మస్వ రూపమేయని యనుభవము కలిగినచోఁ బాహ్యావస్థ నిజము కాదని తెలియదా? మనకు భ్రమలేక పూర్వము, భ్రమయున్నప్పుడు, అది నివారణమయిన తర్వాతను, రజ్జువలె నాత్మ యున్నదిగాని సర్పము లేదు, ప్రపంచము లేదు,—అయినను, సర్పమువలెను, జగత్తువలెను, రజ్వాత్మలు మన కగపడినవి. కాన నది 'వివర్తవాద' మని శాస్త్రజ్ఞులందురు. అనఁగా నొకవస్తువు తనస్వరూపముచెడక యే యింకొక స్వరూపముతో నగపడుట వివర్తము. త్రాఁడు పామువలె గానుపించుట తనస్వరూపము మాఱి యింకొకటిగ నగపడుట పరిణామము—మన్ను కుండగమాఱినట్లే. ఈరెండువాదములు శ్రుతిసిద్ధములయినను వివర్తము పరమార్థతత్త్వమును బోధించుననియు, పరిణామము, ఉపాసనార్థమనియు, శంకరులు సూత్రభాష్యాదులలో వ్యవస్థ చేసిరి. ఈరెండుదృష్టాంతములవలన మనమరయ నగు నంశ మేమనఁ 'గారణములేనిది కార్యముకలుగదు, ఆధారము లేనిది భ్రమ గలుగదు. అనఁగా మన్నులేనిది కుండను జేయ లేము, త్రాఁడులేనిది పాము అనిభయపడము,' అనుజ్ఞానము. కాన సర్వప్రపంచమునకుఁ గారణము, లేక యధిష్ఠానము, నగునొకటి యుండవలయు. దానికి 'సత్' 'తత్' 'బ్రహ్మ'

'ఆత్మా' అని వేదనామములు. కారణమును విడిచి కార్య ముండనిరీతి, అధిష్ఠానమును విడిచి భ్రమలేని రీతి, నాత్మ ను విడిచి జగత్తుండదు, అని తెలియవలెను. ఇందుకే య ద్వైతులు జగత్తు మిథ్యయనియెదరు. అనఁగా బ్రహ్మ కంటె జగత్తు వేఱుగ సృష్టిస్థితిలయములు గలదిగా దని తాత్పర్యము. అయితే బ్రహ్మకంటె వేఱుగ మన యింద్రి యములకు గోచరించు చున్నది కాన జగత్తు స్థితికాల ములో బ్రహ్మకంటె వేఱుగా నగపడుచున్నది. కాన నేజగత్తు బ్రహ్మకంటె వేఱా, కాదా, యని చెప్పుట య గ్నికి దాహకశక్తివలె సాధ్యము కాదనియు, నుభయులసం బంధ మనిర్వచనీయమనియు, శాస్త్రయుక్తులతో నద్వై తాచార్యులు స్థాపించిరి. మఱియు, 'మిథ్య' యనఁగ శశ విషాణమువలె శూన్యమని కాదు, బ్రహ్మకంటె వేఱుగ నుండదు, అనియు, వ్యవహారక్షమమనియుఁ, దెలియ నగు. దీనినిం దెలియక, పూర్వులలోఁ గొందఱు భ్రమపడినారు. కాననే యద్వైతులు శ్రుతియుక్త్యనుభవములచే బద్ధా వస్థ వ్యావహారికమనియు, ముక్తావస్థపారమార్థికమనియు, నుడివిరి. పూర్వోక్తభ్రమ మనకనాదిగఁ గల దని మన యనుభవమే చెప్పుచున్నది. దానిని శ్రుతిస్మృతులు వ్యక్తీ కరించినవి. ఆభ్రమకుఁగారణ మగు నజ్ఞానము నవిద్య యం

దురు. దాని నివృత్తియే మోక్షమనియు, లేక మోక్షఫల మనియు, నందురు. దాని యావరణ విక్షేపాదివిశేషము లను బంచదశిలోఁ జూడ నగు. ఆత్మయొక్కటియె త్రికాలాబాధ్య మగు సత్పదార్థ మని చెప్పుటచే జీవులుకూడఁ జైతన్యస్వరూపు లగుటఁ జేసి యాత్మస్వరూపులే యనియు నవిద్యోపాధిసంబంధముచే నాత్మ పలువిధములుగఁ గనఁబడి, వానికి బంధమోక్షములు జలచంద్రవృద్ధిహ్రాసములవలె లభ్యము లగుననియు, బ్రహ్మాత్మైక్యసాక్షాత్కారమువలన నజ్ఞానము సంసారమును నశించి యానందస్వరూపుఁ డగు ననియు, నద్వైతసిద్ధాంతము. ఏపనిని—లౌకిక కర్మగాని లేక యలౌకికకర్మగాని—చేసినను, మనోవాక్కాయము లేకీభవింపఁజేసి, ఫలాభిసంధి లేక తనకు వైధమని యెంచి, యీశ్వరునందు నిత్యకర్మము దానిఫలమును సమర్పించి కామ్యకర్మాచరణమందుఁ గలిగిన వృథాసక్తితోఁ దానిని జేయఁగ నట్టివిధన్యునకు, పాపహారమై యహంమమతలు తగ్గి యతఁడు లోకోపకారము చేయ నగు. దానంజేసి తనకు శ్రేయస్సగు. రజస్తమోగుణములు తగ్గి సత్వము వృద్ధియై, జ్ఞానోదయమునకుఁ దగిన యవస్థ యతని కొక జన్మమందుఁగాని యనేకజన్మములయందుఁ గాని, చేకుఱు. మఱియు భక్తివైరాగ్యములతోఁ గూడిన జ్ఞానము వృద్ధిఁ

బొందక, సాధనసంపత్తి స్థిరీకరణము కాక, నాత్మస్వరూపము తెలియక, సుఖముఁనొందు నని శ్రుతిశిరస్సులు, భగవద్గీతాభాగవతములు, వ్యాససూత్రములు, నొక్కి చెప్పుచున్నవి. వీనిలోని సూక్ష్మ లేశము లీతీలున శంకరులు, మాధవాదులుం, దమతము భాష్యాదులలో వ్రాసిరి. ఐహికాముష్మిక విషయభోగములనుండి విరక్తి, సగుణ నిర్గుణోపాసనముఁ, దత్త్వజ్ఞానము, మోక్షమునకు సాధనములని యుపనిషన్మతము. ఈ మూఁటిలో విరక్తి ప్రథమ భూమిక. అది లేనిది తక్కిన రెండలవడవు. భక్తివలన విరక్తిజ్ఞానములు గలుగునని భాగవతమతము. ఉపాసనకే భక్తియోగ మని భగవద్గీతా భాగవత నాశము. భక్తి విరక్తులు లేనిది జ్ఞాన మంకురించదు. జ్ఞానము లేనిది మోక్షము దొరకదు, కాన విరక్తి, భక్తి, మోక్షమునకుఁ బరంపరాకారణములనియు, జ్ఞానము సాక్షాత్కారణ మనియు, శంకరసిద్ధాంతము. కాని జ్ఞానావస్థలోఁ గూడ భక్తివిరక్తు లావశ్యకములే. ఆ రెండు జ్ఞానమును స్థిరీకరణముఁజేయుటకుఁ గడు సహాకాయులు. ఈరహస్యమును శంకరులుభగవద్గీతలోని 10 వ యధ్యాయములోని 11 వ శ్లోకములోని "జ్ఞాన దీపేన భాస్వతా" అను రూపకముయొక్క యవయవము

లన్నింటిని వివరించు నవసరమందు వ్యక్తీకరించిరి. వీనినే మాధవులు పంచదశీజీవన్ముక్త్యాదిప్రకరణములలో విస్తరించిరి."

మ. తపముం వంశము తేజముం శ్రుతము సౌం
దర్యంబు నుద్యోగము
న్నిపుణత్వంబుఁ బ్రతాపపౌరుషములు
న్నిష్ఠాబలప్రజ్ఞలుం
జపయోగంబులుఁ జాలవీశ్వరభవ
త్సంతుష్టికై దంతి యూ
థపుచందంబున భక్తిసేయవలయుం
దాత్పర్యసంయుక్తుఁడై.

---

హరిః ఓమ్

శ్రీగురుభ్యోనమః

# అష్టమస్కంధసారము.

---

ఉ. నల్లనివాఁడు పద్మనయ
 నంబులవాఁడు మహాశుగంబులు
విల్లును దాల్చువాఁడుఁ గడు
 విప్పగువక్షమువాఁడు మేలుపైఁ
జల్లెడువాఁడు నిక్కుపభు
 జంబులవాఁడు యశంబు దిక్కులం
జెల్లెడువాఁడు నైనరఘు
 శేఖరుఁ డీవుత మాకభీష్టముల్.

౪౫. అష్టమస్కంధసంగ్రహము.

సోదరులారా!

అష్టమస్కంధములో మన్వాదులచేఁ బ్రకాశితములగు సద్ధర్మములు వర్ణింపఁ బడినందున దానిని మన్వంతరమను

దురు. ప్రతిమనువు కాలములో మనువు, మనుపుత్రులు, సప్త ఋషులు, ఇంద్రులు, సురలు, వేఱువేఱుగ హరిశాసనంబున నామన్వంతరంబుల నడుపుదురు. యజ్ఞాదులగు పురుషోత్తమావతారములను జన్మకర్మాదులు, మొదటి రెండు స్కంధములలో సంక్షేపముగఁ జెప్పఁబడినవి. తత్పూర్తితులైనరమనువులు వారి పుత్రాదులు జగత్పాలన కార్యము లొనర్తురు. చతుర్యుగాంతమునం గాలగ్రస్తములైన ధర్మప్రవర్తక శ్రుతిగణంబులకెల్ల సప్తర్షులుపునః ప్రచారంబుసేయుదురు. అటఁ జతుష్పాదోపశోభితంబైన ధర్మమును హరినిదేశమునం జేసి మనువులుభువిలోఁ బ్రవర్తింపఁజేయుదురు. మనుపుత్రులయిన రాజులు మన్వంతరాంతంబుదనుక యథాభాగముగ ధర్మమునఁ బ్రజల నేలుదురు. సురలు మున్నగువారు యజ్ఞభాగముల భుజింతురు. ఇంద్రులు భగవంతుఁడిచ్చిన త్రైలోక్య రాజ్యలక్ష్మి ననుభవించుచు ముల్లోకంబు లేలుచుఁ దతిలోఁ వానఁగురియుదురు. హరిసిద్ధేశ్వర రూపంబులెత్తి ప్రతియుగంబునందును ఋషిరూపమునఁ గర్మంబును, యోగేశరూపమున జ్ఞానమును, నుపదేశించు. మఱియు బ్రహ్మ ప్రజాపతిరూపమున సర్గమును, రాజరూపమున దస్యు సంహారపూర్వకసాధురక్షణమును, గాలరూపమునలయ

మునుం, గావించి భిన్నభిన్నరూపముల నాజగదీశ్వరుండు దోఁచు. నామరూపాత్మకంబైన మాయచే విమోహితులైజనులు నానాశాస్త్రనిరూపితుండైన యప్పరమేశ్వరుం గాననేరరు.

## ౪౯. మొదటినాలుగు మన్వంతరములు.

మొదటస్వాయంభువస్వారోచిషోత్తమతామసులను నలుగురు మనువులచరిత్రము సంగ్రహముగఁ జెప్పఁబడె. ఆమన్వంతరములలోవరుసగయజ్ఞ, విభు, సత్యసేన, హరి రూపములతో భగవంతుఁడగు విష్ణు వవతరించి లోకపాలనముఁ జేసెను. ఈమనువు లాధికారికులు. నాల్గవ మన్వంతరమందు హరి గజేంద్రమోక్షణముఁ గావించె. ఆచరిత్రము సుప్రసిద్ధము. అందలిగజేంద్రస్తోత్రము సంస్కృతాంధ్రములందు ముద్దులు మూటగట్టుచున్నది, సర్వాస్తికమతస్థులకు సమ్మతము. గజేంద్రుఁ డార్తభక్తుఁడు. పురుషప్రయత్నము పూర్తిగఁ జేసినపిదప స్వప్రయత్ననివృత్తిపూర్వకపరప్రవృత్తిప్రార్థనారూపమగు శరణాగతి గజేంద్రుఁడు చేయుటచే శ్రీహరి యతనిని రక్షించెను.

౫౦. రైవత మన్వంతరము.

అయిదవదియగు రైవతమన్వంతరములో వైకుంఠ లోకకల్పనము జరిగెను. భగవంతులు వైకుంఠావతార మెత్తిరి. మూఁడవ స్కంధములోఁ జెప్పఁబడిన సనకసనందాదులు వెళ్లినలోకము పంచమమన్వంతరమున వైకుంఠ మూర్తిచే నిర్మింపఁబడిన వైకుంఠలోకముగాని ద్వితీయస్కంధములో బ్రహ్మకు నారాయణుఁడు చూపిన వైకుంఠముగాదు. అదినిత్యలోకము, దానినే పరమపద మనెదరు.

౫౧. చాక్షుష మన్వంతరము.

చాక్షుషమన్వంతర మాఱవది. అందుభగవంతుఁ డజితుఁడుగ నవతరించెను. అందుసముద్రమథనమున మందరముగ్రుంక శ్రీహరికూర్మరూపమెత్తి దానిఁ బైకెత్తెను. ఈకథకు వ్యాప్తివిశేషము. ఈమన్వంతరమందుఁ బలి త్రిలోకాధిపత్యము నొందఁగనింద్రుఁడు దుర్బలుఁడై భగవదుపదేశమున నతనితో సంధిఁజేసికొని, యుభయులు, వారియనుచరులు, సముద్రమథనముఁజేసిరి. అం దుద్భవించిన హాలాహలమును భగవంతుఁడగు మహాదేవుఁడు పార్వతి యనుమతితో మ్రింగి త్రిలోకములను రక్షించె.

లోకరక్షణమందు వారికిఁగలయభినివేశ మమితమని యిది నటలో వర్ణింపఁబడినది. భగవంతులు, భాగవతులు, నెన్ని పాట్లైనను బడి జగ ద్రక్షణముఁ జేయుదురుగాన వారి కర్మమనుసరించుట మనకుఁబరమధర్మము, శ్రేయస్కరము. అదియే హరిపూజలలో శ్రేష్ఠము. విషానంతరం మనేకవస్తువులు పాలకడలిలోఁబుట్టి తుదకమృతము పుట్టఁగ దాని గ్రహించుటకు సురాసురలు పోరాడ శ్రీహరి మోహినీరూపమున దానినిఁ బంచఁగ శివుఁడారూపమును మోహించి విష్ణుమాయయని గ్రహింప నారూప మంతర్ధానమయ్యె. కానవిష్ణుమాయారూపమగు కామమును జయించుట భాగవతోత్తములకుఁగూడ నసాధ్యమని యరసి దాని జయముఁగొఱకు భగవచ్ఛరణాగతియే యుపాయమని యెంచి దానినాచరింపనగు.

౫౦. వైవస్వతమన్వంతరములో బలిబంధనము.

వైవస్వతమన్వంతర మేడవది. అది యిపుడు జరుగుచున్నది. శ్రీమన్నారాయణనాభికమలములో బ్రహ్మ పుట్టెను. బ్రహ్మమానసపుత్రుఁడు మరీచి. అతనికొడుకు కశ్యపుఁడు. అతనికి నదితియందు వివస్వంతుఁడను సూర్యుఁడుదయించె. అతనికి సంజ్ఞయందు శ్రాద్ధదేవుఁడగు వైవ

స్వతుఁడుపుట్టె. ఇతఁడిప్పటిమనువు. పూర్వకల్పమంద
తఁడు ద్రవిడేశ్వరుఁడగు సత్యవ్రతుఁడు. ఈమన్వంతర
మం దిక్ష్వాకాదులానై వస్వతుని పుత్త్రులు, వసురుద్రాది
త్యాదులు దేవతలు, కశ్యపాత్రి వసిష్ఠాదులు సప్తర్షులు,
పురందరుఁ డింద్రుఁడు. కశ్యపాదితులకు భగవంతుఁ డుపేం
ద్రుఁడగు వామనరూపమున నుదయించి త్రివిక్రమావ
తారము నొందెను. అపుడు బలిచక్రవర్తిని బంధించి స్వర్గ
మింద్రున కిచ్చెను. సంపద్విపత్తులలోఁగూడ సత్యమును,
ధర్మమును, సన్మార్గమును, హరిభక్తియు, బలి తప్పలేదు.
కాన నతనికి సుతలములో నాధిపత్యమిచ్చి యతనిసన్ని
ధిని భగవంతుఁ డుండి సావర్ణియగు భవిష్యన్మన్వంతర
ములో నతనికి నింద్రపదవి నొసంగెను. బలిచరిత్రము సుప్ర
సిద్ధము, కీర్తనీయము, నాచరణీయము. ఈమన్వంతరములో
బలి భక్తిజ్ఞానవైరాగ్యయుక్తుఁడై పాతాళలోకములో
రాజ్యాధికారమందు హరిచే నియుక్తుఁ డయ్యెను. ఆత్మ
నివేదన భక్తికి బలి దృష్టాంతము.

౫౩. చతుర్దశమన్వంతరములు.

ఇప్పుడు జరుగుచున్నది శ్వేతవరాహకల్పము. ఇంత
కుఁబూర్వము పాద్మకల్పము. శ్వేతవరాహకల్పములో

సగముపైన నొకగంట కాలమయినది. ఈకాలములో లోక పాలనముఁ జేయుటకు హరిచే నియమింపఁబడినవారు పదు నలుగురుమనువులు. ప్రతిమనువుపాలించుకాలము మన్వం తర మనఁబడు. ప్రతిమనువునకు సహాయులుగ సప్తర్షులు దేవతలు మనుపుత్త్రులు గలరు. వారుగూడ హర్యవతార ములు. వీని వివరములు భాగవతాది పురాణములలో విశే షముగనున్నవి. వానికి మన సమాజపువారు చెప్పు (Rounds, Races &c.) గల సంబంధమును బ్రహ్మజ్ఞాను లగు సుబ్బారావు అనీబెసంటు లెడబీటరుగార్లు లోనగు వారు కొంత వ్రాసిరి. కాన నిందు వ్రాయలేదు. దాని రహ స్యజ్ఞానము దుర్విజ్ఞేయము. మఱియునుపదేశసాధ్యము.

| భూతకాలమనువులు. 6. | మనుకాలములో హరి యవతారములు. |
|---|---|
| 1 స్వాయంభువుఁడు | యజ్ఞుఁడు |
| 2 స్వారోచిషుఁడు | విభువు |
| 3 ఉత్తముఁడు | సత్యసేనుఁడు |
| 4 తామసుఁడు | హరియనుహరిమేధస్సు |
| 5 రైవతుఁడు | వైకుంఠుఁడు |
| 6 చాక్షుషుఁడు | అజితుఁడు |

ప్రస్తుతమనువు

7 వైవస్వతుఁడు — వామనుఁడు

రాఁబోవుమనువులు. 7.

8 సావర్ణి — సార్వభౌముఁడు

9 దక్షసావర్ణి — ఋషభుఁడు (ఆయుష్మత్పుత్రుఁడు)

10 బ్రహ్మసావర్ణి — విష్వక్సేనుఁడు

11 ధర్మసావర్ణి — ధర్మసేతువు

12 రుద్రసావర్ణి — స్వధాముఁడు

13 దేవసావర్ణి — యోగేశ్వరుఁడు

14 ఇంద్రసావర్ణి — బృహద్భానుఁడు

ఈయేడుగురు రాఁబోవుమనువులు, భగవదవతారములు. వారిచే లోకపాలనము జరుపఁబడును.

### ౫౩. మత్స్యావతారకథ.

పూర్వకల్పమందు హయగ్రీవుఁడు వేదముల నెత్తుకొనిపోయినపుడు భగవంతుఁడు మత్స్యావతారమెత్తి వాని నుద్ధరించెను. తిరిగి చాక్షుష మన్వంతరాంతమందు సత్యవ్రతునకు జ్ఞానోపదేశముకొఱకు తనమాయచే నొక ప్రళయమును గనపఱచి, సత్యవ్రతుని, సప్తర్షులను, నావ నెక్కించి, వారికి బ్రహ్మతత్త్వము శ్రీహరి మత్స్యరూప

మున నుపదేశించిరి. అప్పుడు హరిని గురు ప్రభావాత్మ రూపములుగ సత్యవ్రతుఁడు స్తుతించెను. ఆ సత్యవ్రతుఁడే వైవస్వతమనువు. ఆసప్తర్షులే కశ్యపాదులు.

ఉ. ఎవ్వనిచే జనించుజగ
 మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁబర
 మేశ్వరుఁడెవ్వఁడు మూలకారణం
బెవ్వఁడు నాదిమధ్యలయుఁ
 డెవ్వఁడుసర్వముఁ దానయైన వాఁ
డెవ్వఁడు వానినాత్మభవు
 నీశ్వరునే శరణంబువేఁడెదన్.



హరిః ఓమ్.

శ్రీ గురుభ్యోనమః.

# నవమస్కంధ సారము.

---

శ్లో. శ్రీ దేవీ యస్య భార్యా ఖగపతిగరుడః
యస్య వాహః ఫణీంద్రః
శయ్యా యస్య నాభౌ సరోజం యస్యాంఘ్రిలగ్నాః
విధిముఖ విబుధాః
యస్య శ్రీముక్తసంఘైః పరిచరణవిధిః
శాస్త్రతః సుప్రసిద్ధః
సోయం రామాఖ్యవిష్ణుః దిశతు తవసుఖం
మంగళం మంగళానాం.

౫౮. నవమస్కంధ సంగ్రహము.

సోదరులారా. !

నవమస్కంధములో నీశానుకథనము వర్ణింపఁబడి నది. ఈశులనఁ బ్రభువులగు రాజులు. శ్రీరామకృష్ణులు స్వయమీశ్వరులు. ఇతరు లీశ్వర నియోగముచేఁ బుడమి

నేలు రాజులు. ఈవైవస్వతమన్వంతరములో నీభూమి నేలిన
౨౮ సూర్యసోమవంశపురాజులచరిత్రములు సంగ్రహ
ముగ నిందుఁ గూర్పఁబడినవి.

### ౫౫. అంబరీష హరిశ్చంద్రుల చరిత్రములు.

వానిలో నంబరీషహరిశ్చంద్ర శ్రీ పరశురామ శ్రీరామ
కృష్ణాదుల చరిత్రములు సుప్రసిద్ధములు. ప్రతిరాజు చరిత్ర
మువలన మన మెరయఁదగిన సుగుణవిశేషము లనేకములు
గలవు. వానిని జక్కఁగ నరసి ప్రవర్తనము బాగుఁ జేసికొన
వలయు. వానిని గ్రంథవిస్తరభీతిచే నిందు సంగ్రహింప లేదు.
అంబరీషుని నడతకుఁ గడు నచ్చెరువొంది తనని కపకారముఁ
జేసిన దూర్వాసు లిట్లు నుతించిరి:—"అహో అనంత
దాసానాం మాహాత్మ్యం దృష్టమద్య మే, కృతాగసోఽపి య
ద్రాజన్ మంగళాని సమీహసే"—"అపకారముఁ జేసినవా
రికిఁ గూడ భాగవతు లుపకారముఁ జేయుట కడు నాశ్చర్యం
బు—" (9-5-14). మఱియు, శ్రీహరి, భక్తపరాధీనుఁడ
నియు, వారుభయులు, నొకరని విడిచి యొకరుండరనియుఁ,
జెప్పి సాధువులందుఁ బ్రయోగించిన కృత్తిప్రయోక్తకుఁ
జెఱుపు గలుగఁ జేయునని యిట్లు శ్రీహరి దూర్వాసులకు
సెలవిచ్చిరి:—"తపోవిద్యా చ విప్రాణాం నిశ్శ్రేయసకరే ఉభే,
తే ఏవ దుర్వినీతస్య కల్పేతే కర్తురన్యథా" (9-3-73) దీనివలన.

వినయము సర్వశ్రేయస్సాధకమని తెలియనగు. హరిశ్చంద్రునిసత్యవాక్యపాలనతితీక్షాదు లాబాలగోపాలప్రసిద్ధములు.

### ౫౬. శ్రీపరశురామ శ్రీరామాద్యవతారములు.

శ్రీపరశురాములు ౨౨ వ మహాయుగములోని కృతత్రేతాయుగ సంధికాలములో బ్రాహ్మణకులమునం దుద్భవించిరి. వారియందు విష్ణు వావేశించి యధర్మశీలురగుక్షత్రియుల నిరువదియొక్కమారు రూపుమాపి ధర్మసంస్థాపనముఁజేసిరి. ౨౪వ మహాయుగాంతర్భావమగు త్రేతాయుగమం దామహావిష్ణువే

తే. "చటులదానవగహనవైశ్వానరుండు
రావణాటోపశైలపురందరుండు
నగుచులోకోపకారార్థ మవతరించి
రాముఁడై చక్రిలోకాభిరాముఁడగుచు,"

క్షత్రగృహస్థధర్మపాలనములు చక్కఁగఁజేసిరి, కాన

శ్లో. "త్యక్త్వాసుదుస్త్యజసురేప్సిత రాజ్యలక్ష్మీం
ధర్మిష్ఠ ఆర్యవచసాయదగాదరణ్యం,
మాయామృగందయితయేప్సిత మన్వధావత్
వందే మహాపురుష తే చరణారవిందం."

(11-5-34.)

## ౫౭. శ్రీరంతిదేవ చరిత్రము.

చంద్రవంశస్థులలో సంకృతి కొడుకగు రంతిదేవరాజీ లోకమునను బరలోకమునను నిట్లు కీర్తింపఁబడు. "అమితాన్నదానముచే రాజ్యముం గోలుపోయి, బిచ్చమెత్తుచు, దైవోపలబ్ధంబైన యప్పటప్పటి యన్నమిచ్చుచు భుజించుచు నిష్కించనుఁడై సకుటుంబముగాఁ గ్లేశముగుడుచు నతనికి నలువదియెనిమిది దినములు జలపానంబేనియు లభింపక కడచె. అతఁడొక్కనాఁడు ప్రాతర్వేళ లభించిన ఘృతపాయససంయావతోయములఁ గుటుంబసహితముగా భుజింపఁ దలఁచి యాఁకటను బిపాసను గంపించుచుండ నతని కతిథియై యొక్క ద్విజుండు సనుదెంచె. అయ్యతిథి నాదరించి యందఱిలో హరిగలఁడన్న సమభావముతోఁ దనకు లభించినదానిలో సగము నయ్యతిథికి శ్రద్ధతోఁ బెట్టిన నతండు భుజించి యరిగె. అట్లతిథిపూజఁ గావించి యారంతిదేవుఁడు శేషాన్నముఁ గుటుంబార్థము పంచికొనం బోయిన నొక్కశూద్రుఁ డేతెంచిన, హరిం దలఁచుచు నందతనికిఁ బెట్టి శేషముఁ దాను గుటుంబముతో భుజింపఁబోయె. ఇంతలో నొక్కండు కుక్కలతోడ నరుదెంచి రాజన్నా, యాఁకొన్న నాకును నాకుక్కలకు నాహారంబు వెట్టుమని యడుగుటయు నాతిథ్యావశిష్టము నతనికిని వాని శునకము

లకును బహుసన్మానపురస్సరంబుగం బెట్టి, శ్వానములకును వాని యజమానునికిని మ్రొక్కె. అట నొక్కనికిఁ బర్యాప్తంబై మిగిలియున్న పానీయమాత్రముఁ ద్రావఁబోవు నంతలో నారంతిదేవు నొద్దకుఁ జండాలుఁ డొక్కఁడే తెంచి, దేవా, త్రావనీళ్లు లైనం బాపి మైన నాకిమ్మని దైన్యంబు గదుర నడుగుటయు వాని దీనత్వంబునకుఁ గరుణించి యత్యంతసంతప్తస్వాంతుండై రంతిదేవుఁ డిట్లమృతవాక్కులు పలికెను. ఈశ్వరుల యణిమాద్యష్టసిద్ధులను మోక్షమునుం గోరను. మఱి సకల భూతములకు సుఖంబు గూరఁ దదీయదుఃఖముఁ గుడువఁ గోరుదు.

ఉ. అన్నము లేదు కొన్నిమధు
రాంబువు లున్నవి త్రావుమన్న రా
వన్నశరీరధారులకు
నాపద వచ్చిన వారి యాపదల్
గ్రన్ననమాన్చి వారికి సు
ఖంబులు సేయుటకన్న నొండు మే
లున్నదె నాకు దిక్కు పురు
షోత్తముఁడొక్కఁడ చుమ్ము పుల్కసా!

దీనుఁడైన ప్రాణికి జల మిచ్చి జీవితంబుఁ గాపాడుదు నేని నాకు క్షుత్పిపాసలును శరీరశ్రమభ్రమంబులును

దైన్యక్లమశోకవిమోహవిషాదంబులును దీఱునని పలికి, తాను 'జావనుండియుఁ బరమకృపాభరితుండై యాచండాలునకప్పానీయంబిచ్చె. అట్టియెడ ఫలార్థులకు ఫలము లొసఁగు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు మువ్వురు నతనికిఁ గానుపించి యేము నీచిత్తముఁ బరీక్షింప నిట్లు మాయఁ గావించితిమని చెప్పిన నారంతిదేవుఁడు వారికి మ్రొక్కి నిస్సంగుఁడై నిస్పృహుఁడై భక్తియోగమున భగవంతుని పై మనసువెట్టె. నిష్కామత్వమునఁ జిత్త మీశ్వరునిపై నిలిపిన యారాజర్షికి గుణమయంబైన యీమాయ స్వప్నములోలెఁ దనకుఁ దాన తొలంగె. అతఁడొక్కండే కృతార్థుఁడయ్యెననుట గాదు, తత్సంసర్గమునం దదనువృత్తులందఱును నారాయణపరాయణులైన యోగులై కృతార్థులైరి." కాన సర్వభూతహితాచరణము వలన విష్ణుమాయాతరణ మగు.

### ౫౮. శ్రీమరుదేవాపిమహర్షులు.

సూర్యవంశస్థుఁ డగు శ్రీరామచంద్రులకొడు కగు కుశునివంశమునందు శీఘ్రునకుఁ బుట్టిన మరుమహారాజు యోగసిద్ధుఁడై యిప్పటికిని హిమవత్పర్వతోత్తరప్రాంతములం దున్నకలాపగ్రామంబునఁ దపంబొనరించుచుండును. అతఁడు, నశించిన క్షత్రియకులమునకుఁ గలియుగాంతమునఁ బునర్భవం బొనర్చెడు. సోమవంశమున నుత్పన్నుఁ

డైన ప్రతీప మహారాజునకు మొదటికొడుకు దేవాపి. అతఁడు
గూడ మరువువలె వనమునకుఁబోయి యోగ నిష్ఠఁబూని
యిప్పుడు కలాపగ్రామమునఁ దపమొనరించుచున్నాఁడు.
రాఁబోవు కృతయుగారంభమునఁ బ్రక్షీణసోమవంశము
నకుఁ బునరుపపాదనంబుఁ గావించెడు నని భాగవత నవమ
స్కంధంబున నున్నది. ద్వాదశస్కంధములోను, కల్కి
పురాణములోను, వీరుభయులు కలియుంగాతమున వర్ణా
శ్రమధర్మములం గ్రమ్మఱఁ దొల్లింటియట్లుకృతయుగసృష్టిం
జేయుటకుఁ గల్కిదేవునిచే నియుక్తు లయిరని యున్నది.
వీరాసృష్టి కిప్పటినుండి కృషిచేయుచున్నట్లు వారిశిష్యు
లగు బెసంటు లెడ్బీటరుగార్లు ప్రకటించిరి. కడచిన ద్వాప
రాంతమునకుముందే వీరురాజర్షులయి, పిదప బ్రహ్మర్షు
లయిరని భారత స్త్రీపర్వాదులం దున్నది. వీరు జీవన్ముక్తు
లయిన తరువాత స్వేచ్ఛగా బహుజన్మము లనేకదేశములం
దెత్తి లోకోపకారము చేయుచున్నారని వారిశిష్యు లగు
బ్లావెట్స్కి సుబ్బారావు బెసంటు లెడ్బీటరు గార్లవలనఁ
దెలిసినది. వీరిరువురి యాజ్ఞానుసారముననే వీరిశిష్యులగు
బ్లావెట్స్కీ ఆల్కట్టుగార్లు 1875 నవంబరు 17 వ తేదిన
అమెరికా దేశపురాజధాని యగున్యూయార్కు పట్టణ
ములో మన దివ్యజ్ఞాన సమాజమును స్థాపించిరి. వారి
యాశీఃప్రభావమువలనను, సహాయము వలనను, వారిశిష్య

ప్రశిష్యులయత్నముల వలనను, వారి సాక్షాచ్ఛిష్యులగు అనిబెసంటమ్మగారి యగ్రాసనాధిపత్యమునను సర్వోత్కృష్టముగా నీలోకమునందది 40 ఏండ్లనుండి వ్యాపించి జగత్తునకుఁ గడుమేలుచేయు చున్నది. 40 సంవత్సరములలో మనసమాజమునకు 23 దేశములలోఁ బ్రధానోపశాఖలు, ఇంచుమించుగ 1000 శాఖలు, సుమారు 26000 సమాజికులు,గలరు. మహాత్ముల యనుగ్రహము వలన నింక నన్నివిధముల వృద్ధినొంది లోకమునకు మతవిద్యాసాంఘిక రాజకీయాది సర్వవిషయములలో నది మేలుచేయుఁగాక యని వారిని మనసావాచాకర్మణా, ప్రార్థించెదము.

శ్లో. త్యక్త్వాసుదుస్త్యజసురేప్సితరాజ్యలక్ష్మీం
ధర్మిష్ఠఆర్యవచసాయదగాదరణ్యం,
భృత్యార్తిహ్యాప్రణతపాలభవాబ్ధిపోతం
వందే మహాపురుష తే చరణారవిందం.

చ. సారముకంసవైరి పదసారసచారు తరార్చనంబుసం
సారమునందు నిందుధర సన్నుతిగాఢతమాంధకారని
స్తారము, వీనికిం దగినసద్గురు సేవయె కారణంబుగా
కారయునింతకంటెను శుభావహమైన విశేషమున్న దే.

౫౯. శ్రీబలరామకృష్ణులు.

చంద్రవంశశాఖ యగు యదువంశరాజులను వివరించి విష్ణ్వంశసంభూతులగు శ్రీబలరామకృష్ణులు వసుదేవునకు జన్మించిరని వర్ణింపఁబడెను. బ్రహ్మాదులకుఁగూడ నూహింపఁజాలని యద్భుతచర్యలను వాసుదేవుఁడు బలదేవ సమన్వితుఁడై యొనర్చి లోకరక్షణము కావించె నని యిట్లు సూచింపఁబడెను.

సీ. సోదరోత్తమవిను దైత్యాంశములఁ బుట్టి
 నరనాథు లతులసేనాసమేతు
లగుచు ధర్మేతరులై ధాత్రిఁ బెక్కుబా
 ధలనలయించుట ధరణి వగలఁ
బొందుచు వాపోవ భూభారముడుపుట
 కై హరిపరుఁడు నారాయణుండు
చెచ్చెరఁ దనసితాసితకేశయుగమున
 బలరామకృష్ణరూపములఁ దనరి
తే. యదుకులంబున లీలమై నుదయ మగును
 భవ్యయశుఁ డగు వసుదేవు భార్య లైన
రోహిణియు దేవకియు ననురూపవతుల
 యందు నున్మత్త దైత్యసంహారి యగుచు.

హరిః ఓమ్

శ్రీగురుభ్యోనమః

# దశమస్కంధసారము.

---

శ్లో. పుంజీభూతం ప్రేమ గోపాంగనానాం
మూర్తీభూతం భాగధేయం యదూనాం,
ఏకీభూతం గుప్త విత్తం శ్రుతీనాం
శ్యామీభూతం బ్రహ్మమే సన్నిధత్తాం.

ఉ. అరయన్ శంతనుపుత్రుపై విదురుపై
నక్రూరుపై కుబ్జపై
నరుపైఁ ద్రోవదిపైఁ గుచేలునిపయిన్
నందవ్రజ స్త్రీలపైఁ
బరగంగల్గు భవత్కృపారసము మా
పైఁ గొంతరానిమ్ము నీ
చరణాబ్జంబుల నమ్మినాఁడ జగదీ
శా! కృష్ణ! భక్తప్రియా!.

శ్లో. చిదానందాకారం జలదరుచిసారం శ్రుతిగిరాం
వ్రజస్త్రీణాం హారం భవజలధి పారం కృతధియాం

విహంతుంభూభారం విదధదవతారం మురహరో
మహోదారంవారంభజతకుశలారంభకృతినః.



## ౨౦. దశమస్కంధ సంగ్రహము.

సోదరులారా !

దశమస్కంధములో ౯౦ అధ్యాయములు గలవు. వానిలో నిరోధము వర్ణింపఁబడినది. సృజింపఁబడిన దుష్ట రాజాదుల, సంహారమే నిరోధము లేక లయము. లయము నాలుగువిధములు:— (౧) చతుర్ముఖబ్రహ్మయొక్క దినాంతమందనఁగ దేవయుగ సహస్రాంతమందు జరుగు సంహారము నైమిత్తికలయము. (౨) ఆబ్రహ్మముయొక్క యాయుష్యాంతమందు మహదాది సప్తప్రకృతులు వాని యన్ని వికారములతోఁ బ్రధాన మగు నవ్యక్తమందలి లయము ప్రాకృతికలయము. (3) ప్రతిక్షణమందు నస్మదాదు లగు సర్వభూతములకుఁ గలుగు నవయవ పరిణామమగు హ్రాసము నిత్యలయము. (౪) తత్త్వజ్ఞానముచే జీవులుపాధినాశమునొంది బ్రహ్మముతో నైక్యము నొందుట ముక్తి యను

నాత్యంతికలయము. మొదటి మూఁడు ౧౨ వ స్కంధము లోను, నాల్గవది యగుముక్తి, ౧౧ వ దానిలోను, వివరింపఁబడినవి. ౧౦ యవదానిలో మొదటి నైమిత్తికలయములో నొకభాగమగు నిరోధము వర్ణింపఁబడెను. ఆ లయమునకు నిమిత్తమేమనఁగ భూలోకములో దుష్టరాజాదులు ప్రబలి ప్రపంచమును బాధచేయుటయే. అట్టి భూభారము నపనయించుటకు విష్ణువు ధర్మహాని గలిగినప్పు డనేకరూపముల నవతరించి దుష్టసంహారముఁ జేసి శిష్టరక్షణమును, ధర్మసంస్థాపనమును, జేయునని శ్రుతి స్మృతి పురాణాదులు ఘోషించుచున్నవి. ఈదుష్టసంహారరూపమగు నిరోధమునైమిత్తికలయమని చెప్పకున్నను, సర్వశాస్త్రప్రమాణసిద్ధమే గాన నదియవశ్యమంగీకార్యమే. ఈ నిరోధము మూఁడవస్కంధమునుండి వరాహాద్యవతారములలో వర్ణింపఁబడి నప్పటికి నీస్కంధములో ముఖ్యముగ శ్రీకృష్ణచరిత్రరూపముగ వివరింపఁబడెను. ౧౦, ౧౧ వ స్కంధములలోఁ బ్రవృత్తి నివృత్తి ధర్మరూపము లగుసర్వవృత్తులను నిర్వికల్పకసమాధి యగు నిరోధసమాధిలో లయింపఁ జేసినఁగాని జీవుఁ డన్యథా రూపమును వదలి స్వరూపస్థితి యగు ముక్తా (బ్రహ్మ) వస్థను బొందఁ డని వర్ణింపఁబడెను.

## ౭౧. శ్రీకృష్ణావతారనిమిత్తములు.

ఈ నాలుగు లయములకు నాశ్రయ మగు పరబ్రహ్మ
మును నిరూపించుట కీప్రళయముల వర్ణనముఁ జేయఁబడె.
పరమపురుషుని సకలావతారములకు ముఖ్యకారణము భగ
వద్గీతా చతుర్థాధ్యాయములోని 6-9 శ్లోకములలో భగ
వంతు లర్జునునకుపదేశించిరి. శ్రీకృష్ణావతారమందుఁ
గూడ వారు పూతనాదు లగు ననేక దుర్మార్గులను గోకు
లాదులందు సంహరించి సన్మార్గు లగు దేవకీవసుదేవాదుల
యిక్కట్లుబాపి యద్భుతగార్హస్థ్యాది ధర్మమాచరించి,
ముచుకుందోద్ధవాదులకు ధర్మార్థకామమోక్షము లుప
దేశించినట్లు, భాగవత దశమైకాదశస్కంధములలో వర్ణిం
పఁబడినది. కాననే భీష్మాచార్యులు శరతల్పమునుండి
శ్రీకృష్ణుల నిట్లుస్తుతించిరి:—

శ్లో. "యం దేవం దేవకీ దేవీ వసుదేవాదజీజనత్,
భౌమస్య బ్రహ్మణో గుప్త్యై దీప్తమగ్నిమివారణిః.

తే. అరణి నగ్ని పొడముకరణి దేవకియందు
విప్రకర్మయజ్ఞవేదగుప్తి
కై జనించె నెవ్వఁ డవ్వసుదేవనం
దనుభజింతు నేకతానవృత్తి.

ఈయర్థమునే భగవద్గీతాభాష్యోపక్రమమందు శ్రీశంకర
భగవత్పాదాచార్యు లీ తీరునవివరించిరి:—

"వేదోక్తము లగు ప్రవృత్తి నివృత్తిధర్మములనాచరించుచు, వారికిఁ జాలకాలము కామ మెక్కు_వయి, వివేకవిజ్ఞానము పోవుటంజేసి ధర్మ మధర్మముచేఁ గప్పఁబడి, యధర్మము వృద్ధినొందఁగ, జగత్థ్సితిని బరిపాలింపనిచ్ఛగించి యానారాయణుఁ డనుపేరుగల విష్ణువు బ్రాహ్మణధర్మము రక్షించుటకు వసుదేవునివలన దేవకియం దావిర్భవించె. ఏలయన: బ్రాహ్మణధర్మము రక్షింపఁబడినచో వైదికధర్మము పాలింపఁబడును. ధర్మబోధకులగు విప్రులధర్మము చక్కఁబడినచో సర్వవర్ణాశ్రమ ధర్మములు నవరింపఁబడును. మఱియు నాభగవంతునకు జననమరణములు లేనప్పటికిని, అతఁడు భూతముల కీశ్వరుఁ డైనను, నిత్యశుద్ధబుద్ధముక్తస్వరూపుఁ డైనను, జ్ఞానైశ్వర్యశక్తిబలవీర్యతేజములతో నెల్లపుడు కూడికొని నప్పటికిని, త్రిగుణస్వరూపము, విష్ణుసంబంధము, గల తనమాయయగు మూలప్రకృతిని వశపఱుచుకొని, తనమాయచే దేహముగలవాని వలెను, జన్మించినవానివలెను, లోకానుగ్రహము చేయుటకుఁ నవతరించెను. తనకు దానివలనఁ బ్రయోజనము లేకున్నను లోకమున కుపచరించ ననుతలంపుతో నర్జునుద్వారమునధర్మము శ్రీకృష్ణు లుపదేశించిరి."

కుంతీదేవి శ్రీకృష్ణావతార హేతువుల నీతీరున నూహించి యతని స్తుతించె. 'నిన్నుఁ (శ్రీకృష్ణుని), గాలస్వరూపుఁగను సర్వనియామకునిఁగను, నాద్యంతరహితునిఁగను, నీవు నిమిత్తమాత్రం బైయుండ భూతజాలమునకుఁ దమలోఁ బరస్పరకలహంబు గల్గుఁగాని నీయెడ నెట్టివైషమ్యముదోఁపని సమప్రవర్తనుఁగను నెఱింగెద. మనుష్యచర్యల ననుకరించుచు నీవు సేయుఁదలఁచువాని నెవ్వరు నెఱుంగరు. నీకెల్లరు సములే....నీయవతారమునకు నిమిత్తముం బలువురు పలుదెఱంగుల నూహింతు రెట్లంటేని కొందఱు యుధిష్ఠిరునకుఁ గీర్తిఁగావింపఁగననియుఁ, గొందఱు మలయమునఁ జందనతరువుపోలె యదువంశంబున నవతరించుటంజేసి తద్వంశమునకు వన్నెపెట్టఁగ ననియు, గొందఱు పూర్వజన్మంబులందుసుతపఃపృశ్నిరూపంబులం బ్రార్థించిన దేవకీవసుదేవులకోర్కులు నెఱవేర్చుచు లోకములకు మేలుగావింపను దానవాంశంబునఁ బుడమిలోనం బుట్టినవారలఁ దెగటార్పఁగననియు, గొందఱు భూభారమునంజేసి సముద్రమధ్యమున నావపోలె నలజడిపడు భూదేవిభారము హరింపఁగననియు, గొందఱు బ్రహ్మదేవుని ప్రార్థనంబున లోకక్షేమమొనరింపఁగననియుఁ, గొంద ఱవిద్యాకాల కర్మముల నీసంసారమున నిడుమలు గుడుచువారికి శ్రవణస్మరణయోగ్యములైనదివ్యలీలలు చూపఁగననియుఁ,

దలంతురు. కౌరవపురస్త్రీ లిట్లూహించిరి:—"స్వకీయాత్మ వలన లోకములఁ బుట్టించుచుఁ బ్రోచుచుఁ దుదిఁ ద్రుంచు నట్టి యేకరూపుఁ డై నయీశ్వరుఁడే యితండనియు నెప్పు డేనియును ధర్మము నైశ్వర్యమును సత్యప్రతిజ్ఞను యథోపదేశకత్వంబును దయ నద్భుతకర్మములనుం బ్రక టించుననియు రహస్యార్థప్రతిపాదకులగు పెద్దలు వేదము లందును రహస్యాగమములందు నెవ్వనిసత్కథలం బాడు దు రట్టిపుణ్యకీర్తినుం డితండే". ఇట్లే దశమస్కంధములోఁ బలుచోట్ల శ్రీకృష్ణావతారనిమిత్తములు కర్మములు ప్రయోజనములును వర్ణింపఁబడెను. పూర్వగ్రంథములోఁ జెప్పిన భగవదితరావతారకారణాదులఁగూడ నిచట నన్వ యింపఁదగు.

### ౭౩. శ్రీకృష్ణావతారమహిమ.

ఈ ప్రళయములకు నాశ్రయ మగు పరబ్రహ్మమును నిరూపించుటకు నీప్రళయవర్ణనముఁ జేయఁబడెను గదా. అనేకావతారములు ధర్మగ్లాని నిమిత్తక నిరోధములకుఁ గర్తలయినను, శ్రీకృష్ణావతారము పరిపూర్ణమేలయన నిత రావతారములయందు వారిచే సంహరింపఁబడినవారికి ము క్తి గలుగలేదు. కాని పూతనా,తృణావర్త,వత్స,బక, అఘ, ధేనుక, అరిష్ట, యక్ష, కేశి, వ్యోమ, ప్రలంబ, కువలయా

పీడ, చాణూర, కంస, సాళ్వ, శిశుపాల, దంతవక్త్ర, నరక కాశీరాజ, పౌండ్రకవాసుదేవాదులకు శ్రీకృష్ణునియందు ద్వేషభక్తిగలవారయినను, వారిని సంహరించి, తనయందమితప్రేమభక్తి చేసిన గోపికాదులకువలె, వారికి ముక్తి నిచ్చెనని విష్ణుపురాణములోనున్నది. ఇతరావతారములలో విష్ణుపీశక్తినిజూపలేదు.

"అహోబలీయం స్తనకాలకూటం
జిఘాంసయాపాయయదప్యసాధ్వీ
లేభేగతింధాత్ర్యుచితాం తతోన్యం
కంవాదయాళుం శరణం భజేమ" (భా. 3-2-23.)

ఆబ్రహ్మస్తంబపర్యంతము గలజీవకోట్లలోని భక్తులకును నానందమిచ్చిరి.

"అవతారాస్సంత్యన్యే
సరసిజనయనస్యసర్వతోభద్రాః,
కృష్ణాదన్యః కోవా
ప్రభవతి గోగోపగోపికాముక్త్యై"
(కృష్ణకర్ణామృతే)

ఈమహోత్తర మయిన కర్మము భగవంతునిపరమదయాళుత్వమును జెప్పకచెప్పుచున్నది.

౭౩. కామభయద్వేషాదిభక్తులవివరము.

సప్తమస్కంధప్రథమమందు హిరణ్యాక్ష హిరణ్యకశి

పుల పూర్వజన్మకథను వివరించుటలో, 'కామభయవైరా దులలో' దేనిచేత నైనను శ్రీకృష్ణునియందు మనస్సునుంచి భక్తిఁజేసిన గోపికా కంస చైద్యాదులు ముక్తిఁబొంది రని వర్ణింపఁబడినది. ఈవిషయము దశమైకాదశస్కంధములు లోఁగూడ నున్నది. కాన నిది మీమాంస్యము. "కామా ద్ద్వేషా ద్భయా త్స్నేహా ద్యథా భక్త్యేశ్వరేమనః ఆవే శ్యత దఘం హిత్వా బహవ స్తద్గతిం గతాః. గోప్యః కామాద్భయాత్కంసో ద్వేషాచ్చైద్యాదయో నృపాః, సంబంధాద్వృష్ణయస్స్నేహా ద్యూయం భక్త్యావయం నృప" (భా. 7-1-31-32) అని నారదులు ధర్మరాజుతోఁ జెప్పుటచే భయ వైర కామ సంబంధస్నేహరూపములు గల భక్తిప్రారబ్ధ కర్మప్రాబల్యముచేఁ గొందఱకుమాత్రమే గలుగుననియు, నది యందఱకు సాధ్యముగాదనియు, నితరసాధనరూప మగుభక్తి యితరు లగు నరసామాన్యు లందఱు భగవంతునియందుఁ జేయనగు ననియు, నిశ్చయ ముగ నరయనగు. గోపికలు కామరూప మగుభక్తిని, కంసుఁడు భీతిరూపమగు భక్తిని, శిశుపాలాదులు క్రోధ రూప మగు భక్తిని, యాదవులు జ్ఞాతిసంబంధరూప మగు భక్తిని, పాండవులు బంధుస్నేహరూప మగుభక్తిని, శ్రీకృష్ణునందుఁ జేయునట్టి ప్రారబ్ధఫలమునకుఁ బూర్వ జన్మములందు వారొనరించినపుణ్య పాపకర్మములే కారణ

ములు. కృష్ణోపనిషత్ప్రకారము ఋషులు మొదలగువారు గోపికలుగఁ బుట్టి భగవత్సాంగత్యసౌఖ్యము నొందిరి. కంసచైద్యాదులభయవైరాదులుగూడ వారి పూర్వార్జిత కర్మములయొక్క ప్రారబ్ధఫలమని భాగవతవిష్ణుపురాణాదులు నుడువుచున్నవి. వీనిలోఁ గామసంబంధస్నేహము లనురాగరూపమయిన భక్తిని బుట్టించును. ప్రతిదిన మందుఁ గల భీతివైరములు తీవ్రక్రోధరూపమగు భక్తిని బుట్టించును. భక్తి నిప్పువంటిది. దానితోఁ గలిసిన యితర వస్తువుల మాలిన్యమును బోగొట్టును. నిప్పులోఁ బుటముఁ బెట్టినకొలఁది మలముపోవను, బంగారముయొక్క వన్నె యెక్కువయి నిజకాంతిని వెలిగించును. అగ్నిజ్వాల ప్రజ్వలించినకొలఁది కట్టెలుపొడి యగు. ఈయగ్నిసాదృశ్యము వలన నరయఁదగిన విశేష మేమన:—భక్తిహెచ్చను, దానివిశేషణములగు కామము, భయము, వైరాదులు, నశించి, వీనివిశేష్యమగు ననన్యభక్తిమాత్రము నిలిచి నప్పుడే యాత్మజ్ఞానము స్ఫురించి భక్తుఁడు ముక్తుఁడగు. దానివిధాన మిట్లు భగవంతు లుద్ధవున కుపదేశించిరి:—

శ్లో. యథాఽగ్నినా హేమ మలంజహాతి
ధ్మాతంపునస్స్వం భజతేచ రూపం,
ఆత్మాచకర్మానుశయం విధూయ
మద్భక్తియోగేన భజత్యథోమాం.

యథాయథాఽఽత్మా పరిమృజ్యతేఽసౌ
మత్పుణ్యగాథా శ్రవణాభిధానైః,
తథాతథా పశ్యతి తత్త్వసూక్ష్మం
చక్షుర్యథైవాంజన సంప్రయుక్తం. (11-14-25-26)

పూర్వజన్మ పుణ్యవిశేషమువలన గోపికలు సాక్షా ద్భగవత్సాంగత్యముగలవా రైరి. ఆ సత్సంగమనునగ్ని సర్వకాల సర్వావస్థలలో వారుచేయు ప్రేమలోని విశేషణ మగు కామమలమును రూపులేకుండఁ గాల్పఁగ, విశేష్యమగుప్రేమ యనునానందముమాత్రము స్ఫుటముగఁ బ్రకాశించినది. అదియే సాధ్యభక్తి, లేక ప్రేమభక్తి. అది స్ఫురించిన క్షణమే భగవత్తత్త్వ జ్ఞానానుభవ మంకురించును. కనుకనే భగవంతులు గోపికలభక్తి నిట్లు ప్రశంసించిరి:—

శ్లో. మత్కామారమణంజారం మత్స్వరూపావిదోబలాః,
బ్రహ్మమాం పరమంప్రాపు స్సంగాచ్ఛతసహస్రశః.
(11-12-13)

దానికి హేతువు వారిసంతతానుధ్యాన మనుభావనమే యని యిట్లు నుడివిరి:—

శ్లో. కేవలేనహిభావేన గోప్యోగావో నగామృగాః,
యేన్యేమూఢధియోనాగాస్సిద్ధామామీయురంజసా.
(11-12-8)

దీనినే పలుమాఱు "భావోహి భవకారణం" అని దశమములో వర్ణించిరి. భావమనఁగ భావనము = అనుధ్యానము ; భవమునకు = ధ్యేయాకార జన్మమునకు, కారణం= హేతువు. పురుగు, సాలీడు చంపునని భీతిచే దానినే నిరంతరముఁ దలఁచుటచే సాలీడైనరీతిననిదృష్టాంతము, భాగవతసప్తమాది స్కంధములం దున్నది. కాన సంతతము దేనిని ధ్యానించిన నదియగును. ఇది ఛాందోగ్యశ్రుతిని, దత్క్రితున్యాయమును, ననుకరించుచున్నది. గోపికలు తన నమితప్రేమతో ధ్యానించినవిధము భగవంతు లిట్లు సెలవిచ్చిరి.

తరల. తగవుధర్మముఁజూడనొల్లక
తల్లిదండ్రుల బంధులన్
మగల బిడ్డలఁ బాసివచ్చిన
మన్నిమ క్తల మిమ్ము నేఁ
దగదు పాసితిఁ దప్పునై పుఁడు
తద్వియోగభరంబునన్
వగలఁ బొందుచు మీరలాడిన
వాక్యముల్ వినుచుండినన్.

ఉ. పాయని గేహశృంఖలలఁ
బాసినిరంతరమత్పరత్వముం

జేయుచు నున్నమీకుఁ బ్రతి
సేయయుగంబుల నైన నేరనే
బాయక గొల్చుమానసము
ప్రత్యుపకారముగాఁ దలంచి నా
పాయుటఁ దప్పుగాఁ గొనక
భామినులార కృపన్ క్షమింపరే"

(10-1081-82)

కానసే నారదాదులగు మహర్షులుగూడ గోపికలను భాగవతోత్తములని వర్ణించిరి. వారికి భగవన్మాహాత్మ్యజ్ఞానము లెస్సగఁ గలదనియు నుడివిరి.

శ్లో. తానావిదన్ మయ్యనుషంగబద్ధ
ధియస్స్వమాత్మానమదస్తథేదమ్,
యథా సమాధౌమునయోబ్ధితోయే
నద్యః ప్రవిష్టా ఇవ నామరూపే. (11-12-12)

ప్రియతముఁడైన యేను బృందావనంబున నుండు నెడ నాతోడి క్రీడల క్షణార్థముగఁ దోఁచిన రేలు వారికి నాయెడఁ బాటునం గల్పతుల్యంబులయ్యె. అప్పుడు నాపై మతినెలకొల్పి యహంకారాస్పదం బైనయాత్మ దేహమును మమతాస్పదపతిపుత్త్రాదుల నీలోకంబు నాలోకంబునుం దెలియక సమాధినిష్ఠులైనమునులట్లు నామరూ

పముల నెఱుంగక యబ్ధిజలములందు నదులెట్లు లట్టులు నాలోఁ జొచ్చిరి; అని భగవంతులుగూడ గోపికలు తమతో నైక్యము పొందిరని సెలవిచ్చిరి. అది యుండక శ్రుతిని, నిర్వికల్పకసమాధినిష్ఠుల ధర్మమును, ననుసరించు చున్నది.

౹ ఇఁక కంసుని భయరూపభక్తిని విచారింతము.

శ్లో. ఆసీనస్సంవిశన్ స్తిష్ఠన్ భుంజానః పర్యటన్ పిబన్,
చింతయానో హృషీకేశ మపశ్య త్తన్మయం జగత్.
(10-2-26)

ఏమిపనిచేయుచున్నను, కూర్చుండినను, నడచుచున్నను, నిలుచున్నను, భోజనము చేయుచున్నను, అటు నిటుఁ దిరుగుచున్నను, నీళ్లు త్రాఁగుచున్నను, శ్రీకృష్ణుని సదా చింతఁజేయుటచే జగత్తంతయు శ్రీకృష్ణరూపముగ నగపడెను. కంసుఁడు భగవంతునిచేహతుఁడై

శ్లో. సనిత్యదోద్విగ్నధియాతమీశ్వరం
పిబన్నదన్వావిచరన్ స్వపన్ శ్వసన్,
దదర్శ చక్రాయుధ మగ్రతో యత
స్తదేవరూపం దురవాపమాప.        (10-41-40)

కంసుఁ డెల్లప్రొద్దును దినుచుఁ ద్రావుచు నడచుచుఁ గూర్చుండుచు శ్వాసము విడుచుచు నుద్విగ్నచిత్తంబునఁ

చక్రాయుధుం దలంచుచుండినకతమున నయ్యీశ్వరతత్త్వ జ్ఞానము స్ఫురించి దానితో సారూప్యంబునొందె.' అట్లే శిశుపాలదంతవక్త్రులుగూడ వైరభక్తిచే ముక్తిఁబొందిరి:—

శ్లో. జన్మత్రయానుగుణితవైరసంరబ్ధయాధియా,
ధ్యాయం స్తన్మయతాం నీతో భావో హి భవకారణం.
(10-74-47)

శిశుపాలుఁడు మూఁడు జన్మములనుండి గలిగిన తీవ్ర క్రోధమునం జేసి శ్రీహరినేప్రొద్దుఁ 'దదీయరూపగుణదివ్య ధ్యానపారణధీనిధియాట' హరి సారూప్యంబు నొందె. సంతతధ్యానముచే ధ్యాత ధ్యేయాకారము నొందె. శిశుపాల తేజ మెట్లు భగవంతునియందుఁ బ్రవేశించెనో యట్లే దంతవక్త్రసాళ్వపౌండ్రక వాసుదేవుల తేజముగూడఁ జొచ్చె (10-78.50-&66-24). ఇట్లే రజస్తమ ఆవిష్టు లయిన పూతనాఘాదులుగూడ భగవంతునిచే హతులుకాఁగా ముక్తు లయిరి.

శ్లో. 'అఘోఽపి యత్స్పర్శనధౌతపాతకః,
ప్రాపాత్మసామ్యం త్వసతాం సుదుర్లభం. (10-12-39)

శ్లో. అహో బలీయం స్తనకాలకూటం
జిఘాంసయాపాయయదప్యసాధ్వీ
లేభే గతిం ధాత్ర్యుచితాం' ఇత్యాది. (3-2-23-24)

కాన శిశుపాలాదులు సామీప్యాదిసగుణముక్తిని బొందిరని బలిభగవంతునితో నిట్లనిరి:—

శ్లో. 'సాలోక్యంచాపిసారూప్యంసామీప్యమథసాత్మతాం,
ప్రాప్తాస్తేపుండరీకాక్ష భావోహిభవకారణం.'
(10-85-42)

ఈ యుభయభక్తులగతికి హేతు వీతీరున నారదులు ధర్మరాజుతో సెలవిచ్చిరి: —

శ్లో. 'ఏనః పూర్వకృతం యత్తద్రాజానః కృష్ణవైరిణః,
జహుస్తేఽపి తదాత్మానః కీటాః పేశస్కృతో యథా.

శ్లో. యథాయథాభాగవతా
భక్త్యాపరమయాఽభిదా
నృపాశ్చైద్యాదయస్సాత్మ్యం
హరే స్తచ్చింతయా యయుః. (7-10-41-42)

కృష్ణవైరు లయిన యారాజులు పూర్వపాపంబులను వానినిరంతరచింతచే నిర్దహించి మేనుసాలించి భ్రమరకీటన్యాయమున హరితాదాత్మ్యం బధిగమించిరి. భాగవతులు భగవంతుని యనన్యభక్తిచే నెట్లట్లు చైద్యప్రభృతులు వైరకృతచింతనంబున హరితాదాత్మ్యంబుఁ బొందిరి. కాననే

మ. కామోత్కంఠత గోపికల్ భయమునం
గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్
సంబంధులై వృష్ణులుం
బ్రేమన్ మీరలు భక్తి నేము నిదె ని
శ్చింగంటి మెల్లైన ను
ద్దామధ్యానగరిష్ఠులై నహరిం జెం
దన్ వచ్చు ధాత్రీశ్వరా.

అని నారదు లనిరి. కాని దీనిలో ము॥ గ్రహింపవ
లసినవి శేషము నారదులే వసుదేవున కిట్లు సెలవిచ్చిరి:—

శ్లో. త్వమప్యేతాన్ మహాభాగ
ధర్మాన్ భాగవతాన్ శ్రుతాన్,
ఆస్థిత శ్శ్రద్ధయాయుక్తో
నిస్సంగో యాస్యసేపరం. (11-5-45)

వైరేణయం నృపతయ శ్శిశుపాలపౌండ్ర
సాల్వాదయోగతివిలాసవిలోకనాద్యైః,
ధ్యాయంత ఆకృతధియశ్శయనాసనాదౌ
తత్సామ్యమాపు రనురక్తధియాంపునఃకిం?
మాఽపత్యబుద్ధిమకృథాః కృష్ణేసర్వాత్మనీశ్వరే,
మాయామనుష్యభావేన గూఢైశ్వర్యే పరేఽవ్యయే.
(11-5-48-49)

మహాభాగా, నీవును నిమిచక్రవర్తి యాచరించిన భాగవతధర్మములను శ్రద్ధతో నాచరించి నిస్సంగుఁడవై పరమగతింబడయుము. శిశుపాలసాళ్వపౌండ్రాదులు వైరమునం గృష్ణగతి విలాసాదులఁ దలంచి ముక్తులైరఁట. సర్వదానురక్తులైన మిమ్ముఁ జెప్పవలయునే? మనుష్యభావమున గూఢైశ్వర్యుఁడై చూపట్టుసర్వాత్ముఁ డీశ్వరుఁడునగు కృష్ణుఁడు నీపుత్త్రుఁడని సాధారణమతి సేయవలదు.'' చతుర్ముఖబ్రహ్మ, శ్రీకృష్ణులతో గోపకులభక్తి నిట్లు వర్ణించిరి.

మ. నినుహింసించినపూతనాదులకు ముక్తి
నీమేటిసంకేత మి
చ్చిన నీకుం బురదారపుత్త్ర గృహాగో
స్త్రీప్రాణదేహాదులె
ల్లను వంచింపక యిచ్చుగోపకులకున్
లక్షింపనేమిచ్చెదో
యనిసందేహము దోఁచుచున్నది ప్రప
న్నానీకరత్నాకరా. (10. 575.)

భగవంతు లర్జునునకుఁ గూడ "మన్మనాభవ, మద్భక్తో, మద్యాజీ, మాంనమస్కురు" అని రెండుపర్యాయములు నొక్కిచెప్పిరి. కాన మనము శ్రీకృష్ణునియం దనురక్తి పూర్వకభక్తి నుంచవలయును గాని వైరాదిరూప

భక్తి నెప్పుడును జేయకూడదు. యుధిష్ఠిరాదులగు పాండవులు గూడ నట్లు చేసినపరమభాగవతులని ప్రథమాది స్కంధములలో నిట్లు స్తుతింపఁబడిరి:—

శ్లో. మనసాధారయామాసు ర్వైకుంఠచరణాంబుజం,
తద్ధ్యానోద్రిక్తయాభక్త్యా విశుద్ధ ధిషణాంపరే.
(1-15-47)

శ్లో. సారథ్య పారిషద సేవన సఖ్య
దౌత్య వీరాసనానుగమన స్తవనానిత్రుర్ణ్వౌన్
స్నిగ్ధేషు పాండుషు జగత్ప్రణతించ విష్ణో
ర్భక్తిం కరోతి నృపతి శ్చరణారవిందే. (1-16-17)

మ. జలజాతప్రభవాదులున్ మనములోఁ
జర్చించిభాషావళిన్
బలుకన్ లేని జనార్దనాహ్వయపర
బ్రహ్మంబు నీయింటిలోఁ
జెలి యై మేనమఱంది యై సచివుఁ డై
చిత్తప్రియుం డై మహా
ఫలసంధాయకుఁ డై చరించుటది నీ
భాగ్యంబు రాజోత్తమా. (7-386)

౭౮. శ్రీకృష్ణలీలలు.

(౧) గోకులలీలలు:— శ్రీకృష్ణచర్యలు లీల లనఁబడు. అవి గోకుల, మధురా, ద్వారకలీల లనిమూఁడు తెఱంగులు.

ఇవి యన్నియు నాబాల గోపాలవిదితములు— వీనిలో గోకులలీల లయిదు విధములుగ విభజింపఁబడినవి.

(౧) ప్రాకట్యము—బ్రహ్మాదిదేవతాస్తుతి, భగవద వతారము, వసుదేవదేవకీస్తుతులు, శ్రీకృష్ణులు చతుర్భుజా కారమున నావిర్భవించి నందగృహములో ద్విభుజములతోఁ బెరుఁగుట. బ్రహ్మము నిర్గుణమయి సత్యస్వరూపుఁడయినను జగత్సర్గస్థితిలయకర్తయయి, జన్మాదులు లేనివాఁడయినను లోకహితార్థ మవసరమువచ్చినపుడవతరించి, దుష్టసంహారపూర్వకశిష్టపాలనము కావించుచుండును. వాని దివ్యజన్మకర్మములను శ్రవణాదులఁగావించినచో దానివలన విరక్తిజ్ఞానముక్తులు గలుగుననియు,భక్తిసహకృత జ్ఞానమే శాశ్వత ఫలదాయక మనియుఁ, దదితరము కాదనియు, బ్రహ్మాదులు శ్రీకృష్ణుని స్తుతించిరి. (౨) బాల్యము—జన్మప్రభృతి ౫ఏండ్లవఱకుఁ గలలీలలు. పూతనాహరణము మొదలు వత్సాపహరణము దనుక. పిదప బ్రహ్మస్తుతి. ఇదిదశమస్కంధస్తోత్రములలో నుత్తమము. దీనివిశేషములను శ్రుతిగీతవివరములోఁ జూడ నగు. (3)పౌగండము. ౭ ఏండ్లవఱకుఁ గలలీలలు—బలరామకృతధేనుకవధ మొదలు శ్రీకృష్ణకృత నందమోక్షణము వఱకును, దదుపరి శ్రీకృష్ణులు గోపకులకు, గుణాతీతులకు వేద్యంబగు సత్యజ్ఞానానంత మగు బ్రహ్మమును గనపర్చిరి.

(ర) కైశోరము-రాసక్రీడాదివర్ణనము, ౯-వ యేఁడు. (౫) యౌవనము, లేక ప్రౌఢి ౧౦-౧౧ వ యేఁడ్లు-అరిష్టసంహారము మొదలు నక్రూరునితో శ్రీబలరామకృష్ణుల మధురాగమనము కంసవధవఱకు. అక్రూరస్తవము సర్వమత సామరస్యమును బ్రకటించుచున్నది:— “కొందఱు సాధుయోగులధ్యాత్మాధిభూతాధిదైవసాక్షియై యంతర్యామి మహాపురుషుఁగా నిన్నుఁగొల్తురు. కర్మయోగులైన కొందఱింద్రాదినానాదేవతారూపముల నిన్నే త్రయీ విద్య (వేదము)చే నానాయజ్ఞంబుల నారాధింతురు. జ్ఞానులైన కొందఱు సర్వకర్మములు నీయందు సన్న్యసించి యుపశమంబుగొని జ్ఞానస్వరూపుఁడైన నిన్ను జ్ఞానయజ్ఞమున ధ్యానింతురు. శైవ వైష్ణవదీక్షలం బొందిన కొందఱు తదాగమోక్తప్రకారముల బహుభేదముల నానామూర్తినేకమూర్తినిగా నిన్నుపాసింతురు. అందఱును దత్తద్దేవతా నామభేదమున భిన్నమతులై నానాదేవతాభక్తులై సర్వదేవతామయుండైన నిన్నే పూజింతురు. వర్షముగురియ జలపూర్ణములై పాఱునానాగిరినదులయ్యయి మార్గములఁదుది సముద్రమునే చేరుచందమున భిన్నభిన్న ప్రకారంబులైన పూజలన్నియుఁ దుది నిన్నే చేరును. సత్త్వము, రజస్సు, తమస్సను నివి మూఁడును బ్రకృతిగుణములు. బ్రహ్మాదిస్థావరాంతంబులైన భూ

శంబు లన్నియు నందుఁ బ్రోతంబులు. అయ్యది నీయం
దుండెడు." శ్లో. యంశైవాః సముపాసతే శివ ఇతి, బ్రహ్మేతి
వేదాంతినః, బౌద్ధాః బుద్ధఇతి, ప్రమాణపటవః కర్తే
తినైయాయికాః, అర్హన్నిత్యథజైనశాసనరతాః, కర్మేతి
మీమాంసకాః, సోఽయంవోవిదధాతువాంఛితఫలం త్రై
లోక్యనాథోహరిః.'

౭౫. సర్వదర్శన సామరస్యము.

ఉత్తరమీమాంసాశాస్త్రమందు, సాంఖ్యయోగు
లచేఁ జెప్పఁబడినపురుషప్రకృతి మహదాదు (25) లగు
నిరువదియైదుతత్త్వములు,బ్రహ్మాధీనములుగా ననుట మా
త్రమునిరాకరింపఁబడినదిగాని, వాని స్వరూపములు నిరాక
రింపఁబడకపోఁగా, భగవద్గీతలతోస్పష్టముగనంగీకరింపఁబడి
నవి. తర్క, పాశుపత, శాస్త్రములలో నీశ్వరుఁడు కేవల
నిమిత్తకారణ మనుట మాత్రము, కొన్నియుక్తులు, దురా
చారములు, నిరాకరింపఁబడినవిగాని, పశుపతిస్వరూపా
దులు, యమాదులు, నిరాకరింపఁబడలేదు. పాంచరాత్ర
మందు జీవాదులకు జన్మములోనుఁగాఁగల స్వల్పాంశ
ములు మాత్రము నిరాకరింపఁబడినవి. బౌద్ధ, జైన, మత
ములలోఁగూడఁ గొన్నియంశములు గ్రహింపఁబడినట్లు
బ్రహ్మసూత్రసారములో వ్రాసియుంటిమి గదా. జనుల

యోగ్యతల ననుసరించి వేదములు, ధర్మశాస్త్రములు, పురాణములు, భారతము, వేదాంగములు, ఉపవేదములు, కామిక, కాపాల, లాకుల, పాశుపత, సోమ, భైరవాద్యాగమములు, విష్ణు, బ్రహ్మ, బుద్ధా, ర్హతాద్యాగమములు, నితరశాస్త్రములు, ప్రపంచములో నీశ్వరాదులచే నిర్మితములు. ఇవియన్నియు నాత్మతత్త్వమును వ్యక్తపఱచుటకు నేర్పడినవి గాన నవి సోపానక్రమముగ నుపకారకములు గాని, సర్వథాత్యాజ్యములు గావని సూతసంహితలో నున్నది. అట్లే వాత్స్యాయనాది సర్వశాస్త్రములలో వేద్యాంశములు గలవని సురేశ్వరాచార్యులు విద్యారణ్యులుగూడ వ్రాసిరి. ఇట్లనేకమహనీయు లప్పుడప్పుడు జనులయోగ్యతల ననుసరించి యాత్మతత్త్వము ననేకభాషలలో ననేక కాలములలో ననేకదేశములలో ననేకజాతులకు ననేకవిధములఁ బ్రకటించిరి. వానిలోఁగూడ నుపాదేయాంశములు మెండుగా నున్నవి. దీనికిఁ గారణ మేమన: వివిధమతకర్తలు సర్వజ్ఞులైన మహాత్ములగు, జగద్గురువులు, లేక వారిశిష్యులు గాన వారు లోకమును వంచించుటకు నిట్టి విరుద్ధాభిప్రాయములను వెల్లడిచేయరు. దేశకాల నిమిత్తాదులను, శిష్యుల యోగ్యతలను, బురస్కరించి, వారిచిత్తములను, విషయవాసనలనుండి మఱలించి, సర్వభూతదయను బోధించి, తుదకు

నాత్మజ్ఞానమె యజ్ఞాననాశకమని యుపదేశింతురు. కనుక నె బోధసారకారు లిట్లు నుడివిరి:—పదము, పదార్థము, వాక్యార్థము, మహావాక్యార్థము, క్రమముగ వ్యాకరణ తర్కమీమాంసావేదాంతశాస్త్రములవలనఁ గలుగును. అద్వైతులలో మతభేదము లున్నట్లు (సిద్ధాంతలేశసంగ్రహముఁ జూడనగు) మోక్షవాదులలో భేదములుండ నోపు. "లయే మంత్రే హఠే రాజ్ఞి భక్త్యాం సాంఖ్యే హఠేర్మతే, మత్తైక్యమస్తి సర్వేషాం యే బుధా మోక్షమార్గగాః." మన దివ్యజ్ఞానసమాజికులతలంపుగూడ నిట్టిదే.

శ్లో. కృపాసముద్రం సుగతస్యమిత్రం
సదావసంతంగిరిరాజపార్శ్వే
జగద్గురుం సర్వమతాదిమూలం
నమామి మైత్రేయమగాధబోధం.

ప్రకృతమనుసరింతము.

ఈయయిదులీలలలో ననేకస్తుతులు గలవు. వానిలో బ్రహ్మదేవతావసుదేవదేవకీగోపికాదిస్తుతులు భావగర్భితముగను, హృద్యముగను, భక్తిజ్ఞానవైరాగ్యభరితముగను, సోపస్కరముగను, నున్నవి. ఈలీల లన్నిటిని వర్ణించుచు శ్రీకృష్ణుఁడు మనవలెఁ గర్మబద్ధుఁ డగుజీవుఁడుగాక యంతర్యామియైనను లోకహితార్థము జీవునివలె నటించు

చున్నాఁ డని శ్రీశుకులు రాజున కిట్లని సెలవిచ్చిరి:—

శ్లో. కృష్ణ మేన మవేహిత్వ మాత్మానమఖిలాత్మ నాం,
జగద్ధితాయసోఽప్యత్ర దేహీవాభాతిమాయయా.

ప్రతిలీలయందు శ్రీకృష్ణునిదివ్యమహిమ వర్ణింపఁబడి, యతఁడు దేవుఁడుగాని నరుఁడుగాఁడని నిర్ణయింపఁబడెను. దేవతావసుదేవ దేవకీబ్రహ్మాక్రూ రగోపికాశ్రుత్యాదులు భగవంతునిస్తుతించినట్లు పలుచోట్ల దశమమందున్నది. ప్రతి స్తుతిలో బహువిశేషము లున్నవి. గ్రంథవిస్తరభీతిచే వానిని వ్రాయలేదు. ఈగోకులలీలలో(1) మొదటియేఁట (ఆవలించు)జృంభణకాలములలోను,(2) రెండవయేఁట మృద్భక్షణ కాలములోను యశోదకు శ్రీకృష్ణులు విశ్వరూపమునుజూపిరి; (3)చతుర్ముఖబ్రహ్మకు నాలవయేఁట ననేకబ్రహ్మాండాత్మకమగురూపము లగుప్రపంచములఁ జూపిరి; చతుర్భుజాకారులగు హరిరూపములనేకములఁ జూపిరి, (4) గోపులకు భగవన్నిజస్వరూపమును శ్రీవైకుంఠముఁజూపిరి; (5) 10వ యేఁట నక్రూరునకు వైకుంఠసంస్థానమును, బ్రహ్మాదాదుల తోఁగూడఁజూపిరి. మూఁడవలీలలో భగవత్ప్రేమ సవిస్తరముగవర్ణింపఁబడినది. దుర్వృత్తులను జంకక సంహరించి సద్వృత్తులను వృద్ధిఁజేయు మని మనకుఁజెప్పి చూపుటకు

శ్రీకృష్ణులు పూతనాదులను గీటడంచి గోపగోపికాపాం
డవముచికుందోద్ధవాదుల ననుగ్రహించిరి.

### ౨౨. మధురాలీల.

విద్యాభ్యాసము మొదలు, ఉద్ధవవ్రజగమనము, గోపి
కలయోదార్పు, కుబ్జాక్రూరగృహదర్శనము, అక్రూరుని
హస్తినాపురమునకుఁబంపుట, జరాసంధయవనవధ, ముచి
కుందస్తుతి, లోనుగాఁగలవిమధురాలీలలు. గోపికలకుఁగల
శ్రీకృష్ణభక్తి నుద్ధవుఁడు చూచి యాశ్చర్యమునొంది వారి
మహిమను విశేషముగఁ బ్రశంసించెను. "కింమధురం ?
అతిమధురం ద్రాక్షాపి మధురం మధురాదపి కిం మధురం ?
మధురానాథస్య గాన మతిమధురం."

### ౨౩. ద్వారకాలీల.

రుక్మిణీవివాహము, ప్రద్యుమ్నోత్పత్తి,మాయావతి
చేవానిపెంపు, శంబరక్షయము,శమంతకాహరణము,సత్య
భామాకాళింద్యాది వివాహములు, నరకాసురవధ, పారి
జాతాపహరణము, రుక్మిణీనర్మోక్తి, రుక్మివధ (బలరామ
కృతము), బాణపరాజయము, ఉషాపరిణయము, నృగశాప
విమోచనము, బలరాముఁడు యముననుండి కాలువలఁ
ద్రవ్వుట, కాశీపౌండ్రకద్వివిదక్షయము, సాంబవివాహము,
బలరామకృతకురుపరాభవము, సాల్వశిశుపాలదంతవక్త్ర

పల్వల సంహారము,బలరామకృతసూతనాశము, శ్రీకృష్ణా దృత గార్హస్థ్యము, కుచేలోపాఖ్యానము, కురుక్షేత్ర మునందు గోపికాసమావేశము, వారికి నాత్మబోధ, శ్రీకృష్ణభార్యలకును ద్రౌపదికిని జరిగిన సంవాదము, వారిప్రేమ, భక్తి, వసుదేవయజ్ఞము, దేవకీ మృతపుత్రదర్శ నము, శ్రుతదేవ బహుళాశ్వులయాతిథ్యము, శ్రుతిగీతలు, బ్రాహ్మణపుత్రాహృత్యాదులు, శ్రీ కృష్ణకీర్తిప్రశంసలు, ద్వారకాలీలలు. శ్రుతదేవాది యాతిథ్యములో నేకకాలమందు నొకయూరిలోనే భగవంతులు వారితో వచ్చిన మును లును ఋషులునుగూడ, శ్రుతదేవునింటను, బహుళాశ్వ నింటను, గుడిచిరి. ఈశ్వరుఁడు బహురూపులగుటయేగాక జీవులకుఁదెలియకయే వారికి భిన్నరూపములఁగల్పించిరి. శ్రీ కృష్ణుల యఘటనాఘటనాసామర్థ్యము వారికే దెలి యును. వేదస్తుతికే శ్రుతిగీతయని పేరు.

## ౭౮. బ్రహ్మగీత, శ్రుతిగీత.

వేదాంతశాస్త్ర సమ్మతముగను, సారవంతముగను, నారికేళపాకయుక్తముగను, నర్థగౌరవముగలదిగను, గఠిన పదాన్వయభూయిష్ఠముగను,నున్నది శ్రుతిగీత. బ్రహ్మస్తుతి భావగర్భితముగను, భగవన్మాహాత్మ్యద్యోతకముగను, హృద్యముగను, మనోహరముగను, భక్తిజ్ఞాన వైరాగ్య

భరితముగను, నున్నది. బ్రహ్మస్తుతిలోఁ గొంతసంగ్రహిం
చితి. “సర్వదేహులకాత్మగావున జీవసమూహపదపర్యా
యమైన ‘నారము’ నకయనముగుటంజేసి హరి ‘నారా
యణుండ’ నంబరఁగుదువు. సర్వదేహులకుఁ బ్రవర్తకుఁ
డవు గావున ‘నారమునకు’ నీవలన నయనము గలుగు
కతంబునను ‘నారాయణుండ’గుదువు. మఱియు నఖిల
లోకసాక్షివై యానారమున యింతువు గావునను ‘నారా
యణుం’ డగు. నరునివలనఁ బుట్టిన చతుర్వింశతి తత్త్వ
ములును జలంబును ‘నారములు’ నాఁబడు. అయ్యవి
యయనంబుగాఁ బడయుటంజేసి ‘నారాయణుం డ’ని
కొందఱు కల్పింతురు. జగదాశ్రయంబైనభగవ
చ్ఛరీరంబు సత్యమగునేని బ్రహ్మకేల కానఁబడలేదు ?
కమలనాళమార్గంబున నాజలంబెల్ల వెదకి యట్లు దానిం
గానక మగిడి స్థానంబుసేరి తపముసల్పి నప్పుడు లెస్స
కానంబడెనే? తొలుతఁ దా నొక్కరుండయియట వత్స
తత్పాలకరూపముల ననేకుండై యారూపంబులఁ దోఁ
చినవారండఱును జతుర్భుజాదిలాంఛనములం దనరార
బ్రహ్మకుఁ జూపె. దీనింజూడ నారాయణుం డద్వైత
బ్రహ్మం బని నిశ్చయం బెట్టుగలుగకుండు ? తనయోగ
మాయచే ననేకావతారము లెత్తి సృష్టిస్థితి లయక్రీడలఁ

గావించుఁ గావున, నసత్యరూపంబు స్వప్నసదృశంబు నిరస్తప్రతిభాసంబు బహుదుఃఖభూయిష్ఠంబు నగునీజగం బెల్ల నిత్యసుఖబోధాత్ముఁ డనంతుఁడు నగునీయందే మాయాయోగమున నుత్పత్తిలయములం గాంచుచు సత్యంబురీతిని జేతనావంతంబుమాడ్కినిం దోఁచెడు. గురుఁ డగుసూర్యునివలనం గలిగినజ్ఞాననేత్రంబున సర్వాత్మల కాత్మం డైన నిన్నద్వితీయుఁ డనియు నాత్ముఁడనియుఁ బురుషుఁడనియుఁ బురాణుఁడనియు నద్వయుఁడనియు నుపాధిముక్తుఁ డనియు సత్యుఁడనియు స్వయంజ్యోతి యనియు ననంతుఁడనియు నిత్యుఁడనియు నక్షరుఁడనియు నజస్రసుఖుఁడనియు నిరంజనుఁడనియుఁ బూర్ణుఁడనియు నమృతుఁడనియుఁ బ్రత్యగాత్మస్వరూపమున నెఱుంగువారు సంసారముపేరిటి యమృతసాగరంబుఁ దరింతురు. ఆత్మనాత్ముఁగా నెఱుంగనివారి కయ్యజ్ఞానమున నీజగంబు రజ్జుసర్పభ్రమంబు రీతిందోఁచు. జ్ఞానవంతుం డాభ్రాంతి నిరసించి సత్యస్వరూపం బెఱుంగు. త్రాడుసూచి పామని వెఱచినవాఁ డదిపాముగాదని నిషేధించునంతకు దానిం ద్రాడుగా నెఱుంగఁ జాలని విధంబున నజ్ఞానాధ్యస్తం బైన జడాత్మభావంబు నపవదింపక యాత్మజ్ఞానంబు నాతండు వొందఁ జాలునే? నీపాదారవిందధ్యానంబునం

జేసి గాని యీపరమార్థజ్ఞానంబు వడయఁజాలఁడని" బ్రహ్మ శ్రీకృష్ణుని స్తుతించెను. శ్రీశుకులు బృహదారణ్యానురోధముగఁ బరీక్షిత్తునకు శ్రీకృష్ణతత్త్వ ముపదేశించిరి.—

"రాజేంద్రా, సర్వజంతువులకు నాత్మప్రీతియే యధికంబు. తన్మూలంబుననే పుత్త్రవిత్తాదీతరవస్తుప్రియత్వంబు గలిగెడు. దేహులకుఁ దమతమ కాత్మయని యహంకారాస్పదంబైన దేహమునందెంత యంతప్రేమంబు మమతాస్పదంబులైన పుత్త్రవిత్తాదులపయిం గలుగదు. ఇయ్యర్థంబు దేహాత్మవాదులకును దుల్యంబు. దేహము జీర్ణమగుచుండినను జీవితాశ బలీయంబై యుండుటంజూడ దేహము నహంకారాస్పదము గాక మమతావిషయంబ యగునేని యాత్మవోలెఁ బ్రియంబుగా దని తలంపవలయు. కావునం బరికించిచూచిన నెల్లదేహులకు నాత్ముఁడే పరమప్రియుండు. చరాచరాత్మకంబైన యీజగ మెల్లఁదదర్థంబు. అట్టి యాత్మలకెల్లనాత్ముండు కృష్ణుండుకాని లాఁతిగాఁడు. అతండును లోకహితార్థంబాత్మ మాయాయోగమున దేహివోలెఁ దోఁచెడు." ఇత్యాది రహస్యజ్ఞానము గూరూపసత్తివలనఁగాని గలుగదని శ్రుతి నొక్కి చెప్పుచున్నది. సర్వస్తుతులలో బ్రహ్మతత్త్వము, భక్తిజ్ఞానవైరాగ్యము

లును, బహువిధముల వర్ణింపఁబడినవి. శ్రుతిగీతల రహస్యము కేవల గురుశాస్త్రైకసమధిగమ్యము.

### ౭౯. శ్రీకృష్ణప్రవృత్తిధర్మాచరణఫలము.

నగులు ప్రవృత్తిధర్మము ననుష్ఠించుచు ముక్తిని సాధించు మార్గమతివిశదముగ ౯౦ అధ్యాయములలో శ్రీకృష్ణచరిత్రరూపమున భగవద్బాదరాయణులు వర్ణించిరి. తమయవతార నిమిత్తముంగూర్చి నారదులకు భగవంతు లీతరున సెలవిచ్చిరి:—'బ్రహ్మన్ ధర్మస్యవక్తాహం కర్తాతదనుమోదితా తచ్ఛిక్షయన్ లోకమిమమాస్థితః పుత్రమాఖిదః (భా 10-79-40.)=బ్రహ్మర్షీ, ధర్మమునకుఁ బ్రవక్తయుఁ గర్తయు ననుమోదితయు నగు నేను లోకశిక్షార్థంబు ధర్మముఁగొనియెద. మోహామొందకుము. "ఇత్యాచరంతంసద్ధర్మాన్పాదిష్టాన్ గృహమేధినాం"(41), "ఏవంమనుష్యపదవీ మనువర్తమానో నారాయణోఖిలభవాయ గృహీతశక్తిః" (44)=జగత్సృష్ట్యాదులకై యనేకరూపములుధరింపఁగలుగు నారాయణుఁడు మానవవేషవిడంబనంబుఁ గోరి గృహస్థసద్ధర్మం బాచరించెను. దశమస్కంధాంతమందుఁగూడ భగవదవతార ధర్మప్రదర్శనోద్దేశము నిట్లు శ్రీశుకాచార్యులు వర్ణించిరి:—"ఇత్థంపరస్యనిజధర్మ (వర్త) రిరక్షయాత్తలీలాతనో స్తదనురూప

విడంబనాని,కర్మాణికర్మకమణాని యదూత్తమస్యశ్రూయా దమున్యపదమోరనువృత్తిమిచ్ఛ౯" (భా 10. 90.53.)= ఇవ్విధంబునఁ దనధర్మ (ప్రవర్తన) రక్షణార్థము లీలావ వతార మెత్తి హరి దానికిఁదగినకర్మము లాచరించిరి. ఆకర్మముల ననుకరించువారి పాపకర్మముల నవి బోఁ గొట్టును. కాన శ్రీకృష్ణులప్రవర్తనము ననుసరింప నిచ్ఛ యించువా రాకర్మములను వినవలయు, భగవంతుఁ డాచ రించినట్లు భాగవతులుఁగూడ నాచరింపవలయు, నని తా త్పర్యము. "యేషామహంప్రియఆత్మాసుతశ్చ సఖా గురు స్సుహృదః"(భా 3.25.38.),"యద్యదాచరతిశ్రేష్ఠ స్తత్తదే వేతరోజనః,సయత్ప్రమాణంకురుతే లోక స్తదనువర్తతే", (గీ. 3. 21.)"మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థసర్వశః, నమాంకర్మాణిలిప్తన్తి నమేకర్మఫలేస్పృహా. ఇతిమాం యోభిజానాతి కర్మభిర్నసబధ్యతే, ఏవంజ్ఞాత్వాకృతంకర్మ పూర్వైరపి ముముక్షుభిః.కురుకర్మైనతస్మాత్త్వం పూర్వైః పూర్వతరంకృతం" (గీ. 4. 11. 14.), మొదలగు శ్లోకము లలో భగవంతు లర్జునునకు నుపదేశించిరి. దానివలన నహంకార మమకారములను విడిచి ఫలాపేక్షలేక లోకో పకారకము లగు లౌకికాలౌకికకర్మములను భగవదర్పణ పురస్సరముగఁ జేసినచోఁ గర్మబంధము పోవు నని తేలును.

దానిచే మాయాతరణ మగునని భగవంతులు కుచేలున కీతీరున సెలవిచ్చిరి:— "కేచిత్కుర్వంతికర్మాణి కామైర హతచేతసః, త్యజంతః ప్రకృతీర్దైవీ ర్యథాహంలోకసంగ్రహం"="ఏను దుది లోకసంగ్రహార్థంబు కర్మాచరణంబుసేయుగతి మనంబులఁ గామమోహితులుగాక నర్థిమై యుక్త కర్మంబు లాచరించి ప్రకృతిసంబంధంబులు బాసి భవ్యనిష్ఠఁ దవిలియుందురు కొంద ఱుత్తములు భువిని." ఇట్లు చేయుటయే నిష్కామధర్మాచరణము జన్మసాఫల్యమగు. కాననే పరీక్షిన్మహారాజు ప్రాయోపవేశముఁజేసి దేహత్యాగముఁజేయ నుద్యుక్తుఁడుకాఁగ మహర్షు లీతీరున సెలవిచ్చి దానినివారించిరి:— "శివాయలోకస్యభవాయ భూతయేయఉత్తమశ్లోకపరాయణానరాః, జీవంతినాత్మార్థమసౌపరాశ్రయంముమోచకుతఃకళేబరం(?)(భా1-4-12)= ఉత్తమకీర్తు లైనమనుజోత్తము లాత్మహితంబు నెన్నడుం, జిత్తములందుఁ గోరరు హసించియు లోకులకెల్ల నర్థసంపత్తియు భూతియుఁ సుఖము భద్రము గోరుదు రన్యరక్షణాత్యుత్తమ మైనమేను విభుఁ డూరకయేలవిరక్తిఁ బాసెనో?" "అముష్యపదయోరనువృత్తిమిచ్ఛత" లోను గాఁగల శ్లోకములయర్థము నీవాక్యములు వివరించుచున్నవి.

మఱియు, శ్రీకృష్ణప్రవృత్తిధర్మమువలన నింకొక సంగతిగూడ నరయనగు. "కర్మాణిపుణ్యనివహాని సుమంగళాని గాయజ్జగత్కలిమలాపహరాణికృత్వా", 'బిభ్రద్వపుస్సకలసుందరసన్నివేశం కర్మాచరన్ భువిసుమంగళమాప్తకామః, ఆస్థాయధామ రమమాణఉదారకీర్తిః సంహర్తుమైచ్ఛతకులంస్థితకృత్యశేషః", "శ్రద్ధాతుక్తేకథాః శ్రుణ్వన్ సుభద్రాలోకపావనీః గాయన్ననుస్మరన్ కర్మ జన్మచాభినయన్ముహుః(11-11-22.), "యేకోపితాన్సుబహుపాండుసుతాన్ సపత్నైర్దుర్ద్యూతహేళనకచగ్రహణాదిభిస్తాన్, కృత్వానిమిత్తమితరేతరతస్సమేతాన్ హత్వానృపాన్నిరహరత్క్షితిభారమీశః" (11-1-2). ఇట్టియేకాదశస్కంధగత శ్లోకములవలనఁ దెలిన విషయ మేమన:— శ్రీకృష్ణులొనర్చిన కర్మములను శ్రవణకీర్తన స్మరణాభినయనాదులఁ జేసినవారు పుణ్యములను సంపాదించుటయేగాక, కలియుగములోఁ బుట్టుటకు హేతువు లగు జన్మములో వచ్చిన పాపములనుగూడఁ బోఁగొట్టుకొనుదురు. మఱియు, నాప్తకాముఁడైనను, శ్రీకృష్ణులు "చక్కనివారినెల్ల నెకసక్కెములాడెడు చక్కనయ్యయై,"సర్వోత్కృష్టములగు సకలకల్యాణగుణములను లోకములోఁ గనపఱచుటకుఁ

గతం బేమన: లోకు లందఱు వానిని గమనించి యట్లాచ రింతు రను తలంపే. కాన లోకోపకారబుద్ధితో నేయా చర్యలు శ్రీకృష్ణు లొనరించి రని శ్రీశుక శంకర శ్రీధరాదుల తలంపు. వాని ననుకరించుటచే నహంకార మమకారము లును, గామాదులును, నశించి, జీవులు ధన్యులగుదురు. కాన నిట్టి యుత్తమధర్మమును జెప్పి, చేసి, చూపిన మహా త్ములు దేవకీనందనులు. "ఏకంశాస్త్రం దేవకీ పుత్రగీతం, ఏకో (పుత్రః) దేవః దేవకీపుత్రఏవ, ఏకోమంత్రం దేవకీ పుత్రనామా, కర్మాప్యేకం దేవకీపుత్రసేవా." మఱియు భారత యుద్ధమునకును, యాదవ క్షయమునకును, పాండ వయాదవులు నిమిత్తమాత్రము లనియుఁగూడ శ్రీకృష్ణు లు సెలవిచ్చిరి (భా 11-1-2). కాన, "తేనవినాతృణాగ్ర మపి నచలతి" యను న్యాయమును, కేనోపనిష దుత్తర భాగార్థమును, శ్రీకృష్ణాచార మనుసరించినది. కాన వారి కైంకర్యము, వారికి నర్పింపఁబడిన యఖిలాచారతయు, వారి శరణాగతియు, సర్వదా సర్వధాకర్తవ్యములు, సర్వ శ్రేయస్కరములు, సర్వలోకోపకారకములు. వారిచర్య లనుగూర్చి లోకోపకారశ్రేష్ఠులగు ఆనీబెసంటమ్మగారు (Mrs. Annie Besant.)(18)పండ్లక్రిందనిచ్చిన యమూ ల్యోపన్యాసముయొక్క తెనుఁగును దీనియనుబంధముగ

నచ్చొత్తించితి. దాని విశేషములను గ్రహించి యానందించి పరోపకారముఁజేసి ధన్యులగుదురు గాక.

శ్లో. వంశీవిభూషితకరా న్నవనీరదాభాత్,
పీతాంబరాదరుణబింబఫలాధరోష్ఠాత్,
పూర్ణేందుసుందరముఖాదరవిందనేత్రాత్,
కృష్ణాత్పరంకిమపి తత్త్వమహంనజానే.

శ్లో. కృపాసముద్రం సుగతస్య మిత్రం
సదానసంతం గిరిరాజపార్శ్వే
జగద్గురుంసర్వ మతాదిమూలం
నమామిమైత్రేయ మగాధబోధం.

హరిః ఓం.

శ్రీగురుభ్యోనమః.

# ఏకాదశస్కంధసారము.

శ్లో. ధ్యేయంసదాపరిభవఘ్న మభీష్టదోహం
తీర్థాస్పదంశివవిరించినుతంశరణ్యం,
భృత్యార్తిహంప్రణతపాలభవాబ్ధిపోతం
వందేమహాపురుష తే చరణారవిందం.

చ. నగుమొగముల్ సుమధ్యమును
నల్లనిమేనును లచ్చికాటప
ట్టగునురముల్ మహాభుజము
లంచిత కుండలకర్ణముల్ మదే
భగతియునీలవేణియుఁ గృ
పారసదృష్టియుఁ గల్గువెన్నుఁ డి
మ్ముగఁ బొడసూపుఁగాతఁ గను
మూసినయప్పుడు విచ్చినప్పుడుల్.

సోదరులారా!

## ౭౦. ఏకాదశస్కంధసంగ్రహము.

౧౧-వ స్కంధములో ముక్తిసాధనములు వివ
రింపఁబడెను. తత్త్వజ్ఞానముచే జీవు లుపాధినాశ మొంది

తమ యన్యథారూపమును వదలి, బ్రహ్మతో నైక్యరూప మగుస్వరూపస్థితిని బొందుటయే ముక్తి యగు నాత్యంతి కలయము. దీని నీతీరున ద్వాదశస్కంధములోని ౪-వ యధ్యాయములో శుకులు వివరించిరి:— "ప్రపంచ మాద్యవంతముగాన నపదార్థంబు, ప్రకాశమానంబయ్యు వికారప్రపంచంబు ప్రత్యగాత్మ ప్రకాశహీనంబగు నేని యణుమాత్రంబేనియు ననిరూప్యంబు. నిరూపణీయం బగు నేని చిద్రూపంబున నాత్మసమంబై స్వప్రకా శంబగు. సత్యమగు నాత్మస్వరూపమునకు నానా త్వముఁ దలఁచువాఁ డవిద్వాంసుఁ డగు. ఘటాకాశ మహాకాశములకు నాకాశస్థజలస్థ సూర్యులకును బా హ్యాంతరవాయువులకు నెట్లట్లు జీవబ్రహ్మస్వరూపంబులకు నానాత్వం బుపాధికృతంబు. సువర్ణ మొక్కఁడయ్యు రచ నాభేదములం గటకకుండలాదిభేదముల వ్యవహరింపఁబడు నట్లు భగవంతుఁ డహంకారోపహతజనులచే వ్యవహార మార్గములందు వ్యవహరింపఁబడియెడు. అర్కప్రభవంబై యర్కప్రకాశితంబైన మేఘ మర్కాంశభూత మగుచక్షు స్సున కావరణంబు గలిగించువిధమున, బ్రహ్మకార్యంబై బ్రహ్మప్రకాశితంబైనయహంకారము జీవునకు బ్రహ్మ స్వరూపంబు నావరించు. అర్కప్రభవమగు మేఘము

దొలఁగినం జక్షుస్సు రవింజూచు నట్లాత్మోపాధి యగు నహంకారము విచారమునఁ జెడినం బ్రహ్మాత్మానుసంధానంబుగలుగు. ఇట్లు వివేకఖడ్గమున మాయామయాహంకారరూప మగునాత్మబంధనంబుఁ ద్రెంచినయతం డచ్యుతాత్మానుభవుం డై స్వరూపనిష్ఠుం డగు. ఇయ్యది యాత్యంతిక ప్రళయంబు." మఱియు, దశమములో శ్రీకృష్ణుల ప్రవృత్తిక్రీడ విపరింపఁబడిన ట్లేస్కంధములో వారి నివృత్తిధర్మము విశదీకరింపఁబడి, నారదులు వసుదేవునకు సంగ్రహముగను, శ్రీకృష్ణులుద్ధవునకు విపులముగను, కర్మజ్ఞాననిష్ఠలతోఁ గూడి నభక్తిముక్తు లుపదేశించిరి. దశమస్కంధమందు భూభారనివారణముకొఱకు యదువంశాదులలో నిజాంశావిష్టు లగు దేవతల నవతరింపఁ జేసి ప్రవృత్తిమార్గము నవలంబించి నిజకథాశ్రవణాదిపరులగు భక్తులకుఁ బరమానందహేతువు లగుభగవల్లీలలను బ్రదర్శించి యేకాదశమందుఁ బ్రవృత్తిప్రకాశ మగుయోగమాయావైభవము నుపసంహరించి, స్వభక్తులకు నివృత్తిపూర్వకముగ నాత్మతత్త్వమునుపదేశించి, క్రీడార్థమై యవతరింపఁ జేయఁబడిన దేవాంశసంభూతు లగుయాదవరాజులను మోసలయుద్ధవ్యాజముచే సంహరించి వారి వారి యథాధికారస్థానములకుఁ బొందించి బ్రహ్మాదృ

నుగ్రహార్థము శ్రీకృష్ణులు వైకుంఠాధిరోహణముఁ జేసి నట్లు వర్ణింపఁబడెను.

౭౧. జాయంతేయోపాఖ్యానసంగ్రహము.

11 వస్కంధములో 31 అధ్యాయములు. మొదటి దానిలో యాదవకులనాశము వైరాగ్యముకొఱకుఁ జెప్పఁ బడినది. ఒకటిమొదలయినధ్యాయములలోఁ గర్మనిష్ఠ యుఁ దక్కినవానిలో జ్ఞాననిష్ఠయుఁ జెప్పఁబడినవి. ఉభయ నిష్ఠలు భక్తితో నిండియున్నవి. వసుదేవునకు నారదులు 2, 3, 4, 5 అధ్యాయములలో జాయంతేయోపాఖ్యాన రూపమున భాగవతధర్మములు తొమ్మిదితీరున నుపదే శించిరి:—నిమిచక్రవర్తి తొమ్మిదిప్రశ్నలు వేసెను, ఋష భదేవునకు జయంతియందుఁ గలిగినవారిలోని తొమ్మిది కొడుకులు వరుసఁగ జవాబిచ్చిరి.

ప్ర (1). భగవన్నిష్ఠధర్మములెయ్యవి ?

ఉ. కవి.—సర్వకర్మములు— లౌకికములుగాని యలౌ కికంబులుగాని— భగవదర్పణపురస్సరముగఁ జేసిన నవి భాగవతధర్మములగు. శ్రవణాది సాధనభక్తిపరిపాకము వలన సాధ్యభక్తి, భగవత్ప్రబోధము, నితరమందువి రక్తి, యేకకాలమందలవడు, తదనంతరము ముక్తి గలుగు.

ప్ర (2). భాగవతలక్షణము లెట్టివి? వాని భేదము లెట్టివి?

ఉ. హరి. తనకు సర్వభూతములయందును భగవద్భావమున సమన్వయమును, బ్రహ్మరూపాధిష్ఠానంబైనఁ తనయందు సర్వభూతసమన్వయమునుం జూచునతఁ డుత్తమభాగవతుఁడు (గీ. 6-29-30). ఈశ్వరునిపైఁ బ్రేమముఁ దద్భక్తులపై మైత్రియు మూఢులపైఁ గృపయుఁ బగవారిపై నుపేక్షయుఁ దనర్చు నతఁడు మధ్యమభాగవతుఁడు. ఇది, తారతమ్యజ్ఞానము లేనిది ము క్తిగలుగదనిచెప్పు రామానుజ మధ్వమతములకు విరోధము. మార్కండేయులు శివుని "భగవత్యచ్యుతే భక్తిం తత్పరేషు యథాత్వయి" (భా. 12-10-34) అని భగవంతునియందు భాగవతులయందు సమానభక్తిని గోరెను. అది యుత్తమ భక్తిలక్షణము. నందుఁడు, గోపికలు, నుద్ధవుని శ్రీకృష్ణునివలెఁ బూజించిరి. ప్రబుద్ధుఁడు నిమికీతీరుననే చెప్పెను.

"ఏవంకృష్ణాత్మనాథేషు మనుష్యేషుచసౌహృదం
పరిచర్యాంచోభయత్ర మహాత్సున్నృషుసాధుషు."

(భా. 11-3-33.

శ్రీకృష్ణుఁడే యాత్మయు నాథుఁడును ననుభక్తుల యందు సౌహృదమును, స్థావరజంగమప్రపంచములందుఁ

బరిచర్యను, విశేషించి స్వధర్మశీలులయెడను, సంతకంటె భాగవతులకును, సేవఁజేయవలయును, అని మధ్యమభాగవతలక్షణముఁ జెప్పె. హరిభావనం బ్రతిమల శ్రద్ధతోఁ బూజించుచుఁ దద్భక్తులగు నితరులయెడ నట్టిభావన లేని వాఁడు ప్రాకృతభాగవతుఁడు. వాఁడిప్పుడే భక్తి నారంభించినవాఁడు. క్రమముగ నుత్తముఁడుగాఁ గలఁడు. జన్మకర్మవర్ణాశ్రమములను హేతువులచే నీదేహమున నహంభావము దలఁపనివాఁడును, విత్తము నెడ స్వీయపరకీయభేదమును, నాత్మనెడ స్వపరభేదమును, జేయక సర్వభూతసముఁడైన శాంతుఁడు భాగవతోత్తముఁ డనం బరగు. (గీ. 6-32.)

ప్ర. (3) మాయ యన నెట్టిది ?

ఉ. అంతరిక్షుఁడు:—నిర్గుణబ్రహ్మంబునందు నాత్మస్వరూపవిపర్యయంబు దేనంగలుగు, నయ్యది భగవంతుని మాయ యనంబడు. దానిచే నీశ్వరుఁ డీజగంబును సృజంచి పాలించి లయింపఁజేయును. అది త్రిగుణాత్మకమైనను దానిం దాఁటందగు.

ప్ర. (4) మాయాతరణమెట్లు ?

ఉ. ప్రబుద్ధుఁడు:— ఈప్రపంచమందు నగపడు పదార్థమంతయు నసత్తగుమిథ్య, ఆత్మమాత్రమేసత్తు, అను

విషయమై, యుక్తిసహిత శ్రుతిస్మృతి విచారముతో గురూపసత్తిలోనగు సాధనములచే భగవత్తత్త్వజ్ఞాన మును సంపాదించి, లోకోపకారకర్మములనుజేసి, భగ వంతుని శరణాగతిఁ జేసినచో నరుఁడు వైష్ణవమాయను దాఁటు నని శ్రుతిస్మృతులు నొక్కి చాటుచున్నవి.

ప్ర. (౫) నారాయణుఁడనుపేరుగల బ్రహ్మమను పరమాత్మ స్వరూపమెట్టిది ?

ఉ. పిప్పలాయనుఁడు — జగజ్జన్మస్థితిలయకర్తయు, శుద్ధ బుద్ధముక్తస్వరూపుఁడును, మనోవాచామగోచరుఁ డును,నవస్థాత్రయము నందనుస్యూతమయి కర్తృత్వా దిదోషములచే నస్పృష్టమగు సగుణనిర్గుణబ్రహ్మమే, నారాయణుఁడు. కనుకనే నారాయణశబ్ద ముభయ బ్రహ్మపరముగ శ్రీశంకర భగవత్పాదాచార్యులు భా ష్యత్రయములో నుపయోగించిరి. అస్మత్కృతబ్రహ్మ సూత్రసారములోఁ జూడనగు. విత్తైషణాదులను విసర్జించి పద్మనాభచరణైషణనలవరించికొని దానం బెచ్చుపెరిగిన సాధ్యభక్తిచే గుణకర్మజాతంబు లైన రజస్తమంబులను చిత్తమలంబుల నెప్పుడు నరుఁడు హరించు నప్పు డాశుద్ధచిత్తమునందు నిర్మలలోచనము లకు సూర్యప్రకాశం బె ట్లట్లునాత్మరూపమగు నారాయణతత్త్వము సాక్షాదుపలబ్ధంబగు.

ప్ర. (6) కర్మమన నెట్టిది ?

ఉ. ఆవిర్హోత్రుఁడు:—వేదములలోను, పాంచరాత్రముల లోనుఁ, జెప్పఁబడిన భగవదర్చనరూపంబైనకర్మంబు ఫలాపేక్షవిడిచి యీశ్వరార్పణపూర్వకంబుగా నాచరించు నతఁడు పాపకర్మనాశము గావించెడు. సర్వలోకసమత్వ మచ్యుతారాధన మని ప్రశ్నోదునితలంపు.

ప్ర. (7) అవతారముల వివర మేమి ?

ఉ. ద్రమిళుఁడు:—ప్రపంచ క్షేమముకొఱకుఁ బహుపాద్యవతారములు హరి యెత్తెను. వారలీలలు సంగ్రహముగఁ బ్రథమస్కంధసారములో వర్ణింపఁబడినవి.

ప్ర. (8) హరిభక్తిలేనివారిగతి యెట్టిది?

ఉ. చమసుఁడు:—స్త్రీశూద్రాదులగు నజ్ఞానులకు హరిభక్తి నుపదేశింపవలయు. హరిభక్తిలేక వేదాదులలోని యర్థవాదవాక్యములను నమ్మి పశుహింసతోఁ గూడిన కర్మములను జేసినవారి నాపశువులు పరలోకమునఁ దినును. శ్రీకృష్ణులుగూడ నుద్ధవున కిట్లే బోధఁ జేసిరి. కాన యజ్ఞములలో జపయజ్ఞము=బ్రహ్మయజ్ఞము, వారివిభూతియని సెలవిచ్చిరి. శ్రౌతకర్మములను గూర్చి బ్రహ్మసూత్రసారములోని ౧౭౨ - ౭౮ వ పుటలను జూడుఁడు.

ప్ర. (9) యుగభేదముచేఁ గలిగిన భిన్నహరిపూజావిధి యెట్టిది ?

ఉ. కరభాజనుఁడు:—శ్రీహరి కృతయుగంబున శుక్లవర్ణుఁడై చతుర్బాహుఁడై జటావల్కల కృష్ణాజినోపవీతాక్షమాలాదండకమండలుధరుండై యొప్పు. అప్పుడు మనుష్యులు శాంతులు నిర్వైరులు సమదర్శనులునై తపమునను శమదమంబులను దేవునిం బూజింతురు. అద్దేవదేవుఁ డప్పుడు హంసుఁడు, సుపర్ణుఁడు, వైకుంఠుఁడు, ధర్ముఁడు, యోగీశ్వరుఁ, డమలుఁ, డీశ్వరుఁడు, పురుషుఁ, డవ్యక్తుఁడు, పరమాత్ముఁ డని, వ్యపదేశింపఁబడు. త్రేతాయుగంబున రక్తవర్ణుఁడు, చతుర్బాహుఁడు, త్రిగుణమేఖలుఁడు, హిరణ్యకేశుఁడు, త్రయ్యాత్ముఁడు, స్రుక్స్రువాద్యుపలక్షణుఁడు, నై వెలయు. మనుజు లప్పుడు ధర్మిష్ఠులై బ్రహ్మవాదులై త్రయీవిద్యచే సర్వదేవమయుండైనహరి నారాధింతురు. విష్ణువు యజ్ఞుఁడు, పృశ్నిగర్భుఁడు, సర్వదేవుఁడు, ఉరుక్రముఁడు, వృషాకపి, జయంతుఁడు, ఉరుగాయుఁ, డనఁ బరమేశ్వరుండు పరఁగు. ద్వాపరయుగంబున భగవంతుఁడు, శ్యామవర్ణుఁడు, పీతాంబరుఁడు, చక్రాద్యాయుధధరుఁడు, శ్రీవత్సకౌస్తుభాదిపరిష్కృతుఁడు, నై వెలయు. మహారాజ లక్షణలక్షితుండైనయధోక్షజుని

మర్త్యులు జిజ్ఞాసువులై వైదికాగమమార్గముల నర్చింతురు. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్నా, నిరుద్ధ, పదవాచ్యుఁడు, భగవంతుఁడు, నారాయణుఁడు, ఋషి, పురుషుఁడు, మహాత్ముఁడు, విశ్వేశ్వరుఁడు, విశ్వుఁడు, సర్వభూతాత్ముండు, నగునీకు మ్రొక్కెదు నని నామంబు లుచ్చరించి నానాతంత్రవిధానముల జగదీశ్వరులఁ బూజింతురు. కలియుగంబునఁ గృష్ణవర్ణుండై నకృష్ణుని, సాంగోపాంగాస్త్రపార్షదుం డైనవానినామసంకీర్తన యజ్ఞముల మతిమంతులు పూజింతురు. ఇంద్రియ కుటుంబాది పరిభవము హరించి యభీష్టము లొసంగి భృత్యార్తిని నిరసించి భక్తసంసారసాగరంబునకు నావయై శివవిరించి నుతంబై శరణాగతరక్షణప్రవణంబై గంగాదితీర్థాస్పదంబై పరమపావనంబై యొసంగు నీపాదారవిందము నో మహాపురుషా ప్రణమిల్లుదు, అని యుత్తరమిచ్చె.

ఈయార్షభసంవాదములోని దొమ్మిది ప్రశ్నోత్తరములలోను భగవత్తత్త్వము, మాయాస్వరూపము, తత్తరణోపాయములు, కర్మభక్తిజ్ఞానవైరాగ్య కారణస్వరూపఫలములు, సంక్షేపముగను సుందరముగను వర్ణింపఁబడినవి.

ధ్యానయాగార్చనకీర్తనములు కృత త్రేత ద్వాపర కలియుగములందుఁ గ్రమముగ ననుష్ఠించినవారు భగవదనుగ్రహ పాత్రు లగుదురు. శ్రౌత కర్మ ప్రాబల్యము త్రేతాయుగమునుండి వచ్చుచున్న ట్లిక్కడను శ్రీ యుద్ధవగీతలలోను జెప్పఁబడినది. కాన మధ్యవచ్చి మధ్య నంతరించుచున్నది. దానివలన లోకమునకుఁ గానలసిన ప్రయోజనమయిన ట్లగపడుచున్నది. భాగవతములోఁ బలుచోట్ల పశుప్రయుక్తకర్మము నిషేధింపఁబడినది. బౌద్ధాదిమత ప్రాచుర్యముచేతనో, మఱే యేకారణముచేతనో, దానియందుఁ జాలకాలమునుండి వైముఖ్యత మనపెద్దలకే గలిగె. హరిభక్తికి భగవత్సంకీర్తనమే కలియుగములో ముఖ్యసాధనమని శ్రీధరకృష్ణచైతన్యాదుల తలంపు. అది భాగవతము ననుసరించుచున్నది. జితమాయునకుఁ భాగవత ధర్మములు ముఖ్యలక్షణములు. భాగవతోత్తమునకు మాయాజయమానుషంగికముగ నలవడు. ఈతొమ్మిదింటిలో 1, 2 ప్రశ్నల కుత్తరము లుత్తమభూమికలు; 2, 3, 4, 5, 6 ప్రశ్నలజవాబులు మధ్యమభూమికలు; 7, 8 సవాళ్ల జవాబు లధమభూమికలు; 8, 9, ప్రశ్నలకు త్తరము లధమాధమభూమికలు. 2, 3, 4, 5, అధ్యాయములలో నాలుగు భూమికలు వివరింపఁబడినవి. కాన, భాగవతులతోఁగూడి

తొమ్మిది భాగవత ధర్మముల నభ్యాసముఁజేసినచో వైష్ణవ మాయను జయించి ముక్తి నొందవచ్చును. 11,12,స్కంధములకు బమ్మెరపోతనగారు చేసిన తెనుఁగచ్చుపడలేదు. వారిశిష్యులు చేసినది యతిస్వల్పము. కొన్నిచోట్లది స్ఖాలిత్యభూయిష్ఠము. కాన మూలమును, దానికి బ్ర॥ వెంకటరంగశాస్త్రులవారు రచియించిన తెనుఁగు వచనమును, బఠించి మననిదిధ్యాసములఁజేసి కృతార్థులుగండు.

## ౧౨. ఉద్ధవగీతలు.

ఆఱవయధ్యాయములో శ్రీకృష్ణులను నారాయణలోకమునకు రమ్మని బ్రహ్మాదిదేవతలు ప్రార్థింప నంగీకరించినట్లును, పిదప నుద్ధవుఁడధ్యాత్మవిద్యను జెప్పుమని భగవంతుని బ్రార్థించినట్లును, నున్నది. ఏడవయధ్యాయమునుండి 29 వ యధ్యాయము వఱకు సమాసవ్యాసరూపముగ శ్రీకృష్ణులతని కుపదేశించిరి. అది భగవద్గీతలకును, భాగవతదశమస్కంధములకును, వివృతిగ నున్నది. మూలముఁ జదివినఁగాని యాయమూల్యవిషయములు మనస్సునకు బాగుగ నెక్కవు. అయినను గొంత సూచించెదను. ప్రత్యధ్యాయమందును భక్తి పూర్ణముగ నున్నది. ముక్తికంటె లోకసేవకొఱకు నెక్కువగ యత్నింపవలయుననియు

నున్నది. లోకమంతయు భగవచ్ఛరీరము, భగవదాలయ మనియు, దానిని వారినివలె గౌరవింపవలయుననియు, నాయుభయులకు భేద మావంతయుఁ జేయక సేవఁజేయ వలయుననియు నుపదేశముయొక్క ముఖ్యసారము. విష్ణు నారద ప్రహ్లాద పృథు బలి వృత్రాదులయాచారముగూడ దాని ననుకరించుచున్నది. కాన లోకసేవను భగవచ్ఛ రీరూపముగఁ జేసినచో భక్తులకు ముక్తిగలిగి వారిజన్మ సాఫల్యమగు, లోకమునకు మేలుగూడ నగు.

## ౭౩. ఉద్ధవప్రశ్నలు.—౨౨.

ఈగీతలలో నక్కడక్కడ నుద్ధవుఁడు 22 ప్రశ్నలఁ జేసెను.

ప్ర (1). సత్సంగోపాయములేవి?

ఉ. అసత్ప్రపంచత్యాగము, సంగత్యాగము, ఎల్లప్పుడు నాత్మోపాసనము.

ప్ర (2). సత్సంగాసంగము లెట్టివి?

ఉ. సంగాసంగము లాత్మకు స్వతస్సిద్ధములుగ లేవు, భ్రాంతికల్పితములు. స్వప్నమందు సుప్తుఁడు బద్ధుఁడైన ట్లగపడినను నిద్రలేచినపిదప బద్ధుఁడుకాఁడని తోఁచి నరీతిని సంగాసంగము లుండు. ఈయుపదేశములోను,

జాయంతేయోపాఖ్యానములోను, ముఖ్యముగ నద్వైత రీతిగనే యాత్మతత్త్వ ముపదేశింపఁబడెను. ద్వైత విశిష్టాద్వైతములుగూడ నక్కడక్కఁడ గనఁబడు.

ప్ర (3). సత్పురుషలక్షణ మెట్టిది?

ఉ. భక్తులు పరస్పరము శ్రీకృష్ణకథాసక్తిగలిగి యుండు టయే. భక్తరక్షణరూపలీలలం దాసక్తిగలిగి యానందిం చుటయే (గీ. 10. 9.)

ప్ర (4). భక్తు లెవరు?

ఉ. నిష్కామరూప మగుప్రేమ భక్తిఁ గలవారు.

ప్ర (5). జీవతత్త్వ మెట్టిది?

ఉ. స్వసృష్టదేహాదులందుఁ బ్రవేశించినా నను నభిమా నముగల యీశ్వరుఁడే జీవుఁడు.

ప్ర (6). దోష మగపడుచున్నను విషయమం దాశయేల?

ఉ. రజఃప్రాబల్యముచే సత్త్వము కప్పఁబడి విషయ మందు దోషమును దెలియకపోవుటవలన నాశగలుగు.

ప్ర (7). హంససనందనాదిసంవాదములో ముఖ్యాంశ మేమి?

ఉ. విషయములయొక్కయుఁ, జిత్తముయొక్కయు, నిగ్ర హము.

ప్ర (8). శ్రేయస్సులలో నుత్తమ మేది?

ఉ. అవ్యభిచారముగఁ (పరాకులేక యెల్లపుడు) జేయఁబడు నననన్యభక్తి శ్రేయస్సులలో నుత్తమము.

ప్ర. (9) ధ్యానయోగ మెట్టిది?

ఉ. రూపములేని బ్రహ్మమునందు రూపకల్పనను జేసి మృచ్ఛిలాదార్వాదిప్రతిమలందును, దనయాత్మయందును, భగవద్భావనమె ధ్యానము.

ప్ర. *(10) అణిమాదిసిద్ధు లన నెట్టివి?*

ఉ. ధ్యేయవస్తువుతో ధ్యాతయొక్క తాదాత్మ్యము(సమానగుణము) గలవాఁ డగుట సిద్ధి. యోగశాస్త్రకారులనాత్మలనే యాలంబనంబుగ ధ్యానముఁ జేసినచో నమితఫలము గలసిద్ధులలనడు ననిరి. భగవంతులాత్మగుణాలంబముననే యాఫలములు గలుగునని సెలవిచ్చిరి.

ప్ర. (11) భగవద్విభూతి యెట్టిది?

ఉ. ఇంద్రాదు లగుసమస్త భూతములయందుఁ, దారతమ్యమున నుండుభగవంతుని సత్త్వవికారము విభూతి. కాని ఆత్మతత్త్వమాబ్రహ్మస్తంబపర్యంతము సమముగ నే వ్యాపించియున్నది. (గీ. ౫-౧౮-౧౯.)

ప్ర. (12) వర్ణాశ్రమధర్మముల నెట్లాచరించిన భగవద్ధర్మమువృద్ధినొందు?

ఉ. మెల్లమెల్లగఁ గర్మత్యాగముకొఱకే ధర్మములు చెప్పఁబడినవి. క్రమముగ నిష్కామధర్మము నభ్యసించి తుదకు "సర్వధర్మాన్ పరిత్యజ్య" అనుదాని నభ్యసించుటకు ధర్మములు చెప్పఁబడినవి. గౌణము వర్ణాశ్రమ ధర్మము. ముఖ్యము భగవద్భక్తిరూపమగు ధర్మమే. అదియే తుదకుపేయమగు.

ప్ర. (13) జ్ఞానాదు లెట్టివి ?

ఉ. జ్ఞానాదులు రెండువిధములు. ఉపాదేయములు, హేయములు. "ధర్మోమద్భక్తికృత్ప్రోక్తః, జ్ఞానంచైకాత్మ దర్శనం, గుణేష్వసంగోవైరాగ్యం", ఇవి యుపాదేయములు. తదితరములు హేయములు.

ప్ర. (14) యమాదు లెట్టివి ? శమాదు లెట్టివి ?

ఉ. యమములు 12. అహింస=పరపీడావర్జనము; సత్యము=హితప్రియయథార్థభాషణము; అస్తేయము = పరుల సొమ్మునమనస్సులోనైనను గ్రహించుసంకల్పము లేకుండుట; అసంగము=దేనియందు నాసక్తి లేకయుండుట; హ్రీ=అకార్యమందసహ్యము; అసంచయము = అపరిగ్రహము; ఆస్తిక్యము = శాస్త్రోక్తమందు విశ్వాసము; బ్రహ్మచర్యము=స్త్రీసంబంధాదిరాహిత్యము, మౌనము =వృథాలాపరాహిత్యము ; స్థైర్యము=ధర్మమందు

సత్యసంకల్పత్వము ; క్షమ=అపరాధియందుఁ గూడఁ గ్రోధములేమి ; అభయము = భయము లేకుండుట. నియమములు 12. శౌచము— బాహ్యశౌచము, ఆభ్యంతరశౌచము, అని రెండు తెఱంగులు. మృజ్జలాదులచే నొడలును శుద్ధిపఱచుట బాహ్యశౌచము. అంతఃకరణమునకు భగవచ్చింతనాదులచేఁ గర్మములందనాసక్తి యాభ్యంతరశౌచము. జపము=గాయత్ర్యాదుల నితరులకు వినఁబడకుండఁ బలుమా ఱుచ్చరించుట. తపము; హోమము; శ్రద్ధా = సచ్ఛాస్త్రములలోఁ జెప్పఁబడిన విషయమందలి యాదరము, ఆతిథ్యం=అతిథిసత్కారము ; భగవదర్చనము=దేవపూజ; తీర్థాటనము = తీర్థయాత్ర; పరార్థేహా=పరోపకారము కొఱకు దేహాదివ్యాపారము; తుష్టి=తృప్తి; ఆచార్యసేవనము = గురుసేవ. మోక్షేచ్ఛగలవానికి యమములు ముఖ్యములు ; కామగుణకును నియమములు ముఖ్యము. ప్రవృత్తనివృత్తాచరణములఁ జేయువారి సంకల్పానుసారముగ యమనియమము లభ్యుదయమోక్షము లొసంగును.

శమాదులకుఁ బ్రసిద్ధార్థములకంటె భిన్నములయిన లక్షణములు భగవంతు లుద్ధవునకీ తీరున సెలవిచ్చిరి.

ముముక్షువులు శమాదులను స్వీకరింప నగు, నశమా దులనుద్యజింపఁ దగు. శమము భగవన్నిష్ఠఁ గలబుద్ధి గాని, యంతరింద్రియనిగ్రహరూప మగుశాంతిమాత్రము గాదు. దమ మన నింద్రియనిగ్రహముగాని, చోరాదుల దండమనమే గాదు. తితిక్ష యన శ్రుతిస్మృత్యాదివిహిత కర్మాచరణమువలనఁ గలుగు దుఃఖము నోర్చుటగాని, బరువు మోయుట లోనగువానివలనఁ గలుగు దుఃఖముయొక్క యోర్పుమాత్రమే గాదు. ధృతి యన జిహ్వోపస్థల వేగము నణచుటగాని, యనుద్వేగమాత్రము గాదు. దాన మన భూతద్రోహత్యాగముగాని, ధనమునిచ్చుటయే గాదు. తపము భోగముం దాశలేకపోవుట యనుకామత్యాగము గాని, కృచ్ఛ్రచాంద్రాయణాదిమాత్రము గాదు. విజయ మనఁ బూర్వజన్మార్జితకర్మఫలరూప మగువాసన యనుప్రతి బంధము యొక్కజయముగాని, పరాక్రమము గాదు. సత్య మన బ్రహ్మముయొక్క యాలోచనముగాని, హితప్రియ మగు యథార్థభాషణముమాత్రము గాదు. ఋత మన సూనృతవాక్యము. శౌచమనకర్మములయందనాసక్తిగాని, మల త్యాగము మాత్రమేగాదు. త్యాగము కర్మసన్న్యా సము. నరుల కిష్టమగుధనము ధర్మముగాని, పశ్వాదిక ముగాదు. భగవత్తము (పరమేశ్వరుఁ) డగు శ్రీకృష్ణుతే

యజ్ఞము. భగవద్బుద్ధితో యజ్ఞముఁ జేయనగుఁగాని కర్మమనుబుద్ధితోఁ జేయఁగూడదు. జ్ఞానోపదేశమే దక్షిణగాని యజ్ఞమందు ఋత్విక్కులకు యజమానుఁ డిచ్చు హిరణ్యాదికము గాదు. ఏలయన, జ్ఞానోపదేశముచే యజ్ఞరూపుఁ డగుభగవంతుని ప్రాప్తి దొరకొను గాన నదియే దక్షిణ. నియమించుటకుఁ గష్టసాధ్య మగు మనస్సు నరికట్టుటకుఁ బ్రాణాయామమవశ్యకము గాన నాప్రాణాయామమే బలము. భగ మన శ్రీకృష్ణుల యైశ్వర్యము. భగవద్భక్తియే యుత్తమలాభముగాని పుత్త్రాదికముగాదు. ఒకయాత్మ మఱియొకయాత్మకంటె భేద మను జ్ఞానము లేకుండుటయే విద్య. అనఁగా నాత్మ యొకటి యనుజ్ఞానమే నిజమయిన విద్యగాని, సామాన్యజ్ఞానమాత్రము విద్యకాదు. అకార్యములయం దసహ్యాత హ్రీగాని సిగ్గుమాత్రమేగాదు. నిరపేక్షము మున్నగు గుణము లలంకారముగాని కిరీటాదులుగావు. సుఖము విషయసుఖదుఃఖములను జెందకుండుటయేగాని, వానిభోగముగాదు. దుఃఖము విషయభోగాద్యపేక్షయేగాని, యగ్నిదాహాదికముగాదు. బంధమునుండి మోచనము గలుగు నుపాయ మరయువాఁడు పండితుఁడు; లేదా బంధమోక్షములస్వరూపమును నిజముగ నరయువాఁడు పండితుఁడు.

మూర్ఖుఁడు దేహగేహాదులందు 'నేను, నాది' యను నభిమానముగలవాఁడుగాని, ఘాతకుఁడుగాఁడు. సన్మార్గ మన, భగవత్ప్రాప్తిని బొందించు నివృత్తిధర్మమేగాని, ముళ్లులేని నుగాఁ గలప్రదేశముగాదు.' దుర్మార్గ మనఁ జిత్తవిక్షేపమును గలుగఁ జేయుఁ బ్రవృత్తిధర్మమేగాని, చోరాదిభీతి గలత్రోవగాదు. స్వర్గ మన సత్త్వగుణోద్రేకముఁ జేయునదిగాని, యింద్రాదిలోకముగాదు. నరక మనఁ దమోగుణోద్రేకముఁ జేయునదిగాని, తామిస్రాదిలోకముగాదు. భగవద్రూపుఁడైనగురువే బంధువుగాని, సోదరాదులుకారు. సకలధర్మస్వరూపుఁడై యాశలేనిహరియే గురువైనపుడింక నతనికంటె బంధు వెవఁడు? గృహము భోగస్థానమగుమనుష్యశరీరమేగాని, మేడ లోనగునిల్లుగాదు. ఆఢ్యుఁడుగుణవంతుఁడే గాని, ధనవంతుఁడు గాఁడు. దరిద్రుఁడు సంతోషములేనివాఁడుగాని, ధనము లేనివాఁడుగాఁడు. కృపణుఁ డజితేంద్రియుఁ డగుశోచనీయుఁడుగాని, దీనుఁడు గాఁడు. విషయములం దాసక్తిలేనివాఁడు స్వతంత్రుఁడుగాని, రాజు స్వతంత్రుఁడుగాఁడు. గుణాసక్తుఁడు స్వతంత్రుఁడుగాడు. పైఁజెప్పినశమాదిగుణములకు వ్యతిరేకములశమాదులు.

ప్ర. (15) గుణదోషము లెట్టివి ?

"గుణదోషదృశిర్దోషః" = ఇదిగుణము, ఇదిదోషము, అనుభేదజ్ఞానము దోషము. "గుణస్తూభయవర్జితః" = గుణదోషవిచారము లేకుండుటయే గుణము. అట్టివారికి గుణదోషములు లేవు. వీరే బ్రహ్మవిద్వరిష్ఠులు.

ప్ర. (16) తత్త్వసంఖ్యావ్యవస్థ యెట్టిది ?

ఉ. తత్త్వసంఖ్య వాదికల్పనలచే భిన్నముగాని, నిజ మాలోచించిన నొకటియేతత్త్వము.

ప్ర. (17) క్షేత్ర, క్షేత్రజ్ఞ భేద మేమి?

ఉ. క్షేత్రజ్ఞుఁడు స్వయంప్రకాశుఁడు. క్షేత్ర మతనిచేఁ బ్రకాశితము.

ప్ర. (18) దేహసంయోగవియోగము లెట్లు గలుగు ?

ఉ. ప్రపంచమం దభిమానముచే జీవాత్మకు మనఃకల్పితముగ నవి గలవుగాని, వాస్తవమున లేవు.

ప్ర. (19) అభిమాననివృత్తి యెట్లు ?

ఉ. మనోజయ మభిమానరాహిత్యమునకుఁ గారణము.

ప్ర. (20) క్రియాయోగ మెట్లు చేయనగు ?

ఉ. ప్రతిమలందు భగవదారాధనవిధానమే క్రియాయోగము. శిలాదారులోహమృచ్చిత్రసికతా మనోమణిమయము లని ప్రతిమలు 8 తెఱఁగులు.

ప్ర. (21) సంసారమున కధిష్ఠానము దేహమా? ఆత్మయా? లేక రెండునుగావా ?

ఉ. ప్రకృతిసంసర్గమువలన నిర్లిప్తుఁడైనపురుషుఁడు సంసారముఁ బొందుచున్నాఁడు గాన సంసారమున కధిష్ఠానము ప్రకృతిసంసర్గ మనునధ్యాసమే.

ప్ర. (22) పరమభక్తిస్వరూప మెట్టిది ?

ఉ. విరాడ్రూపుఁడగుపరమేశ్వరుని పూజయే పరమభక్తి. ఇది సత్సాంగత్యముచేఁ గలుగును. జనకుఁడు యాజ్ఞవల్క్యునొద్ద నాత్మతత్త్వ మెఱిఁగి తత్త్వానుభవముఁ గలిగి, తనను, తనరాజ్యమును, బంధువులను, సర్వస్వమును, గురువునకు సమర్పణముఁజేసెను. ["సోహం భగవతే విదేహాం దదామి మాంచాపి సహదాస్యాయేతి" బృ.] భగవంతునివలె మనోవాక్కాయములఁ బ్రవర్తింపవలయు. వినయము సర్వాలంకారము. సర్వభూతములందు హరిభావనముగలిగి, వానిని గౌరవించి, వానియందుఁగలజీవుఁ డీశ్వరకళ యనినమ్మి, సర్వభూతములకు, నుచ్చనీచభేదము లేక, సాష్టాంగనమస్కారముఁజేసి, యసూయాతిరస్కారాద్యభిమానత్యాగముఁ జేసికొని, సుఖముఁబొందవలెను. కాన హరికేగాక హరిమయమును, హరిపాదమును, నగు, ప్రపంచమునకుఁగూడ దాస్యసేవచేయుటయే పరమభక్తి. ఉద్ధవుఁడుచేసిన 22 ప్రశ్నలలో భగవంతుఁడు చెప్పినవిమ

యములను గూర్చి చేసినవి 6 ప్రశ్నలు. స్వబుద్ధిచే నడిగినవి 16 ప్రశ్నలు.

12-వ ప్రశ్నోత్తరమందు బ్రహ్మచర్యగృహస్థాశ్రమములు ఋణాశ్రమములనియు, వానప్రస్థయత్యాశ్రమము లనృణాశ్రమములనియు, రెండువిభాగములు చేయఁబడినవి. ఋణములు మూఁడు:—ఋషిఋణము, దేవఋణము, పితృఋణము. బ్రహ్మచర్యమందు వేదాధ్యయనముచే ఋషిఋణమును, గృహస్థాశ్రమమందు యాగాదులచే దేవఋణమును, ప్రజోత్పాదనముచేఁ బితృఋణమును, నివర్తించును. 17, 18 అధ్యాయములలో నీయుభయ విధకర్మముల క్రమత్యాగము చెప్పఁబడినది.

15-వ ప్రశ్నోత్తరములోఁ గర్మమాత్రమందు గుణదోషవ్యవస్థ గలదుగాని జ్ఞానభక్తులయందు లేదనియు, 19 వ ప్రశ్నోత్తరములో మనస్సు నాలుగు విధములుగను, వివరింపఁబడెను. భిక్షుగీతయం దాత్మకు మనస్సు విరోధియని చెప్పఁబడెను. భిక్షులకుఁగూడ మనస్సు విక్షేపకరముగాన నాత్మ కది శత్రువు. సాంఖ్యమును విచారించుటచే మనోబలము చెప్పినట్లయినది. శత్రుబలము కనుఁగొనినఁగాని జయోపాయ మరయ వీలులేదు గాన సాంఖ్యము ముందుఁ జెప్పఁబడినది. గుణలక్షణములను జెప్పుటచే మనో

భేదములను వక్కాణించిన ట్లయినది. ఐళగీతలలో మన స్సుతోఁ బోరి జయింపనగు నని చెప్పఁబడెను. అనేకవిధ విచారములచే మనోజయముఁజేసి యానంద మొంద వలయు. రజస్తమోగుణవృత్తులు మనస్సును, స్వాశ్రయ మగునాత్మను, బరిభవించును. మఱియు, నాత్మను సంసార మందుఁ బ్రవేశపెట్టును. సత్వవృత్తిచే నితర రెండుగుణ వృత్తులు నిస్సారములు కాఁగా మనస్సు మూలబలము లేనిదై సులభముగ జయింప నగు. ఐళగీతోపదేశమువలన మనోజయము చెప్పినట్లయినది. ఈ నాలుగంశములు 23, 24, 25, 26 అధ్యాయములలోఁ జెప్పఁబడినవి.

## ౭౪. లోకాత్మతత్త్వపరీక్ష.

ఇఁక లోకాత్మతత్త్వపరీక్ష చేయఁబడును. ఉద్ధవున కిది మొదటఁ జెప్పఁబడినది. లోకమువలనఁ దెలియఁదగిన విషయములను లోకములోని 25 విషయములను గురువుల యొద్దఁ దెలిసికొనవలయు. ఆత్మతత్త్వ మొకగురువువలన గ్రహింపవలయు. అది యేకప్రకారము. 8 మంది హీన గురువులు, 7-వ యధ్యాయములోను, 9 మంది మధ్యమ గురువులు 8-వ యధ్యాయములోను, 8 మంది యుత్తమ

గురువులు 9-వ యధ్యాయములోను, 1 ఆత్మతత్త్వము దేహావివేచనముచే 10-వ యధ్యాయములోను శ్రీకృష్ణులు వివరించిరి.

౬౮-అ. హీనగురువులు.

1. భూమి:— కంపాదిహేతువులు గలిగినను భూమి నిష్కంపముగ నుండునుగాననది నేర్చుకొనఁదగినది.
2. వాయువు:— సర్వత్రప్రచారముగలిగినను, వాయువునకు సువాసన దుర్వాసనలతో సంగము లేనట్లు, నిస్సంగత్వము వాయువువలన నేర్చుకొనఁ దగినది.
3. ఆకాశము:— చరాచరములతోఁ గలసినను, వాస్తవముగ నాకాశమునకు భేదము లేనట్లు, ఆత్మకుఁ బరిచ్ఛేదరాహిత్యమును జూడనగు.
4. జలము:— స్వచ్ఛత్వ, స్నిగ్ధత్వ, మధురత్వములచే జలమెట్లు దానిలోస్నానము చేసినవారిని బావనముఁ జేయు, నట్లు స్పర్శ, దర్శన, ధ్యానములవలన ముని శిష్యులను బావనముఁ జేయును.

"ఈక్షణధ్యానసంస్పర్శైః మత్స్యకూర్మవిహంగమాః,
పోషయంతిస్వకాన్ పుత్రాన్ తద్వత్పండితవృత్తయః."

5. అగ్ని:— తేజోవంతుఁడగుటవలన భక్ష్యాభక్ష్యము

లను గ్రహించినను నగ్ని దోషిగానట్లు బ్రహ్మజ్ఞానికిఁ గూడ వానిని దినుటవలన దోషము లేదు.

6. చంద్రుఁడు:— దేహమునకే గర్భాధానాదివికారములుగాని, యాత్మకుఁ గా వని చంద్రుని క్షీణవృద్ధికళలవలె నరయనగు.

7. సూర్యుఁడు:— జలపూర్ణ ఘటాద్యుపాధిభేదముచే భిన్నుఁడుగఁ గనఁబడినను, వాస్తవముగ భిన్నుఁడుఁ గానట్లాత్మ భిన్నుఁడుఁగాఁడు.

8. కపోతము:— స్త్రీపుత్రాది స్నేహముచేఁ గపోతము నశించునట్లు జ్ఞాని యితరులతో సంగమము చేయఁదగదు.

౭౮-౩. మధ్యమగురువులు.

9. అజగరము:— అదృష్టప్రాప్తమయినపదార్థ మజగరమువలె భుజింపవలయు.

10. సముద్రము:— నదీనదముల గమనాగమనములచేనేమి, కాలవైపరీత్యమునఁగాని, సముద్రమెట్లు చలింపదో యట్లే కామాదులచే క్షోభము నొందఁ గూడదు.

11. మిడత (పతంగః):— అగ్నిరూపముచే మిడత భ్రమముఁజెంది దానిలోఁబడి నశించినరీతిని స్త్రీరూపమును జూచి పురుషుఁడు మోహింపఁగూడదు.

12. (మధుకృత్) తుమ్మెద:— తుమ్మెద పూవులోనిరసము మాత్రముగ్రోలినట్లు మహాత్ములవలన శాస్త్రము విని సార మగు తత్త్వమును గ్రహింపవలయు.

13. మొగగజము (ఏనుఁగు):—ఆఁడుయేనుఁగు యొక్క స్పర్శముచేఁ జెడినట్లు ముని కాంతాస్పర్శమువలనఁ జెడును.

14. (మధుహా) తేనెటీఁగ:— తేనెను బోగుచేసిన తేనెటీఁగలను జంపి తేనెను దిను బోయకథవలన ధనసంచయముచేఁ జెడు లుబ్ధునివృత్తి మానవలయు.

15. లేడి:— శ్రవణేంద్రియలోలత్వముచే లేడి చెడిపోయినట్లు శ్రవణేంద్రియలోలుఁడు గాఁ గూడదు.

16. చేఁప.—చేఁపవలె విద్వాంసుఁడు తిండి యొక్కువతినఁ గూడదు.

17. పింగళయను భోగపుస్త్రీ:— సంసారమందత్యాసక్తి వదలుట పింగళ యనుబోగముదాని వృత్తాంతము వలనఁ దెలియ నగు.

౭౪-౮. ఉత్తమగురువులు.

18. కురలము:—కురలపక్షి దృష్టాంత మేమన:—మాంస ఖండమును నోటిలోనుంచుకొని పోవుచుండఁగ నింకొకపక్షితీసికొని పోవును. అట్లే ధనసంగ్రహము మాత్రముచేసిన ననర్థము ప్రాప్తించును. నిర్లోభత్వ మనఁగ సంచయత్యాగము. ఇక్కడ సంచితత్యాగము.

19. (అర్భకః) బాలుఁడు:— బాలునివలె నభిమానరాహిత్యము మునికి నావశ్యకము.

20. పిల్లచేతికంకణము:—చేతిలో నొకకంకణ మున్నయెడల నిశ్శబ్దముగనుండునట్లు సన్యాసి యితరసహవాసము చేయఁగూడదు.

21. (శరకృత్) బాణములను జేయువాఁడు:—బాణములను జేయువానివలె నేకాగ్రచిత్తముతో సన్యాసి యుండవలయు.

22. సర్పము:—చీమలు గట్టినపుట్టలోఁ బాముచేరిన ట్లితరులుగట్టినయింట్లో సన్యాసి యుండవలె.

23. సాలెపురుగు:—సాలెపురుగు దృష్టాంతమువలన నీశ్వరుఁడు ప్రపంచమున కభిన్ననిమిత్తోపాదానకారణ మనియరయనగు.

24. భ్రమరకీటము:—కీటము నిరంతరధ్యానముచే భ్రమ రమగునట్లు, మానవుఁ డగు ధ్యాత తీవ్రధ్యానముచే ధ్యేయాకారమునొందును.

ఈ 25 గురువుల యుపదేశమువలన సన్యాసికి నంతః కరణశుద్ధి నొందవలయు.

25. దేహము:—దేహము గురువులలో శ్రేష్ఠము. జన్మాది షడ్వికారము శరీరమునకుఁగాని యాత్మకుఁ గాదని నిశ్చ యింపనగు. ఇట్టిదేహమునకు విలక్షణమగు నాత్మ తత్త్వము నన్వయ వ్యతిరేకవిచారముచేఁ జేయనగు.

ఇంతవఱకు 7, 8, 9, 10 అధ్యాయములలో లోకా త్మతత్త్వపరీక్షలు చేయఁబడెను.

## ౭౫. కర్మభక్తియోగజ్ఞానములు.

11-వ యధ్యాయములో బద్ధముక్తసాధువులయొ క్కయు, భక్తియొక్కయు, లక్షణములు చెప్పఁబడినవి.

12-వ దానిలో సాధువులను, భగవంతుఁడు, భాగవ తులు,వారిసాంగత్యము, మాహాత్మ్యము,కర్మానుష్ఠానము, కర్మత్యాగమును, వర్ణింపఁబడినవి.

13-వ దానిలో సత్వవృద్ధి, విద్యోదయక్రమము, హంసేతిహాసమందు చిత్తగుణవిశేషవర్ణనమును, గలదు.

14-వ దానిలో ముఖ్యశ్రేయస్సు భక్తియనియు, సాధనములతోఁ గూడిన ధ్యానయోగవర్ణనమును,గలదు.

15-వ దానిలో ధారణము ననుసరించి వచ్చు యోగసిద్ధులు, శ్రీవిష్ణుపదప్రాప్తికవి విఘ్నములనియు,వివరింపఁబడినవి. పతంజలియోగశాస్త్రములోని సిద్ధు లనాత్మధారణమువలనఁ గలుగును. ఇక్కడఁ జెప్పఁబడిన సిద్ధు లాత్మధారణమువలనఁ గలుగును.

16-వ దానిలో హరియొక్కవిభూతులు, జ్ఞాన వీర్య ప్రభావాదులును, వర్ణింపఁబడినవి.

17-వ దానిలో శ్రీవిష్ణుభక్తినిఁగలిగించు వర్ణాశ్రమ ధర్మములనడుగ, బ్రహ్మచారి గృహస్థుల ధర్మములను హంసగీతరూపమున శ్రీకృష్ణు లుద్ధవునకు సెలవిచ్చిరి.

18-వ దానిలో వానప్రస్థయతుల ధర్మమధికారివ్యవస్థతోఁగూడఁ జెప్పఁబడినది.

19-వ దానిలో మొదటఁ గర్మభక్తిజ్ఞానస్వరూపములు, వాని యధికారులు, కర్మభక్తిజ్ఞానత్యాగము, జ్ఞానికి శ్రౌతస్మార్తకర్మ మగత్యము లేదనుటకు యుక్తి, తర్కములును, వివరింపఁబడెను.

20-వ దానిలో భక్తిజ్ఞానకర్మయోగముల విశేషములు, గుణదోషవ్యవస్థకొఱకు నధికారివిభాగమును, గూడఁ జెప్పఁబడెను.

21-వ దానిలో భక్తిజ్ఞానకర్మయోగముల కనధికారులగు కాముకుల ద్రవ్యగుణదోషములు ప్రపంచము చేయఁబడెను.

22-వ దానిలోఁ దత్త్వసంఖ్యావిరోధము, పురుషప్రకృతివివేకము, జన్మమృత్యువిధానాదికమును, వివరింపఁబడినవి.

23-వ దానిలోఁ దిరస్కారము సహనముచేఁ దగ్గించునుపాయము, బుద్ధిచే మనస్సంయమము, భిక్షుగీతారూపమున వర్ణింపఁబడెను.

24-వ దానిలో సర్వభావములు జన్మనాశములుగలవి గాన నాత్మకు లేవనియు, సాంఖ్యయుక్తులతో మనోమోహనాశమును, భగవద్భక్తివలన వైషయిక సుఖదుఃఖాదిద్వంద్వముల జయమును, సాంఖ్యతత్త్వమును, వివరింపఁబడెను. మఱియు, నాత్మనిర్గుణుఁడని నిరూపించుటకుఁ జిత్తములోఁ బుట్టిన సత్త్వరజస్తమోగుణవృత్తులుగూడ వర్ణింపఁబడెను.

26-వ దానిలో యోగనిష్ఠ దుష్టసాంగత్యమువలనఁ జెడుననియు, సత్సాంగత్యమువలన ఫలించుననియు, యోగభ్రంశమునకు హేతువులను దగ్గఱరానియ్యఁగూడదని ఐళగీతలును వివరింపఁబడెను.

27-వ దానిలో దేవతార్చన మను క్రియాయోగమువలనఁ జిత్తప్రసాదముగలుగుననియు, సర్వకామములు ఫలించుననియు, నంగములతోఁగూడ వివరింపఁబడెను. రాగద్వేషాదులచే వ్యాకులమగు చిత్తముగలసంసారికి నసంగాదులుగలుగుటకు శ్రీకృష్ణార్చనము, తదనుస్మృతియు, నవశ్యమని వివరింపఁబడెను.

28 వ దానిలో నిదివఱలోఁ జెప్పఁబడినజ్ఞానయోగము సంగ్రహముగ ననువదింపఁబడెను.

29 వ దానిలో నుద్ధవుఁడు మోక్షమునకు సులభోపాయ మడుగఁగ నిదివఱలో విస్తారముగఁ జెప్పఁబడినకర్మ భక్తిజ్ఞానయోగములసారమగునివృత్తిధర్మము నీతీరున శ్రీకృష్ణులు చెప్పి యుపదేశము ముగించిరి:—అయ్యా, దయాధర్మంబులు పుణ్యావహంబులు పాపహరంబులు గావునఁ బరమమంగళంబులు, వానిని వివరించితి. వానిని శ్రద్ధతో నాచరించుమర్త్యుఁడు దుర్జయంబైనసంసారమును జయించు. నన్నుఁదలంచుచు నాపై సంకల్పాత్మకంబైనమనస్సు

ననుసంధానాత్మకం బైనచిత్తంబునుంబెట్టి మద్ధర్మము
లపై నాత్మరతినొంది మెల్లన నాతదర్థము (నానిమిత్తము)
సర్వకర్మముల నొనర్పవలయు. మద్భక్తులైనసాధువు లాశ్ర
యించిన పుణ్యదేశముల సేవింపవలయు. దేవాసురమను
ష్యులలో నాభక్తులైనవా రాచరించిన కర్మములు గొన
వలయు. ఒక్కరుండకాని పలువురితోడంగూడికాని నృత్త
గీతాది మహారాజైశ్వర్యంబులు వెలయ నాకుపర్వయాత్రా
మహోత్సవంబులుసేయువలయు. నిర్మలమానసుండై సర్వ
భూతములందును దనయందును నభంబుబోలె బహిరం
తరనావృతుండైన నన్నుంగనవలయు. ఇట్టి జ్ఞానదృష్టి నాశ్ర
యించి సర్వభూతములను మద్భావమునం బూజించుచు
బ్రాహ్మణ చండాలులందును చోరబ్రహ్మణ్యులందును సూ
ర్యస్ఫులింగములందును గ్రూరాక్రూరులందును సమదర్శ
నంబు వెట్టునతండు పండితుండు. నరులందు మద్భావమును
మిక్కిలి భావించుపురుషున కచిరంబస్పర్ధాసూయాతిర
స్కారాహంకారములు పోవును. పరిహసించు స్వజనులను,
దేహాభిమానమును, లజ్జను, విడిచి, శ్వచండాలగోగర్దభాది
సర్వభూతములకు నంతర్యామీశ్వరబుద్ధి వెట్టి దండప్రణా
మం బొనర్పవలయు. సర్వభూతములందును మద్భావంబు
లెస్సగలుగునంతకు మనోవాక్కాయవృత్తుల నిట్లుపా

సింపవలయు. వానికిఁ గ్రమంబున సర్వంబు బ్రహ్మాత్మకం బగు. అన్నింట నీశ్వరదర్శనమునం బొడమినవిద్య నిట్లు చూచు నతఁడు ముక్తబంధనుండై సర్వోపరతినొందెడు. మనోవాక్కాయకర్మంబుల సర్వభూతములందు మద్భావ భావనంబే సర్వోపాయంబులలోనం గడుమేలివెరవు. నిష్కామునకు మద్ధర్మారంభమున నణుమాత్రంబేనియు నంతరాయంబు గలుగదు. ఈధర్మము నిర్గుణంబుగా నాచే నిర్ణీతం బయ్యె. నిరర్థకధర్మమేనియుఁ గామన విడిచి నాయెడ సర్పింపఁబడునేని ధర్మంబగు. నిరర్థాయాసంబయ్యు లోకమున భయశోకాదులు పలాయనాదిక్లేశములఁ గలిగించుఁగదా? అసత్యమగుమర్త్యశరీరమున సత్యుఁడమృతుఁడు నగు నన్నుఁ గాంచుటనుటే బుద్ధిమంతుల బుద్ధియుఁ జతురుల చాతుర్యంబు నగు. ఈబోధవలన బ్రహ్మముం బ్రాపించు. దీని నాభక్తులగు స్త్రీపురుషుల కెల్లరకు లెస్స బోధించు. బ్రహ్మవిద్యాప్రదునకే నాత్మదానంబిత్తు.''

అంత శ్రీకృష్ణుల కుద్ధవుఁడు సాష్టాంగదండంబుఁ గావించి వారియాజ్ఞానుసారమున బదరీనారాయణమున కరిగి యందుఁ దపంబొనరించి ముక్తినొందెను. పిదప యాదవులు సురాపానమత్తులై యన్యోన్యవిహతులయిరి. జరుఁడను బోయ శ్రీకృష్ణపాదముపై మృగభ్రాంతిని

బాణమేయ భగవంతుఁడు లోచనంబులు ముకుళించి ధ్యానమంగళంబు, లోకరమణీయము, నగునాత్మదివ్య విగ్రహంబు నాగ్నేయయోగధారణను వహింపకయే దానితోడ శ్రీవైకుంఠలోకమునకు విచ్చేసె.

౭౬. శ్రీకృష్ణనివృత్తి ధర్మాచరణఫలము.

సోదరులారా, పరమపురుషునకు యాదవకులమున జనించుట మున్నగుచర్యలు నటునకు వేషధారణం బెట్టు లట్టులు మాయావిడంబనం బని యెఱుంగుఁడు. ఈజగం బెల్లఁ దానేపుట్టించి యం దంతర్యామియై చొచ్చి తుది నుపసంహరించి యాత్మమహిమంబున నుపరతుండై యప్ప రమాత్ముండు వెలయుఁ గదా? దేవదేవుఁడైన హరియవ తారపర్యములను సుఖకరము లగుబాల్యక్రీడల నుభయ లోకశుభదంబు లైనవానిం గీర్తించుమానవుఁడు పరమ హంసగమ్యుఁడైన శ్రీకృష్ణునిపై పరమభక్తింబడయు. కాన, “శిరస్తవనివాస జగత్ప్రణామేదృష్టిస్సతాం దర్శనే భవత్తనూనాం” (భా. 10. 10. 39) అని నలకూబరమణి గ్రీవులు శ్రీకృష్ణునితో మనవిచేసినప్రకారము జగత్తు భగవదాలయమనియు, జగత్సేవయు, భాగవతసేవయు,

భగవత్సేవయనియు,నరయునగు."సఆతిథ్యావశిష్టం యద్బహుమానపురస్సరం, తస్యదత్వానమశ్చక్రే శ్వభ్యశ్శ్వపతయేవిభుః"(భా 9.21.6) అని రంతిదేవమహారాజు కుక్కలగమికిని వానిపతికిని భగవద్రూపములని బ్రాహ్మణశూద్రులకంటె నతిగౌరవముతో నతిథిసత్కారముఁ జేసెను. (౧౬౨-౩ పుటలు). ప్రబుద్ధుఁడు నిమికి మాయాతరణోపాయములను జెప్పుటలో "ఏవంకృష్ణాత్మనాథేషు మనుష్యేషుచసౌహృదం, పరిచర్యాంచోభయత్ర మహత్సునృషుసాధుషు" (భా. 11-3.33 )=కృష్ణుఁడే యాత్మయనిగాని నాథుఁడనిగాని యెన్నుభాగవతులందును, నితరమానవులందును,సుహృద్భావము గలిగియుండవలయు. స్థావరజంగమప్రపంచమునకు సేవ (పరిచర్య)ఁజేయవలయు. అందులో నరులకు, వారిలో స్వధర్మశీలురకు, వారిలోభాగవతులకు, నధికముగ సేవఁజేయవలయు",నని సెలవిచ్చిరి. ప్రహ్లాదుఁడు గూడఁ దనకంటెఁ బెద్దలయెడ దాసుఁడుగను, తనసమానులయెడ సోదరుఁడుగను,దీనులయెడఁ దండ్రిగను, గురువులయెడ భక్తునివలెను బ్రేమఁజూపినట్లు చెప్పఁబడియున్నది. (7-3-3233). పంచభూతంబులు తన్మాత్రంబులు దిక్తరుగిరినదీ సముద్రములు మున్నగునవియెల్ల హరిశరీరమని భావించి యనన్యమతి నన్నింటిని మ్రొక్కవలయు నని కవి

నిమికిఁ జెప్పెను. (11-2.41.) శ్రీకృష్ణు లుద్ధవున కుపదేశాం తమందు సర్వభూతములందు నాకాశమువలె వెలుపలను లోపలను దాను నిత్యముగ వ్యాపించియున్నాఁడు గాన వానియందుఁ దనభావనతో గౌరవముఁ జూపవలయు నని సెలవిచ్చి శ్వ చండాల గో గర్దభాది సర్వభూతములకు లజ్జా హంకారాదులను వదలి సాష్టాంగదండ మాచరింపవలయు నని చెప్పి బోధ నిగమించిరి. కాన నీబోధ సర్వభూత సుహృత్త్వము గలిగినఁగాని బ్రహ్మాత్మైక్యజ్ఞానము గలుగ దనుభగవద్గీతోపదేశమును బలపఱచు చున్నది. కాన, (5,6, 12 అధ్యాయములలో,)"భవభయ మపహర్తుంజ్ఞాన విజ్ఞానసారం నిగమకృదుపజహ్రే భృంగవ ద్వేదసారం, అమృతముదధితశ్చాపాయ యద్భృత్యవర్గాన్ పురుషమృషి మాద్యంవిష్ణుసంజ్ఞంనతోఽస్మి"=భృంగము పుష్పసార ముం బోలె నిసృత్తులకు సంసారతాపంబుఁ దీర్ప వేదముల నుండి జ్ఞానవిజ్ఞాన సారామృతం బుద్ధరించియుఁ, బ్రవృత్తు లకు జరామరణాదిభయముఁ దొలఁగింప సముద్రము నుండి యమృతము నుద్ధరించియుఁ, దత్తదధికారానుగుణ ముగఁదనభృత్యులకుఁ గ్రోలనొసంగిన పరమకారుణికుఁడు పురుషోత్తముఁ డాద్యుఁడు వేదకర్తయు నగు విష్ణునామ ముగలవానికి మ్రొక్కుదును.

హరిః ఓం.

శ్రీగురుభ్యోనమః.

# ద్వాదశస్కంధసారము.

---

శ్లో. యం బ్రహ్మా వరుణేంద్రరుద్రమరుతః
స్తున్వంతిదివ్యైః స్తవైః,
ర్వేదైస్సాంగ పదక్రమోపనిషదై
ర్గాయంతియం సామగాః,
ధ్యానావస్థిత తద్గతేనమనసా
పశ్యంతి యం యోగినో,
యస్యాంతం నవిదుస్సురాసురగణా
దేవాయ తస్మై నమః.

## ౭౭. ద్వాదశస్కంధ సంగ్రహము.

సోదరులారా !

ఆశ్రయము 12-వ స్కంధములో నుండు 13 అధ్యా యములలో ముఖ్యముగ వర్ణింపఁబడినది. దాని కంగముగ

నిరోధప్రకారములు పూర్వస్కంధోక్తవిషయములతో సంగ్రహింపఁబడినవి. ఆశ్రయమన బ్రహ్మము, పరమాత్మ, భగవంతుఁడు. "వదంతి తత్తత్త్వవిదః తత్త్వంయజ్జ్ఞాన మద్వయం, బ్రహ్మేతి పరమాత్మేతి భగవా నితి శబ్ద్యతే" (1-2.12) త్రాఁటియందుఁ బాముvలె నెవరియందుఁ బ్రపంచము స్ఫురించుచున్నదో యది యాశ్రయ మగు పరమాత్మ. కాననాశ్రయముపాదేయము=తానని తెలియఁదగినది. ప్రపంచము హేయము=వదలివేయఁదగినది. హేయమగువిషయమును బరిత్యజించి విషయి యగుబ్రహ్మము నేనని తెలియనగు.

౭౮. ప్రపంచసృష్టిస్థితిలయవర్ణనము.

పంచార్థవాదముల వర్ణనమూలముగ బ్రహ్మతత్త్వమును బరోక్షముగఁ దెలియఁజేయుట తైత్తిరీయాదిశ్రుతులరీతి. ఆన్యాయము ననుసరించి జగత్సృష్టిస్థితిలయాంతర్యామ్యనుప్రవేశములగు పంచార్థవాదములవిపరమీపురాణములోఁ జేయఁబడెను. కడచిన 11 స్కంధములలో విపులముగ వర్ణింపఁబడినవిషయ మీస్కంధములో సంక్షేపముగఁ జెప్పఁబడెను. మొదటినాలుగధ్యాయములలో హేయమగుప్రపంచము వర్ణింపఁబడినది. ఒకటి రెండధ్యాయములలో భవిష్యద్రాజుల జన్మస్థితిలయములు, వారిదుర్బలదుర్మార్గములు, వారి యనిత్యతయు, కలియుగ

ములో నాయుర్బలాదులుతగ్గి దానియంతమందు పురుషుఁడు కల్కియవతారమెత్తి యారాజులను బరిమార్చి కృతయుగధర్మమును శ్రీమరుదేవాపిమహర్షుల ద్వారమున స్థాపనము జేయుటయు, వర్ణింపఁబడినవి. మూఁడవదానిలో యుగభేదములు, వానిధర్మములు, నాల్గవదానిలో నిత్యనైమిత్తికప్రాకృతికాత్యంతికలయంబులును, సవిస్తరంబుగ వివరింపఁబడినవి. వీనిలో ధర్మగ్లానినిమిత్తకమయినలయము దశమసారమందును, నాత్యంతికలయమనుము క్తిని నేకాదశసారమందును, వివరించితి. బ్రహ్మాది సర్వభూతముల కెల్లప్పుడు నుత్పత్తిప్రళయంబులను సూక్ష్మదర్శులరయుదురు. దేహధాతు విశేషములరసినయాయుర్వేదజ్ఞులకు, భౌతికశాస్త్రజ్ఞులకు, నిది సమ్మతమే. కాలప్రవాహవేగమున నిత్యము హరింపఁబడు దేహాద్యవస్థలు పరిణామిప్రవాహాదులకుంబోలె నుచ్చనీచంబులగు. ఆకాశమునందుఁ జంద్రాదుల గమనాద్యవస్థ లెట్టు లాద్యంతశూన్యంబైనకాలంబునం గలుగు నవస్థలు స్థూలదృష్టులకుఁ గానంబడవు. ఇయ్యది నిత్యలయము. చతుర్యుగసహస్రంబులు బ్రహ్మ కొక్కపవలగు. అయ్యది చతుర్దశమన్వంతరోపలక్షితం బైనకల్పమనం బరఁగు. దాని తుది నంతకాలము బ్రహ్మకు రాత్రియగు. అప్పుడు భూర్భువస్సువర్లోకంబు ప్రళయంబునొందు. ఇయ్యది నైమి

త్తికప్రళయంబు. ఇందు బ్రహ్మయు శేషశయనుండై నారా
యణుండును జగంబుపసంహరించి శయనింతురు. బ్రహ్మకు
ద్విపరార్థాయువు దీఱినపిదప మహదహంకారపంచతన్మా
త్రలు వానివికారములతో లయించినం గాలవశంబున
నండకోశమెల్ల లయించు. ఇయ్యది ప్రాకృతికలయము.
అత్యంతికలయముతప్ప తక్కినలయములలో రాఁబోవు
సృష్టికి హేతువు లగుబీజములగు సంస్కారములు మాత్ర
ము మిగులును. వానికి స్వరూపనాశనమున్నయెడల సాం
ఖ్యయోగవేదాంత శాంకరరామానుజమతస్థు లందఱు
నంగీకరించిన సత్కార్యవాదమునకు భంగము గలుగ
వలయు. మహాప్రళయములోఁగూడ నిర్బీజలయము లేదని
దేవతాధికరణములో బాదరాయణులు స్థాపించిరి. దానిని
భాష్యకారాదులు పురాణములననుసరించి బలపఱచిరి.
మూఁడవస్కంధసారముఁ జూడనగు. ఈపంచలయోప
న్యాసమువలన మన మరయఁదగినయంశ మేమన ననిత్య
మగుప్రపంచమందాశవదలి సత్యమగునాత్మ నేనని తెలిసి
ప్రవర్తించి సుఖింపనగు.

### ౭౯. భగవత్తత్త్వశ్రవణము.

అయిదవయధ్యాయములో పరీక్షిద్రాజఫలదర్శన
ముచే భగవత్తత్త్వ ముపాదేయ మని వర్ణింపఁబడి, దాని

నరయు నుపాయములగుహరితత్త్వశ్రవణమనననిదిధ్యాసములు సూచింపఁబడినవి. హరితత్త్వశ్రవణమనననిదిధ్యాసములు 5 మొదలు 11 అధ్యాయములలో వివరింపఁబడినవి. శుకులు పరీక్షిత్తునకు నైదాఱధ్యాయములలో బ్రహ్మతత్త్వమీతీరున నుపదేశించి మృత్యుభీతి వారించి చనిరి:— ''ఎవ్వని ప్రసాదమున బ్రహ్మయు నెవ్వనిక్రోధమున రుద్రుఁడుం బుట్టె రవిశ్వాత్ముఁడైనహరి యిమ్మహాపురాణంబున వర్ణింపఁబడె. రాజేంద్రా,

ఉ. ''ఏను మృతుండ నౌదు నని
యంతభయంబు మనంబులోపలన్
మానుము..........''

దేహము ముందులేక నడుమం బుట్టి నశించువిధమునఁ గాక నీవు ముందులేనివాఁడవు నిప్పుడు నశించువాఁడవు గావు. బీజాంకురములరీతిం బుత్రపౌత్రాదిరూపమున భావనాభావనంబులు జీవుఁడగునీకుఁ గలుగునని తలఁపరాదు. ఒకసమిత్తునుండి వేఱొకసమిత్తున నగ్ని కన్పట్టువిధమున నాత్మఁ డొకదేహమునుండి వేఱొకదేహమునకుంబోవు నింతియుకాని భావనాభావనంబు లాత్మునకుఁ గలుగవు. అయ్యవి సమిత్తునకుంబోలె దేహమునకే యగు. స్వప్నమునందుఁ దాను దన శిరశ్ఛేదముం గాంచుతెఱంగున జాగరంబునందు నాత్ముఁడు దేహనాశంబుఁజూచు. అయ్యది యాత్మనాశమనుట భ్రమంబు. ఆత్ముఁడు జరామృత్యువర్జితుండు. ఘటముపగిలినం దదాకాశము మహాకాశములో

నేకీభవించువిధమున దేహము నచ్చిన, జీవుఁడు బ్రహ్మం
బున నేకీభవించు. మనస్సు దేహగుణకర్మముల నాత్మ
నకు సృజించు. అమ్మనంబును మాయసృజించు. అమ్మాయ
వలన జీవునకు సంసారంబగు. తైలాధిష్ఠానవర్తివహ్నిసం
యోగము గలుగునంతకు దీపమునకు జ్వాలారూపపరి
ణామంబు గలుగు విధమున రజస్సత్త్వతమోవృత్తులం
జేసి దేహాకృతంబైనసంసారము మనస్సునకుఁ గలుగుఁ
గాని యాత్మునకుఁ గలుగదు. ఆత్ముఁడు జన్మవృద్ధి క్షయాది
రహితుఁడు. దేహమునం బ్రతీయమానుఁడా కాశమువోలె
నిర్వికారుఁ డనంతుఁ డనుపముఁడు విభుఁడు నై స్వప్రకా
శుఁడై స్థూలసూక్ష్మములకుఁ బరుండగు. ఇవ్విధంబున
నాత్ముఁడు దేహాద్యుపాధిస్థుతుం డని నీవు మనంబున నను
మానప్రమాణసహాకృతజ్ఞానమునను వాసుదేవానుచింత
నంబునను నిమర్శింపుము. మృత్యువులకు మృత్యు వీశ్వ
రుఁడు నగునాత్ముఁడైననిన్ను మృత్యుహేతువు లుపసర్పిం
పఁజాలవు. కావున విప్రశాపచోదితుండైనతక్షకుండు
నిన్నుదహించుననుట పొసగదు. 'అహంబ్రహ్మపరంధామ
బ్రహ్మాహంపరమంపదం ఏవంసమీక్షన్నాత్మాన మాత్మ
న్యాధాయనిష్కలే,= ఏను బరబ్రహ్మంబు పరబ్రహ్మం బేన
యని నిరుపాధికపరబ్రహ్మస్వరూపంబునం దాత్మైకత్వం
బనుసంధించి యుపరతిం జెందు దేని,తక్షకుండు విషజిహ్వలఁ

గాలుగలిచిన నీశరీరము నీవిశ్వము నాత్మాతిరిక్తంబుగాఁ గనుంగొనవు". దీనిని నిష్పక్షపాతబుద్ధితో నరసిన శ్రీ శుకాచార్యులద్వైతతత్త్వమును రాజున కుపదేశించిన ట్లగపడు. అది వేదాంతభగవద్గీతా బ్రహ్మసూత్రార్థముల ననుసరించుచున్నది. రాజు సమాధిలోనుండఁగాఁ దక్షకుఁ డతనిదేహమును గఱవఁగ దానినిద్యజించెను. పిదప సూతుఁడు శౌనకాదులకు బ్రహ్మతత్త్వశ్రవణ సిద్ధికొఱకు 'నధ్యాసాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే'యను న్యాయానుసారముగా వేదశాఖావిభాగములను, శబ్దోత్పత్తిని, ఆఱవయధ్యాయమందు వివరించెను. శబ్దోత్పత్తి స్థానము స్ఫోట మనఁబడు. అది యవ్యక్తమగు నోంకారము. అది వేదమాత,దానిపేరు పరా.పశ్యంతీ,మధ్యమా, వైఖరీ, రూపములు దానిపరిణామములు. వేదశాఖలవివరములు నేఁ జేసిన శ్రీవిద్యారణ్యచరిత్రలోఁ జూడనగు. ఏడవదానిలో వేదోపాంగములగు పురాణముల లక్షణములు, విభాగములు, వర్ణింపఁబడె. కాన నీవిధముగ 5, 6,7, వ యధ్యాయములలో శ్రవణము వివరింపఁబడెను.

### ౨౦. మననము.

8, 9, 10, వ యధ్యాయములలో మార్కండేయ కథా, విష్ణువీక్షా, మాయావీక్షారూప మగుమననము

వర్ణింపఁబడెను. 8 వ యధ్యాయములో మార్కండేయు లకు నరనారాయణ దర్శనముచే బరోక్షతత్త్వజ్ఞానము వివరింపఁబడినది. 9 వ యధ్యాయములో మాయాశిశు దేహములోఁ బ్రవేశనిర్గమ వర్ణనముచే సంసారభ్రమము వర్ణింపఁబడినది. చిన్నపిల్లవాని పొట్టలోఁ బ్రపంచమె ట్లిమిడియుండును? (అసంభావనము), తిరిగి ప్రపంచము వచ్చుట (విపరీతభావనము), వీనివలన సంశయభావనము గూడఁగలుగు. ఈమూఁడు 9 వ యధ్యాయములో వివ రింపఁబడినవి. 10వ యధ్యాయములో మననదృఢము కొఱ కును, సంసారభ్రమనిరాసము కొఱకును, శివసాక్షాత్కార మును, వారిచే నపరోక్షతత్త్వజ్ఞానమును, జెప్పఁబడెను. మార్కండేయు లిప్పటికి లోకోపకారముఁ జేయుచుఁ దిరు గుచున్నారు. ఇంక హరిహరమార్కండేయ సంవాదము వలన నరయఁదగిన విశేషము లేమన:— బ్రహ్మజ్ఞానము కంటె హరిహరులమీఁద నెట్లు లట్లు భాగవతుల మీఁద దృఢభక్తిఁ ('భగవత్యచ్యుతే భక్తిం తత్పరేషు యథా శివే, 12-10-34.) గలుగునట్లు దానిని సంపాదింపవలయు. సాధువులు, శాంతులు, నిస్సంగులు, భూతవత్సలులు, నిర్వైరులు, సమదర్శనులు, హరిహర బ్రహ్మల కేకాంత భక్తులు, హరునియందు, నచ్యుతునందు, బ్రహ్మయందు,

నణుమాత్రంబేనియు భేదమును, నాత్మపరభేదమును,
గాంచ రని శివవాక్యము:—

'న తేమయ్యచ్యుతేఽజేచ భిదామణ్వపి చక్షతే,
నాత్మనశ్చ పరశ్చాపి తద్ద్రష్టాన్వయమీమహి'(12-10-22).

హరబ్రహ్మాది దేవతలయెదుట దక్షునకు శ్రీహరి సర్వ
భూతాత్ము లేక స్వరూపులు, నీశ్వరులు, సాక్షిమాత్రులు,
స్వయంప్రకాశులు, భేదరహితులగు హరిహరబ్రహ్మలలో
భేదము గనని యతండు శాంతిం బొందునని బోధించిరి:—

'అహం బ్రహ్మాచ శర్వశ్చ జగతః కారణంపరం,
ఆత్మేశ్వరఉపద్రష్టా స్వయం దృగవిశేషణః.
త్రయాణా మేకభావానాం యో నపశ్యతి వై భిదాం,
సర్వభూతాత్మనాం బ్రహ్మన్ సశాంతి మధిగచ్ఛతి.'
(4-8-50-54.)

కాన జీవైక్యమును, ప్రపంచైక్యమును, ఈశ్వరజీవైక్య
మును, భావనముఁ జేయఁగ నన్నిటియందును సమభావ
మేర్పడి మనస్సు ప్రేమపూరితముగాఁగ స్వత్వపరత్వముఁ
బోయి వైరమున కావంతయయిన యెడముయ్యదు. అట్టి
మతము నరు లవలంబించినచోఁ గ్రోధనిర్భరమైన ప్రకృత
పాశ్చాత్యఘోరరణముచూసి సర్వజనులందుఁ బరస్పరము
ప్రేమాభివృద్ధినొంది జగము మేలొందును. కాన మాలా

కారుఁడు శ్రీకృష్ణులను "నీపాదకమలసేవయు, నీపాదార్చ కులతోడి నెయ్యము, నితాంతాపారభూత దయయును, దాపసమందార నాకు దయ చేయఁగదె" యని యడిగిన తీరున సర్వభూతములయం దనన్యప్రేమఁగలుగవలయు నని వారిని, వారిభక్తులనుఁ, బ్రార్థింపవలయు. మఱియు నలకూబరమణిగ్రీవులవలె "శిరస్తవనివాసజగత్ప్రణామే" యని ప్రపంచమంతయు భగవదాలయమని గౌరవబుద్ధితోఁ బ్రేమింపవలయును. మఱియు రంతిదేవమహారాజువలె 'ఆర్తిం ప్రపద్యే ఽఖిలలోకభాజాం'='శరీరధారులకు నాపదఁగల్గిన వారియాపదల్ గ్రన్ననమాన్పి సుఖంబులు చేయుట కన్న యొండుమేలున్నదే' =ఇతరభూతములయాపదలను మనము వహించి వారి యాపదలను నివారణముఁ జేయుసామర్థ్యము మనకుఁ గలుగునట్లు భగవంతునిశరణుఁ జొచ్చవలయును. ఇందులకు దృష్టాంతము శ్రీకృష్ణులే గాక గోకులములోని వృక్షములుగూడ:— అవి "వాతాతపహిమాన్ సహాంతః వారయంతినః"=ఆచెట్లక్రిందికివచ్చినవారికి గాలి యెండ మంచు దగలకుండఁగ వారించుచు, వాగాలియెండ మంచును నవియే సహించుచున్నవి. నిద్రాహారాదులు లేక యేడురాత్రిళ్లు పగళ్లు భగవంతుఁ డొక్కవ్రేలిమీఁద గోవర్థనమును ధరించి ప్రళయకాలవర్షమునుండి గోకులమును రక్షింపలేదా? అట్టి మహత్తమమయిన స్వార్థత్యాగపూర్వ

కపరార్థరూప మగులోకోపకారము చేయుటయే భగవదా రాధనములలో శ్రేష్ఠమనియు,నదియేజన్మసామగ్ర్యమనియు, భాగవతము నొక్కి చెప్పుచున్నది. కాన నాధర్మమును గట్టిగ నరసి యాచరించి ధన్యులగుదురు గాక.

౮౧ నిదిధ్యాసము—పాంచరాత్రికింత్రము.

విష్ణుతత్త్వశ్రవణమననములను ధారణము యొక్కయనంతర మది యనుభవమునకు వచ్చువఱకు నిది ధ్యాసమనుధ్యానము చేయవలయు. 11 - వ యధ్యాయ ములో భగవన్మూర్తితత్త్వము పూజావిధానముతో వివ రింపఁబడినది. తద్ధ్యానసిద్ధికొఱకు సూర్యమండలమందు నారాయణాధిష్ఠాతృత్త్వము, సూర్యవ్యూహములు, వర్ణింపఁబడినవి. ప్రథమస్కంధారంభమందుఁ జెప్పఁబడి నట్లు సమస్తవిరాట్స్వరూపంబు నొందినపురుషుని ధ్యాన ముచే వేదపాంచరాత్రతంత్రములు మర్త్యుం డమర్త్యుం డగునని నుడువుచున్నవి. "అతండు కౌస్తుభవ్యాజమున నాత్మతేజమును శ్రీవత్సనామమునఁ దత్ప్రభను, వనమా లాభిఖ్యను గుణమయంబైనతనమాయను, ఛందోమయం బైన పీతాంబరంబును, వర్ణత్రయాత్మకప్రణవరూప మగు బ్రహ్మసూత్రమును, సాంఖ్యయోగాత్మకంబులైనమకర కుండలములను, బ్రహ్మలోకరూపంబైనమౌళిని, బ్రధా

నాత్మకం బై ధర్మజ్ఞానాదిసమన్విత సత్త్వగుణాభిధపద్మ స్వరూపం బైనయనంతనామకాసనంబును, నోజస్సహో బలయుతప్రాణతత్త్వాత్మకగదను, నుదకతత్త్వాత్మకశంఖమును, దేజస్తత్త్వాత్మకచక్రమును, నభోనిభనభస్తత్త్వమయఖడ్గమును, దమోమయచర్మమును, గాలరూపశార్ఙ్గధనుస్సును, గర్మమయతూణీరములను, నింద్రియశరములను, గ్రియాశక్తియుక్తమనోమయరథమును, దన్మాత్రమయరథరూపమును, ధరించు వరదాభయదాదిముద్రలఁ దత్తత్కార్యకరమగురూపము భావించు. సూర్యమండలము తదీయపూజాస్థానముఁగను మంత్రదీక్ష తత్పూజార్హసంస్కారముఁగను, దత్పరిచర్య యాత్మదురితక్షయంబుగను, భావింపవలయు. ఆభగవంతుఁడు భగశబ్దార్థ మగుషడ్గుణంబుల పేరిటిలీలాకమలమును ధర్మయశోనామకచామర వ్యజనముల నైకుంఠలోకంబు పేరిటి నిర్భయాతపత్రమును ధరించు. ఋగ్యజుస్సామరూప మగు వేదము యజ్ఞాఖ్యుఁ డగుసుపర్ణుని వహించు. తన్నెప్పుడు నెడఁబాయని యాత్మశక్తి శ్రీరూపమున నాతనిం గొలిచి యుండు. తంత్రమూర్తి యగువిష్వక్సేనుఁడు తదీయపార్షదప్రవరుండు. అణిమాదిరూపు లగునందాదు లెనమండ్రు తద్ద్వారపాలకులు. అమ్మహాపురుషుండు వాసుదేవసంకర్షణప్రద్యు

మ్నానిరుద్ధనామములఁ జతుర్మూర్తివ్యూహమునఁ బేర్కొ
నంబడు. మఱియు నర్థేంద్రియాశయజ్ఞానముల జాగరాది
వృత్తుల విశ్వతైజసప్రాజ్ఞతురీయులన నెన్నఁబడు. అంగో
పాంగాయుధాభరణసహితుం డైనహరి వాసుదేవాది
మూర్తిచతుష్టయమునం దనరి విశ్వతైజసాదినామచతు
ష్టయముం బొందియు నీశ్వరపదవాచ్యుం డగు. వేదకా
రణం బైన యాభగవంతుఁడు స్వప్రకాశుఁడై స్వమహిమ
పూర్ణుఁడై స్వమాయచే నీవిశ్వమునకు సృష్టిస్థితిలయ
ములం బ్రహ్మాదినామములఁ గావించుచు ననాచ్ఛన్నజ్ఞానుఁ
డయ్యు భిన్నునిరీతిం దోఁచు. శాస్త్రము లతఁడభిన్నుఁ డని
యుద్ఘోషించెడు. అప్పరమాత్ముఁడు తత్పరుల కాత్మతా
దాత్మ్యలభ్యుఁడు.

శా. శ్రీకృష్ణా యదుభూషణా నరసఖా
శృంగారరత్నాకరా
లోకద్రోహినరేంద్రవంశదహనా
లోకేశ్వరా దేవతా
నీకబ్రాహ్మణగోగణార్తిహరణా
నిర్వాణసంధాయకా
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్
నిత్యానుకంపానిధీ.

అని వేకువ మేల్కాంచి యిమ్మహాపురుషలక్షణముఁ దచ్చిత్తుఁడై ప్రయతుఁడై జపించునతఁడు హృదంతర్వర్తి పరమాత్మ నెఱుంగు." పాంచరాత్రమునుగూర్చి బ్రహ్మసూత్రసారములో నిట్లు వ్రాసితిని.

౮౨. పాంచరాత్రమతమునకు వేదాంతమునకు స్వల్పభేదము

భగవంతులగు నారాయణులు చతుర్ముఖబ్రహ్మాదులకు నైదురాత్రు లుపదేశించినట్లు వైష్ణవాగమములలోనున్నది కాన నీమతమునకు, పాంచరాత్రమనియును, భాగవతమతమనియు, సాత్వత మనియుం బేర్లు. ఇదియంతయు రామానుజాచార్యులకు సమ్మతము విశేషభాగము శంకరులకుసమ్మతమని యిట్లువ్రాసిరి. ఈసిద్ధాంత మేమన:— వాసుదేవుఁడొకఁడే శుద్ధజ్ఞానస్వరూపుఁడు, పరమార్థతత్వము, ప్రపంచమునకభిన్న నిమిత్తోపాదానకారణము. వాసుదేవుఁడు తన స్వరూపమును నాలుగువిధములుగ, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, నామములతో వ్యూహములను (సంస్థానవిశేషములను) బొందియున్నాఁడు.— వాసుదేవుఁడనఁగా, పరమాత్మ; సంకర్షణుఁడనజీవుఁడు; ప్రద్యుమ్నుఁడనమనస్సు; అనిరుద్ధుఁడనహంకారము. ఈనలుగురిలో వాసుదేవుఁడు పరమకారణము. సంకర్షణాదులు కార్యములు. ఇట్టి షడ్గుణములు గల భగవంతుఁడగుపరమేశ్వ

కుని, అభిగమనోపాదానేజ్యాస్వాధ్యాయ యోగములను నైదుప్రకారముల ననేకసంవత్సరములారాధించినచో, పాపమునుం బోఁగొట్టికొని, భగవంతునిఁ బొందును.— అభిగమనమన, భగవద్గృహమునకు మనోవాక్కాయ నియమములతోఁ బోవుట. ఉపాదానమన, పూజాద్రవ్యసంపాదనము. ఇజ్యయన షోడశోపచారపూజ. స్వాధ్యాయమన, ద్వాదశాక్షరీ మంత్రాదిజపము. యోగమన, భగవత్స్వరూపధ్యానము. ఈమతమందు వేదాంతులకునవలె, వాసుదేవుఁడు ప్రపంచమున కభిన్ననిమిత్తోపాదానకారణము. మూలప్రకృతియగు నవ్యాకృతముకంటె నతీతుఁడు. దానిని నశపఱచుకొనినవాఁడును, శ్రుతిస్మృత్యాదులలోఁ బ్రసిద్ధుఁడును, పరమాత్మయు, సర్వప్రపంచమునకాత్మయు, నగు నారాయణుఁడు, తనస్వరూపమును దానే బహుప్రకారములుగఁ జేసికొనియున్నాఁడని యనేక శ్రుతులలోఁ బ్రతిపాదింపఁబడినందున వేదాంతుల కది సమ్మతము. మఱియు, నెల్లప్పుడు నేకాగ్రతతో నభిగమనాదులతోఁ జేయఁబడు నాభగవదారాధనముగూడ శ్రుతిస్మృతులలోఁ బ్రసిద్ధమైనందున, నదియు వేదాంతులకంగీకార్యమే. కాని, వాసుదేవునివలన సంకర్షణుఁడు, సంకర్షణునివలనఁ బ్రద్యుమ్నుఁడు, ప్రద్యుమ్నునివలన ననిరుద్ధుఁడు, బుట్టుచున్నారను విషయముమాత్రము గ్రాహ్యము కాదు.

వాసుదేవుఁ డనుపేరుగల పరమాత్మవలన సంకర్షణుఁడను జీవుఁడు పుట్టినచో, జీవునకనిత్యత్వాదిదోషము లబ్బును. జీవునకు జన్మమున్నచో ననిత్యుఁడు కావలసివచ్చును. అనిత్యుఁడైనచో, భగవత్ప్రాప్తిరూపమునిత్యమునగు మోక్షమతనికి లేకుండును. బాదరాయణులు బ్రహ్మసూత్రములందు జీవుఁడునిత్యుఁడని శ్రుతులవలనస్థాపించియున్నారు, కావున జీవునకుఁ బుట్టుక లేదు. అట్లే కర్తయగు సంకర్షణుఁడను జీవునివలన (సాధనము=) కరణమగు ప్రద్యుమ్నుఁ డను మనస్సు పుట్టనేరదు. కరణమగు ప్రద్యుమ్నునివలన నింకొక కరణమగు యనిరుద్ధుఁడను నహంకారము పుట్టనేరదు. లోకములోఁగాని, వేదములోఁగాని, కర్తవలనఁగరణముగాని, యొకసాధనమువలన నింకొకసాధనముగాని, పుట్టుట లేదు. మఱియు నీవాసుదేవాది నాలుగువ్యూహములు, షడ్గుణపూర్ణులగు నీశ్వరులనినచో ననేకేశ్వరకల్పనము శ్రుతివిరుద్ధము, ప్రయోజనశూన్యము. మఱియు, భగవంతుఁడగు వాసుదేవుఁ డొక్కఁడే పరమార్థతత్వమనువారి సిద్ధాంతమునకు విరోధము. ఇట్టి స్వల్పదోషములు గలవు. జీవేశ్వరభేదము, జీవపరస్పరభేదము, పరిణామవాదముమాత్రమే, పాంచరాత్రు లంగీకరించుట వేదాంతులకంత రుచియింపదు. జీవాదులకుఁగూడఁ బైనఁ జెప్పినట్లు జన్మము పాంచరాత్రులు చెప్పలేదని రామాను

జుల తలంపు. అట్లయినచో వేదాంతులకు భాగవతులకు విరోధముండదు. కాని, వేదాంతముకంటె నితరములగు మతముల దోషములనుఁ జెప్పు బ్రహ్మసూత్రము ౨-వ యధ్యాయములోని ౨-వ పాదములో నీ విచారముండుట చేతను, సూత్రసరణిఁ జూచినను, భాగవతమతములోని కొన్నిసంగతులు బాదరాయణుల కంగీకారము గానట్లగప డును. రామానుజులవారి పరమగురువులగు యామునా చార్యులవారి యాగమప్రామాణ్యములో ద్రమిడాది పూర్వాచార్యులు పాంచరాత్రాధికరణమునకుఁ జేసిన వ్యాఖ్యఁ జూడఁగ నది శంకరభాష్యమునకు సరిగనున్నది. కాన, పాంచరాత్రమునకు వేదాంతమునకు భేదము స్వల్పము.

నమ స్తే వాసుదేవాయ నమస్సంకర్షణాయచ,
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ తుభ్యం భగవతేనమః.

౮౩. శ్రీమద్భాగవతోపసంహారము.

భూమికలో వ్రాసినరీతిని 12 వ యధ్యాయములో భాగవతవిషయముల సంగ్రహము కూర్పఁబడినది. పిదప, నిజముగ జన్మాదులులేని భగవంతునిజన్మ కర్మములు దివ్య ములగు నప్రాకృతికములు, నైచ్ఛికములు, కర్మానధీనములు కేవలము లోకానుగ్రహార్థములుగాన, వానిసంతత శ్రవ

ణాదులచే వానితత్త్వ మరసి భగవంతునియందుఁ బ్రేమ భక్తిని, బ్రహ్మాత్మైక్యజ్ఞానమును,నితరమందు విరక్తియునుఁ బడసి ధన్యులగుదురని చెప్పఁబడెను.'ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా' యనునార్యోక్తి ననుసరించి సగుణేశ్వరారాధనము లేనిది నిర్గుణబ్రహ్మ సాక్షాత్కారము గలుగదని నొక్కిచెప్పి యుపదేశమిట్లు నిగమింపఁబడెను:-
“నైష్కర్మ్య మప్యచ్యుతభావవర్జితం నశోభతేజ్ఞానమలం నిరంజనం కుతః, పునశ్శశ్వదభద్రమీశ్వరేనచార్పితంకర్మ యద ప్యనుత్తమం". నిరుపాధికబ్రహ్మ పరోక్షజ్ఞానంబు హరిభక్తిరహితంబైనచో నపరోక్షంబు గా నేరదు.ఉత్తమ కర్మంబుగూడ నీశ్వరార్పితంబుగాకున్న నెట్లు ప్రకాశించెడు? మఱి యాసర్వోత్తమకర్మముగూడ సాధనకాలమందును ఫలకాలమందును దుఃఖాత్మకమగు. కాన హరి భక్తి సర్వశ్రేయస్కరము, సర్వదా చేయఁదగినది.

౧౩-వ యధ్యాయమందుఁ బురాణసంఖ్యను జెప్పి భాగవతశ్రవణము పాపహారియనియుఁ, బుణ్యదాయకమనియుఁ, జెప్పఁబడెను. శ్రీగురూపదిష్టమార్గమనుసరించి శ్రీకృష్ణునందుఁ బ్రేమ భక్తిగలిగి యొకశ్లోకముగాని,శ్లోకార్ధముగాని,నియమపూర్వకముగఁ జదివి దానియర్థము ననుసంధానముఁజేసి యాప్రకార మాచరించినచో మహాఫలము చేకురుట కేసంశయము లేదు.

## ౨౪. శ్రీమద్భాగవతతత్త్వసంగ్రహము.

భక్తి వైరాగ్యజ్ఞానసన్న్యాసలోకోపకార కర్మముల స్వరూపములు, ప్రకారములు, ఫలములు, దృష్టాంతములతో నీగ్రంథములో వివరింపఁబడినవి. ఆదిమధ్యావసానములందు వైరాగ్యమును బోధించుకథలు విశేషముగ నుపపాదింపఁబడినవి. "సర్వవేదాంతసారం యద్బ్రహ్మాత్మైకత్వలక్షణం, వస్త్వద్వితీయంతన్నిష్ఠం కైవల్యైకప్రయోజనం (12-13-12) = సర్వవేదాంతసారంబును గైవల్యైకప్రయోజనంబును బ్రహ్మాత్మైకత్వలక్షణంబునగునద్వితీయవస్తు విందుఁ బ్రతిపాద్యంబు. తేజస్తత్త్వమొక్కటి యయినను, సూర్యుఁడనియు, సూర్యమండల మనియు, సూర్యకిరణము లనియు, వ్యవహరింపఁబడుచున్నట్లు బ్రహ్మతత్త్వమొక్కటి యయినను, అనవచ్ఛిన్నచైతన్యమనియు, మాయావిశిష్టేశ్వరుఁడనియు, అవిద్యతోఁ గూడిన యాత్మయనియు, వ్యవహరింపఁబడు. సూర్యుని తేజస్సు సూర్యమండలమునుండి కిరణరూపములుగ ననేక రూపములఁ బొందినట్లు నిర్విశేషమగు విష్ణువే మాయతోఁ గూడిన యీశ్వరుఁడుగను, జీవులుగను, వ్యవహరింపఁబడు. సూర్యునికిరణములు జనులనేత్రములందుఁ బ్రవేశించి సూర్యు నెట్లు చూడఁగలవో యటులె జీవులు విష్ణ్వంశములయినను, జనుల యంతఃకరణములందు సంక్ర

మించి విష్ణుదర్శనము చేయఁగలవు. జీవాత్మలు చైతన్య స్వరూపులుగాన విష్ణుమాయాతరణముకొఱకు విష్ణువును మాత్రమే నిరంతర ముపాసింతురు. కిరణములు జడములుగాన వాని కాశక్తి లేదు. అట్టియుపాసనము కర్మభక్తి జ్ఞానయోగము లను మూఁడు తెఱంగు లని బోప దేవు లీ తీరున సెలవిచ్చిరి:—(౧)సాంసారికవిషయములందు దోష మెవనిబుద్ధికి గోచరింపదో వాఁడు కర్మయోగ మభ్యసింప నగు; (౨) ఎవని బుద్ధికి సంసారమందు దోషదృష్టిగలుగునో వాఁడు భక్తి యోగాధికారి; (3) ఎవనికి విషయ దర్శనమే లేదో వాఁడు జ్ఞానాధికారి. సర్వకర్మములు విష్ణున కర్పణపురస్సరముగఁ గర్మయోగి చేయ నగు. విష్ణు వార్తాశ్రవణాదులను భక్తియోగు లాచరింపనగు. విజన మందు జ్ఞానయోగి విష్ణుతత్త్వమును (నావిష్ణుః విష్ణుమర్చయేత్) జింతింపవలయు.

"హరిర్హి నిర్గుణస్సాక్షా త్పురుషః ప్రకృతేః పరః,
ససర్వదృగుప ద్రష్టాతంభజ న్నిర్గుణోభ వేత్. (10-885)

కాన సోదరులారా! ఇట్లు కర్మభక్తిసహాకృతజ్ఞాన యోగమువలన భగవత్తత్త్వము తా నని లెస్సగ నరసి తత్ప్రాప్తియగు నానందమోక్షము ననుభవించి యితరుల నానందింపఁజేయుఁడు:—

" శ్లో. అవిస్మృతిః కృష్ణపదారవిందయోః
క్షిణోత్యభద్రాణి శమం తనోతి చ,
సత్వస్యశుద్ధిం పరమాం చ భక్తిం
జ్ఞానం చ విజ్ఞానవిరక్తియుక్తం.
యూయం ద్విజాగ్ర్యాః బతభూరిభాగా
యచ్ఛశ్వదాత్మ న్యఖిలాత్మభూతం,
నారాయణం దేవ మదేవమీశ
మనన్యభావా భజతాధివేశ్య.

శ్లో. శ్రీమద్భాగవతం పురాణమమలం
యద్వైష్ణవానాం ప్రియం,
యస్మి౯ పారమహాస్య మేత దఖిలం
జ్ఞానం పరంగీయతే,
యత్రజ్ఞానవిరాగభక్తిసహితై
ర్నైష్కర్మ్యమావిష్కృతం,
తచ్ఛృణ్వన్విపఠన్విచారణపరో
భక్త్యావిముచ్యేన్నరః.

---

హరిః ఓం.

శ్రీగురుభ్యోనమః.

# హరిభక్తిభూమికలు.

---

శ్లో. శ్రీమద్రాఘవ తీర్థానాం
పదపంకేరుహస్మృతిః,
స్మృతిమవ్యాహతాం కుర్యాత్
సదా పదపదార్థయోః.

శ్లో. ధ్యానాభ్యాసవశీకృతేన మనసా
యన్నిర్గుణం నిష్క్రియం,
జ్యోతిః కించన యోగినో యది పరం
పశ్యంతి పశ్యంతు తే,
అస్మాకంతు తదేవలోచన చమ
త్కారాయ భూయాచ్చిరం,
కాళిందీపులినేషుయత్కిమపి త
న్నీలంమహో (తమో) ధావతి.

---

## ౨౫. హరిభక్తిభూమికలు.

సోదరులారా!

ఇఁకభాగవతోక్తభక్తిని విమర్శించుటలో మొదట శ్రీహరిభక్తిని ౧౧ భూమికలను మెట్లుగ వివరింపఁబడు. శ్రీమద్భాగవతప్రథమస్కంధములోని ౫, ౬, ౭ యధ్యాయములలో మూఁడులోకములకు నుపకరించుట కవతరించినబ్రహ్మర్షి, బ్రహ్మమానసపుత్త్రుఁడు, నగుశ్రీనారదులు, విప్రర్షి, పారాశర్యుఁడు, నగుశ్రీవ్యాసులకు మనశ్శుద్ధిని సంపాదించుటకు ('నారాయణాభిధానస్య బ్రహ్మణః పరమాత్మనః') భగవంతు లగునారాయణులమహిమ వర్ణింపుమని సెలవిచ్చిరి. తదుపదేశానుసారముగ వ్యాసులు శ్రీమద్భాగవత మొనరించిరి. ఆసంవాదములో నారదులు, పూర్వకల్పమందు దాసీపుత్త్రుఁడుగ జన్మించి, చాతుర్మాస్యలలో సన్న్యాసులకు శిశ్రూషఁజేయ, వా రనుగ్రహించి, శ్రీకృష్ణభక్తిని దన కుపదేశింపఁదనకృషిచే నది యధికమయి, భక్తివిరక్తిజ్ఞానలోకోపకారకర్మములు తన కలవడెనని, లెస్స నుడివిరి. ఆసంవాదములోఁ జెప్పినవిషయము లన్నుఁ భూమికలను మెటికలుగ శ్రీధరస్వాములు విభజించిరి:—౧. "మహత్సేవా, ౨. తత స్తత్కృపా, ౩. తత స్త

ధర్మశ్రద్ధా, ౪ తతో భగవత్కథాశ్రవణం, ౫. తతో భగవతి రతిః, ౬. తయాచ దేహద్వయవివేకాత్మజ్ఞానం, ౭. తతో దృఢాభక్తిః, ౮. తతో భగవత్తత్త్వజ్ఞానం, ౯. తతస్తత్కృపయా సర్వజ్ఞత్వాది భగవద్గుణావిర్భావః." సారార్థసంగ్రనిలో "సతాంకృపా, మహత్సేవా, శ్రద్ధా, గురుపదాశ్రయః, భజనేషుస్పృహా, భక్తిరనర్థాపగమస్తతః, స్యాన్నిష్ఠా, రుచి, రాసక్తి, రతిః, ప్రేమా తతః పరం" అని ౧౨ విధములుగఁ జెప్పఁబడినవి. హరిభక్తిరసాయనప్రథమోల్లాసములో శ్రీమధుసూదనసరస్వతులు వానినే ౧౧ భూమికలుగ విభజించిరి. వానినిందుఁగొంచెము వివరించెద. 'ప్రథమంతు మహత్సేవా, తద్దయాపాత్రతాపునః, శ్రద్ధాతు తేషాంధర్మేషు, తతో హరిగుణశ్రుతిః, స్వరూపాధిగతిస్తతః, ప్రేమవృద్ధిః పరానందే, తస్యాధస్ఫురణంతతః, భగవద్ధర్మనిష్ఠాతః, స్వస్మిఁ తద్గుణశాలితా, ప్రేమ్ణో౽థపరమాకాష్ఠే త్యుదితాభక్తి భూమికాః" "ప్రథమం మహత్సేవా=మొదటిదిమహాత్ములసేవ. ఆసేవరెండు తెఱంగులు. ఒకటి భాగవతులసేవ, రెండవది సాక్షాద్భగవత్సేవ. భాగవతసేవవలనఁ గలవిశేషముల నీతీరున నారదులు వ్యాసులకు నుడివిరి:—ఏను బూర్వకల్పమునం దొలిజన్మమున వేదవాదులయింటఁ బరిచర్యసేయు నొక్కదాసికిఁ గొడుకునై జనించి వర్షకాలమునం జాతుర్మాస్యదీక్షానియమమున

యాత్రసాలించి యొక్కచో నిలిచియున్నసన్యాసులకుఁ బరిచర్య సేయ బాల్యముననే నియుక్తుండనై యమ్మహాత్ముల సేవించుచుండుటయు నమ్మునులును సర్వభూతములందుఁ దుల్యదర్శనులయ్యుఁ జాపలంబువిడిచియు నాటలు దొఱంగియు నింద్రియముల నిగ్రహించియు మితభాషిత్వంబుఁ బూనియు ననుకూలవృత్తిని శిశ్రూషచే వారిని గొల్చుచున్న నాయెడఁ గరుణించిన నేను దదనుజ్ఞం గొని వారి యెంగిళు లొకసారిఁ గుడుచుచు దానం బాపంబులెల్ల నెడలఁ జిత్తశుద్ధిఁ గాంచిననా బ్రహ్మవేత్తలచే ననుష్ఠింపఁబడు ధర్మంబునందే నామనస్సునకుఁ బ్రేమబీజమగు రుచి కలిగెను. ఆకాలమందుఁ బ్రతిదినము వారు భగవత్కథలను గానముఁ జేయుచుండఁగ వారియనుగ్రహముచే మనోహరము లగు శ్రీకృష్ణకథలను వినుచుంటిని. ఈప్రకారము నిరంతరము వినుచున్న నాకుఁ బ్రీతివిషయకుఁడగు శ్రీకృష్ణునియందుఁ బ్రేమాంకురమను రతియుదయించెను. దానం జేసి భగవంతునియందు నప్రతిహతమగు జ్ఞానము జనించె. దాన నేను, బ్రపంచాతీతబ్రహ్మరూపుఁ డగు నాయందు స్థూలసూక్ష్మరూపమగు ప్రపంచమంతయునిజావిద్యామహిమకల్పితంబు గాని వాస్తవము కా దని చూచుచుండెదను. ఇట్లు వర్షశరదృతుమాసములు నాలుగు నమ్మహాత్ములగు మునులు కీర్తించువిమలహరికీర్తి క్షణ

క్షణము వినవిన నాకు రజస్తమోగుణముల నిరసించు భగవద్భక్తి తనర్చె. నిత్యానురాగము, వినయము, శ్రద్ధ, యింద్రియనిగ్రహము, పరిచర్యయుం గలిగి క్షీణపాపుఁడై వర్తించుచున్న బాలుఁడైననాయందు దీనవత్సలులగు నమ్మహామునులు చాతుర్మాస్యదీక్షావసానమున నచ్చోటువాయువారు భగవంతుఁడు తానే వారికిఁ జెప్పిన పరమరహస్యమగునీశ్వరజ్ఞానము కృపచే నాకుపదేశించిరి.(సాధనభూతమగుధర్మతత్త్వజ్ఞానము గుహ్యము. దానివలనఁ గలుగు స్థూలసూక్ష్మదేహద్వయములకంటె వేఱగువాఁడు జీవుఁడనుజ్ఞానము గుహ్యతరము. దానివలనఁగలుగు నీశ్వరతత్త్వజ్ఞానము—అట్టి వివిక్తమగు జీవాత్మయే శుద్ధతత్త్వపదార్థమను నపరోక్షజ్ఞానము, గుహ్యతమమగు పరమరహస్యము.) భగవత్ప్రాప్తిసాధనం బగు నాయుపదేశమునఁ జేసి యేను వాసుదేవుని విచిత్రమాయాప్రభావము నెఱింగితి:—సర్వనియామకుఁ డప్రచ్యుతరూపుఁడు నగు నీశ్వరునియెడ సకలకర్మముల సమర్పించుటయే యాధ్యాత్మికాదితాపత్రయనిర్మూలనమునకు మంచిమందై సత్త్వమును శోధించునని సూచితంబయ్యె. స్వతంత్రప్రయోగమున రోగనిమిత్తములయ్యు ఘృతాదిపదార్థములు గొన్నిలాఁతి వస్తువులతోడం గూడి యౌషధమై యారోగముల నుపశమింపఁజేయుచాడ్పున సంసారకారణం బయ్యుఁ గర్మంబు,

భగవదర్పణసమాకృతం బగునేని సంసారనివృత్తిం
గావించు. ఇవ్విధంబునం దొలుత సాధుసేవనంబు గలిగినం
దానందత్కరుణాలాభము, దానివలన ధర్మశ్రద్ధ, యా
శ్రద్ధవలన భగవత్కథాశ్రవణంబు, దానభగవదాసక్తి,
యయ్యాసక్తివలన దేహద్వయవివిక్తాత్మజ్ఞానం, బా జ్ఞాన
మున దృఢభక్తి, యాభక్తివలన భగవత్తత్త్వవిజ్ఞానంబుం,
దాన సర్వజ్ఞత్వాదిభగవద్గుణావిర్భావంబునుం, గ్రమమునం
గలుగు. భగవదర్పణపూర్వకముగం జేయంబడు కర్మము
భక్తియోగసమన్వితం బైనజ్ఞానము నొదవించు. బాహ్య
కర్మంబు లగుభోజనహోమదానతపంబు లెల్ల నాకర్పింపు
మని భగవంతుం డర్జునున కుపదేశించినగీతార్థంబుం దల
పోసి తత్క్రమమునం గర్మముల నాచరించువారు కృష్ణ
నామకీర్తనకృష్ణస్మరణాదులం జేసినవారగుదురు. ప్రణ
వాది మంత్రపూర్వకములుగ వాసుదేవచతుర్మూర్తినామం
బులకు భక్తితో నమస్కరించి మంత్రమూర్తియు నమూ
ర్తియు నగుయజ్ఞపురుషుం బూజించువాండు సమ్యగ్దర్శనుం
డగు. ఇత్తెఱంగున నే నాత్మోపదేశ మనుష్ఠించిన దానికిం
బ్రసన్నుం డై కేశవుండు జ్ఞానైశ్వర్యభక్తియోగముల
నొసంగె॥ (భా.1-5-22&c.). మహాత్ములసేవ శ్రేయోదా
యకమని ఋషభదేవుండు కొడుకుల కిట్లుపదేశించెను:—

ముక్తికిద్వారము మహాత్ములసేవ యనియు స్త్రీసంగిసంగము నరకమునకు ద్వారమనియుఁ బెద్దలు సెప్పుదురు. సమచిత్తులు ప్రశాంతులు విగతక్రోధులు సుహృదులు సదాచారులు పరమేశ్వరుఁడగు నామీఁది సౌహృదంబే ప్రయోజన మని నిశ్చయించి ధర్మానుష్ఠానార్థము దేహభరణము మాత్రమను తలంపున బుత్త్రకళత్రగృహాదుల యెడ నాసక్తియుడిగి లోకమున నత్యంతావశ్యకంబైన యర్థంబే గ్రాహ్యమని తదితరంబులయెడ విరక్తులునగు వారు మహాత్ములనఁబడుదురు (5-5-24&c.). కపిలమహర్షి తల్లియగు దేవహూతి కిట్లు సెలవిచ్చిరి:—ప్రాకృతజనుల సంగమాత్మకు శిథిలముగానిపాశమైనను, సంగము సాధుజనులతోఁ జేయఁబడునేని, తెఱచిన మోక్షద్వారంబని పెద్దలు సెప్పుదురు. భూమివలె మూర్ఖులచర్యలను సైరించువారును, స్వార్థంబు గోరక పరదుఃఖము నిరసింపఁదలఁచు కారుణికులును, సర్వసుహృదులును, లోకమునం దెచట శత్రువులు లేనివారును, శమాదిసంపన్నులును, పరకార్యసాధకులు నగుసాధువులును, ననన్యభావమున నాయెడ భక్తింజేసి మదర్థంబులౌకికాలౌకికకర్మములను ద్యజించినవారై త్యక్తస్వజనబాంధవులై మదీయకథలఁ గీర్తించుచు వినుచు సంతసిల్లుచుందురు. అట్టి మదధీనచిత్తులను, దాపములుతపింపఁజేయఁజాలవు. తల్లీ,

వారే సర్వసంగవివర్జితులైనసాధువులు. సర్వదోషహారులగునట్టి సాధువులసాంగత్యంబు ప్రార్థనీయంబు (3-25-205&c.). అట్లే సూతునకు ఋషులీతీరునఁ జెప్పిరి:—భగవచ్చరణముల నాశ్రయించి యుపశమసంపన్నులైన మునులు తమసేవాపరులకు సన్నిధిమాత్రముననే పవిత్రంబుఁగావింపఁజాలుదురు. కాని భగవత్పాదంబునఁ బుట్టినగంగలోఁ జిరకాలముస్నానముఁ జేసినంగాని యది పావనముఁ జేయఁజాలదు (1-1-15). కాన స్వర్గముగాని ముక్తిగాని మహాత్ముల సాంగత్యమునకుఁ గొంచెమైనను దుల్యము గానేరవనినఁ దక్కినభోగములనుం జెప్పవలెనే యని ప్రాచేతసులు హరితో మనవిఁ జేసిరి (4-30-34). నిమి ఋషభపుత్రులతో నిట్లనిరి :— క్షణభంగురమయ్యు మానుషదేహము దేవాలకు దుర్లభంబు. విశేషించి యందును భాగవత దర్శనంబు పరమదుర్లభంబు. కావున ననఘులారా, నిరపాయమగు క్షేమంబు మి మ్మడిగెద. క్షణార్థమాత్రమేనియు సత్సంగము లభించెనేని మానవుల కయ్యది యీసంసారమున నిధివంటిలాభం బగు (11-2-29&c.). శ్రీకృష్ణు లుద్ధవున కీతీరున సత్సంగమాహాత్మ్యము సెలవిచ్చిరి:—సర్వసంగనివర్తకమైన సత్సాంగత్యము నన్ను వశీకరించునట్లు నష్టాంగయోగము, తత్త్వవిచారరూపమగు సాంఖ్యము, వేదపారాయణము, చాంద్రాయణాదితపస్సు,

సన్యాసము, యోగము, దేవాలయాదిప్రతిష్ఠాదిధర్మము, యాగమం దియ్యఁబడు దక్షిణ, చాతుర్మాస్యాదివ్రతము, రహస్యమంత్రములు, గంగాదిపుణ్యతీర్థములు, దేవపూజాదినియమములు, సత్యాదినియమములు, వశీకరింపవు. స్వర్గాదిలోకనివాసులగు దైత్యులు, రాక్షసులు, మృగములు, పక్షులు, గంధర్వులు, అప్సరసులు, నాగులు, సిద్ధులు, చారణులు, యక్షులు, విద్యాధరులు, మనుష్యులలో రజస్తమః ప్రకృతులయిన వైశ్యులు, స్త్రీలు, శూద్రులు, చండాలురును, వృత్రప్రహ్లాదవృషపర్వబలిబాణమయవిభీషణులగు నసురులును, సుగ్రీవహనుమజ్జాంబవంతు లగువానరులును, గజేంద్రుఁడు, జటాయువు, తులాధారధర్మవ్యాధులును, మధురలో నున్నత్రివక్రయగుకుబ్జ, బృందావనగోపికలు, మధువనమందలివిప్రపత్నులును, బలువురయ్యేయుగంబులందు సత్సంగంబున మదీయపథం బధిగమించిరి. వారిలోఁ గొందఱు వేదములఁ జదువకయు, గురువుల నుపాసింపకయు, వ్రతములను దపముల ననుష్ఠింపకయు నాసాంగత్యముచేతనే నన్నుఁ బొందిరి. గోగోపికమృగసర్పవృక్షములు నగుమూఢాత్ములుగూడ జ్ఞానహీనులయినను నాసంగమునఁ గలిగిన కేవలభావనమగు ననుధ్యానముచేతనే యోగసాంఖ్యదానవ్రతతపోయజ్ఞవ్యాఖ్యాస్వాధ్యాయసన్యా

సముల నతిప్రయత్నమునకుం బొంద నశక్యుండగు నన్నుం బొందిరి. కావున నోయుద్ధవా ! నీవును శ్రుతిస్మృతులను బ్రవృత్తినివృత్తులను శ్రుతశ్రోతవ్యములనుం బరిత్యజించి సర్వదేహుల కాత్మం డద్వితీయుం డగునన్ను సర్వభూతము లకు నొకం డగునాత్మయని శరణుసొచ్చి భయంబెడలు ము (11-12-1&c.). దీనివలన భగవత్సాంగత్యముగాని భాగవతసంగముగాని లేనిచో భగవద్భక్తి గలుగదని సిద్ధము. మహాత్సేవా విషయములో నొక నిష్కర్షను జేయ నగు. భక్తుల యోగ్యతానుగుణముగం గొందఱకు భగవ త్సాంగత్యమబ్బును, గొందఱకు భాగవతసంగమలవడు. ఈరెంటిలో విశేషమేమన:—సాక్షాద్భగవత్సాంగత్యము గలవారు కృతార్థులు గాన వారికి భాగవతసంగాపేక్ష లేదు. భాగవతసాంగత్యము మాత్రము గలభక్తులకు దానిఫలమగు భగవత్సాంగత్యముదొఱకువఱకు యత్నిం పవలయు. మొదటిపక్షములో భగవంతుండే భక్తులకు సాధనము, సాధ్యము. రెండవపక్షములో భాగవతోత్త ములు, ఉపాయము, భగవంతుఁడు, ఉపేయము. దేవ హూతి యాదవపాండవోద్ధవార్జున గోపికాదులు సాక్షా ద్భగవత్సేవవలనం గృతార్థులయిరి. నారదవ్యాసశుకసూత ధ్రువ వృథుప్రహ్లాదనిమిలో నగువారు భాగవతసేవవలన ధన్యులయిరి.

౨. 'తద్దయాపాత్రతా తతః' = పిదప నామహాత్ముల దయ గలుగుటకు శిష్యులకు యోగ్యత గలుగవలయు. ఇదిరెండవభూమిక. వారిదయను సంపాదించుట కుపాయము వారిసుశీలతాది గుణాచరణమే. వారిసహజగుణము లీతీరున శ్రీకృష్ణు లుద్ధవున కుపదేశించిరి:— 'పరదుఃఖమును సహింపనివాఁడు, ఇతరులకు ద్రోహముఁ జేయనివాఁడు, అన్యు లపరాధముఁజేసినను నోర్పుగలవాఁడు, సత్త్వగుణమే సారముగాఁ గలవాఁడు, అసూయాదిదోషములు లేనివాఁడు, సుఖదుఃఖములందు సమబుద్ధి గలవాఁడు, తనశక్తికొలఁది సర్వుల కుపకారి, కామములచేఁ జాపల్యమునొందని చిత్తముగలవాఁడు, బాహ్యేంద్రియములను జయించినవాఁడు, మృదువు, శుచి, అపరిగ్రహుఁడు, దృష్టాదృష్టఫలములకు సాధనముల నాచరింపనివాఁడు, మితాహారి, మనోనిగ్రహము గలవాఁడు, స్వధర్మస్థిరుఁడు, ఈశ్వరుఁడ నైనన న్నే యాశ్రయించినవాఁడు, సంసార మసార మనిచింతించువాఁడు, సావధానచిత్తుఁడు, నిర్వికారి, కష్టములు సంభవించినను దైన్యము నొందనివాఁడు, దేహసంబంధములగు జరామృత్యువులు, ప్రాణసంబంధములగు క్షుత్పిపాసలు, మనస్సంబంధములగు శోకమోహములను షడూర్ములకును భయపడనివాఁడు, దేహాద్యభిమానము లేనివాఁడు, ఇతరులను సన్మానముఁ

జేయువాఁడు, అన్యులకుఁ దత్త్వబోధయందు సమర్థుఁడు, సములకు మైత్రుఁడు, దీనులకు వాత్సల్యముఁ జూపుచు నుపచరించువాఁడు, ఆత్మానాత్మవివేకములచే జ్ఞానియగు వాఁడు సాధు వనంబడు. ఈగుణములను బ్రయత్నముతో సాధించినవాఁడు మహాత్ములదయకుఁ బాత్రుఁ డగు. (11-11-28 -&c). అప్పుడు క్రిందఁజెప్పఁబోవు గుణములు గల్గి గురువు నుపాసింపవలయు నని భగవంతు లుద్ధవు నకు సెల విచ్చిరి:—తనకు సన్మానమును గోరనివాఁడై, పరగుణములయందు దోషదృష్టి లేనివాఁడై, పరబోధ గ్రహణమందు దక్షుఁడై దేహాదులందు మమకారము లేని వాఁడై, లోకమందు సోదరభావము గలవాఁడై, తొందర లేనివాఁడై, తత్త్వార్థము నరయ నిచ్ఛగలవాఁడై, అసూయలేనివాఁడై, సత్యవచనము గలవాఁడై, భార్యా పుత్రగేహక్షేత్రస్వజనద్రవ్యాదులం దుపేక్షగలవాఁడై, స్వపరభేదము లేక సర్వత్ర సమబుద్ధి గలవాఁడై, దేని వలనను లాభమును గోరనివాఁడై, నాస్వరూపముఁ దెలిసి శాంతుఁడై, నాస్వరూపుఁడైన గురువును సేవింప వలయు (11-10-5 &c). భగద్గీతలలోని (అమానిత్వాది) గుణాచరణముఁగూడ మహాత్ములదయను గలుగఁజేయును. ఇట్టి గుణనిధి ప్రహ్లాదుఁడు. హిరణ్యకశిపు నలుగురు కొడుకులలో శ్రేష్ఠుఁడు . ప్రహ్లాదుఁడు. అతఁడు సకల

సుగుణాకరుఁ డై పెద్దలను సేవించె. అతఁడు బ్రహ్మనిష్ఠ గలవాఁడు, సత్స్వభావముగలవాఁడు, సత్యసంధుఁడు, జితేంద్రియుఁడు, తనకువలె సర్వభూతములకుఁ బ్రియ సుహృదుఁడు నిర్వైరుండు నై, పెద్దల నుపాసించుచు దాసుని చాడ్పున నార్యుల యడుగుల కెఱఁగుచుఁ, దండ్రిమాడ్కి దీనులయెడల వాత్సల్యంబు చూపుచు, భ్రాతృవిధమున సమానులయెడఁ దుల్యత్వంబును స్నే హంబును నెఱపుచు, గురువులఁ బరమేశ్వరు నట్టు లట్టులు పూజించుచు, విద్య, ధనము, ఉత్తమకుల జన్మము, రూపము, మున్నగు మదకారణములకు గర్వింపక స్తంభవర్జితుం డై, వ్యసనంబులయెడ నుద్వే గంబు గానక, దృష్టశ్రుతవిషయంబులయెడ విరక్తుండై వానియెడ మిథ్యాదర్శనుం డై, యింద్రియములను, ప్రాణములను, శరీరమును, బుద్ధిని,నియమించి, నిత్యశాంత కాముఁడై, యసురభావం బుడిగి, యెల్లగుణముల మహాత్ముఁ డై,వెలసె (7-4-31 &.c). కాన నిట్టిగుణములు శిష్యునకు లేనిచో, మహాత్ములసాంగత్య మున్నను, వారికి నతనియందు దయగలుగదు. వారిసాంగత్యము ప్రయో జనకారి గాదు. కాన సజ్జనులదయాపాత్రత రెండవ భక్తి భూమికయని చెప్పఁబడినది. ఇదియు రెండు తెఱం గులు. ఈజన్మములోఁ దనప్రయత్నము లేకయే కలుగు

పెద్దల దయాపాత్రత మొదటిది. దీనికి శ్రీశివప్రచేతస
సంవాదము దృష్టాంతము. తప్తసువర్ణసవర్ణగాత్రకాంతులు
వెలయించుచు, శ్రీకంఠుఁడు ప్రసాదాభిముఖుండై ప్రచేత
సులకు సాక్షాత్కరించె. అద్దేవదేవుం గాంచి జాతకౌతు
కులై వారు ప్రణమిల్లుటయు ధర్మవత్సలుం డైనభగవం
తుఁడు, ధర్మజ్ఞులు, శీలసంపన్నులు, ప్రపన్నులు, నగువా
రల నాదరించి, శ్రీరుద్రదేవుఁ డిట్లనియె. అయ్యా,
మీరలు బర్హిష్మంతుని పుత్రులరు. మీరు సేయఁబూనిన
దాని నెఱిఁగి మీకు మేలు సమకూర్పదర్శనం బొసం
గితి. సూక్ష్మమను ప్రధానమునకును జీవపదవాచ్యం డైన
పురుషునకును బరుం డై, ప్రకృతిపురుషనియామకుం డైన
వాసుదేవు నాశ్రయించిన యతండు నాకుఁ బ్రియుండు.
శతజన్మములు నిష్ఠతో స్వధర్మ మాచరించినవాఁడు
బ్రహ్మత్వంబు, నంతకంటె నెక్కువధర్మ మాచరించిన
వాఁడు నన్నునుం బొందెడు. భగవద్భక్తుఁ డన్ననో
యాధికారికులైన బ్రహ్మాదులు నేను నెట్టు లధికారాంత
మున రూపుమాయుదు మట్లు గాక ప్రపంచాతీతమయిన
వైష్ణవపదంబుఁ బ్రాపించెడు. మీరలు భాగవతులు గావున
భగవంతునట్లపోలె నాకుఁ బ్రియులు. భాగవతులకును
నాకంటెఁ బ్రియతరుఁడు గలుగఁడు. పవిత్రము, పరమ
మంగళము, నిశ్శ్రేయసకరము, నగు నొక్క స్తోత్రంబు

మీ కే నుపదేశించెద. దీనినసంకీర్తనముగజపింపుఁడనిచెప్పి భాగవతోత్తముండగు నప్పార్వతీవల్లభుండుల్లంబునఁ గరుణాభరంబు పల్లవిరపఁ గృతాంజలులైన యారాజ కుమారులకు నారాయణపరంబైన శ్రీరుద్రగీతాస్తోత్రముప దేశించిరి. (4-24-24-25 &c). 'నిమ్నగానాం యథాగంగా దేవానామచ్యుతోయథా, వైష్ణవానాం యథాశంభుః పురాణానామిదం(భాగవతం)తథా'(12-13-16). ఇట్లే నార దుండడుగకనే మునులతనికి శ్రీకృష్ణతత్వముపదేశించిరి.

ఈ జన్మములోఁ బ్రయత్నముఁ జేయఁగా లభ్య మగుఁ బెద్దల దయాపాత్రత రెండవది.ఇందులకు దృష్టాం తము శ్రీనారదధ్రువసంవాదము. "ధ్రువుఁడు నారదునకి ట్లనియె:—నాయట్టివానికి దురూహం బైనను సుఖదుఃఖ హతాత్ములకు హితమగుశాంతిమార్గము మీరు కృపచేసి బోధించితిరి. ఐనను క్షాత్రధర్మముఁ బూని యవినీతుఁడ నగు నామనంబున సురుచి వచోబాణములఁ గడునొచ్చి యునికిఁ జేసి యెక్కకుండెడు. నాపెద్దలు నితరులు నధి ష్ఠింపని త్రిభువనోత్కృష్టం బైనయుత్తమపదం బారో హింపఁ గోరు నాకు నిరపాయంబైన యుపాయంబు బోధింపుము. మునీంద్రా, బ్రహ్మదేవుని దేహమునం బొడమిన మీరలు లోకహితార్థంబు వీణవాయించుచు నెల్లపుడు సూర్యునిరీతిఁ దిరుగుదురుగదా) యనిన శ్రీనార

దుఁ డతని కిట్లనియె. వత్సా, నీతల్లి చెప్పిన మార్గంబు నీకు శ్రేయస్కరంబు. పరమభక్తితో భగవంతుఁ డగు వాసుదేవుని భజింపుము. నరుఁడు ధర్మార్థకామమోక్షములలో నెద్దానిం గోరినను నన్నిటికిని హరిచరణ సేవనంబే కారణంబగు; కావున నయ్యా, నీవు యమునాతటంబున నమరుమధువనంబున కరిగి విధ్యుక్తముగ వాసుదేవుని సమంత్రకముగ ధ్యానింపు' మని సెలవిచ్చిరి.(4-8-38&.c).

శ్రద్ధాతు తేషాంధర్మేషు = పూర్వముఁ జెప్పఁబడిన శిష్యగుణములు గలవాఁడై మహాత్ములను సేవించుచున్న వానికి వారిచే నాచరింపఁబడు ధర్మములందు, నేనుగూడ నిట్లే యాచరించి కృతార్థుఁడనగుదు ననురుచి విశేష మను శ్రద్ధయును బుట్టును. అది మూఁడవ భూమిక. దానిచేఁ దానుగూడ నాధర్మముల నాచరించు, గురుశుశ్రూష చేయుచుఁ బరమవిశ్వాసముగలవానికి మహాత్ములసేవచేతను, బుణ్యతీర్థ యాత్రలచేతను, భగవత్కథలందు రుచిగలుగున నియుఁ బండితు లెవని యొక్క ధ్యాన మనుకత్తిచే సంసారహేతువగు కర్మగ్రంథిని ఛేదించుకొని యెదరో, యా భగవంతునిచరితములందు రుచి యెవరికి నుండదు? అనియు, సూతులు ఋషులకుఁ జెప్పిరి. (1-2-16-&.c).
శ్రీశుకు లీతరునఁ బరిక్షిత్తునకు సెలవిచ్చిరి:— 'సంసార చక్రమును నిరోధించు జ్ఞానమునకునుఁ జిత్తశుద్ధికిని నిహ

పరలోక సుఖవిరక్తికిని, మోక్షమునకును, సమీచీనసాధన మగునది భక్తియోగము గాన హరికథయందెవ్వని కాసక్తికలుగదు ? (2-3-12). ఇట్లనేకచోట్లనున్నది. ఇక్కడ "హరికథా" పదము శ్రవణాదు లగునితర భాగవత ధర్మముల కుపలక్షణము. శ్రీకృష్ణులనుగూర్చి చతుర్ముఖ బ్రహ్మ యిట్లు స్తుతించె:— నాథా, యేభాగ్యముచేత నైన నీజన్మమందుఁగాని మఱియొక తిర్యగ్జన్మమందుఁగాని మీభక్తులలో నొకఁడై నేను పుట్టి మీపాదారవింద ములను సేవించుభాగ్య మనుగ్రహింపుము. (10-14-30). భగవత్పాదసేవన మనుభక్తివలె నితరభక్తులనుగూడ నిచట నూహింపవలయు. ఈశ్రద్ధ సాధనానుష్ఠానపరిపాక ముచే వృద్ధిఁబొందుచుఁ, దీవ్రమగు నాఁకలి భోజనమా త్రమందే ప్రవర్తింపఁజేయునట్లైహికాముష్మికవిషయ ములం దరుచినిబుట్టించి, భగవద్ధర్మమే యెల్లప్పుడు నాచ రించువానినిగఁ జేయును. కావనే పరీక్షిత్తు శుకులతో నిట్లనెను:— జలపానమునుగూడఁ జేయనివాఁడ నైనను, మీముఖచంద్రునుండి స్రవించుచున్న భగవత్కథా మృతమును బానముఁజేయుచున్న నన్ను దుస్సహమైన యాఁకలిగూడ బాధింపలేదు (10-1-13). శౌనకుఁడు సూతునితో నీతీఱున హరికథావిముఖుల నిందించెను:— "హరికథా ప్రస్తావమునఁ గడచునిముసంబుదక్కఁ దక్కిన

పురుషాయంబు నెల్లఁ బ్రొద్దుపోఁడుచుఁ గ్రుంకుచు హరించు చుండుఁ గావున హరికథలపై మనసుపెట్టనివాని యాయు వెల్ల వ్యర్థముగఁ గడచు.

సీ. విష్ణుకీర్తనములు వినని కర్ణంబులు
కొండల బిలములు వ్యాసశిష్య
చక్రిపద్యంబులు చదువని జిహ్వలు
కప్పలజిహ్వలు రాహిణేయ
శ్రీమనోనాథు నీక్షింపనికన్నులు
కేకిపిచ్ఛాక్షులు కీర్తిదయిత
కమలాక్షుపూజకుఁగాని హస్తంబులు
శవముహస్తంబులు సత్యవచన
ఆ. హరిపదతులసీదళామోదరతి లేని
ముక్కు పందిముక్కు మునిచరిత్ర
గరుడగమనుభజనగతి లేనిపదములు
పాదపముల పాదపటల మనఘ.

సీ. నారాయణుని దివ్యనామాక్షరములపైఁ
గరఁగనిమనములు కఠినశిలలు
మురవైరికథలకు ముదితాశ్రురోమాంచ
మిళితమై యుండనిమేను మొద్దు

చక్రికి మ్రొక్కని జడునియాదలనున్న
కనక కిరీటంబు గట్టెమోపు
మాధవార్పితముగా మననిమానవు సిరి
వనదుర్గచంద్రికావై భవంబు
ఆ. కైటభారిభజనగలిగి యుండనివాఁడు
గాలిలోన నుండి కదలుశవము
కమలనాభుపదముఁ గనని వానిబ్రతుకు
పసిడికాయలోని ప్రాణిబ్రదుకు.

(2-3-17&c.)

హరికథాశ్రద్ధలేని వారిలోఁ (క) కొందఱు విషయ భోగములం దాసక్తిగలవారు, (గ) మఱికొందఱు పాండిత్యాదిగర్వముచే భగవన్నిందాపరులు. వీ రుభయులు సత్పురుషులచే నరకమందుఁగూడ నిందింపఁ దగినవారు. బ్రహ్మదేవతుల కట్లు పలికెను:— భగవచ్చరిత్రమాని మతిహరము లగునితరకథల వినువారికి వైకుంఠం బగమ్యంబు.

చ. హరి విముఖాత్ము లన్యవిష
యాదృత చిత్తులుఁ బాపవర్తులున్
నిరయ నిపాతహేతువును
నింద్యచరిత్రము నైన దుష్కథా

నిరతిఁ జరించు వారలును
నేరఁపు బొందఁగ నిందిరా మనో
హరచరణారవిందభజ
నాత్మకు లుండెదు గోందినారయన్. (3-15-23).

శౌనకుఁ డిట్లు సూతునకుఁ జెప్పె:—

సీ. అలరు జొంపములతో నభ్రంకషంబు లై
బ్రతుకవే వనములఁ బాదపములు
ఖాదన మేహనాకాంక్షలఁ బశువులు
జీవింపవే గ్రామసీమలందు
నియతిమై నుచ్ఛ్వాసనిశ్వాసపవనముల్
ప్రాపింపవే చర్మభస్త్రికలును
గ్రామసూకరశునకశ్రేణు లింటింటఁ
దిరుగవే దుర్యోగదీనవృత్తి

ఆ. నష్ట్రఖరములు మోవవే యుగుభరములఁ
బుండరీకాక్షు నెఱుఁగని పురుషపశువు
లడవులందు నివాసములందుఁ బ్రాణ
విషయ భరయుక్తితోనుంటవిఫలమధిప.

(2-3-18&c).

(క) ఇట్లనేకములఁ జూడుఁడు. (గ). భగవద్భక్తనిందా
పరుల నీరీతిని చమసుఁడు నిమితోఁ జెప్పెను:—పరమపురు

షుని ముఖబాహూరుచరణములం గ్రమంబున బ్రహ్మక్షత్ర వైశ్యశూద్రులు నాలు గాశ్రమములతోడం గుణత్రయ యోగమునం బుట్టిరి. ఆత్మప్రభావుఁ డీశ్వరుఁడు నగు హరిని భజింపక యవమానించువారు స్థానభ్రష్టులై క్రిందఁబడుదురు. హరికథాకీర్తనంబు లెఱుంగని స్త్రీశూద్రాదులకు మీయట్టిమహాత్ములు కృపసేయవలయు. రజోయోగమున ఘోరసంకల్పులై కాముకులై యాశీవిష క్రోధులై దాంభికులై మానులై యప్పాపాత్ములు హరిప్రియులం బరిహసింతురు. మఱియు వారు స్త్రీలం గొలిచి గృహమైథునాదిసక్తులై యొకళ్లొకళ్లకు గ్రామ్యసుఖముల మెచ్చఁ జెప్పుచు నన్నవిధి దక్షిణాహీనంబుగ యజ్ఞంబులకుఁ దొడరి హింసాదోషం బరయక వృథాపశుహింస సేయుచు, ధనైశ్వర్యకులవిద్యాదానరూపబలకర్మంబుల మదించి, యంధులై ఖలులై, యీశ్వరు నీశ్వరభక్తులను దిరస్కరించుచు వేదపరమార్థం బరయక యాకాశమువోలె సర్వభూతములలో నెల్లపుడు వ్యాపించియున్న యీశ్వరుం, బరమార్థస్వరూపు, వేదప్రతిపాదితుఁ జింతింపక, మనోరథవార్తల వేదార్థంబు సమన్వయింతురు. హరిపరాఙ్ముఖులు శ్రమార్జితములయినను నస్థిరము లగు నర్థగృహాపత్యసుహృత్కళత్రాదులను విడిచి సంతమసంబు సొత్తురు. (11-5-2 &c). కావున నట్టివారివలెఁగాక

భాగవతధర్మములయందు శ్రద్ధయను మూఁడవ భూమిక నభ్యసింపవలయు.

తతో హరిగుణశ్రుతిః = దానివలన భక్తుఁడు హరి గుణ శ్రవణాదులను జేయును. ఇది నాల్గవభూమిక. శ్రవణాదిక మేలచేయవలయు ననిన శ్రీకృష్ణావతార జన్మ కర్మములను దశమస్కంధములో 90 అధ్యాయములలో నతిమనోహరముగ వివరించి, దానియుద్దేశమును ఫల మును శుకు లి ట్లంతమందు సెలవిచ్చిరి:—

> " ఇత్థంపరస్యనిజ (ధర్మ) వర్త్మ రిరక్షయాత్త
> లీలాతనో స్తదనురూపవిడంబనాని,
> కర్మాణి కర్మకషణానియదూత్తమస్య
> శ్రూయాదముష్యపదయోరనువృత్తి మిచ్ఛన్.
> మర్త్య స్తయానుసవమేధితయానువృత్త్యా
> శ్రీమత్కథాశ్రవణకీర్తన చింతయైతి,
> తద్ధామ దుస్తరకృతాంతజవాపవర్గం
> గ్రామాద్వనం క్షితిభుజోఽపియయు ర్యదర్థాః.
> (10-90-53&.c)

ఇవ్విధంబున నిజ(ధర్మ)మార్గరక్షణార్థము లీలావతారం బెత్తి హరి తదనురూపముగ నొనర్చిన చర్యలు శ్రోత యొక్క పాపకర్మ నాశకంబులగును గానఁ దత్పదాను వృత్తిం గోరునతనికి విను టొప్పెడు. శ్రీకృష్ణకథాశ్రవణ

కీర్తన చింతనంబులం బ్రతిక్షణప్రవృద్ధ మగుభక్తియోగ మునం జేసి రాజులును దేనిఁ గోరి పురములవిడిచి యడవుల కేఁగుదురు. ప్రవృత్తిమార్గనిష్ఠులు లోకములోనుండి భగవంతునివలె లోకోపకారకకర్మముల నాచరింతురు. నివృత్తిమార్గనిష్ఠులు తీవ్రవిరక్తితో విజనమున శిష్యులకుఁ దత్త్వమును బోధచేయుచు, లోకరక్షణముఁ జేయుదురు. మౌనము నాచరింతురు. కావున

> సంసారసింధుమతిదుస్తరముత్తితీర్షో
> ర్నాన్యః ప్లవో భగవతః పురుషోత్తమస్య,
> లీలాకథారసనిషేవణ మంతరేణ
> పుంసో భవేద్వివిధదుఃఖదవార్దితస్య. (12-4-40).

వివిధదుఃఖదవార్దితుండై సంసారసాగరము దాఁటఁ దలఁచువానికి భగవంతునిలీలాకథామృతసేవనంబు దక్క నొండొక ప్లవము గానంబడదని శ్రీశుకులు రాజునకు సెల విచ్చిరి. విరక్తకీర్తితంబై శ్రవణరమణీయంబై మౌన సాహ్లాదకరంబై సంసారౌషధంబై వెలయు విష్ణుగుణ వర్ణనంబు వినునెడఁ బశుఘ్నుండు దక్క నితరుండు విరక్తిఁ జెందునే యని, పరీక్షిద్రాజు దశమస్కంధాదిలో ననలేదా? (10-1-4). హరిగుణశ్రుతి యను నాల్గవ భూమిక సర్వభాగవత లక్షణములకు సూచకమని శుకులను దురు:— అన్నింట మృత్యువని యెఱింగిన యింద్రియ

వంతుఁడెవ్వఁడేనియు—జీవన్ముక్తుఁడైనను—సుకోత్తమ సేవ్యంబైనముకుందచరణారవిందమును భజింపకుండునే? (11-2-2). ఆభజనము తొమ్మిది తెఱంగుల నిట్లు ప్రహ్లాదుఁడు తండ్రికిఁ జెప్పె:—

శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం,
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనం.
ఇతిపుంసార్పితావిష్ణౌ భక్తిశ్చేన్నవలక్షణా,
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీతముత్తమం.
(7-5-23&24).

విష్ణుదేవుని శ్రవణము కీర్తనము స్మరణము పాదసేవన మర్చనము వందనము దాస్యము సఖ్య మాత్మనివేదనమను నవవిధముల నెసఁగుభక్తి నాహరిపై మానసమున మొదట సమర్పించి, పిదప దేహాదులతోఁ జేసినవాఁడుత్తమభక్తుఁడని తలంతు. ఈయర్థమును సంక్షేపముగ, సంసారనివృత్తిఁ గోరినపురుషుఁడు భగవంతుని వినవలయుఁ, బలుకవలయు, స్మరింపవలయు, నని శుకులురాజునకు ద్వితీయస్కంధములోఁ గూడఁ జెప్పెను.(2-1-5&c.) తొమ్మిదితెఱంగులభక్తులు క్రమముగ నుపన్యసింపఁబడు. భాగవతాద్యంతములందు సూతుఁ డిట్లు భగవచ్ఛ్రవణాది స్వరూపఫలములను వివరించెను:—

౪ (క. గ. చ). శ్రవణకీర్తన స్మరణములు భగవం
తునిప్రభావము విన్ననుం, గీర్తించినను, స్మరించినను,
సూర్యుఁడు చీఁకటిని, వాయువుమేఘమునుం, బోలెనా
హరి తచ్చిత్తముసొచ్చి సమస్తవ్యసనములఁ దొలఁగించు.
అసచ్చరిత్రంబులు మిథ్యావచనములు. భగవద్గుణోదయం
బైనచరితంబే సత్యంబు, మంగళంబు, పుణ్యంబు, నగు.
హరికీర్తిగానంబు నవనవరుచిరంబు, శాశ్వతమనో మహో
త్సవంబు, నరులకు శోకార్ణవశోషణంబు నగు. చిత్రపద
ఘటితంబయ్యు జగత్పవిత్రంబైన హరికీర్తి కీర్తింపఁబడ
కున్న నయ్యది శబ్దజాలంబుగాదు, మఱి హంసపరిత్యక్తం
బైనవాయసతీర్థంబు. హరి యెందుఁగలుగునందుసాధువు
లుండుదురు.

మ. అపశబ్దంబులఁ గూడియున్ హరిచరి
త్రాలాపముల్ సర్వపా
పపరిత్యాగముసేయుఁగావున హరిన్
భావించుచున్ బాడుచున్,
జపముల్ సేయుచు వీనులన్ వినుచున
శ్రాంతంబు గీర్తించుచున్
దపసుల్ సాధులు ధన్యులౌదురుగదా
తత్త్వజ్ఞ చింతింపుమా.

నిరుపాధికబ్రహ్మముయొక్క పరోక్షజ్ఞానంబు హరిభక్తి లేనిది యపరోక్షజ్ఞానంబుగఁ బరిణమింప దనఁగ నుత్తమ కర్మంబీశ్వరార్పితముగాకున్న నెట్లు ప్రకాశించెడు? మఱి యీసర్వోత్తమకర్మంబుసాధనఫలకాలములందునుఁగూడ దుఃఖాత్మకంబ యగు.వర్ణాశ్రమాచారతపశ్శ్రుత్యాదిపరిశ్రమంబును శ్రీకీర్తి మాత్రార్థంబగు నేని శ్రమమాత్రంబగు. అదియే హరిగుణానువాదశ్రవణాది విలసితంబగు నేని శ్రీధరపాదారవిందస్మృతి నెడదు. శ్రీకృష్ణపాదారవిందముల సంతతస్మృతి యమంగళములు నిరసించి చిత్తశాంతిని, సత్వశుద్ధిని, బరమ (సాధ్య) భక్తిని, విరక్తితోఁగూడిన శాస్త్రజ్ఞానమును ననుభవజ్ఞానమును గావించు (స్కం-1 అ-5-స్క-12-అ-12). కుచేలునితో సతనిభార్య స్మరణముచేతనే భగవంతుఁడు మోక్షముం గూడ నిచ్చునని యిట్లు చెప్పె:— "స్మరతః పాదకమలమాత్మానమపియుచ్ఛతి, కిన్త్వర్థకామాన్ భజతో నాత్యభీష్టాన్ జగద్గురుః." (10-80-11).

మ. కలలోనం దనుమున్నెఱుంగనిమహా
కష్టాత్ముఁడై నట్టిదు
ర్బలుఁడాపత్సమయంబునన్ నిజపదా
బ్జాతంబు లుల్లంబులోఁ

దలఁపన్నంతన మెచ్చి యార్తిహరుఁడై
తన్నైనఁ నిచ్చుఁ గసుని
శ్చలభక్తిఁ భజియించువారి కిడఁడే
సంపద్విశేషోన్నతిన్. (౧౦-౭౭౧)

నారదులు భగవద్ధ్యానఫలము నిట్లు శ్రీకృష్ణులతోఁ జెప్పిరి:—"అపరిమితజ్ఞానసంపత్తిఁ గల బ్రహ్మాదులచేతఁ గూడ హృదయమందుఁ జింతింపఁబడునదియు, సంసార మనుపాడుబావిలోఁ బడినవారికి నుత్తరణసాధనమైన దియు, జనులకు మోక్షస్వరూపమైనదియు, నగు మీపా దారవిందద్వయమును జూచితిని. దానిని ధ్యానించుచు సంచరించెదను. దాని నిరంతరస్మృతిని నాకు గ్రహింపుఁడు:— (10-69-18).

౭. ౫. పాదసేవనము. హరివర్షంబున నృసింహదేవు నీతీరునఁ బ్రహ్లాదుండు స్తుతించె:—రజోరాగ విషాద మన్యు మానస్పృహాభయదైన్యాదిమూలంబై సంసార చక్రవాళంబైనగృహముఁ బరిహరించి యకుతోభయంబైననృసింహపాదమూలమునో, జనులారా, భజింపుఁడు. (5-18-14). కేతుమాలవర్షమునందు భగవంతు నిట్లు రమాదేవి స్తుతించెను:—'ఆత్మలాభముకంటె నన్య మధి కమని తలంపనినీ వొక్కరుండవే తగినపతివి, ఫల మెయ్య

దియుం గోరక నీపదపద్మముల నర్చించు నంగనకు సర్వ కామములు సమకూరెడు. అట్లు గాక యేదే నొక్క యర్థ మపేక్షించి సేవించిన నది యొక్కండే లభించుఁగాని సర్వార్థంబులు సిద్ధింపవు. లభించిన యయ్యర్థమును గామ్యోపాసనాలబ్ధ మవుటం జేసి యనిత్యంబు. తత్ఫలంబు క్షయించినపిదప నయ్యుపాసకు రాలికిఁ జిత్తసంతాపంబుతప్పదు. (5-18-20-22). కానసే శ్రీకృష్ణులగు జగద్గురువులను భర్తృభావమునం బాదసంవహానాదులఁ సేవలము ప్రేమభక్తితోఁ గొలుచువా రెంతతపంబు సేసిరో ? (10 - 90 - 28). మాలాకారుఁడన్నిభక్తులలో భగవద్భాగవతపాదసేవలను, సర్వభూతదయను, నిమ్మని కోరెను:—

క. నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోడి నెయ్యము నితాం
తాపారభూతదయయును
దాపసమందార నాకు దయసేయఁగదే.

మఱియు భగవత్పాదమన వారిచే సృజింపఁబడిన సర్వజగత్తని బ్రహ్మాదిదేవతలు శ్రీకృష్ణస్తుతిలో నిట్లు చెప్పిరి:—భవతః పదోభువో భారోపనీతః (10 - 3 - 39).

నీపాదమైన యీభూమియొక్క భారమును నిజావతారము నఁ దొలఁగింతువు. ఈయర్థము 'పాదోస్యవిశ్వాభూతాని' యను సర్వవేదగతపురుషసూక్తశ్రుతి ననుసరించు చున్నది. కావనే భగవంతు లుద్ధవునకు ౧౨ నియమ ములలో భగవదర్చనమువలె పరోపకారవ్యాపారమును గూడ నుపదేశించిరి (11-20-34-'పరార్థేహా'). పలువిధము లుగ భగవత్సేవఁజేయుటకు మనలోకములో వీలుండు టచేతనే దేవతలుగూడ భారతవర్షంబున మానవజన్మము గలుగుట కెంతయుఁ దపస్సు చేసి యుండవలయు నని మనలను శ్లాఘించిరి (5-19-19.). కాన నాజగద్గురుని భర్తృభావమునం బాదసంవాహనాదులఁ గేవలప్రేమ భక్తితోఁ గొలుచువా రెంత తపంబు సేసిరో ?(10-90-28) మీరే యూహింపుఁడు.

౫. వందనము. భగవంతుఁ డర్జునునకు:—

సతతం కీర్తయన్తోమాం యతన్తశ్చదృఢవ్రతాః ।
నమస్యంతశ్చ మాంభక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ।
మన్మనాభవ మద్భక్తోమద్యాజీమాం నమస్కురు ॥

అని కీర్తన వందనార్చనాది సర్వవిధభక్తు లుపదేశించిరి. కావున నొండుమాని నీదయయెన్నడు వచ్చునో యని ప్రతీక్షించుచుఁ గాయకవాచకమానసిక వ్యాపారముల

నిన్ను నమస్కరించుచుఁ బూర్వజన్మకర్మఫలమందాసక్తి వర్జించి కుడుచుచు జీవించు నతండు ముక్తిపథమున దాయభాగి యయ్యెడు నని బ్రహ్మ శ్రీకృష్ణుని స్తుతించెను (10-14-8). నేఁడు గదా నా యమంగళంబు నశింప జన్మము ఫలవంతంబుగాఁగ యోగిధ్యేయుని పాదారవిందమునకు మ్రొక్కెద నని యక్రూరుఁ డనెను (10-38-6). భగవంతునకే గాదు. భగవంతుఁడు గోకులమందుఁ దిరిగిన యెల్లచోట్లకు నతఁడు నమస్కరించె. హరికిని హరిభక్తులకును నమస్కారరూపమగు భక్తి భాగవతములోఁ బలుచోట్ల నున్నది. తుదకు సూతులు వందనభక్తిప్రభావం బిట్లు వర్ణించిరి:— పడియు, జారియు, రోగమున నొచ్చియుఁ, దుమ్మియు, మైమఱచియు "హరయే నమః" యని గట్టిగఁ బలుకునతఁడు ఘోరపాపమునుండి ముక్తుఁడగు (12-12-48). శ్రీరామకృష్ణచరమోపదేశములవలన శరణాగతి యనుప్రపత్తిరూపమగు నమస్కారము సర్వానర్థములకుఁ బ్రతిబంధకమే గాక సకలశ్రేయోదాయకముగూడ నగు.

౬. అర్చనము, వైదికము, తాంత్రికము, మిశ్రము. అని విష్ణుపూజ మూఁడు తెఱంగులు. ఈమూఁడు విధములుగఁ జేయఁబడు భగవదర్చనము ఫలకారి. దీనివిధాన

ములు భగవంతు లుద్ధవున కుపదేశించిరి. (11 స్కం. 27 అ.)
స్థిరచిత్తముతో నీపాదములపై జలము పోసి దూర్వాంకురముల నైనం బూజించినభక్తుఁ డత్యుత్తమగతిఁబడయు నని బ్రహ్మవామనునితోఁ జెప్పె. (8 - 6 - 17).

'పత్రంపుష్పంఫలంతోయంయోమేభక్త్యాప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః.'

అని భగవంతులు భక్తియుక్తమగు నర్పనము నంగీకరింతు మని యర్జునునకు సెలవిచ్చిరి. (గీ. 9-20)

2. దాస్యము. 'స్మృతే సకలకళ్యాణభాజనం' 'యన్నామా మంగళఘ్నం' లోనుగాఁగల బహుప్రమాణములవలననే నారాయణనామమును వినినమాత్రముననే పురుషుఁడు నిర్దోషియగునో యట్టిపరమపవిత్రుఁడైన భగవంతుని దాసుల కేమితక్కువ? అశేషజీవులకు బంధువుఁడైనయో శ్రీకృష్ణా, గత్యంతరశూన్యులమై తమ దాసుల మైనమాయందుఁ గలిసిమెలిసి సంచరించుట యొకవింత గాదు. ఇంద్రాదిదేవతలకిరీటాగ్రములచే స్పృశింపఁబడుచున్న పాదములుగల మీరు శ్రీరామావతారమందు మృగజాతులగు సుగ్రీవాదులతోఁ గూడ కలిసి సంచరింప లేదా? యనియుద్ధవవాక్యము (11-29-4). శ్రీహనుమంతులదాస్యభక్తి లోకోత్తరము, సర్వలోకవిదితము.

కాయేనవాచా మనసేంద్రియైర్వా
బుధ్యాత్మనావా ప్రకృతే స్స్వభావాత్,
కరోతి యద్య త్సకలం పరస్మై
నారాయణా యేతి సమర్పయే త్తత్.(11 - 2 - 36)

సర్వదైహికకర్మములు స్వామిభృత్యన్యాయ మనుసరించి స్వామివని యెన్ని శ్రద్ధాభక్తులతో సమర్పణపూర్వకముగ నారాయణనిమిత్త మాచరించుట దాస్యభక్తి. అట్లె పృథుప్రహ్లాదు లొనరించిరి. దాస్యభక్తిలో నిదియే భాగవతులయందలి భక్తి. ఈరెండువిధములయిన దాస్యభక్తి విశేషములు ప్రహ్లాదకృతనృసింహస్తవమునఁ జూడనగు.

౮. సఖ్యము.—

'అహోభాగ్య మహోభాగ్యం నందగోపవ్రజౌకసాం,
య న్మిత్రం పరమానందం పూర్ణంబ్రహ్మ సనాతనం.'
(10 - 14 - 32).

పరమానందస్వరూపుఁ డగు శ్రీకృష్ణుఁడు నందాదులగు గోపులకు మిత్త్రుఁడుగ సంచరించెను, గాన వారి భాగ్య మేమని బ్రహ్మ యచ్చెరువొందెను. తత్త్వవేత్తలకు సచ్చిదానందబ్రహ్మ మయినట్టియు, దాస్యభక్తులకుఁ బరదైవతమైనట్టియు, మాయానశులకు నరబాలకుఁడై నట్టి యీబాలకృష్ణునితోఁ బూర్వజన్మములందుఁ

చేయఁబడిన పుణ్యకర్మములచే గోపకులు క్రీడించి రని శుకులాశ్చర్యపడిరి (10-12-11). సఖ్యభక్తి దశమస్కంధ పూర్వభాగములో నతిమనోహరముగ వర్ణింపఁబడినది. అర్జునుఁడుగూడ శ్రీకృష్ణునందు సఖ్యభక్తిఁ జేసిన భక్తాగ్రేసరుండె. వారి ప్రభావము పద్మపురాణమువలన నరయ నగు.

౯. ఆత్మనివేదనము. ధర్మార్థకామములను త్రివర్గము నాత్మవిద్య, శ్రౌతకర్మము, వార్తాదండనీతులను, వేదార్థ సారభూతము లైనవిద్యలెల్ల, నాత్మసుహృదుఁ డైన పరమపురుషున కర్పింపఁబడునేని సత్యంబులని ప్రహ్లాదుని తలంపు (7 - 6 - 34). భావాద్వైత ద్రవ్యాద్వైత క్రియాద్వైతములను లెస్సదెలిసి సర్వకర్మములు భగవదర్పణముచేయుట యాత్మనివేదనమనియు, దానివలన ద్వైతభ్రమ నివర్తించు ననియు, నారదుని తలంపు (7. స్క. 15. అ.). బలిచక్రవర్తి స్థిరచిత్తముతోఁ దనను దన సర్వస్వము నగు నఖిలభూమండలమును గర్జితలోకములను వామనున కర్పించెను. దీనినే ప్రపత్తి లేక శరణాగతి యని విశిష్టాద్వైతు లనుదురు. వరాహరామకృష్ణ చరమశ్లోకములును వాని టీకలును దాని విశేషములను వివరించెను.

" ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్యవర్జనం,
రక్షిష్యతీతివిశ్వాసో గోప్తృత్వ వరణం తథా,
ఆత్మనిక్షేప కార్పణ్యే షడ్విధా శరణాగతిః".

మఱియు, భేదంబు నిరసించి సర్వవిధముల సర్వలోకరక్షకుఁడును భగవంతుఁడును, నగునారాయణునే పురుషుఁ డాశ్రయించునో యతఁడు దేవతలకుఁ గాని, ఋషులకుఁగాని, భూతములకుఁగాని, మనుష్యులకుఁగాని, పితృదేవతలకుఁగాని కింకరుఁడునుగాఁడు. ఋణగ్రస్తుఁడును, గాఁడని కరభాజనుఁడు నిమికిఁ జెప్పె (11-5-4). కావున, స్వాత్మనివేదనము సర్వపుణ్యపాప ప్రతిబంధకము లను రూపుమాపి విష్ణుప్రాప్తికి నుపకరించును. శరణాగతి కిఁగూడ నింతఫలము గల దని చరమశ్లోకభాష్యము లోను శరణాగతిగద్యలోను శ్రీరామానుజాచార్యులు వ్రాసిరి. చరమశ్లోకమునకుఁ బూర్వ మున్న "మన్మనా భావ...." అనుశ్లోకము శరణాగతి నుపపాదించు నని శ్రీ శంకరాచార్యులు వ్రాసిరి. ప్రపత్తి విశేషములు ముత్కృత బ్రహ్మసూత్రసారభూమికలోఁ జూడ నగు. కాన, నీ తొమ్మిదిభక్తులలో నేది యయిననొకటి నాశ్రయించినను భాగవతధర్మానుష్ఠాతయగు. విష్ణు శ్రవణముచేఁ బరీక్షిత్తు, కీర్తనముచే శుకుఁడు, స్మరణముచేఁ బ్రహ్లాదుఁడు, పాద

సేవనముచే లక్ష్మి, పూజచేఁ బృథువు, వందనముచే నక్రూరుఁడు, దాస్యముచే హనుమంతుఁడు, సఖ్యముచే, నర్జునుఁడు, స్వాత్మసమర్పణముచే బలియు, మోక్షము నొందిరని పెద్ద లిట్లనుదురు:—

శ్లో. శ్రీవిష్ణోశ్శ్రవణే పరీక్షిదభవద్వైయాసకిః కీర్తనే
ప్రహ్లాదస్స్మరణే తదంఘ్రిభజనే లక్ష్మీఃపృథుఃపూజనే,
అక్రూరస్త్వభివందనే కపిపతిర్దాస్యే చ సఖ్యేఽర్జునః
సర్వస్వాత్మనివేదనే బలిరభూత్కైవల్యమేషాం ఫలం.

ఈ శ్లోకములోఁ దొమ్మిది భక్తులు మోక్షమునకు సాక్షాత్సాధనములని చెప్పినను, మధుసూదన సరస్వతులు వీని నన్నింటిని నాల్గవభూమిక యగు 'హరిగుణశ్రుత్యాదికము' గఁ జెప్పి, ముందుఁ జెప్పఁబోవు నాలుగు భాగవతధర్మము లగు భూమికలకు నంగము లగుసాధనము లని సెలవిచ్చిరి. ఇంతవఱకు సాధనకోటి చెప్పఁబడినది. కాన, శ్రవణాదికముయొక్క స్వరూపము సాధనసాధ్యమగు నుభయ రూపము.

౫. తతోరత్యంకురోత్పత్తిః = హరిగుణశ్రవణాదికమనువిత్తునలన, (ఆసక్తి) రతియను నంకురముపుట్టును. ఆ రతియే ౫వ భూమిక. రతి యనునంకురము భగవద్భక్తి

యనురసమునకు స్థిరమగు బీజము. ఆస్థిరబీజమునకు స్థాయీభావమని యాలంకారికులనామము. దీనినే కఱఁగిన చిత్తమందుఁ బ్రవేశించిన భగవదాకారమువలె నుండు వాసనావిశేష మని ముందుఁ జెప్పఁబడు. అదియే భాగవతధర్మశ్రద్ధ (శ్రద్ధ) యనుబీజముయొక్క యంకురము. ఈక్రమమును శ్రీ కపిలుఁడు తల్లికిఁ జెప్పెను.—

"సతాం ప్రసంగాన్మమవీర్య సంవిదో
భవంతి హృత్కర్ణరసాయనాః కథాః,
తజ్జోషణాదాశ్వపవర్గవర్త్మని
శ్రద్ధారతి ర్భక్తి రనుక్రమిష్యతి. (3 - 25 - 25).

సత్పురుషులు పవిత్రకీర్తి గలభగవంతుని కథలను మనస్సుల కింపుఁ బెంపఁ బ్రసంగింప భక్తులు సంతసించి వానిసేవించుటచే, శీఘ్రముగ మోక్షమార్గమందువారికి శ్రద్ధయు, రతియు, భక్తియుఁ గ్రమముగ నుదయించు. భాగవతధర్మశ్రద్ధ, బీజమువంటిది. రతి, స్థాయీభావమగు నంకురమువంటిది. బీజము స్థిరమయి, మొక్కఁగాక పూర్వమంకురముగ మాఱును. తర్వాత నాయంకురమగుస్థాయీభావమే భక్తియనురసముగఁ జెట్టుయొక్క వేరుమొదలు పండువఱకు నభివ్యక్తినొందు. ఇక్కడ నలం

కారశాస్త్రము ననుసరించి కొన్నివిషయములు చెప్పఁబడు నుగాన వానిని శ్రద్ధతో గమనించినంగాని ముందుగ్రంథము తెలియదు. శృంగారాదిరసములయొక్క యావిర్భావము నకుఁ గారణమైన సంస్కారము జనులహృదయములం దుండు. అదియే స్థాయీభావ మనఁబడు. ఆస్థాయీభావము శృంగారరసమునకు రతియనియు, హాస్యరసమునకు హాస మనియు, కరుణారసమునకు శోకమనియు, రౌద్రరస మునకుఁ గ్రోధమనియు,వీరరసమునకు నుత్సాహమనియు, భయానకరసమునకు భయ మనియు, భీభత్సరసమునకు జుగుప్సయనియు, అద్భుతరసమునకు విస్మయ మనియు, శాంతరసమునకు శమ మనియుఁ జెప్పఁబడు. ఈస్థాయీ భావమునే వాసన లేక సంస్కారము, అని వ్యవహరింతురు. ఈస్థాయీభావము, నాలుగుకారణము లున్నచో రసరూప మగు సుఖమును బొందించు. ౧ విభావము, ౨ అనుభావము, 3 సాత్త్వికభావము, ౪ వ్యభిచారిభావము, అను నవి నాలుగు హేతువులు. ఈకారణము లాయారసము లకు భిన్నభిన్నములుగనుండు. రసోత్పత్తికి ముఖ్యహేతువు విభావము. అది రెండుతెఱఁగులు:— ౧ ఆలంబన విభావము, ౨ ఉద్దీపనవిభావము. రసమునకు ముఖ్యతరకారణ మాలంబనవిభావ మనియు, రసమును వృద్ధిఁబొందించుఁ గారణ ముద్దీపనవిభావ మనియుఁ జెప్పఁబడు. లోకప్రసిద్ధ

మైన శృంగారరసమునకు నాయికానాయకులాలంబన
విభావ మనియు, రూపయౌవన స్రక్చందన మలయా
నిలచంద్రాదు లుద్దీపనవిభావ మనియు, నెఱుంగవలయు.
శృంగారరసము పుట్టునపుడు నాయికానాయకులకు నన్యో
న్యము కలుగుకటాక్షవీక్షణాదులనుభావ మనంబడు.
స్వేదరోమాంచాదులు సాత్త్వికభావములు. నిర్వేదాదులు
వ్యభిచారిభావములు. ఈనాల్గింటచే స్థాయిభావము రస
రూప మయి యనుభవగోచరమగు. రతి యనుస్థాయి
భావము లోకసిద్ధులగు నాయికానాయకుల నవలంబించి
స్ఫురించినచో శృంగారరసమనంబడు. అదియే యలౌకిక
మగుభగవత్స్వరూపము నవలంబించి స్ఫురించినచో భక్తి
యనఁబడు. కావున భక్తిరసమునకు స్థాయిభావము రతి.
ఆరతికి నాలంబనవిభావము భగవత్స్వరూపము. ఆరతి కుద్దీ
పనవిభావము సాధుసంగమభగవత్కథాశ్రవణాదులు. ఆ
రతి కనుభావము మహాతాంధర్మరూపమగు శ్రద్ధయను బీజ
ము. పూర్వజన్మకృతపుణ్యకర్మము, భగవదనుగ్రహముఁ
గూడ, శ్రద్ధకు హేతువులు. అశ్రుగద్గదస్వరరోమాంచాదు
లు ౮ సాత్త్వికభావములు. నిర్వేదాదులు 33 వ్యభిచా
ములు. లౌకికసుఖములు నిష్ఫలము లనుబుద్ధి నిర్వేదమనఁ
బడు. కనుక, అనుభావము=బీజము, శ్రద్ధ; ఆలంబనవిభావ
ము=భగవత్స్వరూపము. ఉద్దీపనవిభావము=సాధుసంగమ.

భగవత్కథాశ్రవణాదికము. గద్గదస్వరరోమాంచాదులు= సాత్త్వికభావములు. నిర్వేదాదులు=వ్యభిచారిభావములు. అంకురము=(ఆసక్తి) రతి=స్థాయీభావము=స్థిరమగుబీజము =రసాభివ్యక్తికవ్యవహితపూర్వవృత్తి. రసము=భక్తి=వృక్షరూపభక్తుని యాపాదమస్తకము వ్యాపించువృత్తివిశేషము. ఇది శ్రద్ధారతులచే నావిర్భవించు. కాన భగవద్గుణశ్రవణాదులచేఁ జిత్తము కరఁగినపుడు శ్రుతమగు భగవదాకారము హృదయమందుఁ జొచ్చి చిత్తమును ఘనీభావముఁ (గట్టి) బొందించినను, నది సంస్కారరూపముగఁ జిత్తమందే స్థిరముగ నుండును. అదియే స్థాయీభావము, శ్రవణాదికమగు నుద్బోధకసామగ్రీసంబంధము గలిగినప్పుడ నే యది బుద్ధికి స్ఫురించును. భాగవతధర్మశ్రద్ధారూప మగుబీజము సత్సంగహరిగుణశ్రవణాదికముతోఁ గూడినచో నంకురమగు రతి యను స్థాయీభావముగ మారును. ఆరతి యాలంబనాదికముతోఁ గూడినచో భక్తియను రసరూపమభివ్యక్తిని బొంది సర్వకాలసర్వావస్థలలోను భాగవతులందు స్థిరముగనుండు. శ్రీకృష్ణచైతన్యులశిష్యు లగు శ్రీరూపగోస్వామి విశదముగను జ్వలనీలమణిలో దీనిని వివరించిరి.

" భవాపవర్గో భ్రమతో యదాభవే
జ్జనస్యతర్హ్యచ్యుతసత్సమాగమః,

సత్సంగమోయ ర్హి తద్దైవసక్తితౌ
పరాపరేశేత్వయి జాయతే రతిః." (10-51-52).

సత్సంగనుమువలన భగవంతునియందుఁ బ్రేమ రూపమయిన యంకురమను రతి, దానివలనఁ గ్రమముగ సంసారబంధమోక్షము, గలుగునని ముచుకుందుఁడు శ్రీ కృష్ణులనుస్తుతించెను. కుంతీదేవి యిట్లు స్తుతించె:—

ఓ కృష్ణా, మీవిషయ మగురతి యన్యవిషయమిశ్రముగాక యొకమాఱు గలిగినను గంగసముద్రమువఱకు నవిచ్ఛిన్నముగఁ బ్రవహించున ట్లారతి మీయం దవిచ్ఛిన్న మగుభక్తిరసముగ నభివ్యక్తిఁబొందును. కాన సర్వపుణ్యపాపకర్మాచరణముచే నేలోకమందు జన్మించి యేయవస్థనొంది సంచరించుచున్నను, మాచేఁ జేయఁబడిన శుభకర్మములచేతను, సత్పాత్రదానములచేతను, మా కీశ్వరుఁడైన శ్రీకృష్ణునియందు రతి గలిగియుండవలయు నని వారిభక్తులు ప్రార్థించిరి. (1-8-43&c.) ఈ యయిదవభూమికయే భక్తిస్వరూపము. ఇతర మగు నాఱుమొదలు ౧౧ భూమికలు భక్తియొక్క పరిపాకవిశేషములగు ఫలరూపములు.

౬. స్వరూపాధిగమ స్తతః=భగవంతునియందుఁ గల ప్రేమాంకుర మగు రతివలన స్థూలసూక్ష్మ దేహముల

కంటె వ్యతిరిక్తస్వభావుఁ డగుజీవుని స్వభావము ననుభవించుట యనునాఱవభూమిక యుదయించును. దేహేంద్రియాదివిశేషముచే వివిక్తాత్మస్వరూప మనుభవారూఢము గానిచో, భగవద్విషయ మగురతి నిర్వాహకము కాదు. జీవతత్త్వము కపిలుఁడు తల్లి కిట్లుబోధించెను.— హృదయగ్రంథిభేదనం బై నిశ్శ్రేయస మొదవించు నాత్మదర్శనరూప జ్ఞానంబును దత్త్వజ్ఞానంబున నుదయించుఁగావున దాని నీకుఁ దేటపఱచెద వినుము. ప్రత్యక్ప్రకాశుఁడు, జన్మాదిరహితుఁడు ప్రకృతికిఁ బరుఁడై న యసంగుఁడు నిర్గుణుఁడు, జ్ఞానవిషయత్వజ్ఞానాధారత్వములను వ్యవచ్ఛేద్యుండు గాని స్వయంజ్యోతివిశ్వప్రకాశకుండునగు నాత్మ పురుషుఁ డనంబడు. అతండు దేహాద్యుపాధిసహకారమునఁ దద్ధర్మము లగు జన్మమరణాదుల బొందునట్లు స్వప్నమునం దత్తద్విషయములఁ బోలె మిథ్యోపలంభమునఁ దోఁపఁ జేయుచు వస్తుగతిం బరికింప జన్మమరణాదులం బొందఁడు. అప్పురుషుఁడు సూక్ష్మము గుణమయము విష్ణుశక్తియు నగుమాయను లీలావశమున యాదృచ్ఛికభగవత్సంకల్పమునఁ దటిసిన దాని గుణసంసర్గమున సమానరూపవిచిత్రప్రజాసృష్టి సేయుదానిం బొంది యాత్మజ్ఞానము నావరించు దాని తగులంబునఁ దన్ను మఱచి ప్రకృత్యధ్యాసమునం జేసి ప్రకృతిగుణ

క్రియమాణకర్మములఁ దాను గ ర్తయని తలంచు. అట్టి తలంపే యక ర్తయు స్వతంత్రుఁడును సాక్షియు సుఖాత్ముఁడు నగు నాత్మునకు సంసారమును బంధమును దత్కృతపరతంత్రత్వంబు నయ్యెడు (3-26-24). మఱియు, జీవుఁడు, ఆత్మఁడు, నిత్యుఁడు, నాశరహితుఁడు, శుద్ధుఁడు, ఏకము, క్షేత్రజ్ఞుఁడుఁ, ఆశ్రయుఁడు, అవికారి, దృక్స్వరూపుఁడు, జ్ఞానస్వరూపుఁడు, వ్యాపకుఁడు, బహిరంతరసావృతుఁడు. ఈ ౧౨ లక్షణములు గలవాఁడు జీవుఁ డని తెలిసి, దేహాదులందు (నహంకారమమకారములు) నేను నావి యనుభావములు లేకుండ వలయు. ఇట్లా శుద్ధత్వం పదమును జీవస్వరూపము నను భావమునకువచ్చినచో నదియే 'తత్పదలక్ష్యార్థ' ముతో నభేదమనుజ్ఞాన మంకురించును. ఈ తత్త్వంపదార్థశోధనము బ్రహ్మసూత్రసారములోఁ జేయుటచే నిక్కడ విరమించినాను. భాగవతదశమమందు శుకాచార్యులు రాజున కీయర్థ మిట్లుసెలవిచ్చిరి:—సకల జీవులకు నాత్మస్వరూపుఁడగు శ్రీకృష్ణుఁడు జగదుపకారము కొఱకు జీవునివలెఁ దనమాయచేఁ బ్రకాశించుచున్నాఁడు (10-14-55). ఇట్టి జీవపరాభిన్నజ్ఞానము భక్తి గలిగినమీఁదఁ గలుగునని సూతు లిట్లు చెప్పిరి:— భగవంతుఁ డగు వాసుదేవునియందుఁగలభక్తి జీవబ్రహ్మైభేద జ్ఞానమును నితరమందు విరక్తియు శీఘ్రము గలిగించును"

సకలశ్రేయస్సునకు హేతు వగుభక్తిని విడిచి కేవలము తత్త్వజ్ఞానముకొఱకు యత్నించువారికిఁ బొల్లుధాన్యమును దంచెడువారివలె శ్రమమాత్రము మిగులును. (10-14-4.) మఱియు, శ్రవణాదిసాధనభక్తి విస్తరించినకొలఁది యాత్మ తత్త్వ మనుభవమునకు వచ్చును. (11 - 14 - 26) ఇట్టి శుద్ధత్వంపదార్థజ్ఞానానంతర మన్యమందు స్థిర క్తి దృఢమై పరమాత్మయందుఁ బ్రేమ భక్తి యతిశయించు.

౭. ప్రేమవృద్ధిః పరానందే = ఇదియే పరమానంద స్వరూపుఁడగు పరమాత్మయందుఁ బ్రేమ వృద్ధియను నేడవ భూమిక. ప్రహ్లాద ప్రవర్తన మిందులకు ముఖ్యదృష్టాంతము.- 'ఆటలాడుబాలుఁ డయ్యుఁ గ్రీడాసాధనంబులం దెగడి కృష్ణగ్రహగృహీతాత్మునిరీతిఁ దన్మయచిత్తముతోడ జడుని వడువున నీజగం బిట్టిదని యాతఁడు దా నెఱుంగఁడు. కూర్చుండునెడను, దిరుగునెడను, భుజించునెడను, శయనించునెడను, పానముసేయునెడను, బలుకునెడను గోవిందతాదాత్మ్యముం బొందినకతనఁ దనచేసినయాసనపర్యటనాదులఁ దా ననుసంధింపఁడు. వైకుంఠచింతామిశ్రచేత నుండై యొక్కచో రోదనంబొనర్చు. తచ్చింతాహ్లాదమున నొక్కచో నవ్వు. ఒక్కచోఁ బాడు. తద్భావభావనాయుక్తుం డై తన్మయుండై యొక్కచో నాహరి ననుకరించు.

ఎలుంగెత్తి యొక్కచోఁ బలుకు. సిగ్గువిడిచి యొక్కచో
నృత్యంబు సేయు. తద్భావాపత్తి నిర్వృతుండై యొక్క
చోఁ బులకితాంగుఁడై ప్రేమస్థిరత్వమునం బొడమిన
యానందబాష్పములు గన్నుఁ గవం గ్రమ్ముదేర మిన్న
కుండు. నిట్టూర్పు నిగుడ్చుచు మాటిమాటి కోపన్నగ
శాయి, యోదనుజభంజన, యోజగదీశ, యోమహాపన్న
శరణ్య, యోహరీ, జగత్పతీ, నారాయణా, యని లజ్జలేక
యఱచును. విశేషభక్తిచేఁ గర్మానుశయము చిత్తమం
దున్న రజస్తమోరూపమగు మలమును సంసారబంధము
నశించి, బ్రహ్మసుఖము గలుగుఁ గాన హృదయమునందు
శ్రీహరిని నిరంతరము భజింపు మని దైత్యబాలకులతోఁ
బ్రహ్లాదుఁడు చెప్పెను. (7-4-37 అ). ఇట్టిదశ పుట్టునఱకే
భక్తిసాధనములు పలుమాఱు అభ్యసింపవలయు. ఈప్రేమ
సాధ్యభక్తి. దీనికి సాధనము లగుశ్రవణాదుల నిది
వఱకు వివరించితిమి. వానినిఁ బ్రయత్నపూర్వకముగ నను
ష్ఠింపవలయు.

ఇవిగాక మఱి యేడుసాధనములు కలవని ఛాందో
గ్యోపనిషత్తునకు వాక్యమనువ్యాఖ్యానముఁ జేసిన
బ్రహ్మనంది యనుమహర్షి చెప్పెను. ఆవాక్యమునకు
భాష్యముఁ జేసిన ద్రమిడాచార్యు లీతిరున భక్తిసాధ
నములను వివరించిరి. వాక్యము—“తల్లబ్ధిర్వివేకవిమోకా

భ్యాసక్రియాకల్యాణానవసాదానుద్ధర్షేభ్యః సంభవా
న్నిర్వచనాచ్చ." ౧. వివేకము, ౨. విమోకము, ౩. అభ్యా
సము, ౪. క్రియ, ౫. కల్యాణము, ౬. అనవసాదము,
౭. అనుద్ధర్షము. ఈసాధనసప్తకమువలన సాధ్యభక్తి లభిం
చును. వీనియొక్క సాధనత్వము, శ్రుతిస్మృతులందుఁ
జెప్పఁబడిన దని వాక్యమున కర్థము.

(౧.) ద్రమిడాచార్యులిట్లా వాక్యమునకు భాష్య
ముఁ గావించిరి:— వాక్యం:— "జాత్యాశ్రయ
నిమిత్తాదుష్టాదన్నాత్కాయశుద్ధిః = మూఁడువిధము లగు
నన్నములను బరిత్యజించి శాస్త్రోక్తమై నిర్దుష్ట మగు
నన్నమును దినుచు దేహము శుద్ధిపఱచు కొనుట వివేక
మనఁబడు. ఉల్లిగడ్డ మొదలగు నన్నము, జాతిచే దుష్ట
మగు నన్నము. చోరపతితాదులచే నియ్యఁబడిన ద్రవ్య
మాశ్రయదుష్టమయిన యన్నము. కేశకీటాదిమిశ్రమయిన
యన్నము నిమిత్తదుష్టమైన యన్నము. ఈమూఁటిని
విడువవలయు. ఏలయన:—ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః సత్వ
శుద్ధౌ ధృవాస్మృతిః = ఆహారములో దోషము లేని
చోఁ జిత్తము శుద్ధ మగు, చిత్తము శుద్ధమైనచో నిశ్చల
మగుభక్తి కలుఁగునని శ్రుతి నుడువుచున్నది. కాన నా
హారశుద్ధి భక్తికి మొదటి యుపాయము. కాని మనదేశ
మందంతటను, పూటకూళ్లతిండ్లు, ఉల్లిపాయ, పకోడీలు,

పులునులు, లోనగునవి వ్యాపించినవి. అవి బహుశోచనీయములు.

(౨.) కామములయందు (పుత్రభార్యా స్రక్చందనద్రవ్యాదులందు) నభినివేశము లేకపోవుట విమోక మనఁబడు. ఇందులకుఁ బ్రమాణవిగా శ్రుతి:— "సర్వం ఖల్విదం బ్రహ్మతజ్జలా నీతిశాంత ఉపాసీత" = ఈప్రపంచ మంతయు బ్రహ్మమువలనఁబుట్టి, పెరిగి, చచ్చుటవలన, జగత్తు బ్రహ్మాత్మకమఁయినందునఁ బ్రపంచగతసర్వపదార్థములందు రాగద్వేషములు లేక బ్రహ్మము నుపాసింపవలయు. ఈశ్రుతి రాగద్వేషరాహిత్య మనుశాంతి, భక్తికి సాధన మని తెలియఁజేయు చున్నది.

(3.) భక్తికి నాలంబమైన భగవత్స్వరూపమును సర్వకాలములందుఁ జింతించుట, అభ్యాస మనఁబడు.

శ్లో. యం యంవాపిస్మరణ్ భావం త్యజత్యంతే కళేబరం,
తం తమేవైతికౌంతేయ సదాతద్భావభావితః. (గీ-8-6)

ఏపదార్థములను జింతించుచు శరీరమును విడుచునో చింతింపఁబడిన యాపదార్థములనే పొందును. కావున సర్వకాల సర్వావస్థలయందును భక్తినిష్ఠుఁడు భగవత్స్వరూపమునే చింతించువాఁడు కావలయు. ఈశ్లోకములోను, నితరశ్లోకములోను, సర్వదా చింతనమను, భగవ

ధ్యానము భక్తిసాధన మని భగవంతు లర్జునున కుపదే
శించిరి.

(౪.) శక్తిగొలఁది నిత్యాదికర్మముల నాచరించుటయే
క్రియ యనఁబడు. శ్రు॥ క్రియావా నేష బ్రహ్మవిదాం వరి
ష్ఠః=నిత్యాదికర్మనిష్ఠుఁడు బ్రహ్మవేత్తలలో నుత్తముఁడు.
బ్రహ్మజ్ఞాన మనుసాధ్యభక్తికి నిష్కామకర్మాచరణము
సాధనమని శ్రుతి సూచించుచున్నది.

(౫.) సత్యము, ఋజుభావము, దయ, దానము,
అహింస, వ్యర్థచింతనముచేయకపోవుట, యను నారు
కల్యాణములనఁబడు = శ్రు॥ సత్యేన లభ్య స్తేషా మే
వైషవిరజో బ్రహ్మలోకః = రజస్తమోగుణరహిత మగు
బ్రహ్మలోకము బ్రహ్మనిష్ఠులకు సత్యముచేతనే పొందఁదగి
నది. ఇచట సత్యము దయాదుల కుపలక్షణము. దీనివలన
సత్యదానాదులు భక్తికి సాధనములని శ్రుతి సూచించు
చున్నది.

(౬.) దేశకాలనిమిత్తములచే దేహాదులకు శోకహే
తువులు ప్రాప్తించినపుడు మనస్సునందు దైన్యము లేకుం
డుట,అనవసాద మనఁబడు. శ్రు॥నాయమాత్మా బలహీనేన
లభ్యః=ఈపరమాత్మ మనోబలము లేనివానిచేఁ బొందఁ
బడఁడు. ఈశ్రుతి దైన్యాభావరూప మైనమనోబలము
భక్తికి సాధన మని చెప్పుచున్నది.

(౭.) దేశకాలాదుల యానుకూల్యముచేఁ బుత్రజన్మాదిహర్ష హేతువులు సంభవించినను మనస్సు, ఉత్కటహర్షమును బొందక యుండుట, అనుద్ధర్షమనఁబడు. శ్రు. శాంతో దాంత ఉపరత స్తితిక్షుః సమాహిత శ్శ్రద్ధావిత్తో భూత్వా ఆత్మన్యేవాత్మానం పశ్యేత్ = శమాదిమత్కసంపత్తి గలిగి పరమాత్మను దర్శింపవలయును. ఆత్మదర్శనమును సాధ్యభక్తికి శాంతిదాంత్యాదులు, మనస్సుయొక్క యతిసంతోషాభావము, సాధనములనియాశ్రుతి సూచించుచున్నది. శ్రవణాది నవవిధభక్తిసాధనములలో నెద్దియనుష్ఠించినను దానితో నీవివేకాదిసాధనసప్తకముగూడ నాచరింపవలయు. లేనిచో సాధ్యభక్తి పుట్టనేరదు. "సర్వాపేక్షాచ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్, శమదమాద్యుపేతస్స్యాత్తదాపితుతద్విధేః" అను బ్రహ్మసూత్రములు వర్ణాశ్రమధర్మాచరణముకంటె శమదమాదులు భక్తిపరిపాకము గోరినవారికి నవశ్యకర్తవ్యములని నొక్కి చెప్పుచున్నవి. భగవంతులు గూడ నుద్ధవున కిట్లే సెలవిచ్చిరి (భా.11-19-6-12). ఆయుపదేశమును విష్ణుభక్తివివేకములో వివరించితి. కాన భగవంతునందు సప్తమభూమికయగుప్రేమ వృద్ధి (ప్రేమ వృద్ధిః పరానందే) కలుగుటకు పూర్వోక్తములగు నారు సాధనము లవశ్య మనుష్ఠింపవలయు. తర్వాత నాలుగు (౮-౧౧) భూమికలప్రయత్నంబున సిద్ధించును.

(౮.) 'తస్యాఘస్ఫురణంతతః'=ప్రేమాస్పదమగు భగవంతునియొక్క స్వరూపసాక్షాత్కారము భగవంతునియందు భక్తునకుఁగల ప్రేమాతిశయమగు నేడవ భూమికవలనఁ గలుగును గాన నట్టి భగవద్రూప సాక్షాత్కారమే ౮-వభూమిక. కపిలుఁ డీ తీరునఁ దల్లి కీభూమికను వర్ణించెను:— నాభక్తు లన్యోన్యము నాచరిత్రముల నాదరముతో సేవించుచు, బ్రహ్మైక్య మనుకైవల్యమును గూడ నపేక్షింపక, నాపాదసేవయందు సదా కోరికలగలవారుగ నుందురు. అతిసుందరములు, భక్తాభీష్టప్రదాన సమర్థములు, ప్రసాదసూచకములు, నగు నాయొక్క శ్రీ నారసింహవామనరామకృష్ణాదిరూపముల నెప్పుడుఁ జూచుచు, నాజన్మకర్మరూపాది ప్రతిపాదకవాక్యములను నుడువుచుందురు. పూర్ణచంద్రునివంటి ముఖములు, పుండరీకములవంటి నేత్రములు, స్మితకటాక్షములు, సకలసుందరసన్నివేశయుక్తావయవములు,గంభీరవిలాసములు, రమ్యవచనములు, గలపూర్వోక్తరూపములచే నాకర్షింపఁబడిన చిత్తేంద్రియములు గల నాభక్తులు ముక్తిని గోరకున్నను వారిభక్తియే ముక్తిని గలుగఁ జేయు. (3-25-34&c.)

(౯.) భగవద్ధర్మనిష్ఠాతః = భగవత్ప్రేమవృద్ధిచే భాగవతధర్మము లయిన శ్రవణకీర్తనాదులం దత్యంతాభి

నివేశము కలుగును. ఇది ప్రేమవృద్ధిఫలరూపమగు ౯-వ భూమిక. దీనికి భగవద్ధర్మనిష్ఠయని పేరు. అయితే భగవద్ధర్మనిష్ఠ 3-వ భూమికగ నెందులకుఁ జెప్పఁబడినది యన నది ప్రయత్నముతోఁ సాధింపఁదగినది గాన సాధనకోటి లోఁ జేర్పఁబడినది. ఈనవమభూమిక యగు భగవద్ధర్మనిష్ఠ యప్రయత్నముగ సిద్ధించుఁ గాన ఫలకోటిలోఁ జేర్పఁబడినది. దీనికి దృష్టాంతములు పెక్కులు గలవు. విష్ణుపురాణములో భరతుని చరిత్ర మిట్లు వర్ణింపఁబడినది (2-13-7 &):—సాలగ్రామక్షేత్రమునందు భరతమహారాజు గుణవంతులలో నుత్తముఁడై, భగవంతుని ధ్యానించుచు, నహింస మొదలగు యమాదులను సేవించుచు, బుద్ధీంద్రియములను లెస్సజయించుచుఁ జిరకాల ముండెను; కృష్ణ, విష్ణో, హృషీకేశ, లోనగు పేళ్లను జెప్పుచుండెను. స్వప్నమందుఁగూడ భగవన్నామోచ్చారణము చేసెను. భగవన్నామములను వానియర్థములను దప్ప యితరమును జింతింపలేదు. సర సంగపరిత్యాగము చేసి భగవత్పూజార్థము గావలసిన కుశ్వ పుష్పాదికము సంపాదనముఁ జేసెను. భాగవతమందు నంబరీష చరిత్ర మిట్లే వర్ణింపఁబడెను (9-4-18). అంబరీషమహారాజు సప్తద్వీపము లేలుచు, నసదృశ మగు గజాంతైశ్వర్యమును బొందియు, సకలము స్వప్నతుల్యముగ భావించెను, భగవంతునందును భాగవతులందును బరమభక్తి గలిగి

యుండి దానిచే జగత్తంతయు నసారమని తలంచెను. మఱియు నతఁడు కృష్ణపాదారవిందములందు మనస్సును, భగవద్గుణకీర్తనమందు వాక్కును, దేవాలయముల మార్జనమందు హస్తములను, హరికథాశ్రవణమందుఁ జెవులను, భగవంతుని యర్చామూర్తులను విమానములనుఁ జూచుటయందు నేత్రములను, భాగవతుల శరీరస్పర్శమందు శరీరమును, భగవత్పాదారవింద సౌగంధ్యము గలతులసీదళముల నాఘ్రాణించుటయందు నాసికమును, భగవన్నివేదితాన్నమందు జిహ్వను దేవక్షేత్రయాత్రలందుఁ బాదములను, భగవత్పాదాభివందనమందు శిరస్సును, నుపయోగపఱచెను. ఈకృత్యము లన్నియు భగవద్భక్తులయెడఁ గూడఁ జేసెను. భగవదర్పితమగు స్రక్చందనప్రసాదాది స్వీకారము భగవద్దాస్య నిమిత్తముకొఱకే చేసెను. ఈవిధముగ సకలకర్మములను భగవద్విషయముగాఁ జేయుచు హరి సర్వోత్తముఁడని భావించుచు భాగవతులగు విప్రులాజ్ఞతో రాజ్యమేలెను (9-4-18). ప్రాయోపవిష్టుండగు పరీక్షిత్తు మునుల కిట్లనెను:— నేను సంసారమున విరక్తిఁ జెంది యీశ్వరుని యెడఁ జిత్తంబు నిలిపి శరణుసొచ్చితి, మీరు గంగాదేవియుఁ బ్రసన్నచిత్తమున నెఱుంగవలయు. విప్రశాపప్రేరితుండై తక్షకుండు నన్నుఁ గఱచుఁగాక. శ్రీకృష్ణదేవుని కథలఁ గీర్తింపుఁడు

ఇఁక నేయేజన్మం బెత్తినను నా కప్పుడెల్లఁ దప్పక భగవద్భక్తియు భాగవతసాంగత్యమును సర్వలోకమందు మైత్రియు, నిండు. మీకు నమస్కారము. ఇట్లే శ్రీకృష్ణుని మాలాకారుఁడు వేఁడెను. ఉద్ధవుఁ డీతీరున శ్రీకృష్ణునితో యాదవుల ధర్మాచరణము మనవి చేసెను;—(11-6-50) "శయనాసనాటనస్థానక్రీడాశనాదుల నిన్నుఁ గొల్చు మే మట్టిప్రియుఁ డాత్ముఁడు నగు నిన్నెట్లు విడుతుము. నీ వుపయోగించిన ప్రక్చందనవస్త్రాలంకారముల ధరించి యెంగిలి గుడిచి నీకు దాసులమై నీమాయను జయింతుము. కర్మమార్గములం బరిభ్రమించు మేము నీవారితోఁ జెలిమి సేసియు నీకథలఁ గీర్తించియు దుస్తరంబైనతమం బతిక్రమించి జ్ఞానతపోనిష్ఠులగు సన్న్యాసులకుఁ బ్రాప్యంబగు పరబ్రహ్మంబుఁ బ్రాపింతుము." కాన వీరిచరిత్రలు నవమభూమిక యగు హరిధర్మనిష్ఠ కుదాహరణంబులు.

(౧౦.) స్వస్మిꣳ తద్గుణశాలితా = భగవద్భక్తులందు భగవద్గుణములవంటి గుణము లెల్లపుడు గలిగి యుండుట దశమభూమిక. "యస్సాత్వ్తై స్సమవిభూతయః" అని (11-6-19). భక్తులకు భగవంతుఁడు ప్రియుఁడు, నాత్ముఁడును, సుతుఁడును, సఖుఁడును. గురువును, సుహృదుఁడును, నిష్టదైవమును, నగు నట్లు భక్తులు గూడ వారి భక్తులయెడ నాచ

రింపవలయు (3-25-38). శ్రీకృష్ణునికల్యాణ గుణములలోఁ గొన్ని యీగ్రంథ భూమికలోను భాగవతోత్తములగుణములు కొన్ని రెండవ హరిభక్తి భూమికా వివరణములోను, నుదాహరింపఁ బడినవి. అట్టి వానిని హరి భక్తులు సంపాదింపవలయు. మఱియు, భగవద్గీతలో, స్థితప్రజ్ఞ, భగవద్భక్త, గుణాతీత,యనియు,సూతసంహితాదులలోఁ బ్రాహ్మణ, అత్యాశ్రమీ, యనియు, వర్ణింపఁబడిన భాగవతోత్తముల గుణములు భగవద్గుణములవంటివి గాన వానిని సంపాదింప సకలవిధముల యత్నింప వలయు నని శ్రీకృష్ణు లుద్ధవున కిట్లు సెలవిచ్చిరి.'శ్రద్ధాళుర్మత్కథాశ్శృణ్వన్సుభద్రా లోకపావనీ, గాయన్ననుస్మరన్ కర్మ జన్మచాభినయన్ముహుః' (11-11-22)=నాజన్మకర్మములను శ్రద్ధతో శ్రవణ[illegible]నస్మరణములు చేయుచు నావలె నాచరింపవలయు. ప్రాచీనబర్హి సంగరహితుఁడై హరిభక్తిచే నతనితో సమత్వ[illegible]ను బొందెనని యున్నది (4-29-84). "విముక్తసంగోనుభజన్భక్త్యా తత్సమతా మగాత్" అనఁగా:— భగవత్ప్రవర్తనవలె భక్తులుగూడఁ బ్రవర్తింపవలయు. ఈవిషయము బ్రహ్మసూత్ర సారాంతమందును, ౧౦-౧౧-వ స్కంధసారాంతములందును, వివరింపఁబడినది. ఇది సగుణము[illegible]క్తి ధర్మము. బృందావనమునందు శ్రీకృష్ణుఁ డంతర్ధానము కాఁగా గోపికలు వారియందలి గాఢానురాగముచే వెదకుచు వారిని

జూడనందున వారిగమనము,చిఱునగవు, వీక్షణము, భాష ణము లోను గాఁగలవానియందు దయ్యము పట్టినవానివలె భగవదావేశము గలవారై తామె కృష్ణుఁడని భావించి కృష్ణచేష్టలను బలుతెఱంగుల నాచరించి తమ స్వరూ పాదులను మఱచిరి. అంత భగవంతుఁడు ప్రత్యక్షమై వారిభక్త్యతిశయమున కచ్చెరుపొందిరి. ఇది భగవంతుని గుణములలలో జగద్వ్యాపారమును వర్జించి యితర గుణ ములతో సమానము లగుగుణము లెల్లపుడు గలిగి యుం డుట యను పదియవ భూమిక. ఈసగుణముక్తినే సాలోక్య సామిప్య సారూప్య సాయుజ్యములని వేదాంతులనుదురు. ఈదశావస్థలు సగుణభక్తుని భూమికలు.ఇఁక నిర్గుణభక్తుని చరమావస్థ వర్ణింపఁబడును.

(౧౧.) ప్రేమ్ణోథపరమాకాష్ఠా=భగవద్విషయమైన ప్రేమయొక్క పరమావధినిఁ బొందుట ౧౧-వ భూమిక. ఈ భూమికను బ్రవేశించిన భక్తులు ప్రాణపరిత్యాగపర్యంతము భగవద్విశ్లేషమును సహింపఁజాలక తుదకు బ్రహ్మైక్య మగు నద్వైతనిర్గుణముక్తి నొందుదురు. దీనికిఁ గూడ గోపికలే దృష్టాంతము (10-31-అ). వారు శ్రీకృష్ణదర్శ నము లేనిక్షణము వెయ్యి యుగములుగఁ గడపిరి. వారి దర్శనము కలుగఁగనే గోపికలతిసంతోషము నొందిరి. "కృష్ణా, నీవు పగటియం దడవిలో సంచరించుచున్నపుడు

నిన్నుఁ జూడని యొకనిమిషము మాకొక కల్పమువలె
నున్నది. రమ్యములయిన కుంతలములు గలముఖార
విందమును రాత్రివేళనైన నిర్విఘ్నముగఁ జూడవలయు
ననిన, బ్రహ్మదేవుఁడు మాకంట్లకు రెప్పలను సృజించి
మాటిమాటికి నినుఁ జూచుటకు విఘ్నముఁ జేయుచు
న్నాఁడు గాన నతం డెంతమూర్ఖుఁ డని చెప్పవచ్చును"
అనునవి గోపికల నర్మోక్తులు. కనుకనే నారదులు 'భగవద్వి
స్మరణే పరమవ్యాకులతా, యథా వ్రజగోపికానాం' అని
గోపికలభక్తి యత్యుత్తమ మని సూత్రములలోఁ బ్రశం
సించిరి. బృందావనమందు శ్రీకృష్ణవియోగమును సహిం
పలేక రాధ యీతీరున విలపించెను:—

శ్లో॥ "యావన్నజీవిత మిదం బహిరేతి లోలం
తావ ద్విముచ్య రుషముత్పథం ప్రయాహి
నోచేదజీవిత మిదం వపు రస్మదీయం
వోఢాసి సత్యమహహాంసతలే నసత్యం."

అతిచంచల మగు నాప్రాణ మీశరీరమునుండి వెడలి
పోకముందే నీవు వచ్చి నాకన్నుల కగపడవలయు.
అట్లు గాక యిఁక నొకనిమిషమైన నాలస్యము చేసితివా
నాప్రాణములు పోవును. పిదప నీవు వచ్చి, అయ్యో.
నావియోగమును సహింపఁజాలక మృతిఁబొందె నని జాలి

నొంది ప్రాణవిహీనమైన యీ (నా) శరీరమున నీబుజముల మీఁద నుంచుకొని మోయవలసివచ్చును. ఇది సత్యము. ద్వారకావాసులుగూడ శ్రీకృష్ణ వియోగమును సహింపలేమని యాక్రోశించిరి. మఱియు బృందావనమందు శ్రీకృష్ణమూర్తి వేణుగానముచే గోపికల నాకర్షించినపుడు వారు స్వజనుల నతిక్రమించి కృష్ణ సన్నిధానంబునకుఁ బోవుచుండఁగఁ గొందఱు గోపికలు భర్త్రాదులచే నిరోధింపఁబడి గృహములలో నుండి వెలుపలికి వచ్చుటకు వీలులేక కన్నులు మూసికొని సహింప శక్యముగాని కృష్ణవియోగజనితతీవ్రదుఃఖముతోఁ గృష్ణుని ధ్యానింప సంచితప్రారబ్ధపాపము లన్నియు నశింప ధ్యానముచేఁ గలిగిన కృష్ణాలింగసుఖానుభవముచే సంచితప్రారబ్ధపుణ్యము లన్నియు నశింప జన్మహేతువు లగు పుణ్యపాపము లొక్కక్షణమందే పోఁగొట్టుకొని సత్వాదిప్రచురము లగు దేహములను విడిచి శ్రీకృష్ణునితో నైక్యముఁ బొందిరి. మఱియు భగవంతులు గోపికల భక్త్యుద్రేకమునఁ దనతో నైక్యమునొందినిట్లుద్ధవునకుఁ సెలవిచ్చిరి:- "తానావిదన్మయ్యనుషంగబద్ధధియస్స్వమాత్మానమథ స్తథేదం, యథాసమాధౌ మునయోబ్ధితోయే నద్యః ప్రవిష్టా ఇవ నామరూపే. (భా-11-12-12)=ఆబృందావనక్రీడలో నా

పైమతి నెలకొల్పి యహంకారాస్పదంబైన యాత్మదేహ మును మమతాస్పదపతిపుత్త్రాదుల నీలోకంబు నాలోకం బునుం దెలియక సమాధినిష్ఠులైన మును లట్లు నామ రూపముల నెఱుంగక యబ్ధిజలంబులందు నదులవలె నాలో గోపికలు చొచ్చిరి." దీనివివరము దశమస్కంధసార మునఁజూడ నగు. కాన గోపికలభక్తి పరమావధి యగు నేకాదశభూమికను బొందెను. ఇట్టి తీవ్రభక్తిగలవారు కైవల్యము నపేక్షింపకయే దానిని బొందుదు రని శ్రీభాగ వతసిద్ధాంతము. కనుకనే దేవతలు భారతవర్షములో జన్మ మొందిన నరుల నిట్లు ప్రశంసించిరి:—

'సత్యందిశత్యర్థితమర్థితోనృణాం
నైవార్థదోయత్పునరర్థితాయతః,
స్వయం విధత్తే భజతా మనిచ్ఛతా
మిచ్ఛాపిధానం నిజపాదపల్లవం' (15-20-25) =

"హరినరులకుఁ గోరినయర్థ మిచ్చుఁగాని యడిగిన కారణంబున దాని నొక్కదానినే యొసంగు. మఱి పరమార్థ మొసంగఁడు. సర్వకామ పరిపూరకంబైన తన పాదపల్లవ మును నిష్కామత్వంబునఁ గొల్చువారికి సకలకామములం బ్రసాదించు. అనఁగ ధర్మార్థ కామమోక్షముల నొసంగు." కాననే స్కాందములోని రేవాఖండములో 'భక్తి'

మోక్షమగు చరమపురుషార్థమని యీతీరున వర్ణింపఁ బడినది:—

"నిశ్చలాత్వయిభక్తి ర్యా
సైవముక్తిర్జనార్దన."

"నవరసమిళితం వా కేవలం వాపుమర్థం
పరమ మిహ ముకుందే భక్తియోగం వదంతి."

కాన బోధసారోక్తరీతిని భక్తిముక్తులకు సామరస్యము చేయనగు.

———

హరిః ఓం.

శ్రీగురుభ్యోనమ.

# విష్ణుభక్తితత్త్వవివేకము.

---

అసత్కీర్తనకాంతారపరివర్తనపాంసులాం,
వాచం శౌరికథాలాపగంగయైవ పునీమహే.

## ౨౧. కర్మభక్తిజ్ఞానయోగవిభాగములు, వాని యధికారులు, వానిఫలములు.

సోదరులారా!

భగవంతులగు శ్రీకృష్ణులు, ౧ కర్మయోగము, ౨ జ్ఞానయోగము, మోక్షసాధనములుగ నర్జునున కుపదేశించినట్లు:—

'ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు,
లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ,
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం.'

(గీ.2-39-3-3)శ్లోకములవలన నగపడును. కాననే శ్రీశంకర మధ్వాచార్యులు భగవద్గీతలను కర్మజ్ఞానయోగములుగ విభజించిరి. (గీ. 18-66) చరమశ్లోకపత్రికలోఁగూడ నీశ్వర

శరణాగతి యగు తీవ్రభక్తి కర్మయోగనిష్ఠయొక్క పరమ రహస్యమని శంకరులు నుడివిరి; కాని శ్రీరామానుజానంద గిరివల్లభ శ్రీధరమధుసూదనసరస్వతి లోనగు నాచార్యులు మానవులచే నాచరింపఁదగిన మోక్షసాధనములు మూఁడని నుడివిరి:—అవి ౧ కర్మయోగము, ౨ జ్ఞానయోగము, ౩ భక్తియోగము. భగవంతు లర్జునునకు నుద్ధవునకు వీని నుపదేశించుటలో, నష్టాంగయోగము కర్మయోగమునం దంతర్భూతముగ సెలవిచ్చిరి. భగవద్గీతలలో మొదటి యధ్యాయమంతయు రెండవదానిలో ౧౦శ్లోకములవఱకు సాధనసంపత్తిలో ముఖ్యమగు తీవ్రవైరాగ్యము చెప్పఁబడినది. తదనంతరము౫వ యధ్యాయము ౨౬వ శ్లోకమువఱకు భగవంతులు కర్మయోగమును, బిదప నాఱవయధ్యాయాంతమువఱకు దానియంగముగ నష్టాంగయోగమును, ౭ మొదలు౧౨వఱకు భక్తియోగమును, ౧౩ మొదలు ౧౭వఱకు జ్ఞానయోగమును, ౧౮వ దానిలో నన్నియోగముల సంగ్రహమును, నర్జునునకు సెలవిచ్చిరి. భాగవతములోని ౧౧వ స్కంధములో ౭ మొదలు ౨౯ వ అధ్యాయము వఱకు వానినే వివరముతోను, భక్తిప్రాధాన్యముతోను, ఉద్ధవునకు శ్రీకృష్ణులే యుపదేశించిరి.

" యోగాస్త్రయో మయా ప్రోక్తాః
నృణాం శ్రేయోవిధిత్సయా,
జ్ఞానం కర్మ చ భక్తిశ్చ
నోపాయో ఽన్యోఽస్తి కుత్ర చిత్. (భా. 11-20-6.)

=జ్ఞానకర్మభక్తియోగములు నరులకు మోక్షమును గలుగఁజేయుటకు నాచేఁ జెప్పఁబడినవి. వీనికంటె నితరోపాయములు లేవు." కనుకనే పూర్వాచార్యులు భగవద్గీతలనుగూడ, కర్మభక్తిజ్ఞానయోగములుగ విభజించిరి. కర్మయోగమన:—నిష్కామకర్మాచరణము గాని,నిషిద్ధకామ్యకర్మాచరణములుగావు. శ్రుతిస్మృతులలోఁ జెప్పఁబడిన గర్భాధానాదిషోడశకర్మములు, పంచమహాయజ్ఞములు, సప్తపాకయజ్ఞములు,సప్తహావిర్యజ్ఞములు,సప్తసోమయాగములు—ఇవి వర్ణాశ్రమధర్మములు; ఇవి ఫలాభిలాషతోఁ జేయఁబడినచో సంస్కారకము లగు ; నిష్కామముతో నీశ్వరార్పణబుద్ధితోఁ జేయఁబడినచో నివి చిత్తశుద్ధిని బ్రహ్మజ్ఞానేచ్ఛను *బుట్టించును. ఈయలౌకికకర్మములు, లౌకికకర్మములును, బ్రహ్మజ్ఞానేచ్ఛను బుట్టించునట్లాచరించినచో నది కర్మయోగమగును. కావనే భగవంతులు—

" తావత్కర్మాణికుర్వీత ననిర్విద్యేతయావతా,
మత్కథాశ్రవణాదౌవా శ్రద్ధాయావన్నజాయతే.
(భా. 11-20-9).

=ఇహాపరలోకసుఖములందు వైరాగ్యము కలుగువఱకుఁ గాని, భగవత్కథాశ్రవణ కీర్తనాదులం దాసక్తికలుగు వఱకుఁగాని, కర్మయోగ మాచరింపనగు"నని సెలవిచ్చిరి. నిష్కామకర్మయోగమును జేయుఁవాఁడు సర్వకర్మములను జేయనలసినపని లేదు. నిషిద్ధకామ్యకర్మములను బొత్తిగా మానివేసి, యథాశక్తి నితరకర్మములను భగవదర్పణ పురస్సరముగఁ జేయ నగు.

"నిర్విణ్ణానాం జ్ఞానయోగో న్యాసినా మిహ కర్మసు,
తేష్వనిర్విణ్ణచిత్తానాంకర్మయోగస్తుకామినాం.(డిటో-7).

=కర్మములయందును, వానిఫలములందును, దుఃఖబుద్ధితో నిర్వేదము నొందినసన్న్యాసులకు జ్ఞానయోగము,అట్టి నిర్వేదము లేక ఫలాసక్తిగలవారికిఁ గర్మయోగము" అనియు ;

"యదృచ్ఛయామత్కథాదౌజాతశ్శ్రద్ధస్తుయఃపుమాన్,
ననిర్విణ్ణో నాతిసక్తో భక్తియోగోస్య సిద్ధిదః. (డిటో-8).

=కర్మఫలములందు వైరాగ్యమునొందకయు ఫలాత్యంతాసక్తిలేకయు యాదృచ్ఛికముగ (ఏదియో యొక భాగ్యమగు పుణ్యవశమున) మత్కథాదులపై శ్రద్ధగలుగు వానికి భక్తియోగంబు నుచితంబు" అనియు నధికారి విభాగముం జెప్పిరి.

"స్వధర్మస్థోయజన్ యజ్ఞై రనాశీః కామ(మాంస)ఉద్ధవ,
నయాతి స్వర్గనరకౌ యద్యన్యన్నసమాచరేత్.
అస్మిన్ లోకేవర్తమాన స్స్వధర్మస్థో నఘ శ్శుచిః,
జ్ఞానంవిశుద్ధమాప్నోతిమద్భక్తింవాయదృచ్ఛయా.
(డిటో-10), (డిటో-11)

=స్వధర్మస్థుఁడై ఫలముఁగోరక యజ్ఞముల నాచరించుచుఁ గామ్యప్రతిషిద్ధకర్మముల నొనర్పనివాఁడు స్వర్గమును నరకమును బొందఁడు. పాపరహితుఁడు శుచియయి యీ లోకములోనున్న స్వధర్మస్థుఁడు, విశుద్ధమయినజ్ఞానమును గాని లేక పుణ్యవిశేషమున భక్తినిగానిపొందు",అనిగూడ నుద్ధవునకు సెలవిచ్చిరి. కనుకనే యీకర్మ భక్తిజ్ఞాన యోగములగు మూఁడుపాయములు కడపటభాగమున నొక్కటియే యగు. ప్రతిభాగమునఁ బర్యవసానమున నీమార్గములలో నొండొంటికి భేదమించుకంతయుఁ గానరాదు. కర్మయోగి భక్తిచేఁ బరిపూర్ణుఁడై భగవదర్పణ ఫలపరిత్యాగములచే నహంకారమును నశింపఁజేయుటచేఁ బరిపూర్ణజ్ఞాని యగు. అట్లే జ్ఞానియు, భక్తుఁడును, గడపటఁ దక్కులక్షణములు గలవా రగుదురు. భక్తి పరిపూర్ణమగునపుడు భక్తుని హృదయమందు జ్ఞానము తనంతటఁ దాను బ్రకాశించును. జ్ఞానికి భగవత్సాక్షాత్కారము కాఁగా హృదయమందు భక్తివికసింపక తీఱదు.

ప్రతిమార్గమందును జీవుఁడు కొంతవఱకుఁ బరిపక్వస్థితి నొంద మహాపురుషుల యనుగ్రహమున కవశ్యమగు కాలము రాఁగా నుత్తారకగురువు ప్రత్యక్షమై మోక్షమార్గదర్శియై భక్తుని శిష్యునిగఁ బరిగ్రహించును. ఇట్లు చిత్తము శుద్ధమై యేకాగ్రత గలిగి నిర్గుణబ్రహ్మజ్ఞానమునకు యోగ్యతకలిగినమీఁద సద్గురువుచే నుపదేశింపఁబడిన వేదాంతవాక్యములచే సచ్చిదానందరూపమై, సకలభేదశూన్యమై, యఖండమైన చిన్మాత్ర బ్రహ్మస్వరూపమగు నారాయణుఁడు నే ననుజ్ఞానము శిష్యునకుఁ గలుగు. ఇది సర్వావిద్యానివర్తకము, మహానందావహము.

౮౭. భక్తిభేదములు.

కర్మయోగాచరణముచే నద్రుత (కఱుఁగని) చిత్తుఁడైన మానవునకు విరక్త్యాది పూర్వముగఁ దత్త్వజ్ఞానము గలుగు. ద్రుత(కఱుఁగు) చిత్తునకు భగవత్కథాశ్రవణాదికమందు రుచి గలిగి భగవద్భక్తి యుదయించునని మధుసూదనసరస్వతి తలంపు. కర్మజ్ఞానభక్తుల భేదములు, విశేషములు, మత్కృతబ్రహ్మసూత్ర సారమున వివరింపఁ బడెను గాన, దానినిఁ జూడనగు. భక్తియనఁగ నీశ్వరునందుఁ బరమప్రీతి. 'భజసేవాయాం' అని వ్యుత్పత్తి. మఱియు—

" ద్రుతస్య భగవద్ధర్మాత్ ధారావాహికతాం గతా,
సర్వేశే మనసోవృత్తిః భక్తిరిత్యభిధీయతే.

=భగవద్గుణములను వినుటచేఁ జిత్తము ద్రవించును. అట్టిచిత్తమం దవిచ్ఛిన్నముగా భగవదాకారమైనవృత్తి జనించును. అదియే భక్తి యనఁబడు." చిత్తము తేజో ద్రవ్యమైనందున విషయదర్శన శ్రవణములు గలుగఁగ నది ద్రవీభావమును బొందుటకు యోగ్యమయియు న్నది. అగ్ని సంయోగముచేఁ బూర్ణముగ ద్రవించిన లక్కయందు నింగిలీకపుచూర్ణమును జేర్చినచో నా చూర్ణ మాలక్కలో నేకీభవించి దానితోఁ గూడఁ గాఠి న్యావస్థను బొందినను, నాలక్కను దిరిగి ద్రవింపఁజేసి, యేవస్తువునందుఁ బూసినను, నాచూర్ణముగూడ నా వస్తువునందు స్ఫురించుచుండును. కొంచెముగ ద్రవించిన లక్కయందుఁ జేరినరంగు లక్కతోఁ గూడ నన్యవస్తువు లందుఁ జేరినను, నావస్తువుల నంతటను వ్యాపింపఁ జాలదు. అట్లే భగవద్గుణాదిశ్రవణముచేఁ బూర్ణముగ ద్రవించిన చిత్తమునందుఁ జేరిన భగవదాకారమా చిత్త మేవస్తువును గ్రహించినను, నావస్తువునందుఁ దా నెక్కు వుగ స్ఫురించుచుండును.

ఈభక్తి సాధనసాధ్యములని రెండు తెఱంగులు. భగవంతునందుఁ బ్రీతిఁగలుటకు నాచరింపఁబడు సేవలను దొమ్మిదిగ భాగవతాగ్రేసరుఁడగు ప్రహ్లాదుఁడు విభజించెను. ఆతొమ్మిది విధములు సాధనభక్తి యనఁబడు. వీని వివరము హరిభక్తి భూమికలలోఁ జేయఁబడె. (౨౮౫ పు.) అవి సాధ్యమగు ప్రేమభక్తికిని, దత్త్వజ్ఞానమునకును, గూడ, నుపాయములు. కాననే గీతలలోని 13వ యధ్యాయములో జ్ఞానసాధనములైన 'అమానిత్వాదుల' నుపదేశించునపుడు— "మయిచానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ" (10-శ్లో). దేవతాంతర, ఫలాంతర, ఉపాసకేతర, సంయుక్తముగాని భగవద్భక్తియు జ్ఞానసాధనమని చెప్పఁబడినది. సాధనభక్తి సాధ్య (ప్రేమ)భక్తికి ముఖ్యోపాయ మని భాగవత 11-3-35 శ్లోకములో నీతీరున నున్నది.'స్మరంతః స్మారయంతశ్చ మిథోఘౌఘహరంహరిం, భక్త్యాసంజాతయాభక్త్యా బిభ్రత్యుత్పులకాంతనుం. =పాపపుంజములను నశింపఁజేయునట్టి భగవంతునిఁ దాము స్మరించుచును, నితరులను స్మరింపఁజేయుచును నుండు (సాధన) భక్తిచేఁ గలిగిన (సాధ్య) భక్తిచేఁ బులకాంకితమైన శరీరమును భాగవతోత్తములు ధరింతురు.' ఈశ్లోకములోని మొదటి 'భక్త్యా' శబ్దము సాధనభక్తిని, రెండవ 'భక్త్యా' శబ్దము సాధ్యభక్తిని బోధించుచున్నవి.

పూర్వోక్తము నవవిధభక్తులలోఁ జివరనున్న 'సఖ్యము, ఆత్మనివేదనము', అను రెండు, సాధనభక్తులే కాక సాధ్యభక్తులుగూడనగు. అమానిత్వాదిగుణములు (గీ.13-6, 18-51-55) గలవాఁడై భగవద్గుణశ్రవణాదిభక్తి ననుష్ఠించుచు, సకలప్రేమలను భగవంతునందే చేర్చి సకలబాహ్యవిషయములందు విముఖుఁడై యుండు నొకానొక మానవశ్రేష్ఠునకు, భగవత్స్వరూపగుణవైభవాది ప్రతిపాదకములగు భాగవతాదిగ్రంథములను వినుటచేఁ, జిత్తము ద్రవీభావమును జెందును. అట్టి చిత్తవృత్తి యందు భగవదాకార మావిర్భవించి పరమానందరూప ముగ సాక్షాత్కరించును. ఇదియే సాధ్యభక్తి. పూర్వ పక్షము:—

ఈ సాధ్యభక్తి మోక్షముకంటె వేఱుకాదా? ఈ సాధ్యభక్తి మోక్షముకంటె విలక్షణమై సర్వోత్కృష్ట మగు పురుషార్థమని కొందఱు పెద్దలతలంపు. వారి ప్రమాణవాక్యము లేమన:—

'న కించిత్సాధవో ధీరాః భక్తా హ్యేకాంతినో మమ,
వాంఛం త్యపి మయాదత్తం కైవల్య మపునర్భవం.'
(భా. 11-20-35).

=నాయం దేకాంతభక్తి (ప్రేమభక్తి), గలసాధువులు పునర్జన్మములేని మోక్షమును నేనిచ్చినను గ్రహింపరు. ఈభక్తి మోక్షాంతర్భూతమని తలంచి ధర్మార్థకామమోక్షములు నాలుగే పురుషార్థము లని కొన్నిశాస్త్రములు చెప్పుచున్నవి గాని మోక్షముకంటె నధికమగు నైదవ పురుషార్థము భక్తి యని శ్రీ భాగవత భగవద్గీతానారదాది భక్తిసూత్రములలో నున్నది:—

"యానిర్వృతి స్తనుభృతాం తవపాదపద్మ,
ధ్యానాత్ భవజ్జనకథా శ్రవణేన వాస్యాత్,
సా బ్రహ్మణి స్వ మహిమన్యపి నాథ మాభూత్
కిం న్వంతకాసిలులితాత్పతితాం విమానాత్."

(భా-4-9-10)

=ఓస్వామి, మీపాదారవిందములను ధ్యానించుటచేఁ గాని మీభక్తుల కథలను వినుటచేఁగాని యేసుఖము గలుగునో యట్టిసుఖము శుద్ధబ్రహ్మస్వరూపనిష్ఠులయినవారికిఁ గూడఁ గలుగవసినచో మృత్యువుచే నశింపఁబడు విమానమువలన నధఃపతనము నొందువారికిఁగలుగునా?"

"యోగినా మపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా,
శ్రద్ధావాన్ భజతే యోమాంస మేయుక్తతమోమతః."

(గీ. 6-47.)

జ్ఞానయోగి, కర్మయోగి, అభ్యాసయోగి, మొదలగు యోగులందఱికంటె నాయందుఁ జిత్తముఁ జేర్చి శ్రద్ధతో నన్ను భజించువాఁడు సర్వయోగులలో శ్రేష్ఠుఁడని నా యభిప్రాయము" అని భగవంతులు సెలవిచ్చిరి. భక్తి సూత్రములలో భక్తి యీశ్వరునందుఁ బరమప్రేమ రూప మనియు, నమృతరూప మనియు, నారదులు నిర్వచించిరి.

దీనికి సమాధాన మేమన:— భగవత్స్వరూపమును విడువలేని ప్రేమ సాధ్యభక్తి యని నారదు లీతీరున సెల విచ్చిరి:—"తదర్పితాఖిలాచారతా తద్విస్మరణే పరమవ్యా కులతేతి". సాధనరూపమగు భక్తి సాధ్యభక్తికిని, దత్త్వ జ్ఞానమునకును, నితరవిషయములందలి తీవ్రవిరక్తికిని, నంత రంగసాధనము. సాధ్యభక్తికిని నిర్గుణజ్ఞానమునకు, నొక టియే ప్రయోజన మని కపిలుఁడు దేవహూతికిఁ జెప్పె. సాధ్యభక్తిలో రహస్య మేమన:—ఉపాస్యోపాసకుల కే మాత్రము భేదము లేదనుస్మృతి సంతానము. దీనినే 'అనన్యభక్తి' యని భగవద్గీతలలో ననుదురు. దీనిపేరు 'జ్ఞాన లక్షణ' మని శంకరులును, 'జ్ఞానాఖ్య' మని యానందగిరు లునువాడిరి. భక్తియును నుపాసనాశబ్దమును జ్ఞానమను వేద శబ్దమును బర్యాయపదములుగ శ్రుతిలోనున్నట్లు శంకరులు 'ఆవృత్త్యధికరణ' (4-1-1) భాష్యములో వ్రాసిరి. నిర్గుణో పాసనానిర్గుణజ్ఞానములకు భేదము లేనట్లు భగవద్గీతా

శాంకరభాష్యమువలన స్పష్టపడఁగలదు. స్థితప్రజ్ఞుఁడు, భగవద్భక్తుఁడు, గుణాతీతుఁడు,జీవన్ముక్తుఁడు, బ్రాహ్మణుఁడు, అత్యాశ్రమి, అనుపదములు సమానార్థకము లని శంకర విద్యారణ్యులతలంపు, భక్తిజ్ఞానముల స్వరూపము:— విరాగము, విచారము, శౌచము, ఇంద్రియనిగ్రహము, దేవునియందుఁ బరమప్రీతి, యైనట్లు గీతలలో 2-12-14 వ యధ్యాయములవలన స్పష్టమగునని కొంద అద్వైతాచార్యులఁ దలంపు. జ్ఞానమువలన ముక్తిగలిగినను, భక్తికిముక్తి యానుషంగికము. భక్తియే ముఖ్యమని వారియన్నిక. వీని విశేషములు హరిభక్తిరసాయనమందును, బ్రహ్మసూత్రసారమందును, జూడనగు.

### ౨౨. భగవద్భక్తిబ్రహ్మజ్ఞానములవిశేషములు.

పూర్వపక్షము:— మఱియు బ్రహ్మజ్ఞానమునకును, భగవద్భక్తికిని, మహత్తరమైన యింకొకభేదము గలదు. బ్రహ్మసూత్రశాస్త్రము బ్రహ్మవిద్యను బోధించుచున్నది. భాగవతశాస్త్రము భగవద్భక్తిని బోధించుచున్నది. ఈ రెంటికి స్వరూపము, సాధనము, ఫలము, అధికారి, వేఱు వేఱుగాఁగలవు. (౧). ద్రవీభావమునొందిన చిత్తమునందు భగవదాకారస్ఫురణము భక్తిస్వరూపము. ద్రవీభావముఁ బొందనిమనస్సునందు నద్వితీయబ్రహ్మస్వరూపస్ఫూర్తి

బ్రహ్మవిద్యాస్వరూపము. ౨. భగవద్గుణాదిమాహాత్మ్యప్రతి పాదకములయిన భాగవతాదిగ్రంథములయొక్క శ్రవణాదికము భక్తిసాధనము. వేదాంతమహావాక్యముల శ్రవణాదికము బ్రహ్మవిద్యాసాధనము. 3. భగవంతునందుఁ బ్రేమవృద్ధి నొందుట భక్తిఫలము. సర్వానర్థమూలమగు నజ్ఞానముయొక్క నివృత్తి బ్రహ్మవిద్యాఫలము. ౪. బ్రాహ్మణాదిసర్వజనులును, నితరభూతములును గూడ, భక్తియం దధికారులు. సాధనచతుష్టయసంపన్నుఁడైన పరమహంస పరివ్రాజకుఁడే బ్రహ్మవిద్యయం దధికారి. కాన సాధ్య భక్తిబ్రహ్మవిద్యలకు విశేషభేదము గలదని శంకింపనగు.

దీనికి సమాధానమేమన:— ౧. ద్రవీభావముఁ బొందని మనస్సునందు నద్వితీయబ్రహ్మస్వరూపస్ఫూర్తి యగువిద్యాస్వరూపము గలుగదు. అద్రుతచిత్తుఁడగు నధికారి వేదాంతశ్రవణమనననిదిధ్యాసముచే ద్రుత చిత్తుఁడైనఁ గాని యట్టిస్ఫూర్తిగలుగ నేరదు. "అపిచ సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యాం" (3-2-24) అను బ్రహ్మసూత్రము ప్రమాణము. ౨. ద్విజులకు వేదాంతశ్రవణాదికమువలన బ్రహ్మజ్ఞానముత్పన్నమయి నను స్త్రీశూద్రద్విజబంధువులకది స్మృతీతిహాసపురాణములవలన లభ్యమగు. 3. భగవత్ప్రేమరూపమగు భక్తి బ్రహ్మజ్ఞానమువలె సర్వానర్థమూలమగు నజ్ఞానమును నశింపఁ జేయునని భగవంతులు— 'మామేవ యే

ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే॥ (గీ.7-14) శ్లోక ములో సెలవిచ్చిరి. (ర) భక్త్యధికారులలో జ్ఞానాధికారి యొక్కఁడై నుండనోపు. ఇతరభక్త్యధికారులుగూడ జ్ఞాన ప్రాప్త్యధికారము సంపాదింపనిది భగవత్ప్రాప్తి నొందరు. నిర్గుణభక్తులకు, నిర్గుణజ్ఞానులకు, ధర్మములలో నీషత్తైన భేదము లేనట్లు స్థితప్రజ్ఞ భగవద్భక్తగుణాతీతలక్షణములవ లన స్పష్టమగు. మఱియు, శ్రీశంకరప్రశిష్యు లగుసర్వజ్ఞ మునులు— 'శ్రవణాదికం శమదమాదిపరః, పరమాత్మనః పరమభాగవతః కురు, తావతా పరమ మేవ పదం పర మాత్మన స్త్వ మవలోకయసి.' అని భగవద్భక్తి శమద మాదికమువలె బ్రహ్మజిజ్ఞాసాధికారి కావశ్యక మనియు, బ్రహ్మాత్మైకజ్ఞానము, భగవత్స్ఫూర్తియు నేకమనియు, సం క్షేపశారీరకములో సెలవిచ్చిరి. మఱియు— "మూలం దేవీసిద్ధయే విష్ణుభక్తి స్తాంచ శ్రద్ధానువ్రతాసత్త్వకన్యా, కామాన్ముక్తః స్తత్ర ధర్మోప్యభూచ్చేత్సిద్ధం మన్యే తద్వి వేకస్యకృత్యం" అని భగవద్భక్తిజ్ఞానసాధనములలో ముఖ్య మని శ్రీకృష్ణమిశ్రులు ప్రబోధచంద్రోదయము లోను, 'మోక్షసాధనసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ' అని శంకరులు వివేకచూడామణిలోను, సెలవిచ్చిరి. కాన సూక్ష్మబుద్ధితో నాలోచించినచో శబ్దభేదమేగాని తత్వ భేదము నిర్గుణభక్తినిర్గుణజ్ఞానముల కంతగ లేదు. కాననే

భగవంతులు—'ప్రియోహిజ్ఞాని నోత్యర్థమహంసచమమ ప్రియః' (గీ-7-17) 'యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చా ప్యహం' (గీ 9-29). అని నిర్గుణజ్ఞాని భక్తులను సమానులుగ నిర్ణయించిరి. (12 & 14 అధ్యాయములనుగూడఁ జూడ నగు). ఈవిషయమై శబ్దకల్ప ద్రుమాదులగు బహుప్రమాణములను బ్రహ్మసూత్రసార విమర్శఖండములోఁ జూడనగు.

౮౯. భక్తిప్రభావము.

మఱియు, భగవద్భక్తి బ్రహ్మజ్ఞానముకంటె సాధనావస్థలో భిన్నమయినను సాధ్యావస్థలో స్వర్గాదులవలె వినాశిత్వాదిదోషములుగలదిగాదు. భక్తి సర్వదేశకాలావస్థలలో ననుభవింపఁదగిన సుఖస్వరూప మయినందున, నాభక్తి నిరతిశయపురుషార్థ మని చెప్పఁబడినది. ఈభక్తి నిష్ఠుఁ డెప్పటికిని సంసారమును బొందఁడనుటకుఁ బ్రమాణములు పెక్కులు గలవు. వానిలో నొకటి నుదాహరించెదను:—

" నవై జనోజాతు కథంచ నావ్రజేత్
ముకుందసేవ్యన్య వదంగ సంసృతిం,
స్మరన్ముకుందాం ఘ్ర్యుపగూహనం పునః
విహాతుమిచ్ఛేన్నరస గ్రహోజనః (భా1-5-19).

=భగవంతుని సేవించుజనుఁ డెప్పటికిని, నేవిధముగనైనను, సంసారమును బొందఁడు. భగవంతుని పాదములను స్మరించుచుం దత్సుఖము నాస్వాదించువానికి దానిని విడుచుటకును, మఱియొకదానిని గ్రహించుటకును, నిచ్ఛగలుగదు." ఈశ్లోకము భక్తునకుఁ దిరిగి సంసారము లేదని తెలియఁజేయుచున్నది. సర్వసుఖములయందు వైరాగ్యముగలవాఁడుగదా ముముక్షువు. వాని నుద్దేశించిగదా శారీరకమీమాంసము ప్రవర్తించినది. భక్తిసుఖమునందు వైరాగ్యములేనిచో ముముక్షుత్వ మేలాగున లభించును? అను శంకకు సమాధాన మేమన:— భక్తిసుఖాసక్తులైన వారినిగూర్చి శారీరకమీమాంసమారంభింపఁ బడలేదు. కాన భక్తిసుఖమందు వైరాగ్యము లేకపోవుట సమ్మతమే. భక్తులు గూడఁ దాము భజించునట్టి భగవత్స్వరూపమును నిర్ణయించుటకై శారీరకమీమాంసమును బ్రథమమం దాదరింపనగు. కాననే భగవంతులు— "మహాత్మనస్తు మాంపార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః, భజన్త్యనన్యమనసః జ్ఞాత్వాభూతాది మవ్యయం." (గీ. 9-13) శ్లోకములో శాస్త్రోపపత్తులచే భగవత్స్వరూపాదులను దెలసి పిదప భక్తిఁ జేసినచో నది నిశ్చలమయి మహాఫలదాయక మని సెలవిచ్చిరి. సగుణబ్రహ్మోపాసనరూపమగు ననన్యభక్తి యిట్లు స్తుతింపఁబడెను:—

'ఆత్మారామాశ్చమునయః నిర్గ్రంథా అప్యురుక్రమే,
కుర్వంత్యహైతుకీం భక్తిం ఇత్థంభూతగుణోహరిః.'
(భా. 1-7-10).

=నిర్గుణబ్రహ్మస్వరూపనిష్ఠులయిన శ్రీ శుకాదిమహాత్ములు గూడ నజ్ఞానగ్రంథిశూన్యులయినను, భగవంతునందు నిష్కారణమయినభక్తిని జేయుచున్నారు. కాన భగవంతునియొక్క రూప గుణాదులకు, నిర్గుణబ్రహ్మస్వరూపమునుండిగూడ వారిచిత్తముల నాకర్షించు సామర్థ్యము గలదు. "స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే" అని నిర్గుణబ్రహ్మోపాసనరూపమగు ననన్యభక్తిలక్షణము శంకరులు నిర్దేశించిరి. సగుణనిర్గుణబ్రహ్మజ్ఞానములవలె వాని యనన్య (సాధ్య)భక్తిగూడ ద్వివిధము. కావున భాగవతుల యనుగ్రహమునకుఁ బాత్రుఁడై భగవద్భక్తి సుఖమును బొందినవానికి సర్వసంశయములు నివర్తించును.

## ౯౦. భక్తిప్రకారములు.

భక్తిభేదములు, విశేషములు, భగవంతులగుశివకేశవులు, భాగవతులు, వారిశిష్యులయోగ్యతల ననుసరించి బహుప్రకారముల సెలవిచ్చిరి. సూతసంహితాధ్యాత్మరా

మాయణాభగవద్గీతానారదశాండిల్యసూత్రాదులలోఁ బలు తెఱంగుల భక్తి విభజింపఁబడినది. ఆయాగ్రంథముల వలన విశేషము లరయునగు. నారదులు 'ఆత్మాద్యా గుణాద్యా' అని రెండువిధములుగ భక్తిని వివరించిరి. "ఆర్తాద్యా" అనఁగ భగవద్గీతలోని (౭. అ-౧౬) శ్లోకములో "చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినోఽర్జున, ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ." అని భగవంతు లర్జునునకు నాలుగుతెఱంగుల భక్తి నుపదేశించిరి. ఆర్తుఁడు, జిజ్ఞాసువు, అర్థార్థి యగుముగ్గురు సకామ భక్తులు. జ్ఞాని యగుముముక్షువు నిష్కామభక్తుఁడు.
(1) శత్రువ్యాధ్యాదిపీడితుఁడై వానినివారణముకొఱకు భగవద్భక్తిఁ జేయువాఁడార్తభక్తుఁడు. తనను గూర్చి యజ్ఞము చేయక పోవుటచేఁ గుపితుఁడైన యింద్రుఁడు వర్షింపఁగ దుఃఖించు గోకులములోని గొల్లలును, జరాసంధునిచే కారాగృహమున వేయఁబడిన రాజనిచయమును, ద్యూతసభయందు వస్త్రాకర్షణము చేయఁబడిన ద్రౌపదియు, మకరగ్రస్తముగు గజేంద్రమును, ఆర్తభక్తులు. "ఆర్తత్రాణపరాయణస్సభగవాన్ నారాయణో మేగతిః" అను నంత్యనియమముగల నూఱుశ్లోకములను జూడనగు.
ఆత్మజ్ఞానమును గోరి భక్తిచేయువాఁడు జిజ్ఞాసభక్తుఁడు. మైథిలుఁడగు జనకశ్రుతదేవులును, ముచికుందో

ర్థులును, జిజ్ఞాసభక్తులు. ఈలోకమందుఁగాని పరలోక మందుఁగాని లాభముఁగోరి భక్తిచేయువాఁ డర్థార్థియను భక్తుఁడు. ఇహలోకార్థార్థి, పరలోకార్థార్థి, యని యిరు తెగలీభక్తులు. ఇహరాజ్యముకొఱకు సుగ్రీవవిభీషణులు శ్రీరామచంద్రులను సేవించిరి. పాలకొఱకు మహాదేవుని ఉపమన్యుఁడు సేవించెను. వీరు మొదటితెగవారు. ధ్రువుఁడు పరలోకమగు నుత్తమలోకప్రాప్తికి విష్ణువును సేవించెను. కాన రెండవతెగవాఁడు. వీ రర్థార్థి భక్తులు. నిష్కామ భక్తితీవ్రతచేఁ గ్రమముగ నీముగ్గురు భక్తులు విష్ణుమాయను దాఁటుదురు. కాని జిజ్ఞాసువు జ్ఞానమును సంపాదించి తద్ద్వారా మాయను దాఁటును. ఆర్తుఁడును, అర్థార్థియునయితే జిజ్ఞాసనుజ్ఞానమునుబొంది వాని ద్వారా మాయా తరణమును జేయు. భగవత్తత్త్వపరోక్షజ్ఞానము గలవాఁడు నిష్కామభక్తుఁడగు జ్ఞాని. అతఁడు తత్త్వసాక్షాత్కారము మాత్రమును గోరు భక్తుఁడు. ప్రహ్లాద పృథ్వాదులు జ్ఞానభక్తులు. అర్జునుఁడు జిజ్ఞాసు వని కాని జ్ఞాని యని కాని శంకింపవలదని 'భరతర్షభ' అని భగవంతుఁ డతనిని బిలిచెను. అతఁ డుత్తమభక్తుఁడనియు, నరావతార మనియుఁ దాత్పర్యము. 'జ్ఞానీచ' అను వాక్యము లోని 'చ' కారముచే 'ప్రేమ లేక సాధ్యభక్తుఁడు' గూడ జ్ఞానివంటివాఁడే యని తలఁపవలయు. ప్రేమ భక్తుఁడు

జ్ఞానివలె నిష్కామభక్తుఁడే. గోపికాకుబ్జాక్రూరయుధిష్ఠిరాదులు ప్రేమభక్తులు. సనకాదినారదవసిష్ఠశుకాదులు సిద్ధులగు జ్ఞానవంతులగుటచే బ్రహ్మలోకముగలవారు. కంసశిశుపాలాదులును భయద్వేషాదులచే భగవంతుని సంతతము చింతఁజేయుచున్నను వారియం దనురక్తి లేదుగాన భక్తులుగారు. భగవదనురక్తియే భక్తిస్వరూపము. దానినిట్లు శివానందలహరిలో శ్రీశంకరాచార్యులు వివరించిరి:-

"అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా,
సాధ్వీనైజవిభుం లతాక్షితిరుహాం సింధుస్సరిద్వల్లభం,
ప్రాప్నోతిహ యథాతథాపశుపతేః పాదారవిందద్వయం,
చేతోవృత్తి రుపేత్యతిష్ఠతి సదాసాభక్తిరిత్యుచ్యతే." దీనిఁ

గూర్చి యొదుదృష్టాంతములచే భగవంతునందు భాగవతునకుఁ గలభక్తి క్రమముగ వృద్ధినొంది యుపాస్యోపాసకభేదములేని 'అనన్యభక్తి' రూపము నొందవలయునని తెలియవలయు. నదీసాగరసంగమములో నేటినీరు సముద్రపునీరు వేఱుఁబఱుప వీలులేనట్లుత్తమభక్తునిభక్తి 'అహమేవవిష్ణుః' = నేనే విష్ణు వనియుండవలయు. ఇట్లు భగవంతులు తనయందు గోపికలు భక్తిచేసి రనియు, నిర్వికల్పకసమాధిలో నుత్తమజ్ఞానుల యనుభవ మిట్టిదనియు, ముండకశ్రుత్యనురోధముగ నుద్ధవునకు సెలవిచ్చిరి:—

" తాస్తాః క్షపాః ప్రేష్ఠతమేననీతా, మయైవ బృందావనగోచరేణ, క్షణార్ధవద్యాః పునరంగతాసాం, హీనామయాకల్పసమాబభూవుః. తానావిదన్ మయ్యనుషంగబద్ధధియస్స్వమాత్మాన మదస్తథేదం, యథాసమాధౌమునయోఽబ్ధితోయే నద్యః ప్రవిష్టా ఇవ నామరూపే" (భా 11-12.11 & 12)

ప్రియతముండైనయేను బృందావనంబున నుండు నెడ నాతోఁ గ్రీడికల క్షణార్ధముగఁ దోఁచిన రేలు వారికి నాయెడఁబాటునం గల్పతుల్యంబులయ్యె. అప్పుడు నాపై మతినెలకొల్పి యహంకారాస్పదంబైన యాత్మ దేహమును మమతాస్పదపతిపుత్రాదుల నీలోకంబు నాలోకంబునుం దెలియక సమాధినిష్ఠులైన మునులట్లు నామరూపముల నెఱుంగక యబ్ధిజలములందు నదులట్లు లట్టులు నాలోఁ జొచ్చిరి. "అపిచసంరాధనే ప్రత్యక్షానుమానాభ్యాం" అను బ్రహ్మసూత్రము (3-2-24), "బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే, వాసుదేవస్సర్వమితిసమహాత్మా సుదుర్లభః" అను గీతా 7 అ. 19 శ్లోకము. వానిభాష్యము కూడ నీయర్థమునే స్పష్టపఱచుచున్నవి.

మఱియు — 'గుణాద్యా' అను నారదసూత్ర ప్రకారము భగవంతుఁడగు కపిలదేవుఁడు తల్లియగు దేవహూ

తికి భక్తిప్రకారము లుపదేశించెను. భక్తి సగుణమని
యు, నిర్గుణమనియు, రెండు తెఱంగులు. సగుణభక్తుఁడగు
నుపాసకుఁడు తనకంటె నుపాస్యుఁ డగు దేవత వేఱని
యుపాసన చేయును. అట్టి భక్తి తామసరాజస సాత్త్విక
రూపము లని మూఁడుప్రకారములు. తామసభక్తుఁడు,
పరహింసకుఁగాని, దంభమునకుఁగాని, మాత్సర్యమునకుఁ
గాని, దేవతయందుఁ భక్తిఁ జేసినచో నది మూఁడుప్రకార
ములు. వానిలో నుత్తరోత్తరం బుత్తమంబు. రాజసభక్తుఁ
డు, విషయములను గోరికాని, కీర్తి నపేక్షించిగాని, ఐశ్వ
ర్యముకొఱకుఁ గాని దేవతావిగ్రహములందు భక్తిఁ జేసి
నచో నది మూఁడుప్రకారములు. వానిలో నుత్తరోత్తరం
బుత్తమంబు. సాత్త్వికభక్తుఁడు పాపకర్మపరిహార మగు
నని కాని, భగవదర్పణరూపముగఁగాని, యజ్ఞాదికర్మము
వేదము చేయవలసినదని విధించుచున్నదనిగాని, అర్చాది
విగ్రహములందు భేదమతితో భక్తిఁ జేసినచో నదియు
మూఁడుప్రకారములు. వానిలో నుత్తరోత్తమం బుత్త
మంబు. ఇట్లు గుణత్రయయుక్తమయిన భక్తులగు మూఁటిని
మూఁటిచే నెచ్చించినచో నవి తొమ్మిదిభేదములగు. వీనిని
శ్రవణాదులగు నవవిధములతో మేళనముఁ జేసినచో
భక్తి 9×9=81 ప్రకారము లగు. వీనికి నిర్గుణభక్తిఁ గలిపి
నచో నవి 82 భేదము లగు. భగవద్గుణాదికము వినిన

మాత్రముననే ఫలాపేక్షయు భేదధర్మమును, లేక, యెవని మనస్సు కఱఁగి భగవంతునియందే లగ్నమాయి, వాని యందే ప్రేమను బుట్టించి తెంపులేక నూనెధారవ లెను, సహజముగను, నుండునో యది నిర్గుణభక్తి యన బడు. అట్టినిర్గుణభక్తునకు సాయుజ్యాదిముక్తు లిచ్చినను వానిని లెక్కసెట్టక భగవత్సేవయే చేయుచు,దానియందే యమితానందము నొందును. 'అర్థార్థి, ఆర్త, జిజ్ఞాసు' భక్తులు వరుసగ 'తామస, రాజస సాత్త్విక' గుణవిశిష్టు లగు సకామభక్తులు. జ్ఞానిలేక ప్రేమభక్తుఁడు నిర్గుణభక్తుఁడు నిర్గుణభక్తికి జ్ఞానయోగమునకు, నేకప్రయోజనమని కపి లుఁ డీరీతినిఁ జెప్పె:—జ్ఞానయోగశ్చమన్నిష్ఠో నైర్గుణ్యో భక్తిలక్షణః । ద్వయోరప్యేక ఏవార్థో భగవచ్ఛబ్ద లక్షణః ॥ (భా-3-32-32). 'భక్తిశాండిల్యసూత్రాధ్యాత్మ రామాయణరామానుజభాష్యాదులలో బహువిధంబు లుగ వర్ణింపఁబడినది. గ్రంథవిస్తరభీతిచే నవి యిందు వివరింపఁబడలేదు.

### ౯౧. భక్తిరసాయనము.

భక్తిజ్ఞానములతారతమ్యము ప్రశ్నప్రతివచనరూప ముగ బోధసారము ననుసరించి వ్రాయఁబడును. గురువు:— సర్వశాస్త్రముల ముఖ్యతాత్పర్యమగు భక్తిరసాయన

మను భక్తిని గలుగఁజేయు నుపాయము చెప్పెదను. దేహముయొక్క సర్వవికారములగు జన్మజరావ్యాధిమరణాదులకు మందగు లేహ్యమువంటిది భక్తి. ధర్మార్థకామమోక్షములను, జ్ఞానవైరాగ్యములను, అంతఃకరణశుద్ధిని, బుట్టించు సాధనములలో భక్తి ముఖ్యము. ఎట్టిరాగ, త్రేక, ప్రేమరూపమగు చిత్తవృత్తిచే జీవుఁడు బ్రహ్మానందమును బొందునో యట్టిదానికి భక్తి యని పేరు. సనకాదిమహాత్ములు దానిని సాధించిరి. మోక్షసాధనము లగు నిత్యానిత్యవస్తువివేకాదులున్నను, భక్తిలేనిచో, నూఁకదంపువలె నవి నిష్ప్రయోజనములు. ఈశ్వరభక్తికంటె నితరసాధనములు లేకున్నను, క్రమముగ విరక్తిజ్ఞానముక్తు లా భక్తివలననే గలుగును. శిష్యుఁడు:—జ్ఞానమువలన ముక్తి గలుగునని శ్రుతి చెప్పుచుండఁగ భక్తివలన నది యెట్లు గలుగు? గురువు:—ఈశ్వరానుగ్రహము లేనిది మోక్షము గలుగదు గాన నీశ్వరానుగ్రహమువలననే ముక్తి గలుగునని నిశ్చయింపనగు. భక్తి లేనిచో నీశ్వరుఁ డనుగ్రహింపఁడు గాన నతనిభక్తి యావశ్యకము. ఈశ్వరుఁడు పరిపూర్ణుఁడు గాన దేనితో నపేక్ష లేకున్నను, నతనికిఁ బ్రేమరూపమగు భక్తిఁ జేసినచో నతఁడు శీఘ్రముగఁ బ్రసన్నుఁడై వానికి విశేషానుగ్రహముఁ జేయును. ఈశ్వరుఁడు కరుణాసముద్రుఁడు గానఁ బారిజాతాదులు

సమీపమునకు వచ్చినవారి కెల్లరకు సుగంధ మిచ్చునట్లు, ప్రేమభక్తిని జేసినవారిని గరుణతో ననుగ్రహించు.
"నైనాత్మనః ప్రభు రయం నిజలాభపూర్ణః మానం జనాదవిదుషః కరుణోవృణీతే" (భా. 7-9-గీ. 9-29-10-10)
కనుకనే ప్రహ్లాదుండు నృసింహస్వామి నిట్లు ప్రార్థించెను:— అవివేకులకు ప్రపంచవనితాది విషయములం దలి ప్రీతి నైజముగ నున్నట్లు నిన్నుస్మరించు నాహృదయము నుండి యట్టిసహజప్రీతిని నీయందు నాకు వదలకుండునట్లు చేయుము; లేదా అజ్ఞానులకు విషయములం దెసతెగక నుండు ప్రీతి నిన్ను స్మరించెడు నాకు లేకుండ జేయుము. కనుకనే, ఈశ్వరునందుం గాని పరబ్రహ్మమందుం గాని నిరతిశయానురాగమే భక్తి యని శాండిల్యఋషి యనెను. పరమాత్మయగు విశ్వేశునందుం బ్రేమరూపముగు భక్తియుండి నచో సర్వసాధనములు గలిగినట్లే. మఱియుం జేయుందగిన యితరకృత్య ముండదు. ఏలయన: వేదాంతములందు బ్రహ్మపరోక్షానుభవము ప్రేమలక్షణముగు భక్తియొక్క పరిణామమే. మఱియు, మహేశ్వరునందుం బ్రేమ కలుగంగనే యాప్రేమానందముచే ద్వైతముగు ప్రపంచమును మఱచిపోవును గాన సర్వశాస్త్రము సమన్వయముగు. ప్రపంచము వాసుదేవునిచేం బ్రకాశింపం జేయుచున్నదనియు, వాసుదేవుండే దానికి స్వరూపమనియు, భక్తుం డర

యఁగ నట్టిదైవ్వతరసమును గట్టిగ నాస్వాదించువానికి నద్వైతజ్ఞాన మెందులకు? వాసుదేవుఁడే పరంబ్రహ్మమని యు, పరమాత్ముఁడనియు, పరాత్పరుఁ డనియు, జగత్తు లోపలవెలుపల వ్యాపించు నారాయణుఁడనియు, భక్తుఁడు తెలిసికొనును. కేశవుఁడు అణువనియు, పెద్దవాఁడనియు, స్థూలుఁ డనియు, గుణములను ధరించుచున్నాఁడనియు, గుణములు లేనివాఁడనియు, గొప్పవాఁడనియు, వైష్ణవుఁడు విష్ణువుఁ బొగడును. శివుఁడే ప్రపంచమునకుఁ గర్త, భోక్త, సర్వేశ్వరుఁడు, ఆత్మ, జీవుఁడు, శివునికంటె నితర మేమియు లేదనియు, ఆకాశము, వాయువు, నిప్పు, నీరు, నేల, జీవుఁడు, సూర్యచంద్రులు, అగు నెనిమిదిశివరూపము లనియు, శైవులు శివునిఁ బొగడుదురు. ఈప్రకారము పరిణమించినప్రేమయే జ్ఞానమని తెలియవలయు. మఱియు, 'నాన్న' యనుపదమున కర్థమును దెలియనికాలమునుండి పసివాఁడు తండ్రిని 'నాన్న, నాన్న' యని పిలుచును. కొన్నియేండ్లు గడువఁగ 'నాన్న' యనుపదమున కర్థముఁ దెలిసినపిమ్మట, దనతండ్రిని 'నాన్న' యనిపిలుచుట సరి యని నిశ్చయించును. ఆప్రకారముగనే, వేదశాస్త్రము లనుగ్రమముగఁ జదివి వానిలోఁ జెప్పినప్రకారము దేవుని యందు భక్తిఁ జేసినచో యథార్థజ్ఞానమును బొంది ముక్తుఁ డగును. ఇంకొకహేతువును బట్టి చూచినను, భక్తిజ్ఞాన

ములకు భేదములేదు. భక్తునకు జ్ఞానికి వేదాంతశాస్త్రము
లో లక్షణభేదములేదు. ఉభయులకు, ఆత్మానాత్మవిచార
ము, వైరాగ్యము, బాహ్యాంతరశౌచము, ఏకాదశేంద్రి
యములను జ్ఞానభక్తిసాధనములకంటె నితరవిషయముల
కుఁ బోనీక నిగ్రహించుట, దేవునియందుఁ బరమప్రీతి,
ఈ మొదలుధర్మము లవశ్య మాచరింపఁదగినవి. భగవద్గీతల
లో రెండవ యధ్యాయాంతములో స్థితప్రజ్ఞలక్షణములు,
౧౨ వ యధ్యాయాంతములో భగవద్భక్తలక్షణములు,
౧౪ వ యధ్యాయాంతములో గుణాతీతలక్షణములు
భక్త జ్ఞానులకు సమానములు.—భగవంతుని గూర్చి
నీవాఁడ నని భక్తుఁడు సేవించును; నేను నీవైతినని జ్ఞాని
యనుచు సేవించును. ఇట్టి భేద మిద్దఱకు మొదటనున్నను,
అభ్యాసపరిపాకమందు ఫల మొకటియే. ఏలయన,
భక్తుఁడు దేవుని "దాసోహం=నేను నీదాసుఁడను" అని
భావనచేయఁగఁ జేయఁగఁ దుదకు లోపల వెలుపలను
దేవుని సాక్షాత్తుగఁ జూచుటచే 'దాసోహం' అను పదము
లో 'దా' అను నక్షరమును మఱచి 'సోహం=దేవుఁడే
నేను' అని భావనచేయును. ఇట్టి యనుభవము నారదాదు
లగు భాగవతోత్తములకుఁ గలదు. కాని యిక్కడ నొక
విశేషమున్నది. దానిని జాగ్రత్తతో వినుము. భక్తుఁడును,
జ్ఞానియు, నీశ్వరరసము ననుభవించిన వారైనను, ననుభవ

ములోఁ గొంచెము భేదముగలదు. జ్ఞానరూపమైన రసము
కంటె నితరమున రసమని జ్ఞానినిశ్చయము. అధిక ప్రేమ
రసముకంటె నితరము నీరసమని భక్తుని నమ్మకము. అంత
శిష్యుఁడు ప్రశ్న చేయుచున్నాఁడు—జ్ఞానేతరములగు ననే
కోపాయములున్నను జ్ఞానమువలననే ముక్తిగలుగుననియు;
నితరసాధనములకంటె భక్తివలననే జ్ఞానము గలుగుననియు
కాన భక్తివలన జ్ఞానము, జ్ఞానమువలన ముక్తి, గలుగునని
గదా సాధారణక్రమము. వసిష్ఠాదులు జ్ఞాను లనియు,
నారదాదులు భక్తు లనియు, సుప్రసిద్ధము గదా. ఈభేద
మునకుఁ గారణము వేఁడెదను. దానికి గురువు జవాబి
ట్లిచ్చెను. ఈవిచిత్రమునకు హేతువును సదృష్టాంతముగఁ
జెప్పెదను వినుము:—గంగాస్నానముచేఁ దాపము పాప
ము పోవును గదా. తాపక్షయము మాత్రము కోరువాఁ
డు గంగాస్నానముఁ జేసినను, పాపక్షయము మాత్రము
కోరువాఁడు గంగాస్నానముఁ జేసినను, నిద్దఱకు, స్నానము,
తాపక్షయము, పాపక్షయము, అను మూఁడు ఫలములు
గలిగినవి. అయినను, నొకఁడు శైత్యముఁ గోరినవాఁడు.
ఇంకొకఁడు శుద్ధిని గోరినవాఁడు. కాన భావభేదముచే వారి
రువురకు నామభేదము గలిగె. అట్లే ముక్తికొఱకు దేవు
నాశ్రయించిన జ్ఞానులు భక్తిచే జ్ఞానముఁ బొంది దాని
గుండా మోక్షమును బొందుదురు. హరి నాశ్రయించిన

సంసారవిరక్తులయిన భక్తులు వారిభక్తిప్రభావముచేతనే జ్ఞానము నొంది, ముక్తులని వర్ణింపఁబడుచున్నారు. ఈయుభయులకు విరక్తిభక్తిజ్ఞానముక్తులు సమానమే యయినను భావభేదముచే నామభేద మబ్బును. కాని జ్ఞానికి ముఖ్యఫలము మోక్షము. భక్తునకు భక్తి ముఖ్యఫలము, ముక్తి యానుషంగికము, అనఁగ ఫలరూపమైన భక్తని విడువకనుండును. ఈప్రకారమునఁ జూచినను నీశ్వరభక్తి శ్రేష్ఠమే.

భక్తిమహిమము నింకొకరీతిని వర్ణింపఁబడును. శిష్యుని ప్రశ్న:— హరి పరమానందస్వరూపమైన పరమాత్మ గదా. సనకవసిష్ఠ నందిస్కంద శుకాదులకు శివప్రాప్తి గలిగినను శివభక్తిరసాయనము నాదరించుచున్నట్లు పురాణప్రసిద్ధము. ద్వైతము లేకుండిన భక్తి యెట్లు గలుగు? భగవంతుఁడు వేఱుగను, భాగవతుఁడు వేఱుగను నుండనిచో భక్తి యుదయించు టెట్లు? గురువు జవాబు:— జీవబ్రహ్మైక్యజ్ఞానమునకుఁ బూర్వముగల ద్వైత (భేద) జ్ఞానము మోహజనకము. బ్రహ్మాత్మైకత్వజ్ఞానానంతరము భక్తికొఱకు స్వేచ్ఛగా ద్వైతము కల్పింపఁబడినది గాన నది యద్వైతముకంటెఁ గూడ సుందరమని భాగవతములో నిట్లు చెప్పఁబడియున్నది.—

“ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే,

కుర్వం త్యహైతుకీం భక్తిమిత్థం భూతగుణో హరిః.”
(భా. 1-7-10.) ఏకరసమగు బ్రహ్మాత్మైక్యసుఖమనుభవించు
చున్నప్పుడు కల్పితమగు ద్వైత మమృతము నంటిరి.
మఱియు నిద్దఱు స్నేహితులకును, దంపతులకును, జీవాత్మ
పరమాత్మలకుఁ గలద్వైతసుఖమునంటిరి. పతివ్రతాహృ
దయములోఁ దనపతియం దమిత ప్రేమయున్నను లోక
రీతిని దానిని జూపక సిగ్గుపడును. అయినను నిత్యము నా
ప్రేమానందము ననుభవించును. కాన, పరమార్థమద్వై
తము. భజనహేతువునకు ద్వైతమున్నచో నట్టిభక్తిముక్తి
కంటె నూరురెట్లు హెచ్చు. ఇది బోధసారములోని భక్తి
రసాయన సంగ్రహము.

౯౩. నిగమనము.

క. చిత్రంబులు త్రైలోక్యప
విత్రంబులు భవలతాలవిత్రంబులు స
న్మిత్రంబులు మునిజనవన
చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్.

శ్రీమద్భాగవతరత్నాకరములో నమూల్యము లగు
రత్నములు నన్నింటిని “బలుకుట చిత్రంబు శూలికైనఁ
దమ్మిచూలికైన” ననినచో నాకు వాని నరసి వివరింపశక్తి
లేదని వేఱఁ జెప్పవలయునే? భాగవతతత్త్వము గురుదేవ

ప్రసాదైకసాధ్యము. "భక్త్యాభాగవతం జ్ఞేయం నతు వ్యుత్పత్త్యానటీకయా" అను వృద్ధవచనము స్మరింపనగు. కాన భాగవతమును దెనుఁగున సంగ్రహించుట దుస్సాధ్యము. అయినను "విబుధజనులవలన విన్నంత గన్నంత తెలియ వచ్చినంత" తేట పఱచితి. కాన సోదరులారా, ఈ భాగవతసారమునందలి తప్పులను మన్నించి యనుగ్రహింపుఁడు.

శ్లో. క్వేదం నానావిగూఢార్థం, శ్రీమద్భాగవతం క్వను,
మందబుద్ధి రహంకృష్ణ, ప్రేమకింకిం నకారయేత్.
క్వాహం మందమతిః క్వేదం, మథనం క్షీరవారిధేః,
కిం తత్ర పరమాణుస్స్యాం, యత్ర మజ్జతిమందరః.
ప్రార్థయే సర్వవిదుషో, క్షంతుం మంతుశతాని చ,
యద్యత్ర కుత్ర చిద్దోషో, నిర్మలం కురుతాదరాత్.

## ౯౩. మంగళము.

శ్లో. శ్రీమద్భాగవతం పురాణ మమలం
యద్వైష్ణవానాం ప్రియం,
యస్మిన్ పారమహంస్య మేతదఖిలం
జ్ఞానంపరం గీయతే,
తత్ర జ్ఞానవిరాగభక్తిసహితం
నైష్కర్మ్యమావిష్కృతం,

తచ్ఛృణ్వన్ విపఠన్ విచారణపరో
భక్త్యావిముచ్యేన్నరః.

శ్లో. నమస్తస్మై భగవతే, వాసుదేవాయ సాక్షిణే
య ఇదం కృపయా కస్మై, వ్యాచచక్షే ముముక్షవే.
యోగీంద్రాయ నమస్తస్మై, శుకాయ బ్రహ్మరూపిణే,
సంసారసర్పదష్టం యో, విష్ణురాత మమూముచత్.

1-4-16.
బరంపురం.
(బ్రహ్మపురి.)

ఇతి శివం.

# శ్రీకృష్ణులనుగూర్చి అనీబెసంటమ్మగారిచ్చిన యుపన్యాసము.

(శ్రీకృష్ణజన్మకర్మములను గూర్చి, శ్రీకృష్ణభక్తాగ్రేసరులును, మహర్షుల సాక్షాచ్ఛిష్యులును, బ్రహ్మజ్ఞానులును, లోకోపకారధురంధరులును, భారతవర్షాభివృద్ధిబద్ధకంకణులును, సరస్వతీవిగ్రహులును, సర్వభూతసుహృదులును, బోధకత్వవక్తృత్వలేఖకత్వములలో నసదృశులును, మన దివ్యజ్ఞానసమాజాధిపతులును, నగు (Mrs. Annie Besant) అనీబెసంటమ్మగారు ౨౦ ఏండ్లక్రిందట నీ అడయారులో నింగ్లీషున నిచ్చిన ప్రశస్తోపన్యాసమును బ్రహ్మశ్రీ మహారాజశ్రీ నాభి రామమూర్తి పంతులు, ఊటుకూరు వేంకటగోపాలరావుపంతులు, గార్లను నస్మన్మిత్రరత్నములు మృదుమధురశైలిం దెలిగించిరి. వారికి నతులొనరించి దాని నింకుఁ బ్రకటించితి. అందలి యమూల్య విషయములను గ్రహించి యానందింపుఁడు.)

సోదరులారా!

లోకములోఁ గొన్ని మహోన్నతవిషయములు కలవు. వానిని సంపూర్ణముగ నిరూపించుటకు దైవవాణియు నసమర్థమయియుండునన మనమెంతటివారము? శ్రీకృష్ణుని వేణుగానమును దలంచుకొనిన, దానిముందఱ నరగాన మెంతయు ప్రతివ్యత్యయముగఁ దోఁచును. అయినను మనోవాక్కర్మంబులచే భగవద్భక్తి యభివృద్ధిఁజెందుఁ గాన భరమపవిత్రంబగు నా వేణుగానమహద్విషయమును యొక్కింత వక్కాణింపఁ బూనుకొను టొక్క యయుక్తకార్యముగా నేరదు?

కాని యీవిషయమును గుఱించి సమంజసగతి నుపన్యసించుటకు మనము సమర్థులమని తలంపక తప్పదు. మన పరిచ్ఛిన్నతను విచారింపకతీరదు. మనకుఁ బ్రస్తుతము ప్రాప్తమయిన భావప్రకాశశక్తికంటె నతిశయ సామర్థ్యము కలుగవలెనని కోరియే తీరవలెను. ఏలయనఁ బ్రాసంగికవిషయ మత్యంతోత్కృష్టము. భూలోకమును మహిమాతిశయప్రదర్శనంబుచే భాసిల్లంజేసిన భగవదవతారము లన్నింటిలో జనుల కత్యంత ప్రియదాయకం బగు నవతారము మనమీప్రాతఃకాలమున బ్రసంగింపఁ బోవు శ్రీకృష్ణావతారముకంటె వేఱొండు లేదు. శ్మశానభూనాయకుం డగు మహాదేవుని ఘోరతపోమహిమలు ప్రాపంచికసుఖములు తుచ్ఛములని తలఁచి సంసారోపరమమును బొందిన వారిహృదయములను మాత్రమే యాకర్షించును. శ్రీకృష్ణుని మహిమ లట్లుగావు. అతం డింటివేలుపు. సంసారమున కధిష్ఠానదైవము. స్వస్వరూపప్రదర్శనమూలమునఁ దన మహిమలను జూపు భగవంతుఁడు. అతఁ డత్యంతము నరస్వభావము గలవాఁడు, మానవసంసారములో నుద్భవించినవాఁడు, మనుష్యుని భంగి వర్తించుచున్నానని తానే స్వయము వక్కాణించియున్నవాఁడు. శైశవావస్థలో ముద్దులమూటఁగట్టు మొగముతో నెగడుచు వినోదభరితంబులగు బాలక్రీడలఁ బ్రౌఢిమతోఁ జూపుచు నిజమయినపసిబిడ్డవలె నతఁడు నటించుచుండు. బాల్యకౌమారాద్యవస్థలం జెందునపుడు నయితమతని ప్రవృత్తి స్త్రీపురుషబాలురకు హృదయరంజకమయి తనరుచుండు. మానుషరూపధారి యగు నాభగవంతుం డెచ్చటెచ్చట నుండునో నచ్చోట్లనెల్ల సంతతానందంబు వృద్ధిం జెందియుండు. ఆయీశ్వరుండు నెలకొనియుండు తావు లశ్రాంతము హాసవికాసమధురగానభూయిష్ఠంబు లయి యొప్పుచుండు. శ్రీకృష్ణుఁడు మనతలంపులోనికి వచ్చునపుడు నదీ

ప్రవాహజలముల జలజల రవమును వనస్పతిపత్రముల చటచట రవమును, బచ్చిక బయిళ్ల కసవు మేయు పశువుల యంభాధ్వానములును, దలిదండ్రుల కాళ్లచుట్టు నిర్వ్యాజముగ నాడుకొను బిడ్డల పకపకనవ్వులును, మనము తత్కాలమునందు వినుచున్నట్లే యుండగా. అతఁడు తాను చేయుచేష్టలన్నిటిలో మానవస్వభావమును గనుపఱచు ప్రధానదైవము. తొట్లలోనుండు పసిబిడ్డను మనుష్యప్రేమచే లాలించుచు, యౌవనవంతులగు వారియాటలతోఁ గలసి యాడుచు, తనను ప్రేమించువారికిఁ జెలికాఁడయి వధూవరులను దీవించుచుఁ, దనతొలికాన్పుబిడ్డను జేఁతులనిడి ముద్దాడు పడుచు తల్లిపై దరహాసమును నిగుడ్చుచు, నన్నివిషయములలోఁ బ్రేమకును, మానవసుఖమునకును, నిరవగు నాదేవుఁడు తనమనోహరమగు దయారసముచే మనుష్యుల మనస్సులను మోహపెట్టెననుటలో నచ్చెరువేమి?

ఈ యంశమునట్టివానినిగూర్చి మనము చింతనఁజేయవలసియున్నది. మొట్టమొదట నవతారప్రసంగముఁ జేయుదము. కొన్ని యసంభావనలను దొలఁగించుటకే దాని నిచ్చట వివరించుట యవసరము. అవతారమునకుఁ బ్రపంచాపేక్షచే రెండురూపములు గలవు. మొదటిది చరిత్రాంశమును బ్రకాశింపఁజేయునది. ఆయంశమును మీరు మఱవకుఁడు. మహాత్ములకథలను మీరు చదువునపుడు వారినిజమయిన జీవితచరితమునే చదువుచున్నవారలు గాని కట్టుకథలఁ గాదు. చరిత్రకంటె నెక్కుడుగఁ గూడ దాని భావింపవలసియుండును. అవతారపురుషుఁడు ప్రపంచమనురంగమునందుఁ బ్రబలనాటకమునాడు నటుఁడు. అతఁడీబ్రహ్మాండమను నాటకశాలయందొక మాదిరి నటుఁడు. ఆత్మతత్త్వమును వ్యక్తపఱచుచు నిర్దిష్టమగు నొకనాటకము నతఁడాడి

చూపించుచున్నాఁడు. అతనిచేష్టలన్నియుఁ యథార్థచరిత్రాంశములయి
నను, మనుష్యుల మనస్సుల నాటునట్లు బోధఁజేయు పరమార్థతత్త్వము
గల కథలుగఁగూడ నుపకారకములై యున్నవి. కేవల కట్టుకథగాఁదీసి
కొనిన, యాథార్థ్యము యొక్క యొక ప్రధానాంశమును, కేవలచరి
త్రగాఁ దీసికొనిన, నదియొక ప్రధానాంశమును, మీరు గనఁజాలరు.
అవతారచరిత్రమనఁగా నాత్మవిషయకమగు వస్తుతత్త్వమును వ్యక్తపఱ
చుటయే. నాటకమేమో వాస్తవముగ జరిగిన సంగతులను బ్రదర్శించునది
యయినను, దాని రచియించిన గ్రంథకర్త యేదియో యొక ప్రయోజ
నము నుద్దేశించి స్పష్టములగు నాకారములలో లోకోపకారముకొఱకుఁ
బ్రదర్శింప, నది నమ్మనగు. మఱియు నవతారపురుషుఁడు తాను బ్రపంచ
చరిత్రములో మనుష్యమాత్రునివలెఁ దనకాలము నెప్పుడు నదేకాల
మునఁ దానవతారపురుషుఁడుగఁ జూపవలసినపని నాటకరంగమందుఁ
జూపుచుండును. ఈ యంశమును మనము చక్కఁగ జ్ఞాపకముంచుకొన
వలయు. లేకుండిన నవతారమువలనఁ గలిగెడు మహదోద్బోధను మనము
యథాస్థితిగఁ దెలిసికొనలేకపోవుదుము.

అవతారపురుషుఁ డీలోకమున జన్మించునపుడొంటిగ వచ్చే
యఁడు. తనపూర్వజన్మములలోఁ దన ననుసరించి యున్నవార లనేకుల
తోను, మనుష్యులుగాఁ బుట్టిన ద్యులోకవాసులతోను, బ్రతిపక్షికోటి
లోఁజేరి నరజన్మమెత్తిన బహ్వాసురవ్యక్తులతోను, జుట్టుకొనఁబడి యవ
తరించును. ఈ యంశమును ముఖ్యముగ శ్రీకృష్ణావతారము చెప్పుచున్నది.
ఈవిశేష మితర నరావతారములలో సైతము నిజముగఁ గన్పట్టుచున్నది.
దీనికిఁ గారణమేమనః— అవతారపురుషులు పృథివియం దొంటరిగఁ
బుట్టకపోవుటయేమానవులు జన్మించినయనేక లగుస్నేహితులతోను,

శత్రువులుగఁ దమసమత్తునుం దగపడు నసంఖ్యాకము లగువ్యక్తులతోను, నీ జగన్నాటకమును బ్రదర్శించుటకు వా రవతరింతురు.

మన మిపుడు చింతనఁజేయుచున్న యవతారవిషయములో నీ దురవగాహ మగునృత్తియంశము చాలనట్లుకు సార్థక మగుచున్నది. శ్రీకృష్ణావతారముయొక్క మునుబట్టియు, బహుముఖమానవజీవితములలో నాతఁడు ధరించిన వివిధవేషవ్యాపారముల వ్యాపకతనుబట్టియు, మహాత్తర మగువక్తవ్యాంశమును సులభసాధ్యముగ నొనర్చుటకై యీనాటకమును బ్రత్యేక ప్రత్యేకాంకములుగా విభజించి ప్రదర్శింపుచున్నాను. ప్రస్తుతము నాటకపరిభాష నవలంబించి వక్కాణించుచున్నాను. ఏల యన: అట్లుచేయుటచే నాభావములు మీకు మఱికొంచెము స్పష్టముగఁ దెలియును. జీవితచరిత్రము వ్రాయుటలో దానిలోని వివిధావస్థలను విస్పష్టఘట్టములుగఁ జీసికొని వరుసగ నొక్కొక్కదానిని. వివరించుచున్నాను. ఒక్కొక్కఘట్టములో నొకమహాద్బోధకలదు. తమకన్నులముందఱ నాటకమాడుటవలనఁ బ్రబలబోధనాలాభమును బొందవలెనని ప్రభువుయొక్క సంకల్పము. కొంతవఱకు కాఘట్టములు నిర్దిష్టము లగునాయాజీవితావస్థలతోసరియయియుండు కొంతవఱకు కొకదానియందొకటి యంతర్లాపిగానుండు. ఎట్లుండినను వానిని మనమునందుఁ దేటగా గ్రహించియుండుటవలన నవతారముయొక్క పూర్ణోద్దేశము మనము చాలబాగుగ గ్రహింపఁగల మని నాయూహ. అనఁగ : వివిధోపదేశములు సంకీర్ణముగాకుండఁ బ్రత్యేక ప్రత్యేకముగా నుంచుకొనుట కాఘట్టములు మనమనస్సులో నమర్పఁబడి వేఱువేఱు గదులవలె నుపయోగించును.

మొదటమొదట నాతఁడు భక్తి కాశ్రయమగు నొకమహావ్యక్తి (ఇష్టదేవత) లోకమునకుఁ బ్రదర్శించుటకును, దనునాశ్రయించుభక్తుల

యందుఁ దనకుఁ గలప్రేమను వ్యక్తపఱచుటకును, నవతరించెను. భక్తి కాశ్రయముగా నుండి తనభక్తులయందు భగవంతునకుఁ గలకృపాకటాక్షము వ్యక్తపఱచుటయే యాతనిమహానాటకముయొక్క ప్రథమాంకోద్దేశము. శ్రీకృష్ణజీవితములో నది యొకనిర్దిష్టమగుఘట్టము.

నాటకములో రెండవయంక మేమన:—లోకపురోభివృద్ధికిఁ బ్రతిబంధకములగువిపక్షబలములను వినాశముచేయు వేషమే. అట్టి దుష్టసంహారమే యామహాత్ముని జీవితమంతయు నలంకరించుచున్నది.

మూఁడవయంకమో, ప్రపంచచరిత్రయొక్క రంగస్థలములో రాజ్యతంత్రనైపుణ్యము గలిగి ధీమంతుఁడై చతురోపాయములచే వివేకయుక్తుఁడగు నాటకునివ్యాపారమే. ఈ యంకమందుఁ దనయద్భుతమగు రాజనీతిబోధచేతను, బుద్ధికుశలతచేతను లోకమును సన్మార్గమందుఁ బ్రవర్తింపఁజేయుచుఁ బ్రభుశక్తికంటె మంత్రశక్తినే యెక్కుడుగాఁ జూపుచుండెను.

పిమ్మట నతఁడు లోకసుహృదుఁడుగాను, నరసఖుఁడుగాను, పాండవపక్షపాతిగాను, నర్జునప్రాణసఖుఁడుగను, నటించెను.

తదనంతరాంకము శ్రీకృష్ణుని నుపదేశకునిగాను, కులవంశజాతి విచక్షణలేక లోకమునంతకు గురువుగాను, బ్రదర్శింపుచున్నది.

తరువాత నతని మనుష్యులహృదయకోశములందు దాగియుండు రహస్యములసహిత మన్వేషించి కనుగొను నద్భుతశక్తియుక్తుఁడగు మహానుభావునిగాను, మానవస్వభావమును బరీక్షించి శోధనఁజేయు మహాత్మునిగాను, మనము తెలిసికొనుచున్నారము.

సప్తమాంకములో విశ్వరూపమును జూపుచు నీవిశ్వమంతయు వ్యాపించు చైతన్యము తానేయనియు, తానుకానిది చరాచరంబులలో

నేదియుంలేదనియు, సదసత్తులు జ్ఞానాజ్ఞానములు తన్నాశ్రయించిన వేయనియు, తనకన్యముగ నేదొకటి లేదనియు, నాతఁడు ప్రదర్శించె ననుకొనవచ్చును.

ఈ యేడంకములుగ నాతనిజీవితచరితమును మనము విభజింపవచ్చును. అందు నొకొక్కొక్కయంక మొకొక్క మనుష్యజీవితకాలములోఁ జింతనఁ జేయుటకుఁ జాలియుండును; గాని యొకయుదయమునఁ జేయునుపన్యాసమున నిమిడ్చఁదగియుండదు. కావున వానినంకముల వరుసను గ్రహించి యథాశక్తి విచారణఁజేయుదము. నేను సూచించు జాడలఁబట్టి స్వామీమనోధర్మదార్ఢ్యానుసరణిని సవిస్తరముగా మీ రితనిమహిమల నూహింపఁగలరు. ఒకవిధమగురూపము కొందఱి కింపగును. మఱియొకవిధమగురూపము మఱికొందఱి మనముల నాకర్షించును. అన్నిరూపములు గూడ మనచింతనకుఁదగినవియే, మనభక్తికి నుద్బోధకములే. అయినను భక్త్యపేక్షచే నన్నిరూపములలో సకలజన హృదయరంజకమయి మంగళకరమగు నాతని బాల్యరూపమే ముఖ్యము. శైశవ బాల్య కౌమారావస్థలలోఁ దాను వ్రేపల్లెలోనుండి గోప గోపీజనంబులతోడను గోపబాలురతోడను గలసిమెలసి వర్తించినపుడును, బృందావనసంచారము చేయునపుడును, మానవచిత్తచోరుండయి, యద్భుతకృత్యంబు లొనరించిన యాచిన్నివెన్నుని ప్రథమజీవితావస్థ యేల ప్రధానమయియుండదు? భక్తికి మహదాశ్రయుండనియు, భక్తవత్సలుండనియు, జనులు తన్నుఁ దెలిసికొనుటకయి శ్రీకృష్ణుండు యౌవనరూపమునుధరింపక బాలరూపధారియగుట కిచ్చగించె ననునంశము మీరు చక్కఁగ గమనింపవలెను. ఆయంశము మీరు జ్ఞాపకముంచుకొనిన నాతనివిషయమయి యజ్ఞులాడు నపవాదముల కవకాశముండదు.

ఇప్పుడు శ్రీకృష్ణుని జననకాలవృత్తాంత మెత్తుకొందము. భూలోకములో నాతఁ డావిర్భవింపకమునుపు దేవతలు విష్ణులోకమునకుఁబోయి దైత్యులుగాఁబుట్టిన దురాత్ములబాధనుండి సాధులను రక్షించి భూభార ముడుపవలయునని ప్రార్థింపఁగా నతఁడు వారిని మానవలోకములోఁ దమతమ యంశములతో మనుష్యులుగాఁబుట్టుఁ డని యాజ్ఞాపించెను. జరుగఁబోవు జగన్నాటకమునకు వలయుసాధనసామగ్రి తానురాకమున్నే సమకూర్పఁబడెనో యనన ట్లాతఁడు జన్మింపఁ బోవుస్థలమందే మహర్షులుగూడ ముందుగ జన్మించిరి. వ్రజములోని నందుఁడును, దన నాశ్రయించియుండుగోపకులును, గోపికలును, గుడ కాయద్భుతమగు పుణ్యభూప్రదేశములో నివసించు వారందఱును దేవతాంశసంభూతులేయని మనము వినుచున్నారము. అంతియగాదు, ప్రపంచాభ్యుదయముకొఱకు లోకపాలురే యట్లు పుట్టిరఁట. తాత్పర్యమేమన: దేవతవే స్వయముగా నీలోకమునకువచ్చి మనుష్యులుగాఁ బుట్టిరి. శ్రీకృష్ణునిబాల్యమందలి యద్భుతలీలలం దంతటను నాటకపాత్రలుగా నున్నవారలు సామాన్యమనుష్యస్త్రీ పురుషబాలురు గారనియు, నామహాత్మునిసేవకొఱకు గోవులుగా జన్మఁగొన్న లోకపాలురనియు మనము తెలిసికొనవలయును. అందకత్తె లగుగొల్లభామలైననో, వారు పురాతనఋషులే. వారు తొల్లి విష్ణువునందు గాఢభక్తి సలుపుచు సంతతగోష్ఠిం గోర నబ్బగవంతుఁడు ప్రసన్నుండయి నేను ద్వరలోఁ గృష్ణావతార మెత్తఁబోవుచున్నవాఁడ నక్కాలంబున నేను బాల్యదశలో నుండుతఱి మీరు నన్నుబరివేష్టించియుండి పరమాత్మయని మీరు పూజించుదైవమును బాలుఁడును నయిన నామృదుచరణసన్నిధిని మీసద్భక్తి వెల్లిఁగొలుపుటకయి మీరు గోపికారూపంబులఁ బృథ్విపయిం బుట్టుండని యాశీర్వాదం బొసంగె.

శిశూదయమున కనుకూల మగుసిసన్నాహములు సిద్ధమయిన తోడనే భగవంతుఁడు బాలకృష్ణుఁడుగ జన్మించెను. ఆతనిజన్మకాల మందు జరిగిన సుప్రసిద్ధవినోదములను గుఱించి గాని, కంసహంతకుఁ డుద్భవింపఁబోచున్నాఁ డనుయశరీరవాణి విషయమయిగాని దేవకీ వసుదేవులను స్వర్థముగఁ గారాగృహబద్ధులం గావించి పిమ్మట వారిని శృంఖలానిబద్ధులుగా నొనరించిన యంశమును గూర్చిగాని, లోకకంట కుండగు కంసుం డీశ్వరసంకల్పము వికల్పమగునట్టులు వివేకశూన్యుఁడై చేసినవివిధదుష్ప్రయత్నముల విషయమయి గాని నేను విస్తరించిచెప్పఁ బూనుకొనలేదు. కడలియొడ్డునఁ బిల్ల లాడుకొనుచుఁ బోసినయిసుక కుప్పల నెట్లొక్కతరంగ మట్టెవచ్చి సునుమట్టముగ నొక్కపెట్టునఁ దుడుచుకొనిబోవునో యట్లు కంసప్రయత్నములన్నియు నిష్ప్రయో జనము లాయెనని నయంశమును మీరంద ఱెఱిఁగియేయున్నారు. స్వచ్ఛముగ స్ఫటికకలశలోనుండు దీపకళికమాడ్కి పరిశుద్ధమగుతల్లికడు పులోఁ దాను పరంజ్యోతియయి దాఁగియుండి యంతకుమున్నే నిజశరీ రచ్ఛాయచేఁ బ్రకాశితమయిన చెఱసాలను మఱింతఁ బ్రజ్వలింపఁజేయు దివ్యతేజోమయుండై చతుర్బాహువులతో నాతఁ డుద్భవించెను. అనఁగా: జగజ్జ్యోతియగు శ్రీకృష్ణుఁ డామెగర్భమున నుండెను. ఆమె యే యాజ్యోతియుండు స్ఫటికపాత్ర. పరంధాముఁ డామెయందుండి యామెయున్న చెఱసాలలోని చీఁకటిని బటాపంచలగునట్లు వెలుఁగు చుండెను. అతఁడు జన్మించినపుడు భగవంతునకు సహజముగా నుండ వలసిన విష్ణుచిహ్నములతో ననఁగా శంఖచక్రాదులతో వక్షస్థలమందు శ్రీవత్సాంకముతో సాక్షాద్విష్ణురూపుఁడై పుట్టెను; కాని యారూప మంతలోనే యంతర్ధానమయి తల్లిదండ్రులయెదుట మానవశిశువుమాత్ర ముండెను. అంతటఁ దండ్రియగువసుదేవుం డాబిడ్డను గరములనిడుకొని

తాళములు వేయఁబడియున్న బలవత్తరము లగు ద్వారములను గవాటము
లను గాపలివాండ్రను దాఁటి తనసోదరునింటికి సురక్షితముగఁ దీసికొని
పోయి యచ్చట శిశువునకా కెదురుచూచుచు సిద్ధపడియున్నస్థలమం
దుంచెననునంశము మీకందఱకు విశదమైయే యున్నది.

శ్రీకృష్ణుఁడు పసిబిడ్డగానున్నపుడే సహజమయిన దుష్టసంహార
సామర్థ్యమును జూపెను. ఈవిషయమై ద్వితీయాంకములో మనకు బోధ
పడును. అయినను, దనతోఁటిబిడ్డలతో గంతులువేయుచుఁ బెంపుడు
తల్లియింటిలో నాటలాడువానిగనే మీరు ప్రస్తుత మాతని జూడుఁడు.
బాలుఁడుగాఁ బెరిగి యొంటరిగా వెళ్లఁగలిగినపిదప నాతఁడు పొలముల
లోను వనములలోను బరిభ్రమణముఁ జేయ నారంభించెను. మఱియు
నతనియద్భుతమురళీగానము తోటలలోను, బయళ్లలోను, వినఁబడ
సాగెను. వింతవేణుగానముచే వినువారలయుల్లములఁ గరఁగించుచుఁ గర
మున మురళినిఁబట్టి తిరుగునప్పు డాతఁడు కేవలముపసిపిల్లఁడు. అప్పటి
కాతనివయస్సాయిదేండ్లు. ఆయిదేండ్లుమాత్రమే సుండె!. పడఁతులు దమ
గృహకృత్యములనువిడిచి యామురళీగానము వినఁబనువై తదేకధ్యాన
ముగలవారయిరి. తద్గానశ్రవణానందతత్పరులయి పురుషులుగూడఁ దమ
పనిపాట్లు విసర్జించిరి. ఆవింతశిశువు దనమనోహరమురళితో దివ్యగా
నముఁ జేయుచు నుపాంతభూముల సంచరించుచుండఁ బురుషులు స్త్రీలు
బాలురు బాలికలు మాత్రమేగాక గోవులుగూడ నాతనిము దమవీనులఁ
బడఁ దచ్ఛ్రవణాసక్తిచే మేఁతమేయుటమానఁదొడంగె. వాయుమార్గ
మున నాగానము తమ్ము డాసినతోడనె లేఁగలు తమ తల్లులపొదుఁగుల
పాలనుగుడుచుట మిన్నకుండెను. నదీజలము లాగానమును బాగుగ నా
కర్ణింప నివ్వగించి యుప్పొంగసాగెను. ఒకస్వరమునయిన వదలక సం

పూర్ణముగ వినుటకై తరువులు తమకొమ్మలను గ్రిందికివంచెను. పక్షులు గూడ నాగీతామాధుర్యమున కస్వారస్యముగలుగు నేమో యనుశంకతోఁ దమకు స్వాభావికములగుకలవరములఁ జేయకుండెను.

ఈప్రకారము మాతఁ డాటపాటలం జేయుచు వర్తించుచుండ గోపగోపికాతత్కుమారికాజనహృదయంబు లావింతబాలుని యందునిమగ్నంబులయ్యెను. అతఁడు వారిని బ్రేమించి వారితో నాడుకొనుచుండెను. వారును నాతని నెత్తుకొని వానిచిన్నపాదములను దమవక్షమునఁ బొదువుగ నంటుకొని 'ఓసర్వేశ్వరా! ఓపరమాత్మా! ఓమహాపురుషా!' యనుచుఁ బాటలఁ బాడుచుండిరి. తమయిండ్లచుట్టు నాడుబాలుఁడు దేవుఁడని వారు గుర్తెఱిగియుండిరి. మఱియుఁ దాను గంతులువేయుచు విలాసచేష్టలుచేయుచున్నతఱి నిబ్బాలుండు వ్రజజనంబుల కనేకోపదేశపాఠముల నొసఁగెను. అవియే యిప్పటికిని లోకమునకు బోధనవచనంబులయి నెగడుచున్నవి. విజ్ఞానులగువారు వానిని లెస్సఁగ బోధపఱచుకొనఁగలరు. మహాత్మునిమహిమను దెలిసికొనక దాని నవమానించి న్యూనతపఱచుటకుఁ దెలివిహీనులు యత్నముఁ జేయునొక ప్రసంగ మిచ్చట ముచ్చటించెదము. ఇట్టి దుర్భరమానసులాడువారు తామునిరసించు కథను బూర్ణముగా నెప్పుడును నిజముగాఁ జదువక యచ్చటచ్చటఁ గొన్నిముక్కలను విని శేషమును దమయూహలచేఁ బూర్తిపఱచునజ్ఞులని చెప్పనొప్పు. శ్రీకృష్ణుని ఘోరవ్యభిచారస్వభావమున కుదాహరణముగా వారు పలుమాఱు విననసహ్యముగనుండునట్టు లోకవిషయము నిక్కడ చెప్పెద.

ఈకథానాయకుఁ డాఱేండ్లబాలుఁడఁట. అది యతనిదుర్నీతిని దెలుపునఁట. ఆఱేండ్లవయస్సులో మనగోపబాలుఁడు యథేచ్ఛముగఁ

దిరుగుచుండ నొకనాఁడు నదిలోఁ గొందఱుగోపికలు తమయుత్తమస్త్రీ
త్వమున కననురూపముగను శాస్త్రవిరుద్ధముగను వస్త్రములవీడి జలక
మాడుచుండిరి. వారు దమ యుడుపులను గట్టున నిడి నదిలో మునిఁగిరి.
ఈయాకృష్ణబాలుఁ డాయంశమును దనదివ్యదృష్టిచేఁ గనుఁగొని వారి
కోకలను బోగుచేసి వానినిబట్టుకొని దగ్గఱనుండు నొకచెట్టు నెక్కి
యాచేలములఁ దనభుజములచుట్టుఁ గప్పుకొని యేమిజరుగునో చూత
మని నిరీక్షించుచుండెను. నీరు మిక్కిలిచల్లగా నుండెను. గోపభామి
నులు చలితో వజవజవణఁకుచుండిరి. కాని, యాబాలుఁ డతినిర్మలనిశ్చ
లదృష్టితోఁ దమవంకఁ దేఱి చూచుచుండఁగాఁ దా మతనియెదుటకు రా
నొల్లకుండిరి. అప్పు డతండు వారలంజూచి 'రండు, మీరువిసర్జించిన
మీచీరలనుగొనిపొం'డని బిగ్గఱఁబిలిచిన వారు సంశయపడుటనుజూచి,
పసి పెదవులవెడలుమాటల నిట్లనియె:—"మీరు కట్టుకొనియుండవలసిన
కోకలను సిగ్గుమాలి విడచిన హేతువుచేత భగవచ్ఛాసనము నుల్లంఘించి
తిరి. కావున మీరు త్యజించినవస్త్రములను మీరువచ్చి నాచేఁతులనుండి
తీసికొనిపోయి పాపవిముక్తులగుఁడు", అని పలికిన వా రట్లు లేతెంచి
యాతనికిమ్రొక్కఁగ వారిబట్టల మఱల నిచ్చివేసెను. అతఁడు పూర్ణ
యౌవనవంతుఁ డయి స్త్రీలసతీత్వమును జెఱచిన ట్లీకథను దాహరించు
చున్నారు. ఈకథయందలి రహస్యమును మీకు విశదపఱుచుచున్నాను.
సావధానముగా వినుఁడు. గోపికలు పూర్వజన్మమందు ఋషులు. పర
మాత్మయే బాలకృష్ణరూపమున బుద్ధిఁ గఱపుచున్నాఁడు. ఇంతియే
కాదు. ఈకథాంతర్భూతమైన యొకరహస్యబోధకూడఁ గలదు. ఆరహ
స్యములు మీకు వివిధగతుల నింతవఱకుఁ జెప్పఁబడెను. అదియేమన:—
ఒకప్రధానోపదేశసమయమున జీవాత్మ పరమాత్మను సమీపించునప్పు

డొకకఠినపరీక్షకు లోఁబడవలసియున్నది. ఇంతవఱకుఁ దనకుఁ బ్రాపుగా
నెన్నుకొనిన యాధారముల నన్నిఁటిని విడనాడి, తనయంతరాత్మతో
సంబంధించని సాధనము లన్నిటిని త్యజించి బహిస్సహాయముగాని,
రక్షణముగాని, యాచ్ఛాదనముగాని లేక, తనయంతరాత్మయొక్క ప్రభా
వము తప్ప మఱియొక యాశ్రయ మేదియుఁ గానక తననైజధర్మముతో
నగ్నముగాఁ బరమాత్మయెదుట నిలువవలెను. అట్టిపరీక్షకు నిలువలేక
లోఁగడఁ దనకు సహాయాస్పదమని యెన్నుకొనిన యేసాధనమందైనను
సక్తతఁగలిగి యుపదేశమునకు, నిర్ణయింపఁబడిన మహాపుణ్యకాలములో
చాంచల్యముఁ జెంది స్నేహితునిగాని, రక్షకునిగాని, తుదకుఁ దనగురు
వును గాని, సాహాయ్యమునకయి పిలిచెనేని జీవాత్మ యాపరీక్షలో
నెగ్గనివాఁడే యగును. తనయంతఃకరణములో నుండు నంతర్యామి
తప్ప యన్య మేదియులేదని దృఢనిశ్చయుఁడై సర్వధర్మములను సన్న్య
సించి యొంటరిగా నుపదేష్టయొద్దకుఁ బోవలెను. జీవాత్మ పరమాత్మ
సాయుజ్యమును బొందువప్పుడే నగ్నతయనఁగా సర్వసంగపరిత్యాగ మా
వశ్యకమని పయిన చెప్పఁబడెనో యానగ్నతయే గోపికావస్త్రాపహరణ
కథలో బాలకృష్ణమూర్తిచే గోపికల కుపదేశింపఁ బడియె. నగ్నత
యనఁగా నిదియే. ఇట్టిభూతార్థవాదములుకలవు. దానిలో నొకటి విన్న
వించెద. సర్వేశ్వరుఁడు పదియవదియగు కల్క్యవతారము నెత్తునపుడు
యుద్ధరంగమందుఁ బోరాడి యోడిపోవును. తనయాయుధముల నన్నిఁ
టిని బ్రయోగించును; కాని, యవి యన్నియు నిష్ప్రయోజనము
లగును. తుద కాయుధములన్నిటిని విడనాడి వట్టిచేతులతో యుద్ధము
చేసినపుడు గాని జయమునొందువాఁడు గాఁడు. మీఁదికథలోని భా
వమే యిక్కడఁగూడ నూహ్యము. భగవత్ప్రాప్తికి బుద్ధిమొదలుగాఁగల
యే యుపాయములు జీవున కెంతమాత్ర ముపకారకములు కానేరవు.

శ్రీకృష్ణునియయోగ్యప్రవర్తనకు ముఖ్యదృష్టాంతముగాఁ బ్రతి పక్షులీచేలాపహారకథను బ్రసంగించుటచే నాతనివిషయమయినకథ లనేకవందలకొలది యుండినను దానినే నేను బ్రత్యేకించి చెప్పవలసి వచ్చినది. మఱియు, హైందవులుగాఁ బుట్టిన మీరు మీమతములోని రహస్యములఁ జక్కఁగాఁ దెలిసికొని పరులు మీమతమును నిందించు నపుడు సిగ్గుపడి మిన్నకుండక తెలివిగా మాట్లాడి యట్టినిందలను మాపి కొనుట విధియై యున్నది.

అనంతర మేడేండ్లబాలుఁ డైనపిమ్మట గోపికలతో నతఁడు సలి పినక్రీడావిశేషములఘట్టమాలోచింతము. అతఁడు వనమున కేఁగి యక్కఁ డెట్లంతర్ధానమాయెనో, యాతని నన్వేషించుటకు వారంద ఱెట్లాతని వెంబడిపోయిరో, యాతఁడు లేకపోవుటవలన రూప మగపడకుండున ట్లతని క్రీడల నెట్లనుకరింపఁ బ్రయత్నించిరో, వీనివిషయమయి చింతనఁ జేయుదము. తత్కాలమందు సప్తవర్షములవయసుగలవాఁ డయి నను గొంతసేపు దాఁగి తనను బ్రేమించువారికి మఱల సందర్శన మొసఁ గుచుండె. భక్తులవిషయమయి యిట్లే భగవంతుఁ డెప్పుడు వర్తించు చుండు. పిమ్మట రాసక్రీడయును నద్భుతనాట్యము గోపికలతో నతఁ డొనర్చె. ఈలీలాకాలమం దనేకకృష్ణులుగాఁ దానగపడి యిద్దఱేసి గోపికలమధ్య నొక్కొక్కకృష్ణుఁడు నిలిచినట్లు భాసించెను. ఈప్రకార మాగోపికావలయమధ్యమునను, గోపికాద్వయమధ్యమునను, నిలచి యా బాలుఁడు తనపార్శ్వమందలి గోపికల కొక్కరి కొక్కొక్కచేతి నూతగా నిడి యపూర్వమగు రాసక్రీడ సలిపెను. అజ్ఞులచే నింద్యార్థముగా నె న్నఁబడు సంశయములలో నిది మఱియొకటి. ప్రియుఁడుగాను ప్రియా ర్థుఁడుగాను క్రీడించునాబాలునియందుఁ గాలుష్యము నారోపించు

వాఁడు స్వయము కలుషచిత్తుఁడుగా నుండవలయు. భవిష్యద్యుగము లలో నేమి జరుగునో, యప్పుడతనివిషయమై లోకు లేమి యనుకొని యొదరో వాని నన్నిటిని తనదివ్యదృష్టితో ముందుగానే చక్కఁగఁ దెలిసి కొని యందుఁ గల్మషచిత్తులకు దాను చేయఁదలఁచుకొన్న యుపదేశము నిర్దుష్టముగ వారిమనసుల కెక్కుటకై లీలలలో బాలరూపమును దాల్చె నేమో యని మన మనుకొనవచ్చును. ఆయుపదేశ మేమి యని మీ రడుగ గవచ్చును. ఆతనిజీవితచరితములో నీబాల్యావస్థ యంతటినుండి మనము సంపాదింపఁదగు నుపదేశమును విశదపఱపక మున్నే మఱియొక యంశ మును మీకు జ్ఞాపకమునకుఁ దెచ్చుచున్నాను. అదియే యనిన:—సర్వ జగత్తుల కన్నప్రదాతయగు నామహానుభావుఁడు తన కన్నము కావలె నని కొందఱుబ్రాహ్మణులకడకు వార్త నంపెను. వా రన్నము లేదు పొమ్మ నుచు దాని నడుగవచ్చిన బాలురను దోలివేసిరి. పురుషులు గదా యిట్లు నిరాకరించిరి. తమభర్తలుపేక్షఁ జేసినమాత్రఁ దామును నన్నమియ్య మని నుడివెదరో లేదో చూతమని యాబ్రాహ్మణులభార్యల నడుగుఁడని వారలచెంతను కాబాలుర మఱల నంపెను. ఆ స్త్రీలు శ్రీకృష్ణభగవానుని సదా ప్రేమించినవార లగుటచేఁ దమయిండ్లలో మూలమూలలో దొర కినయాహారపదార్థముల నన్నిటిం గొని, గృహముల విడచి, పతులఁ బాసి, గృహకృత్యములఁ గట్టిపెట్టి యాతనికొఱ కన్నముఁ బట్టికొని గుంపుగుంపులుగా బయలువెడలిరి. జను లెల్ల వారిని నివారింపసాగిరి. కాని కార్యము లేకపోయె. భ్రాతలు, భర్తలు, సుహృత్తులు, వారిని మఱలింపఁ బ్రయత్నించిరి; కాని వారు మఱలక తమప్రియుఁడయిన శ్రీకృష్ణునియొద్దకుఁ బోక తప్పదనియు, తమ మనోహరుఁ డగుబాలుఁడా కలితో నుండ సహింపలేమనియుఁ బలుకుచు నాతనియొద్దకేఁగి తాము

దెచ్చినయన్న మాతని కిడిరి. అతఁ డాబువ్వఁ గడుపార నారగించెను. ఈకథవిషయమయి లోకుల ప్రసంగము లెట్లున్నవో చూడుఁడు:—"ఈ స్త్రీలు మగలను విడనాడిరి. గృహముల వదలిరి. భర్తలను గృహాములను విడిచిపెట్టి శ్రీకృష్ణునివెంటఁ బడు టెంతకానిపని?" యని కొందఱు నిందచేయుచున్నారు. వారిప్రేమ కేవల కాయికమయిన వలపని లోకులయూహ. ఏఁడేండ్లపసివానితో నది యెట్లు సాధ్యమగునో మీరలే చక్కఁగ విచారింపుఁడు. ఈపడఁతులవలపు నిజముగ నింద్రియోద్భూతమయినదే యని సూచించుమాటలు కొంద ఱనియుండుట నే నెఱుంగుదును. వీరలు మన్మథోద్రేకమును జెందియుండిరని యొకానొక గ్రంథకర్త తా నద్భుతముగ భాషాంతరీకరించిన యొకగ్రంథములో స్పష్టముగ వ్రాసియున్నవాఁడు. అమ్మాటలకేమి? వస్తుతత్త్వము విచారింతము. తనసన్నిధిని రమ్మని భగవంతుని యాజ్ఞయయినచో జీవుఁడు బ్రహ్మేతరపదార్థముల నన్నిటిని విడువవలయు నన్నమాట లోకములోని మతము లన్నియు నంగీకరించిన సుప్రసిద్ధమయిన యంశమే గదా. శ్రీకృష్ణునకును నాజరతునివాసి యగుజీససు ప్రభువునకును, గలతారతమ్యవిచారణలో శ్రీకృష్ణుఁ డపరిశుద్ధుఁ డనియు, జీససు పరమపవిత్రుఁ డనియు విపక్షగావింపఁ బడియె. దీనికి నిదర్శనముగా గోపసతులు తమపతులను విడచి శ్రీకృష్ణునితో నాటలాడుచు సదా నతని నాశ్రయించినారను కథను జెప్పుదురు. వా రిట్లనుట సమీచీనముగఁ దోఁచదు. ఏతద్విషయమయి నాజరతునివాసి యగు జీససేమని వచించెనో నేను చదివియున్నాను. అతఁ డన్నమాట లివి:—"నాకంటె నెక్కుడుగాఁ దల్లిని గాని, తండ్రిని గాని, యెవరు ప్రేమించుదురో వారు నన్ను బొందుటకు యోగ్యులు కారు. నాకంటె ప్రియతరులుగా నెవఁడు తనకొడుకుల కూఁతుల నభిమానించునో వాఁడు నన్నుఁ జేరు

టకు నర్హుఁడు కాఁడు. నా నామముకొఱకు నింట్లను, అన్నదమ్ముల నక్క
చెల్లెండ్రను, తల్లిదండ్రులను, భార్యను, బిల్లలను, భూములను, త్యజించిన
వాఁడు ముందటికంటె నూఱంత లెక్కుడు వైభవమొందుటయే గాక
శాశ్వతపదవికి నర్హుఁడు కాఁగలఁడు." (మ్యాథ్యూ × 37 × ; × .29).
ఇంతియె గాక దీనికంటె దృఢతరముగాఁ జెప్పఁబడిన యింకొక వాక్యము
గలదు. "ఎవఁడు తనతండ్రిని, తల్లిని, భార్యను, సంతానమును, సహోదరు
లను, స్వసలను మాత్రమే గాక, తనజీవితమును గూడ హేయముగఁ
జూడక నన్నుజేరవచ్చునో వాఁడు నాకు శిష్యుఁడు కనర్హుఁడు. (ల్యూకు
× iv, 26). శ్రీకృష్ణుఁడు చెప్పినవియు నివియు సమానభావద్యోతక
ములే. తనసన్నిధానమునకు రమ్మని జీససునాజ్ఞ యగునేని భార్యాభర్తలు
జననీజనకులు మొదలగువారందఱు విడువఁబడవలసినవారే. ఆత్యాగము
వలనఁ గలుగుఫలము శాశ్వత బ్రహ్మలోకనివాసము. జీససు నాజ్ఞను
మన్నించుట క్రమమయినచో శ్రీకృష్ణునియాజ్ఞను మన్నించు టేల
యుక్తము కాఁగూడదు? ఇట్టిబోధ యీరెండుమతములలో మాత్రమే
కాదు. భూలోకములో నుండు మతములన్నిటిలోను జీవాత్మ పరమా
త్మలకుఁ గలసంబంధము, వలపును దెలుపు శృంగారవాక్యములలో నే
వ్యక్తపఱుపఁబడుచున్నయది. సాలమను గానమును జూడుఁడు.
క్రైస్తవుల బైబిలు పుస్తకమును దీసికొని దానిపత్రములయందు మనఁ
జదివిన "క్రైస్తునకుఁ దనతావలంబులయెడఁ గలప్రేమ" అను కథాను
క్రమణిక కనఁబడును. ఆశీర్షికను నవలి కథాభాగమును బరీక్షించినచో
నత్యంతకామోద్రేకము లగుశృంగారపదములును, మనోహరమగు సౌం
దర్యమూర్తికి వలయు సమస్తగుణాంశములు గల యొకచక్కని జవరాలి
రూపవర్ణనమును, ప్రేమరసమును బాహ్యముగా ననుభవించుటకుఁ దవ
చెంత కేతెమ్మని ప్రియుండు ప్రియురాలిని సరసముగఁ బిలుచుటయు

మొదలుగాఁగల యవి చూపఁబడెను. "క్రీస్తు, ఆతనిమతానువలంబులు" అను శీర్షికలోని కథనము క్రైస్తవులు యుక్తముగ నున్నదని యను చున్నారు. నా యభిప్రాయము గూడ నట్లే. "సాలమను గానము" అను దానివిషయమై గాని దానిలో నిండియుండు శోధనకరములగు శృంగారికగ్రంథాంశములఁ గూర్చిగాని నా కేయాక్షేపము లేదు. కాని హిందూమతగ్రంథములందుండు కథలలో వేని నపరిశుద్ధకథలుగా భావించి నేను త్యజింపవలెనని యందురో యట్టికథలు హిబ్రూమతగ్రంథముల యందుఁ గూడ నున్నచో వానిని సయితముఁ ద్యజింపవలెను గాని పరిశుద్ధములుగా నెంచను. అన్నిమతములలోని కథల శుద్ధాశుద్ధము లొక యేకప్రమాణముచేత నిర్ణయింపవలయు నని నాయూహ. ఏకారణములఁబట్టి యయిన నొకటి నిందార్హమని యెంచఁబడునో రెండవది గూడ నట్లె యెంచఁబడవలసినది. అలాగుననే మహమ్మదీయమతములో సయితము సూఫీరీతులలో పరతత్వముపై జీవునికి బ్రహ్మయం దుండవలసిన ప్రేమభక్తిభావమునకు ప్రధాననిదర్శనముగఁ దీసికొనఁబడినది. మఱియు సర్వకాలములయందును భగవంతునకుఁ దనభక్తులతోఁ గలుగు సమావేశమును వర్ణించునప్పుడు భార్యాభర్తల పరస్పరానురాగమే సాదృశ్యముగ నెన్నుకొనఁబడును. ఈ యనురాగము సంబంధములన్నిఁటిలో నతిసన్నిహితము. ప్రాపంచికసంయోగములలో నత్యంతాంతరము మార్తిత్వముయొక్క మనఃకాయంబు లేకీభావంబున మగ్నమగు నట్టు లగ్నమయి యుండుటలో నాహా! జీవబ్రహ్మైక్యమున కింతకంటె మించిన సాదృశ్యము మఱెచ్చటఁ గనఁగలుగు? భక్తివిషయము నెప్పుడు చెప్పఁబడినను ప్రేమాస్పదుఁ డయిన భగవంతుఁడు భర్త లేక ప్రియునితోడను, భక్తుఁడు భార్య లేక ప్రియురాలితోడను సాదృశ్యముగాఁ బరికింపఁబడుదురు. ఈ భార్యాభర్తలసాదృశ్యము సర్వమతసాధారణము.

వీలయన నది యనాది సిద్ధమగు వస్తుతత్వము. ఇహమందు భార్యకు భర్తవిషయమై సర్వాత్మనాపారతంత్ర్య మెట్టిదో భగవంతునియందు జీవునికి సర్వాత్మనా ప్రపన్నతయు నట్టిదే. శ్రీకృష్ణుని రాసక్రీడ కిదియె సమాధానము. ఆతని వ్రజనివాసజీవితకథ కిది ముఖ్యతాత్పర్యము.

అన్నలారా! ఈయంశమును గుఱించి నేనెందు కంతపట్టుదలతోఁ జెప్పితినో మీరందఱెఱింగియే యున్నారు. పందొమ్మిదవ శతాబ్దమువఱకు నిక్కృథ భక్తి ప్రరోచనమునకు సాధనమగుచుండెను, గాని తుంటరిమాటల కాస్పద మయి యుండలేదు. కేవలప్రాకృతస్వభావము గల పాశ్చాత్యభావోద్గమమునకుఁ బూర్వము భాగవత పురాణ కథల కెట్టి యపార్థములును కల్పించువారుండ లేదు. ఇఁక నీవిషయముఁ గట్టిపెట్టి మఱియొకవిషయమునకుఁ బోదము. ప్రస్తుతపు హిందూజనులలోఁ ననేకులు తమవిపరీతపుభావనలచే శ్రీమద్భాగవతమును జదువుట కనర్హులయి యున్నవారు గాన నట్టివారలకసలు నీమహాగ్రంథ ముండకుండునట్టుల నామహర్షులు దీసికొనిపోవుదురు గాత యని సర్వేశ్వరునిఁ బ్రార్థించుచున్నాను. నింబార్కోపాస్యభావరహితులై కామోద్రేకభావనామాత్రులై భగవత్కథల నిప్పటివారు జదువఁగల్గినంత నిష్కల్మషచిత్తులగువఱకు వేదాదిపురాణగ్రంథములలోఁ జాలభాగ మింతకుఁబూర్వమే వారికలవడకుండ మఱుగుపఱచినట్లు మునివర్యు లీ భాగవతమును గూడ నుండకుండ జేయుదురని సవినయము నాజగత్కర్తను బ్రార్థించుచున్నాను.

ఇఁక దుష్టసంహారమును అనంతరఘట్టమును మిక్కిలి సంక్షేపముగా వివరించెద. కొన్నివారములు మాత్రమే యాతుగల పసిపిల్లఁడై

యుండఁగాఁ బూతన యనురక్కసి పొలియునటుల దాని స్తన్యపానము
చేసెను. అఘాసురునిచేఁ బెంపుచేయఁబడినదేహ మహద్గుహాలోఁ దాను
ప్రవేశించి తనదేహమును బెంచుటచే నాదేహగుహ ముక్కముక్క
లుగాఁ బగులునట్లు లొనరించెను. మానవపానమునకు యోగ్యమగు
యమునాజలమును విషదగ్ధముసేయుచుండిన కాళియనాగఫణములను దన
పాదములతో మర్దించె. ఇత్యాదికృత్యములఁ జేయుచు శ్రీకృష్ణుఁడు
వ్రజమునువిడిచి కంసుకడ కేగువఱకుఁ దనవాసస్థానపు టెల్లలలోఁ గనఁ
బడిన దౌష్ట్యరూపము లన్నిఁటిని దఱిమి తునుమాడినట్టులు మనకు
ద్యోతక మవుచున్నది. వ్రజమువదలి కంసుని మల్లయుద్ధరంగస్థలములో
నిలుచునపుడు తాను దనయన్నయుఁ బదునొకండేండ్ల బాలకుమారులై
సుకుమారములగు లేఁబ్రాయపుశరీరములు గలవారలై యుండిరని గ్రంథ
స్థమై యున్నది. లీలలన్నియుఁ జాలించి మల్లయుద్ధమునకుఁ బోవువార
లింకను బాల్యావస్థలోనే యుండిరి. అదిమొదలు గొప్పదుష్టగణము
లను నొకరివెనుక నొకరి నెదుర్కొని శ్రీకృష్ణుఁడు తన దుర్ధషమగు
శక్తితో సమ్మర్దనము చేసెను. ఈయితిహాసములఁగూర్చి మనము పెంచి
వక్కాణింప నక్కఱలేదు. ఏలయన నాతని జీవితచరితమంతయు నట్టి
వృత్తాంతములతో నిండి యున్నది.

శ్రీకృష్ణుని జీవితచరితములో నద్భుతమగు నట్టియు, మనోహర
మగునట్టియు నొకయంశమయిన రాజనీతిశాస్త్రవేత్తృత్వమును దెల్పు
మూఁడవఘట్టము మన కిపుడు వక్తవ్యాంశము. తనవిపక్షిని ద్వేషిగా
నగపఱచి, తనకార్యము నిర్వహించుకొని, యితరులను గూడఁ దనపక్ష
మువారిగాఁ జేసికొను నేర్పరితనము మొదలగు శక్తులన్నిఁటి నాతఁడు
తనమంత్రిత్వములో నడుగడుగునకుఁ గనుపఱచుచుండెను. ఈభాగ

మును పాండవుల విషయములోఁ బ్రధానముగ నగపడుచుట మీకందఱ
ఱకుఁ దెలిసినవిషయమే. సంధిగ్ధసమయములలో వారికి రాయబారిగ
ముం దడుగుపెట్టినవాఁ డాతఁడే. నింద్యముగా నిషేధింపఁబడిన
నరమేధమును మహాదేవప్రీతిగఁ జేయ సమకట్టిన రాక్షసరాజగు జరా
సంధుని సంహారించుటకు భీమార్జునులతోఁ బోయినమహోపాయశాలి
యాతఁడే. క్షత్రియధర్మముల కావంతియయిన విరుద్ధము లేకుండ
యుద్ధము జరుగునటులఁ జేయుటకై వారివెంబడి జనిన ధర్మరతుఁ
డతఁడే. జరాసంధమహారాజు గారి నగరములోనికి నతఁడును భీమార్జును
లును బ్రవేశించుతఱి జరిగినవిశేషము వినుఁడు. మిత్రునకుఁ బ్రవేశ
యోగ్యమగు నపావృతసింహద్వారము దాఁటిపోక తాము శత్రులుగా
వచ్చుచున్నామని వ్యక్తపఱుచునట్లు కోటగోడలో నొకభాగమును విఱు
గఁగొట్టి వారు ప్రవేశించిరి. అనలంకృతులై పోక గంధపుష్పమా
ల్యాలంకృతులై విజయోత్సాహముతోఁ బ్రతిజ్ఞా పరిపాలనకొఱకు
వచ్చితిమని పృచ్ఛకుల ధిక్కరించుచు నగరప్రవేశముఁ జేసిరి. అన్నము
గుడుచుటకు కాహాటాతులయినను, దా నప్పుడు భుజింప మనియును,
వెనుకనుండి రాజుగారిని గలిసికొని వచ్చిన కర్జమును దెలిపెద మని
యును, నమ్మహామంత్రి ప్రత్యుత్తర మిచ్చెను. ఇట్టి వర్తనమునకుఁ
గారణము రాజుగా రెదురుతిరుగుము వచ్చినపుడు తాము మిత్రులుగ
రాలేదనియు శత్రులుగ నతనినాజికిఁ జీరుటకై వచ్చితిమని దెలుపు
టకై యిట్లు వర్తించితిమనియు సందర్భమున కెనమియ్యనితేటమాట
లతో మర్యాదతో నాతఁడు ప్రత్యుత్తరమిచ్చె. మఱియుఁ,బండ్రెండు
వత్సరము లరణ్యవాసము నొకసంవత్సర మజ్ఞాతవాసము నడిపిన పిమ్మటఁ
బ్రయాసమును బోరాటమును లేకుండఁ దాము గోలుపోయిన రాజ్య
మును మగుడ రాఁబట్టుకొను కెట్లను ప్రశ్న గలిగినపుడు, పాండవుల

యొక్కయు, వారిస్నేహితులయొక్కయు, సభామధ్యమున నిలిచి సాధ్య మైనంతవఱకు యుద్ధముచేయు నవసరములేకయే కార్యసిద్ధి గలుగురీతినిఁ జూపుమఁ బ్రియమంతినమొసంగె. మనోహరంబులగు తనదివ్య వాక్కులచే నుభయకక్షులస్వస్థతకు భంగములేకుండఁ జేయుటకై తానె రాయబారిగఁ బోయెద నని యొడంబడె. రాయబారిగఁ జను సుయోధను నాజ్ఞానుసారంబుగఁ దన నిమిత్త మేర్పఱుపఁబడిన శిబిరములఁదేనిలోఁ దిగఁడయ్యె. శత్రునివలన నుపచారములను గైకొనకేని మిత్రభావము గలిగియుండవలసివచ్చు ననుశంకతో నిట్లు చేసె. మిత్రునివలనఁ జేయఁబడు నుపచారములను గొనఁదగినభంగి శత్రువునుండి గ్రహింపఁ గూడ దనుధర్మమును బట్టి దుర్యోధనుఁడు వేయించిన గుడారము లలోనికిఁ బోవనొల్లక తనదౌత్యము నెట్లు సమర్థించెనో మీకందఱకుఁ దెలిసినయంశమే. ఉచితజ్ఞతానుసారముగా దుర్యోధనునిఁ జూడఁ బోయినసమయములో దౌత్యానుగుణ్యముగఁ దాను చూపవలసిన సమస్తగౌరవములం జూపుమఁ దనకు విధాయకములగు నన్నిమర్యాదలను బాలించినను, దాను బోరాడవలసినవానితో సంధిసంధానయోగ్య మగు నన్నము భుజించుట కిష్టపడఁడాయెను. మహారాజులెమ్మఁ డగు విదురుఁడు పెట్టినయన్నముమాత్రమే శుచియై తనకుఁ దినఁదగినదని వచించుచు దాని నెట్లారగించెనో యదియు మీ రఱిఁగినదే. విరోధి భూపాలసభామధ్యమందు ప్రియములగుమాటల నాడి సామోపాయముల నెట్లు సంధిఁ జేయఁ బ్రయత్నించెనో మీకుఁ దెలియని యంశము గాదు. అతిసౌమ్యతను దెల్పు ప్రహ్వీభావముతో నతఁడు క్షమాపణ గోరుటయు జాత్యంధుఁడగు ధృతరాష్ట్రమహారాజుతోఁ బాండవుల ప్రతినిధిగా సంభాషించు తఱి నాదరణలేమిచేఁ గుపితుఁడయినవగతుని వలెఁ గాక దీనయాచకునివలె విన్నవించుటయు మీ రఱిఁగిన యంశమే.

కౌరవుల క్రోధపుమాటల మఱచ్చి వారిమనసులు కరఁగి తనపక్ష మవలం బించుటకును వారిబుద్ధులను న్యాయపథమందుఁ బ్రవేశింపఁ జేయుట కును నెట్టివాక్చాతుర్యము వినియోగపఱచెనో మీకు విదితమయ్యే యున్నది. నాటికొంతకాలమునకుఁ బిదపఁ గురుక్షేత్ర రణరంగములో ధృతరాష్ట్రుని కొడుకులందఱు హతులైనవెనుక వారి దుఃఖోపశమనా ర్థము శ్రీకృష్ణుం డింకొకసారి వారికడకు మధ్యవర్తిగఁ బోయె. పుత్ర హీనుఁడగు తండ్రియొక్కయు, పుత్రశోకముతో దహించుచున్న తల్లియొక్కయు, క్రోధోద్వేగము ప్రప్రథమమునఁ దనమీఁదఁ బడఁగా వారికోపమును దనయుక్తియుక్తము లగుమాటలతోఁ జల్లార్చి హత పుత్రబంధుమిత్రులగు నా శోకసంతప్తు లయిన వారిని శాంతిం బొందింపఁజేసె నని యెవఁడొకఁడు తలఁచు నట్లు మధ్యవర్తిగాఁ బోవఁ గారణమయ్యె. తుదకుఁ దన యనంతరకృత్యము పూర్తియయి తాను జేయవచ్చిన పని యంతయుఁ గొనసాగించి యనంతరాంతమునకుఁ దా నెట్లు మార్గదర్శిగా నుపదేష్టగాఁ బ్రవర్తించెనో యది యెల్ల మీకుఁ దెల్లంబె. అతఁ డద్భుతనైపుణ్యము గల రాజ్యతంత్రవేత్త. సునిశిత మగు బుద్ధిమంతుఁడు; దూరదర్శి. ప్రాపంచికవ్యవహారములలో దక్షోపేతముగా మనుష్యులు మెలఁగుచు యుక్తాయుక్తవిచక్షణను గాంభీర్యనైపుణ్యమును గూడఁ గలిగి యుండవలెననియుఁ, గార్యనిర్వాహణములో వాక్చాతురిని, కుశాగ్రబుద్ధిని బ్రదర్శించుట మానవులలోఁ బ్రతిపాదింపఁబడిన సత్యధర్మములకు విరోధము కాదనియు మానవులకు బోధపఱుప నుద్దేశిం చినట్లు యాతఁ డిట్టిశక్తులం జూపుచు రాజకార్యధురంధరుఁ డై నటించెను.

అనంతర మాతని మంత్రిత్వప్రశంసనుండి యాతని సుహృద వస్థాప్రసంగమునకుఁ బోదము. పాండవులకు భవిష్యద్భాగ్యకాఁబోవు

ద్రౌపదియొక్క స్వయంవరమధ్యమునఁ బూర్వసఖుఁడగు నరావతార
మెత్తినయర్జునుని మొట్టమొదటఁ గలిసికొనిననాఁటనుండి తాను మిక్కి
లిగాఁ బ్రేమించిన పాండవకుటుంబముతో నతనికిఁ గలసంబంధబాంధవ్య
ములఁ జక్కఁగా బర్శీలించుటకు వలయునవకాశము నాకుఁ గలిగియుండిన
మేలుగ నుండునని తలంచుచున్నాను. తన్ను గుర్తుపట్టలేని పూర్వజన్మ
స్నేహసంస్కారము గలిగిన శ్రీకృష్ణునియొక్కయుఁ, దాను పోల్చలేని
పురాణసఖుండయిన శ్రీకృష్ణుని సమావేశమును బహుజన్మానుబంధవశం
బునఁ బొందినయర్జునునియొక్కయు లోచనద్వయయుగ్మము లొండొం
టితోఁ గలిసికొనినప్పుడు వారియపూర్వమనోభావము లెట్లుండవచ్చునో
చక్కగ మీరు విచారింపుఁడు. ఈజన్మములో వారు మొట్టమొదట
గలిసికొనినది మొదలు పాండవుల విషయమై శ్రీకృష్ణుని యనవరత
స్నేహము, నిరంతరరక్షణము, వారి మర్యాదను బ్రాణములను జాగరూక
తతోఁ గాపాడుకోరికయు, నెంతయుశ్లాఘ్యములు. తా నిచ్చటనుండినఁ
దన యవతారప్రయోజనమునకు భంగము కలుగునని తోఁచెనో
యచ్చట నాతఁ డుండక వెడలిపోవు. కురుపాండవులు జూదమాడు
సమయమున నాతఁ డక్కడ లేకుండెను. ఏలయన నట్లు లేకుండుటయే
భగవదుద్దేశ్యము నిర్వహించుట కావశ్యకమయి యుండెను. ఆతఁ
డప్పుడు స్థలాంతరమున నుండెను. ద్యూతస్థానమందే యుండినయెడలఁ
దానందులో సంబంధము గలుగఁ జేసికొనవలసిన యవసరము తటస్థించి
యుండును. అక్కడనుండినపక్షమునఁ దన స్నేహితులకు సహాయము
చేయక యూరకుండునా? ద్రౌపదికి మానభంగముగలుగునేమో యను
భయము పుట్టినపుడు తనను గావుమని యామె యార్తరవము వెడలిన
తోడనే తనదీనపోషణధర్మముఁ బ్రదర్శింపుచు నామె కట్టినవస్త్రములు
లాగివేసినకొలఁది వేలువస్త్రములు తక్షణ మామెయొడలున సమకూరియుం

మునట్టు లనుగ్రహించి యామె మానసంరక్షణఁ జేసెను. అంతలోన
యాట ముగిసెను. సాకటాలపాచిక పాఱెను. దైవగతియుఁ దానుబో
వలసిన త్రోవఁ ద్రొక్కెను..

ఆవిధి ప్రసారముఁ గనుపెట్టు టెంతకష్ట సాధ్యమగునని ? ఈశ్వ
రునకుఁ గలిగిన యాయొక్క-సంకల్పము మార్పులేక, యడ్డులేక, వెంటనే
నెఱవేఱెను. కాని జను లాదైవగతినిఁ దప్పించుకొనుటను నిష్టపడిరేని
వారి మనోభీష్టసిద్ధి యగుటకు తగుసాధనముల నన్నిఁటిని వారికిఁ
గలుగఁజేయుచుండెను. కురుక్షేత్రమం దాను ప్రసిద్ధయుద్ధము జరుగు
టకు తగుసన్నాహము చేయుటకే తానవతరించెను. భావిశతాబ్దముల
కనుగుణమగు కార్యసిద్ధికై సిద్ధపడి యాసంకల్పము నెఱవేర్చుట కాతఁ
డీలోకమందు జన్మమెత్తెనని యొకక్షణములోనే మనము తెలిసికొనఁ
గలము. తనయుద్దేశమును గొనసాగించుటలో నొకగొప్పయుపకార
మాతఁడు సేసెను. అది యేమి యన:—తనుపురాకృతకర్మవలన నాప
దలోఁ జిక్కుకొనినజనులు తనయుద్దేశమును వినిరేని, యధర్మతమః
ప్రభావమునకు లోఁబడక ధర్మప్రకాశపక్ష మవలంబింపఁగలవారగుదు
రనుసదుద్దేశముతో వారికిఁ గావలసినంత యవకాశము తన్నిమిత్తము
నిచ్చుచునే వచ్చెను. తనయుద్దేశ్యము నెఱవేర్చుటలోఁ దానెప్పుడు
వెనకఁ దీయలేదు. కాని తనయుద్దేశమన్యథా మాఱునట్లు మనుజుఁ
డవలంబింపఁగల పురుషప్రయత్నముల నన్నిఁటి నతఁడుపయోగింపక
విడువలేదు. మనకీయుపదేశ మెంత ప్రయోజనకారియో చూడుఁడు.
భగవదిచ్ఛకడ్డ మేమియు లేదు. కాని, యాదైవగతి ననుసరించు
టలోఁ దనయావచ్ఛక్తి వినియోగించి తాను జేయవలసినపురుష
కారము మనుజుఁడాచరణలోనికిఁ దీసికొని రాకుండిన నాదోష

మాతనిదే. భగవదిచ్ఛానురూపముగా సర్వము నడువవలసియున్నను సాధ్యమయినంతవఱకు స్వధర్మముఁ దప్పక భూతదయఁగలిగి చేయవలసినపను లన్నియుఁ జేయక తీఱదు. అట్లు గావించిరేని జనులు పాపకర్మల మాని పుణ్యకర్మలం జేయుచు సత్ప్రవృత్తినుండుట కిచ్ఛగించుటయును, నట్టిజక్కనిత్రోవను బోక దుష్కార్యాచరణమందే గట్టి పట్టుదలఁ గలవారుమాత్రమే తుదకు దేశమునకుఁ బట్టువిపత్తులకు లోనై భ్రష్టు లగుటయును దటస్థించును.

ఉపదేష్టగురువు:— కురుక్షేత్రరంగమందు యుద్ధసన్నద్ధసేనా మధ్యంబున శ్రీమద్భగవద్గీత నుపదేశించిన మహాత్ముఁ డయిన శ్రీకృష్ణుని యుపదేష్టగురువని వేఁ జెప్ప నవసరముగలదా? అప్పమహనీయుఁడో కర్జునునకు మాత్ర ముపదేశకుఁడు గాఁడు; ఇండియాదేశమునకు మాత్రమే యుపదేశకుఁడు గాఁడు; మానవభాషాభూషితంబగు గాంభీర్యభగవద్గీతోపదేశమును విని కొంచమైనను బోధచేసికొనఁగల మానవబుద్ధి కంతకును నతఁ డధ్యాత్మోపదేశకజగద్గురువే. “అర్జునా! నే నుపదేష్టను. చిత్తము నాశిష్యుఁడు” అను అనుగీతావాక్యమును స్మరణకుఁ దెచ్చికొందు. నాయుపదేశమును వినుట కిచ్ఛగించిన వానిచిత్తము నాశిష్యుఁడు. బోధను గ్రహించుటకు సిద్ధముగా నున్న యేయొకపురుషుని యంతఃకరణము నాశిష్యుఁడు. పరమార్థతత్త్వమును బోధచేయు గురు వెవరికిని జ్ఞానప్రదానము చేయ సంకోచించుట వానియందలి యనూయతచేఁ గాదు. తన హితోపదేశ మెవరినిఁగూర్చి యుద్దేశింపఁ బడ్డనో యట్టివారి వ్యాపకము నద్దాని స్వీకరించి ధరింప సమర్థము గామిని, దాని నొసంగుటలో నతనికిఁ బ్రతిబంధకముగలుగుచున్నది. జ్ఞానము విలువ గలపదార్థ మగుటయు దానిని ధారాళముగాఁ గాక సాధ్యమగునంత

స్వల్పాంశముగా నియ్యవలసియుండు ననుహేతువుచే నది వారికిఁ బరమ గురు వియ్యలేదని తలంచువా రాగురువుల దివ్యహృదయ మిట్టిదనిగాని, వారిశిష్యుల యంతఃకరణవృత్తిలో మందముగఁ బ్రతిఫలించు ప్రేమానుబంధ ప్రభావ మిట్టిదనిగాని, చక్కఁగాఁ దెలిసికొనినవారు. గురు వెన్నఁడును బోధచేయ నిరాకరింపఁడు. గురువునకు బోధచేయుటలో సంకోచ మెప్పుడును నుండదు. శిష్యుఁడు దాని వినుటకుఁ జెవి నిడఁడు. గురువుల కొఱ తేమియుండదు. కాని యుపదేశగ్రహణమున కిష్టముగలిగి సిద్ధముగా నుండు శిష్యులలేమియే ప్రబలముగానున్నది. "ఏహేతువువలన నిప్పు డొక యవతారపురుషుఁడుగాని యవతారము గాకపోయినను మహాత్ములుగాని మానవుల శ్రోత్రపుటములలోనికిఁ దమ జ్ఞానామృత ధార ప్రవహింపఁజేయుటకు బయలుపడిరారు?" అని ప్రజలనఁగ వినుచున్నాను. మనల నేకారణమున వా రుపేక్షఁ జేయుచున్నారు? మనల నేల చేఁబట్టరు? ఈప్రపంచములో నిక్కాలమున నేల పూర్వము వారివలన నుపదేశింపఁబడిన జ్ఞానము విజృంభింపఁగూడదు? ఈప్రశ్నలన్నిఁటికిఁ బ్రత్యుత్తర మేమన:—ఒక్కఁడైన నేర్చుకొనుటకు వచ్చునా? యని కనిపెట్టి కనిపెట్టి విసికియున్నారు. ఎవఁడైన నొకఁడు దన మనస్సువిప్పి "ఓ ప్రభువా! నాకుపదేశింపుము" అని మొఱపెట్టిన తోడనె వారియుపదేశము దివ్యశక్తిప్రవాహములో వెల్లువగాఁ బయలు వెడలి హృదయాకాశమం తంతట వ్యాపించును. ఆయుపదేశము మీకుఁ గలుగ లేదంటిరేని, దానికిఁ గారణము గలదు వినుండు.—మీహృదయ గృహాకవాటములు సువర్ణాసక్తి, యశోలాభకాంక్ష, ప్రభుత్వాపేక్ష, యైహికఫలభోగవాంఛ, యను బీగముచెవులచే గట్టిగ బిగింపఁబడియుండుటచే జ్ఞానోపదేశముఁ జేయుగురువులందుఁ బ్రవేశింపఁజాలరు. మీహృదయముల తాళములను దెఱచి కిటికీలను బాఱవేసినతోడనే లోనఁ

ప్రవేశించుటకు ద్వారమువద్ద యెల్లప్పుడు గనిపెట్టియున్న జ్ఞానబోధప్రవాహములోనికిఁ జొచ్చి వెల్లిగొలుపును.

హృదయాన్వేషకుఁడు:— ఈవిషయమందుఁ గూడ నీతఁడు దురవగాహుఁడు. ఏలయన: అతఁడు మాయకుఁ బ్రభువు, భ్రాంత్యధిష్ఠానదేవుఁడు. జగత్తునంతను గాకపోయినను, దన భక్తుల హృదయములఁ దప్పక శోధించును. ప్రపంచమందు జనులుత్పథగాములుగాకుండ నదుపదేశ మిప్పుడును జేయుచుండును. తనతో నైక్యమునకుఁ బ్రతిబంధకముగు నిట్టిదోషము రవంతయాయిన మిగులకుండునట్లు భీమార్జున యుధిష్ఠిరులవిషయమై చేయఁబడిన శోధన యయినదో సునిశితముగు స్వర్ణకలసలాకుతో నొనర్పఁబడు తీవ్రముగు పరిశోధనమై యున్నది. ఏలయనిన వారు స్వకీయులై తనతో నేకీభావమునొందవలె ననియేగదా ! తనకోరిక. పాపలేశ మేమాత్రము వారియంతఃకరణమందు శేషించినను నతని సాయుజ్యమున కర్హులు కానేరరు. భక్తులహృదయములను భగవంతుఁడు శోధించుట వారియందుఁగోపముగలిగి వారు చెడుత్రోవలఁద్రొక్కవలెనను నుద్దేశముతోఁ గాదు. వారియెడల పరమకారుణికుఁడై యనుగ్రహించి వారి హృదయములను బరీక్షించి యందుండు కాలుష్యము నంతను బిడికిళ్లతోఁ బట్టి వేళ్లతోఁ బెల్లగించివేయుటకుఁ బ్రయత్నించుచుండును. రెండో మూఁడో సమయములలోన ట్లాతఁడు చేసినట్లు నాకు జ్ఞాపకమున్నది. అతని పరీక్షాపద్ధతిని మీకుఁ గనుపఱచుటకు రెండింటినిమాత్ర ముదహరించినఁజాలును. కురుక్షేత్రయుద్ధ మనేకదినములవఱకు విజృంభించుచుండెను. వేలకొలఁది లక్షలకొలఁది మృతకళేబరము లాభయంకరముగు రణరంగమందుఁ జెదిరియుండెను. అర్జునుఁడు దన త్రోవనడ్డము వచ్చినచోటఁ దక్క నితరత్ర తనమార్గమునఁ జిక్కు ప్రాణుల నంపలఁ

నాయకుఁ డగు భీష్ముఁడు యుద్ధభూమికి వచ్చుచుండెను. కాని, యర్జునుఁ డన్నిస్థలముల నేకకాలమున నుండినట్లయ్యె. అతఁడు సుడిగాలి వడువునఁ జక్రాకారంబుగఁ దిరుగుచు యుద్ధభూమియందు వేల్పోక కోటులుగాఁ గృష్ణుఁడు నర్జునులం దొలుచు రథసారథ్యంబు సేయుచుండెఁ. ననసాగ్నములో ద్రమునవచ్చినవారలం బదుజుం దునిమి విజయంబు నొందుచు స్వస్థానమునకుఁ బోయెను. కృష్ణార్జునులిచ్చట లేరో యచ్చట భీష్ముఁడు గర్జించుచుండెను. పాండవుల ధైర్యము సన్నగిలసాగెను. అంతట నొకనాటి రాత్రి, అనఁగా నాఁటి యుద్ధమునకు ముందు రాత్రి గుడారములలో విశ్రమించి యుండఁగా యుధిష్ఠిరుండత్యంతనిరాశం జెంది భీష్ముఁడు హతుఁ డగునట్లు నేమియుం గానరదని బహిరంగముగ వాక్రుచ్చె. అప్పుడు హృదయశోధకుఁడగు శ్రీకృష్ణునినోటనుండి పరీక్షావాక్యము వెడలెను. ఏమనిన:—"చూడుఁడు. రేపటిదినమున నేనుబోయి భీష్ముని జంపుదును". యుధిష్ఠిరుఁ డందు కంగీకరించునా? ఏలయన: దాని కొక ప్రతిజ్ఞ యడ్డుగా నుండెను. శ్రీకృష్ణుఁడు నిద్రఁబోవుచుండ దుర్యోధనార్జునులాతనిసహాయము నడుగుటకుఁ బోయినప్పుడు వారిద్దఱిలో నెవరికేమి కావలెననుప్రశ్న పుట్టెను. ఒంటరిగా నిరాయుధుండనై యుద్ధముచేయకుండ నొకపక్షమున నుండుననియు, రెండవపక్షమునకు సహాయము చేయుట కొక బలవత్తరమగు సేన నిచ్చెదననియు శ్రీకృష్ణుఁడు పలికెను. నిరాయుధుఁడగు శ్రీకృష్ణుని యర్జునుఁడు కోరుకొనెను. దుర్యోధనుఁడు యుద్ధసన్నద్ధమగు సేన కావలెననెను. కావున నవతారపురుషుఁడు యుద్ధముఁ జేయనని ప్రతిజ్ఞఁ జేసెను. రథసారథి నుండవలసిన కళ్లెమునుమాత్రము తనచేతఁ బట్టుకొని నిరాయుధుఁడై శ్రీకృష్ణుఁడు పీతాంబరమును ధరించి యుద్ధరంగమునకుఁ బోయెను. అర్జునుని యుద్ధమునకుఁ బురికొల్పుటకు,

రెండుపర్యాయములు కళాహీనమై, పోరాడుచున్న భీష్ముని దానెదిరించి చంపఁబోవుచున్నట్లు దోఁచునట్లు రథముమీఁదనుండి క్రిందికి దుమికెను. ఆయిరువురుపురుషుల నర్జునుఁ డతని ప్రతినను జ్ఞాపకముచేసి నివారించెను. నిర్మలచారిత్రుఁడగు ధర్మరాజున కట్టి నాపరీక్ష తటస్థించినది. తనకు జయముకలుగఁజేయుటకు శ్రీకృష్ణుఁడు దనప్రతిజ్ఞాభంగము చేయవలయునా? యుధిష్ఠిరుఁడు నిశ్చలుఁడుగ నిలిచెను. "నివాక్రాంతిచాలకే దత్తమయినది. దానికి భంగమురాఁగూడ" దని మాఱుబలికెను. ధర్మజుఁడు పరీక్షదాఁటెను. శోధన నాగెను. కాని, యాతని యుదారహృదయమునం దొకలోపము మాత్రముండిపోయెను. ఆలోప మతనినిఁ దనహృదయేశ్వరునుండి దూరముఁజేయునేమో యనుభయము కలుగఁ జేయనంతటిది దాయెను. పరీక్షాసమయమందుఁ దాను సహాయుఁడయి యొంటరిగా నిలువఁబడు శక్తిలేమియు, తన మనోనిశ్చయము నెఱవేఱుటకుఁ దనకంటె బలవత్తరుఁడగు సహాయొకని నాసరాగాఁ గోరుటయు నాతనిలోపములు. ఆకసటిదౌర్బల్యాగ్నిసంపర్కముచే రూపుమాయు పదార్థమువలె దగ్ధముగావలసియుండెను. యుద్ధము జరుగుచుండ, నొకయాపత్సమయమందు దుర్ధర్షుఁడగు ద్రోణాచార్యుఁ డెదురులేనివాఁడనియు, జయశీలుఁడై తన యెదుటనున్న ప్రాణసమూహము నంతనుఁ బొరిఁగొనుచున్నాఁ డనియుఁ దనపుత్రుఁడు మృతినొందె ననువార్తను వ్యాపింపఁజేసినపక్షము నతఁడు మాని యుద్ధముఁజేయుటనికికిని, యతని సంహారమునకును సాధనమని సమాచారమువచ్చెను. ద్రోణాచార్యుల కొడుకుని పేరువంటిపేరు గలుగు నొకయేనుఁగును భీముఁడు హతము చేసియుండెను. దాని నాధారము చేసికొని "అశ్వత్థామ మృతినొందెను" అని ద్రోణాచార్యులు వినునట్లు భీముఁడు పలికెను. యుధిష్ఠిర మహారాజు చెప్పినఁగాని ద్రోణాచార్యులు నమ్మఁడు. అప్పుడు పరీక్షా

కరుణను తలఁపించెను. యుద్ధములో జయమునొందుటకొఱకు, మాటను మాత్రము సత్యమును వాస్తవముగా నసత్యముగు వాక్యము నతఁ డుచ్చరించుటకు సాహసించునా? అతఁ డొప్పుకొనలేదు. తనతమ్ముని దీనాలాపముల వినియుఁగూడ నట్లు చేయుటకు నంగీకరింపలేదు. తాను గౌరవించువారందఱు నసత్యపక్షము నవలంబించియుండఁ, దానొక్కఁడు మాత్రము సత్యమునే దృఢముగ గ్రహించి నిల్చునా? అప్పుడు మహాత్ముఁడగు శ్రీకృష్ణుఁడు విజయముచేసి యశ్వత్థామ చంపఁబడెనని పలుకుమనియెను. శ్రీకృష్ణుఁడు చెప్పునదియంతమాత్రమునను తా నట్లు బలుకఁ దగునా! పూజనీయుఁడగు నాతఁ డట్లు చేయుమన్నని చెప్పిన మాత్రాన దా నబద్ధమాడుట తగునా? ఓహో! అది పాటిగాదు. దేవత చెప్పినఁ గాని, మనుజుఁడు చెప్పినఁ గాని, భగవదాజ్ఞనును, సద్ధర్మమునను విరుద్ధమగు కార్యమును జీవుఁ డెప్పుడును జేయఁగూడదు. ధర్మప్రతికూలముగా నడచి పాపముఁ గట్టుకొనుటకంటె నీలోకములో నంతయుఁ గోలుపోయి తా నొంటిగా ధర్మాచరణమందు నిలకడఁగలిగి యుండు టెంతమేలు. అనఁగా, తనకు సంభావ్యుఁడగు కృష్ణభగవానుల యాజ్ఞ యయినదను వ్యాజమునఁ దన మనోభీష్టమగు మిథ్యావచనోచ్చారణఁ జేసినవెంటనే యతఁ డెందుకు స్వీకరింపఁడయ్యె. తనరధము నేలగ్రుంకె. తత్ప్రకృతి యామరణాంతము నతని వెంబడింపసాగెను. భగవదాజ్ఞ కంటెను, స్వర్గసుఖముకంటెను, సుకృష్టమగు దీనరక్షణధర్మమును ఘనకము విస్మయమయి గూడఁ జూపుచు, దేవేంద్రుసన్నిధిని యనన్యశరణ్యుఁడయి నిలువఁబడునట్టి దుఃఖమును వేదనగూడా నాతని వెంబడించియుండెను. ఈదుఃఖాద్యనుభవమును ననుతాపముచేఁ దనచిత్తము పరిశుద్ధమాయి పౌర్ణిమ్యశశాంకతేజోవిరాజితమయి వెలిగెనని లోకుల కెఱుఁగఁజేసె. అయ్యో! శ్రీకృష్ణుఁ డబద్ధమాడుమని ప్రోత్సాహముఁ

జేసినని యాజ్ఞజను లందురు. అన్నలారా! మీర లీభ్రాంతిఁ జెందక వస్తుతత్త్వమును గ్రహింపలేరా? పరమాత్మ యీబ్రహ్మాండములోఁ జేయుచుండున దేదియయినఁ గలదా? ఈజగత్తులో నతని ప్రాణస్పందము దక్క వేఱుచేష్టాశక్తియు, నతనియాత్మ తప్ప మఱియొకయాత్మయు, నతనిచైతన్యము వినాగా నీవిశ్వమంతయు వ్యాపించున దింకొక పెద్దయయును లేదు. తుట్టతుదను వస్తుతత్త్వము విచారణఁ జేసినచో నేయొక చేష్టయు నతనిచేష్టయే గాని యన్యముగా నేరదు. తత్త్వమేదియో దానిని వారు జాగరూకతతో సంఘుకొనఁ జెప్పియే యున్నారు. "మోసగాండ్రగు జూదరులయం దుండు ద్యూతవ్యాపారము నేను" "వేదములోని ఋక్కులు, పనసలు, స్వరములు నేను" అని యాతఁడు వక్కాణించెను. ఇది యొక యద్భుతబోధ. దానిని గ్రహించుట కష్టమయినను నది యథార్థము. మన యభివృద్ధిమార్గములో మెట్టుమెట్టునందును మనము నేర్చుకొనవలసిన పాఠ ముండియున్నది. మనకన్నిబోధలు నే యీనాఁ డామహానుభావుఁడే. మన పెనుగువలలో నొకమెట్టునుండి మఱియొక పైమెట్టునకుఁ బోవలసివచ్చును. అట్టి యనుభవమువలన హృదయములో నుండుదుష్టచేష్టలయందుఁ గలకోరిక దగ్ధమగుచున్నది. ఉభయవిధము లగు కత్తులు మానవదేహమాంసములోనికిఁ గోసికొని చనునవియయినను రెంటికి భేదము కలదు. వైద్యునికత్తి పుండుమాన్పుటకైఁ గోయుట యందుఁ బ్రవృత్తికలయది. ఘాతుకునికత్తి హననవ్యాపారమునందుఁ బ్రవృత్తిగలిగియుండు. ఈరెండు నెట్టువేళలో యట్టులే పరమేశ్వరుని వాఁడికత్తి కష్టమనుభవింపఁ జేసి దానిబాధవలన మనుజుని శుద్ధపఱచుచు విలక్షణమై యున్నది. ఏలయనిన దుష్టమగు నీచస్వభావమును దృప్తి పొందించు నుద్దేశముతో ధర్మపథమునుండి తొలఁగి కామమును దీర్చుకొనుటకుఁ జేయుదుష్కార్యాచరణమునకు మనుజుఁ డొడంబడినంత

బరిమాణములను భావించుచు దూరశస్త్రప్రయోగమును జేయుచున్నాఁడు. తుదకాతఁడు పరమేశ్వరుఁడుగ నభివ్యక్తమగుచున్నాఁడు. ఆసందర్భమున నాతఁడు శంఖచక్రగదాపద్మాన్విత మగుచతుర్భుజయుత వైష్ణవ రూపమును, బ్రహ్మాండమంతయుఁ దనలో నిమిడ్చికొనిన విశ్వరూపమును, బ్రదర్శించుచున్నాఁడు. ఆతని గాంభీర్యజ్ఞానోపదేశమంతయు, నాతని యవతారజీవితకాలములోని యాచరణదార్ఢ్యమంతయు, నాతని పారమార్థిక రూప మాతిశయముగా నగపడుచున్నది. మొదటియంశముకంటెఁ గడపటియంశములోనె యాతని పరమేశ్వరస్వభావము వ్యక్తపడెనని చెప్పిన వింతయేమి! బ్రహ్మాండమునుధరించు బాహ్యరూపముకంటెఁ గుడిప్రక్కనుఁ గాని యెడమప్రక్కనుఁ గాని రవంతయయినఁ దప్పిపోని దృఢనిశ్చయస్వభావమె యతనిసంపూర్ణ మహిమను గోచరింపఁజేయుచున్నది. ప్రారంభింపఁబడిన కార్యమును మధ్య నెన్ని విఘ్నములు వచ్చినను సహింపక తుదముట్టింపవలయు నను ధ్యానము నిరానుస్వంతం దనుకొని యాతనిజీవితచరితమును పూరింకొనవలెను చదివినయెడల తన్మాహాత్మ్యము విశదమగును.

అతఁ డేందు కవతరించెనో తెలియునా ? ఇండియాదేశపు క్షత్రియజాతికి సంస్కృతాచారముఁ గఱపి యిండియాదేశమునందు దక్షిణపువాసుల కడ్డులేక ప్రవేశించుట కవకాశ మిచ్చుటకె. ఆప్రధాన పద్ధము వారికంతవఱ కెన్నియోమార్గములు బుద్ధులు నేర్పఁబడినవి. పరశురామునిచే వారియునికి యొకపర్యాయము నాశమైనను తిరిగి వారు ప్రతిష్ఠాపితులై రనుసంశయము మీరఁజేఁగెనదే. క్షత్రియులు తనను చూచి నేర్చుకొనునట్లు శ్రీరామచంద్రుండు క్షాత్రధర్మం బెట్లు నిరూపిముగ నాచరించెనో వారి కెఱింగిన విషయమె. తమకుఁ బాటిల్లిన కీడు మూలముగాఁ గాని, తమకుఁ గనఁబఱచిన ప్రేమాతిశయముచేతఁ గాని,

యీ రాజులు జ్ఞానముఁ దెచ్చుకొని సన్మార్గ ప్రవర్తకులు కాలేరి. భయము వలనఁగాని, భక్తివలనఁగాని శ్రీరామపద్ధతి ననుసరింపరైరి. అంతట క్షత్రియజాతిక్షయసూచక మగు దుర్నిమిత్తములు ప్రకటితములాయెను. ఇండియా దేశమం దచ్చటచ్చటఁ గొంతమంది హతశేషులనుమాత్రము చెదరియుండునట్లు క్షత్రియజాతిని దుడిచి వేయుటకై యతఁ డవతరించెను. ఖడ్గపాణులగు క్షత్రియులే యిండియాదేశమును బరివేష్టించియుండు నిమసగోడ. ఆప్రాకారమునే ముక్కముక్కలుగా వ్రక్కలించి పునరుద్ధారణ గలుగకుండ నా ఖడ్గమును దునకలుగాఁ జేయుటకై యాతఁ డిప్పు డవియం దుద్భవించెను. ఏలయన, నా కరవాలమును బ్రజలరక్షణకొఱకుఁ గాక వారిని గాటియపెట్టుటకొఱకు వారు వినియోగించుచుండిరి. ధర్మస్థాపనకు బదులుగా క్రూరపరిపాలన కొఱకుగా నాయాయుధమును వా రుపయోగింపసాగిరి. కాఁబట్టి మంచిమాటలవలన సన్మార్గములోఁ బడనివారు దుఃఖానుభవమువలన సద్బుద్ధిని సంపాదించుటకొఱకుఁ బ్రపంచరక్షణకొఱకు వారికిఁ దానొసఁగిన యస్త్రమును దానె తునుకలుగ ఖండించెను. కురుక్షేత్రయుద్ధభూమియందు క్షత్రియజాతి కడసారిఘోరయుద్ధము చేసెను. రణసమాప్తియయిన వెనుక సేనలో కొలఁదిమంది మాత్రము మిగిలిరి. కురుక్షేత్రయుద్ధముపిదప క్షత్రియజాతి మగుడఁ బూర్వోత్కృష్టస్థితికి రాలేదు. బొత్తిగానది యదృశ్యము కాక పోయినను గొన్ని భాగములలో మాత్రమే యాజాతి కుటుంబములు కొన్ని కనపించుచున్నవి. ప్రత్యేక మొకజాతిగా నిప్పు డిండియాదేశములోఁ జాలప్రదేశములలో దానిఁ జూచుట కష్టసాధ్యమను వంశము మీకండఱకుఁ బూర్ణముగా గోచరమైయే యున్నది. ఈప్రపంచ సంరక్షణవిషయిక మంత్రాలోచనలో నిట్టి కార్య మేల సంఘటన చేయఁ బడెను ? రాజులు, పాలకులు, ప్రజలను ధర్మమార్గమున నేలుట కిచ్చ

గలిగిన, నేలవలయు, లేకపోయిన బొత్తిగా మానవలయు నని యందఱ కిఁక ముందుఁ దెలియఁగలందులకే కాక యిండియాదేశమున కితరఖండ ములవారు సయితము వచ్చుట కొఱకుఁ గూడ నీపని చేయఁబడినది.

భగవత్సంకల్ప మిట్లున్న దనుమాట యెంతవింతగఁ గనఁబడును? భరతఖండమును బుణ్యక్షేత్రముగఁ జేసి, యందలి గోచరభూము లును, విపినంబులును తనపాదస్పర్శచేఁ బావనంబుగావించి తనమధుర స్వనం బెల్లవోట్ల ప్రతిధ్వను లిచ్చునట్లొనరించి సర్వభంగుల దేశాభి మానమును జూపించిన కృష్ణుండా దేశముమీఁది కితరదేశస్థులు దం డెత్తివచ్చి దాని జయించుట కవకాశమిచ్చుట సంభవించునా? అంతేని సంభవింపవచ్చును. ఏలయన:—అతని విచక్షణ మనుష్యమాత్రుని విచక్షణవంటిది గాదు. అతఁడు కార్యావసానమును బ్రారంభమునుం డియే యెఱుంగువాఁడు. ప్రాచీనకాలిక మగునిండియాఖండము పర మార్థ జ్ఞానధనమును గుప్పరించుట కనుకూలమగు పాత్రగా నుండు నట్లితర ప్రపంచ ఖండములకంటెఁ బృథక్కుగా భగవంతునిచే నుంపఁ బడెను. మీఱి లోకపాత్రనిండ నీళ్లుపోసి జలముఁ ద్రావుటకయి దప్పిగొన్నవా రార్చుచుండఁగా వారలకందరాకుండు నప్పాత్ర నెత్తి యిన యొక గూటియందులో నుంచివేయుదురా! మహామహిముఁడగు కృష్ణుండు పరమార్థ జ్ఞానామృతముతో నిండియాదేశ మనుపాత్రను బూరించి దాఁచఁగా నొకేతెగవారితృష్ణానివారణముకొఱకును నేక దేశస్థులవినియోగము కొఱకును మాత్రముగాక లోకములో నందఱ పిపాసాపరిపూరణార్థ మాయమృతరసమును బాత్రలోనుండి తీసి పయికిఁ బోయవలసిన సమయము తుదకు తటస్థ మయ్యె. జీవనామృత మందఱకును బావనము చేయునట్లవకాశము గలుగఁజేయుటకే యామానవాభిమాని యగు ప్రేమాసముద్రుఁ డవతరించెను. విదేశస్థుఁ డిండియాదేశపు పొలిమేరలను దాఁటి వచ్చునట్లు మధ్య నున్న యడ్డు

లను దీసి వేసెను. గ్రీసుదేశస్థులు వచ్చి పడిరి. మహమ్మదీయులు ముప్పుముప్పులుగాఁ గురిసిరి. ఇట్లొకరివెనుక నొకరనేకులు దండెత్తి రాఁగరాఁగఁ దుట్టతుదకుఁ బ్రస్తుత మిండియాదేశము నేలు నాంగ్లేయులు తేతెంచిరి. అందువలన నపకీర్తియును కష్టములు సంభవించి యిండియాదేశము శాపదగ్ధమాయెనని యనుకొనుచున్నారా! ఆహా! అన్నలారా! అట్లెంతమాత్రము కాదు. తత్కాలమున కెగ్గుగాఁ దోఁచినది నిజముగాఁ బ్రపంచమునకు క్షేమకరముగాను, శ్రేయస్కరముగాను, బరిణమించును. లోకమంతయు నుద్ధరించుటకొఱకు నిండియాఖండము కొంతకాలము కష్టములనుభవించినను మేలని తోఁచెడిని.

అటుగాఁ దాత్పర్య మేమి? రాజనీతి ననుసరించి నేను మాటలాడలేను. ఆర్యవంశ మెట్లు పారమార్థికాభివృద్ధి నొందుచున్నదో విచారింపవలెనని పరమార్థ విద్యార్థిగా నీవిషయమును వితర్కించుచున్నాను. చిట్టచివరకు నిండియాఖండమును జయించి ప్రస్తుతము దాని నేలుచున్న యాంగ్లేయులభాష లోకములోని యన్నిభాషలకంటె నెక్కుడువ్యాపకము గలదై ప్రపంచమంతటికి నేకభాష కాఁదగి యున్నది. అది యొకద్వీపమగు బ్రిటనుదేశముయొక్కయే కాక గొప్పదియగు నమెరికాఖండముయొక్కయు నాస్ట్రేలియాఖండముయొక్కయు భాషయై యున్నది. ఒక భూభాగమునుండి మఱియొక భూభాగమునకు వ్యాపించుచుఁ దుదకు భూమండలమందలి జనులందఱును బహుళముగాఁ దెలిసి వ్యవహరించుచున్నభాషయై విరాజిల్లుచున్నది. ఇతరజాతీయులుఁ గూడ నీభాష నభ్యసింప మొదలుపెట్టుచున్నారు. ఏలయనఁగ లోకవ్యవహారమును వర్తకవ్యాపారమును, రాజకీయ తంత్రమును, నాంగ్లేయభాషమూలముగానే జరుగుట కారంభమవుచున్నది. అట్టిజగద్విఖ్యాతభాషలో మతగ్రంథములను వ్రాయించి తన్మూలముగాఁ దనబిడ్డలగు సర్వమానవసంతానముల హృదయములను

శుభ్రిపఱచి పరమార్థ జ్ఞానలబ్ధులం జేసి కటాక్షించు నుద్దేశముతోఁ బర
మేశ్వరుం డాంగ్లేయుల నిండియా దేశమునకుఁ బంపి భూమండలవిస్తృ
తంబగు తమ మహారాజ్యములో హిందూదేశ మొకభాగముగ భావించు
నట్లులం జేసిన నాశ్చర్య మేమి గలదు? లోకమునకుఁ బరమార్థ
జ్ఞానమును సమకూర్చుటకే యాతని యవతారముయొక్క ముఖ్యోద్దే
శము. ఒక జాతివారు మాత్రము పరమాత్మతత్త్వవేత్తలగుట చాలదు. ఒక
దేశస్థులు మాత్రము పరమార్థ జ్ఞానవంతులగుటవలన సంతుష్టి లేదు. ఎంత
మహిమగలదైన ప్రియముగలదైనను నొకే దేశము పరమార్థయాథా
త్మ్యమహాధనమును సంపాదించుకొని యుండుటయుఁ నితరులు జ్ఞాన
ధనదరిద్రులయి యుండులను యాచించుటయు న్యాయము గాదు. ఇంత
యాదేశమును నేను బ్రేమించునట్లు మీలో నెవరు ప్రేమింపఁగలరు ?
లోకముయొక్క తత్త్వజ్ఞానాభివృద్ధికొఱకుఁ దాను స్వయముగ నేమియుం
జేయఁజాలకపోయినను తన్నిమిత్తమై భగవదాజ్ఞానుసారముగాఁ దటస్థించు
మహానిరూపణ లట్టిపని గావించుట కవకాశముండుటకై ఖండాంతరజాతీ
యులతోఁ గలతాఁగలేక కొంతకాల సంయోగతి నొందినను మేలని యే
యూహించుచున్నాను. కాఁబట్టి శాహిరమునకుఁ బరాజితముగాను, బరా
ధీనముగాను, నేఁడు కన్పట్టుచున్నదో యా యార్యుఁడ పరమార్థదృష్టిచేఁ జూచిన
నందఱు జాతులవారును, నన్యదేశీయులును, ధారాళముగాఁ బ్రవేశించి
నేర్చుకొనుటకుఁ జేయఁబడిన పరమార్థతత్త్వాంతరములు విశాలములుగఁ
దెఱపఁబడినట్లు తోఁపక మానదు.

ఆ హేతువువలన మీరు విధాయకముగాఁ జేయవలసిన కార్య
మొకటి ప్రసక్తమగుచున్నది. ఋషిగోత్రజులుగాను, ఋషుల తేజస్సు
మీనాడులయందు రక్తరూపముగాఁ బ్రవహించు యోగ్యత గలవారు
గాను, మిమ్ముల నెన్నిపర్యాయములో యెంతయుచ్చగానో కొనియాడు

చుంటిని. అది సత్యమే గాని, యంతమాత్రముతోఁ దృప్తి నొందవలసిన యంశము గాదు. శ్రీకృష్ణుఁడు తన శాశ్వతసత్యసంకల్పములలో మిమ్ముం గూర్చి యుద్దేశించినరీతి మీరు సమస్తజాతులవారికి దివ్యతత్త్వోపదేష్టలగు బ్రాహ్మణగురువులై మానవులకు దేవతలుచేయు హితోపదేశములకు ద్వారభూతులై యుండవలసిన యెడల మీరు మనః పారిశుద్ధ్యమును, పరమార్థజ్ఞానమును, బూర్ణముగా సంపాదింపవలయును. మీ రజ్ఞానాంధకారములో దేవులాడుచున్నచో మీతత్త్వశాస్త్రములు లోకమునందఱను నెట్లు జ్ఞానసంపన్నులఁ జేయఁగలవు? మహర్షుల జ్ఞానము భూమండలములోని ప్రతిభాగమునం దుండు మ్లేచ్ఛులకడ కేఁగి వారిని జ్ఞానసంపన్నులం గావించి కృతార్థులం జేయుచుండఁగా నమ్మహనీయుల దేహసంబంధులై పుట్టిన మీరలు మీమతగ్రంథములనే బాగుగ నెఱుంగకయున్నారు. పోనిండు. బాగుగా నెఱుంగకపోయినను నభిమానమైన లేకయుండుట తగునా? ఇదియే మీకుఁ బ్రధానముగాఁ జేయవలసిన హితోపదేశము. ఇండియాదేశములోఁ బుట్టిన యీ బ్రహ్మవిద్యను వ్యాపింపఁ జేయు బోధకు లాదేశములో నంతరించినందున నాలోపమును లేకుండఁ జేయుటకై మహర్షులు తమబిడ్డలలోఁ గొందఱి నితరదేశములకుఁ బంపవలసి వచ్చెను. వా రచ్చటికిఁ బోయి మఱల వచ్చి మీమతము మీకు బోధపఱచుటకై యట్లు పంపఁబడిరి. ఈయుపకీర్తి యింతటితో నివర్తించుట న్యాయముగదా? మీలోఁ గొందఱు క్రమ్మఱఁ దొల్లింటిదివ్య జ్ఞానజీవనమవలంబించి పరమేశ్వరునిఁ బ్రేమభక్తితోఁ గొలువ నారంభించి యాతని మార్గము ననుసరించి సంచరించుట యుక్తముగదా! మీలో నవతరించిన శ్రీకృష్ణుఁడు తన జీవితచర్యలలోఁ గనఁబఱచిన మహిమను మీలో నక్కడక్కడ నొక్కఁడొకఁడుగాక జాతీయులందఱు గనఁబఱచుచుండిన, ప్రత్యేకముగా నొక యవతారమెత్తుటకన్న నిజముగ వేయి

మడుంగు లెక్కువగా నుండదా? ఆతని జ్ఞానమును, నతని ప్రేమను నిష్ఠమి యం వదుగిడిన మనుజు లందఱు విషయమై యాతనికిఁగల భ్రాతృవాత్స ల్యము ననుకరించుచు నీదేశీయజను లందఱు నాతని యవతారముగాఁ బరిణమించెదరుగాత యని మన మేల కోరి ప్రార్థింపఁ గూడదు? ఇండియా దేశస్థులలో నొకరొకరినుండియు నిండియా దేశమును బ్రపంచములోని యితర దేశములనుండియు వేఱుసేయు నడ్డులు నగాంచబుద్ధి యసహ్యస్వభావము, ననూయయుం, దూరముగాఁ దొలఁగిపోవుఁగాక! సర్వమతిమార్గములును శ్రీకృష్ణమూర్తి సంచరించునవియె యగుటచే మనుజు లేమార్గము నవలంబించి నడచినను నందు వారలు నాతనిం గనుఁ గొనియెదరు. వారు పోయిన యేత్రోవనయినను వారి ననుసరించి మనము గూడఁ బోవుదము, ఇదియే శ్రీకృష్ణుని యాచరణవాక్యము. ఈమంగళవాక్యమే మనకింతటినుండి మార్గదర్శియగుంగాత! ఇయ్యది చెప్పినప్రకారము శ్రీకృష్ణుఁడు త్రైకాలనితోం దేను: గావున పరమప్రేమాస్పదుండును నేతయు నగు నాతని చర్యమున ననుకరింప వలెనని నతండు నడచిన యట్లె మనమును నడుచుకోవలెను.

శ్లో. కృష్ణోరక్షతునో జగత్త్రయగురుః కృష్ణంనమస్యామ్యహం
కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయతస్మైనమః
కృష్ణాదేవసముత్థితం జగదిదం కృష్ణస్యదాసోస్మ్యహం
కృష్ణేతిష్ఠతి సర్వమేతదఖిలం హేకృష్ణరక్షస్వమాం.

కాన

శ్లో. మధురమధురమేతన్మంగళం మంగళానాం
సకల నిగమవల్లీసత్ఫలం చిత్స్వరూపం
సకృదపి పరిగీతం శ్రద్ధయా హేళయా వా
సఖివర నరమాత్రం తారయేత్ కృష్ణనామ.

# శ్రీరస్తు.

# శుద్ధపత్రిక.

---

‘కర్తృ.’ ‘మాధ్వ’ ‘చరిత్రాదులలో’ ముకారార్ధంబు లోపంబుఁ జేసి యుఁ జేయకయుఁ వ్రాయఁబడినది. సంధివికల్పము గాన నది యంతఁ బాటింపఁబడలేదు. రేఫసంయుక్తాక్షరానుస్వారంబు లంతఁ బాటింపఁబడ లేదు. తత్త్వ, పుత్ర, సత్త్వాదిపదములకు రెండురూపములు గ్రహింపఁ బడినవి, ‘మీమాంసము’ను ‘మీమాంస’ యనియు, ‘అటులు’కు ‘అట్లు’ అనియు, ‘శత్రునకు’ ‘శత్రువు’ అనియు, ‘గ్రంధ’ ‘అర్ధ’ యథార్ధ’ములకు ‘గ్రంథ’ ‘అర్థ’ ‘యథార్థ’ములనియుఁ, జదువవలయు.

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౪ | ౪ | మాత్స్వర్య | మాత్సర్య |
| ౬ | ౧ | యతి | నీతి |
| ౬ | ౧౩ | వేయించితిని | వేయింపఁ దలంచితిని, [గాని యది పెద్దరయుగులకే విఘటించితి. |
| ౬ | ౨౧ | మీద | మీఁద |
| ౭ | ౧౭ | రామా | రో |
| ... | ౧౯ | నగ | నఁగ |
| ౮ | ౪ | పబ | పఁబ |
| ౮ | ౧౬ | స్వ | స్వా |
| ౯ | ౧౦ | ఫ | ఫా |

| పుట. | పఙ్క్తి. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౧ | ౬ | దా | దో |
| ౧౨ | ౫ | బ్రు | ప్రు |
| ... | ౧౧ | ర్ధ | ర్థ |
| ... | ౧౭ | పాప | పాప |
| ౧౩ | ౧౫ | ణ | నా |
| ౧౪ | ౧౪ | శు | లు |
| ౧౫ | ౧౩ | హూ | రహూ |
| ౧౬ | ౬ | త్వతీయ | ద్వితీయ |
| ౧౭ | ౧౦ | హ్యా | హ్యాము |
| ౧౯ | ౨౧ | రం | రువం |
| ౨౦ | ౭ | కర్తానీన | కర్తానీః |
| ౨౧ | ౯ | భాగవత | స్మూలప్రపిష్ఠిలోఁ బ్రా [దినవో భాగవతి |
| ౨౧ | ౧౧ | ఛ్చే | త్వే |
| ... | ౧౫ | పా | పౌ |
| ... | ౧౬ | ట్లగ | ట్లఁగ |
| ౨౨ | ౧౭ | నుద | నఁదా |
| ౨౩ | ౧ | క్రమిం | గ్రహిం |
| ౨౪ | ౪ | ర్తు | ర్తో |
| ౨౫ | ౧ | ౧వ | వ |
| ... | ... | ములు | ము |
| ... | ౯ | లో | గ |
| ౨౭. | ౧౯ | ముదె | ముఁదె |
| ౨౯ | ౧ | బుగొని | బుఁగొని |
| ౩౧ | ౪ | ధ్వ | ధ్రి |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౩౨ | ౭ | లాౘ | లావ |
| ౩౬ | ౫ | నడవి | యడవి |
| ౩౮ | ౪ | జ్జ్వద | జ్జ్వలద |
| ... | ౧౨ | మనువులు (౧౪) | (౧౪) మనువులు |
| ౩౯ | ౪ | శాశ | శాంశ |
| ౪౦ | ౧౬ | జాడు | జాడె |
| ౪౨ | ౨ | వణోనగు | వాది |
| ... | ౧౬ | లకీ | లీ |
| ... | ౮ | రభ | ఁముఖ |
| ... | ౧౨ | వీనికి | వీఁకి |
| ... | ౧౬ | ఁడు | లు |
| ... | ౧౮ | జాఁడుడు | జాడుఁడు. |
| ౪౩ | ౧౨ | దు | ద |
| ... | ౧౫ | కుప్ర | కుఁబ్ర |
| ... | ౧౮ | నప | నఁబ |
| ౪౪ | ౧౫ | సూచింపఁబడినది:— | |

పిదప నిట్లు చదువవలయు.

శ్లో. వదంతితత్తత్త్వవిదస్తత్త్వం యద్జ్ఞానమద్వయం,
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి కథ్యతే.

శ్లో. తచ్ఛ్రద్దధానా మునయో జ్ఞానవైరాగ్యయుక్తయా,
పశ్యంత్యాత్మని చాత్మానం భక్త్యా శ్రుతగృహీతయా.

(భా. ౧. ౨. ౧౨, ౧౩).

| | | | |
|---|---|---|---|
| ౪౪ | ౧౭ | కల్వ | కత్వ |
| ౪౪ | ౨౦ | (భా. ౧౩.) | (భా. ౧౨. ౧౩.) |
| ౪౫ | ౧౧ | పను | పుఁప |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౪౭ | ౪ | ద్వారి | దూరి |
| ... | ౭ | దుకు | దులకు |
| ... | ౮ | ర్ధ | ర్ధ |
| ... | ౧౬ | దొడగ | దొడఁగ |
| ... | ౨౦ | జములు | జనములు |
| ౪౬ | ౩ | నటలోఁజేయ | నటులోఁజేయఁ |
| ... | ౧౨ | లధి | లునధి |
| ... | ౧౫ | తరున | తీయన |
| ౪౯ | ౧౬ | ఇతి | అని |
| ౫౧ | ౨ | నొద్ద | యొద్ద |
| ... | ౩ | గలని | గలిసి |
| ౫౨ | ౬ | ంందా | సంసా |
| ౫౩ | ౨ | స్వర్గ | సర్గ |
| ౫౪ | ౫ | తోడేలు | తోఁడేలు |
| ౫౭ | ౫,౧౨ | బ్రహ్మమునకో | బ్రహ్మకో |
| ... | ౧౯ | + 12000=2000 | + 2000=12000 |
| ౭౧ | ౧౯ | శాస్త్ర | శ్శాస్త్ర |
| ౭౩ | ౭ | పరి | బరి |
| ౭౫ | ౧౩ | నూర్యాశి | సూర్యాసి |
| ... | ౧౪ | నన | సన |
| ౭౭ | ౮ | నడుపు | నడపు |
| ... | ౧౩ | చేక | యేక |
| ౭౮ | ౧ | ఋభు | ఋభువు |
| ౭౯ | ౧౦ | మను | మనువు |
| ... | ౧౩ | ర్తింపఁ | ర్తింపఁజేయఁ |
| ౮౧ | ౬ | ౧౯. అ | ౧౯ |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౭౧ | ౧౮ | దుకు | దులకు |
| ... | ౨౧ | జనక. అ | జనకా |
| ౭౨ | ౫ | శ్యా | న్యా |
| ౭౩ | ౧౧ | లుఁ | లు |
| ౭౬ | ౪ | గుణన | గుణమున |
| ౭౭ | ౪ | వుకు | వునకు |
| ... | ౬ | సూధ | సూద |
| ... | ౧౭ | భగప | భగవదు |
| ౭౮ | ౧ | ౧౮. శ్రీ | ౨౦. శ్రీ |
| ... | ౪ | నీలు | నీటి |
| ౮౦ | ౮ | ధారిత్ర్య | ధారిత్ర్వ |
| ౮౨ | ౧ | గనుప | గసఁబ |
| ... | ౧౩ | దొమ్మిది | దొమ్ముండుగ్రి |
| ౮౬ | ౬ | సద్ధ | నద్ధ |
| ౮౬ | ౧౬ | వట్టి | నట్టిన |
| ౮౯ | ౧౩ | యగు | యొంనగు |
| ... | ౧౪ | లు, కడు | లుఁగడు |
| ౯౨ | ౧౦ | జేసిరి | జేసెను |
| ౯౫ | ౨ | ప్రతీతి | ఁబ్రతీతి |
| ... | ౧౫.౧౬ | నామముగ | ణము |
| ... | ౧౬ | చర్య | చర్యవలనఁ |
| ౯౬ | ౮ | నన్గో | నన్యా |
| ౯౭ | ౧౬ | సమురు | సమారు. |
| ౯౮ | ౪ | డేవ | దేని |
| ౯౯ | ౪ | గాజు | గాఁజుఁ |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| ... | ౧౫ | మహా | మహాను |
| ... | ౨౧ | నర్వా | సర్వా |
| ౧౩౨ | ౨౧ | మాకఁలి | మాకలి |
| ౧౩౬ | ౨ | తత్ | తత్త |
| ... | ౯ | నైన | లైన |
| ౧౩౮ | ౯ | డంతు | డనంతు |
| ... | ౧౩ | అఖి | మా. అఖి |
| ౧౪౦ | ౪ | నా | సా |
| ౧౪౧ | ౧౦ | యః | అన |
| ౧౪౭ | ౧౬ | హారి | హోరి |
| ౧౫౧ | ౧ | త్రు | త్త్రు |
| ౧౫౮ | ౫ | లీవ | లీన |
| ౧౭౦ | ౬ | గుఁజే | గుచే |
| ... | ౯ | నతి | యాతి |
| ౧౭౩ | ౧౦ | నోర | గోర |
| ౧౭౪ | ౧౯ | త్రి | త్త్రి |
| ౧౭౫ | ౬ | యుంగా | యుంగాఁ |
| ౧౭౭ | ౧౭ | చ | ఊ |
| ౧౭౮ | ౫ | ఊ | ను |
| ... | ౭ | పైకు | పైఁగు |
| ౧౬౧ | ౨ | ముఁజే | ముచే |
| ... | ౪ | ర్ధా | ర్ధా |
| ... | ౬ | నస్తా | సస్తా |
| ... | ౮ | ట్లు | ట్లఁ |
| ... | ౧౫ | తే | అ |
| ౧౬౨ | ౧౫ | అు | ఱ |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ... | ౧౭ | శుఁ | శు |
| ౧౭౩ | ౨ | నతని | యతని |
| ... | ౫ | ముకో | ముఁదో |
| ... | ౧౨,౧౬,౧౮ యు | | యుఁ |
| ... | ౧౯ | కాల | కాను |
| ౧౭౫ | ౧౯ | స్కంద | స్కంధ |
| ౧౭౬ | ౬ | ్యథా | ద్యథా |
| ౧౭౭ | ౧౧ | నెకెగి | వెలిఁగి |
| ౧౭౯ | ౪,౫ | నాలీడుఁడై | సాలీఁడుఁడై |
| ౧౮౧ | ౬ | కక | కఁగ |
| ... | ౧౧ | ఁజే | నే |
| ౧౮౨ | ౩ | లుసూ | లుఁసూ |
| ... | ౧౨ | తమఅ | తెమో |
| ౧౮౪ | ౧ | ము | శా |
| ౧౮౬ | ౧ | యుసూ | యుఁసూ |
| ౧౮౬ | ౨ | లుగూ | లుఁగూ |
| ... | ౧౯ | కలీ | కాలీ |
| ౧౮౭ | ౨౧ | పర్చి | ఁబఱచి |
| ౧౮౮ | ౩ | లున | లగున |
| ౧౮౯ | ౫ | వాంచిత | వాంఛిత |
| ... | ౬ | వాథో | నాథో |
| ... | ౧౬ | సుఁగా | సుగా |
| ౧౯౦ | ౯ | నూతి | సూతి |
| ... | ౧౧ | లుగూ | లుఁగూ |
| ౧౯౧ | ౭ | నాంఖ్య | సాంఖ్య |
| ౧౯౨ | ౧౯ | ద్బిఁజే | ద్ధిచే |

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨౩౬ | ౨ | వాతిద | వాద |
| ... | ౧౨ | లులం | లురం |
| ... | ౧౫ | భావించు స్పర్థా | భావించు, స్పర్ధా |
| ౨౩౭ | ౮ | గానున | గానమును |
| ... | ౧౯ | విహా | నిహా |
| ౨౩౮ | ౫ | శ్రీకృష్ణని | శ్రీకృష్ణని |
| ౨౪౦ | ౯,౧౦ | కాన...ములలో,) | ములలో), కాన |
| ౨౪౩ | ౪ | జేయూట | పేయూట |
| ౨౪౬ | ౭ | వా | వా |
| ౨౪౬ | ౧౩ | ధస్థు | ధవి |
| ... | ౧౪ | సిమ | పిమ |
| ... | ౧౫ | (డై | ఁపై |
| ... | ౧౭ | పొసగదు | పొసఁగదు |
| ౨౪౭ | ౪ | సూతార్థ | సూత్రార్థ |
| ... | ౧౮ | కథా | కథా |
| ౨౪౮ | ౧౬ | సుధా | సుధా |
| ౨౪౯ | ౧౬ | యొప | వెప |
| ౨౫౦ | ౧ | కముల | కముల |
| ... | ౨ | ము, | మును, |
| ... | ౩ | యుగదే | యుఁగదే |
| ... | ౧౦ | సుఖం | వారిసుఖ |
| ... | ౧౭ | మంచుపగ | మంచునుపగు |
| ... | ౧౯ | త్రిల్లుప | రాత్రులుబ |
| ... | ౨౦ | ర్ధనము | ర్ధనము |
| ౨౫౧ | ౪ | గాఁతి | గాతి |
| ౨౫౨ | ౭,౮ | రధ | రధ |

# శుద్ధపత్రిక.



| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨౫౬ | ౧౦ | గుయని | గునని |
| ౨౫౮ | ౨౧ | చేకుగు | చేకుఱు |
| ౨౬౩ | ౬ | హార్షి | హ్రార్షి |
| ... | ౧౩ | శిశ్రూ | శుశ్రూ |
| ౨౬౪ | ౬ | స్ప | స్పృ |
| ... | ౨౦ | కొడుకు | కొడుక |
| ౨౬౫ | ౬ | శిశ్రూ | శుశ్రూషి |
| ... | ౮ | పారఁగు | పారిగు |
| ... | ౯ | నెడల | యెడల |
| ... | ౧౩ | కధ | కథ |
| ... | ౧౪ | యాకు | యుకు |
| ... | ౧౭ | డగు | డనగు |
| ౨౬౬ | ౪ | బాలుఁడైన | బాలుఁడనైన |
| ౨౭౧ | ౬ | ర్య, సు, | ర్య, స |
| ౨౭౧ | ౪ | డగు | డనగు |
| ౨౭౬ | ౮ | కనే | కుండనే |
| ... | ౧౦ | నాగుఁబె | నాగుపె |
| ౨౭౭ | ౨౦ | లీతనఁబరి | లీతిఁనఁబరి |
| ౨౭౮ | ౩ | నేక | చాల |
| ... | ౮ | డ్రై | డనై |
| ౨౭౯ | ౧ | ము | ముచు |
| ౨౮౧ | ౧౦ | నిర్వ్యాస | నిశ్వ్యాస |
| ౨౮౮ | ౧౧ | వాకు | వాకను |
| ౨౮౯ | ౧౪ | ముని | మును |
| ౨౯౦ | ౧౪ | ౫ | ౪. ట. |

